University of Madras

# B.A. Degree Examination

# SELECTIONS

## TELUGU

VOL. I

PUBLISHED BY THE UNIVERSITY



THE S.P.C.K. PRESS, PRI.

# I. నన్నయభట్టు
# మ హా భా ర త ము.

## 1. జరాసంధవధ.

(సభాపర్వము. ఆ. I.)

వ ధౌమ్యప్రభృతులవచనంబుల కనుగుణంబుగా ననుజానుమతుం డయి ధర్మరాజు రాజసూయంబు సేయ సమకట్టి దీని నిర్విఘ్నంబుగ నిర్వహించునప్పని కనాదినిధనుం డాదిపురుషుండు పురుషోత్తముండు పుండరీకాక్షుం డధోక్షజుం డయ్యును జగద్ధితార్థంబు మర్త్యుం డైన జన్మించినమహాత్ముండు వాసుదేవుండ యోపుం గాని యన్యుల కశక్యం బని యప్పుడ యాప్తచరులఁ బిలువం బనిచి 1

క అనిలజవాశ్వంబులఁ బూ, న్చినరథముల నెక్కి వారు శీఘ్రరు మధుసూ
దనుఁ దోడ్కొని చనుదెం డని, పంచి తదాగమనకాంక్షఁ - బార్థివుఁ డుండెన్. 2

### కృష్ణుఁ డింద్రప్రస్థపురంబునకు వచ్చుట.

వ అయ్యుధిష్ఠిరుసందేశంబున దాశార్హుండును దద్దర్శనోత్సుకుఁ డయి ద్వారవతి వెడలి యతిత్వరితగతి నిరంతరప్రయాణంబుల నింద్రప్రస్థపురంబునకు వచ్చి. 3

ఉ కుంతికి ధర్మనందనున - కున్ వినయంబున మ్రొక్కి భీము ధీ
మంతునిఁ గౌఁగిలించుకొని - మధ్యమపాండవు మాద్రిపుత్త్రులన్
సంతతభక్తి నమ్రులఁ బ్ర - సాదమృదూకృతదృష్టిఁ జూచి తా
నెంతయుఁబ్రీతి నెత్తికొని - యెన్ మహి యెత్తినపుణ్యుఁ డున్నతిన్. 4

వ. తదనంతరంబ ధర్మతనయుండు. 5

క. పరమాసనమున నునిచి య, పరిమితహర్షంబుతో స - పర్యావిధులన్
గురుఁ బూజించువిధమ్మునఁ, గురువృషభుం డఖిలలోక - గురుఁ బూజించెన్. 6

క. ఏమఱక జనులయోగ, క్షేమంబుల నడపుచున్న - కృష్ణుని యోగ
క్షేమంబు లడిగి యపుడు మ, హాముదమున ధర్మసుతుఁడు - హరి కిట్లనియెన్. 7

1*

క. ధ్యేయుఁడవు సకలకార్య, స్థేయుండవు నమ్రులకు వి - ధేయుఁడవు నయో
పాయజ్ఞుఁడ వీజగముల, నీయెఱుఁగని యదియుఁ గలదె - నీరజనాభా. 8

వ. అయినను నాయర్థిత్వంబునం జేసి నీ కెఱింగించెద 9

సీ. పాండుమహీపతి - పనిఁబూని నారద, మునివచ్చి వీరెల్ల - వినుచు నుండ
రాజసూయంబు వి - రాజితంబుగఁ జేసి, పితృ పితామహులకు - హితముసేయు
మని నన్నుఁబనిచె నే - య్యమున నో నాకిట్టి, బలము సామర్థ్యంబుఁ - గలుగు టెఱిఁగి
పనిచెనో తత్క్రతు - ప్రారంభమున కోడం, బడితి వీ రందఱుఁ - గడఁగి దీని
నిత్యసత్యవచన - నిపుణనిర్మలబుద్ధి నిర్ణయించి పనుప - నీనియోగ
కాంక్షనున్నవాఁడఁ - గమలాక్ష యనిన ధ, ర్మాత్మజునకు నిట్టు - లనియెఁ జక్రి

క. కురువృషభ సర్వగుణముల, సురుచిరతేజుఁడవు రాజ - సూయాఖ్యమహా
ధ్వరమునకు నీవ యర్హుఁడ, వరిసూదనశౌర్యు లయిన యనుజులబలిమిన్ 11

వ. తొల్లి జామదగ్న్యుం డయినపరశురామునిచేతఁ ధాత్రి యపగతక్షత్త్రం బయిన నంత నుండి యైలవంశంబును నిక్ష్వాకువంశంబును దక్కఁ దక్కినక్షత్త్రియవంశంబు లెల్లం గృత్రిమంబులు గాని మకుటార్హంబులు గా వీ రెండువంశంబులవలన నేకోత్తరశత వంశంబు లయ్యె మఱి యయాతి భోజవంశంబులవలనం జతుర్దశవంశంబు లయ్యె నిట్టి సకలక్షత్త్రియుల నెల్ల జయించి జరాసంధుం డున్నవాఁడు వానిసామర్థ్యంబు సెప్ప నశక్యంబు 12

క. అతిదర్పోద్ధతుఁడు మహా, ద్భుతభూరిబలుఁడు చేది - భూపతి సేనా
పతి యయి శిశుపాలుఁడు సం, తతమును నాతనిన కొలుచుఁ - దద్దయుభక్తిన్ 13

క. ఆయతభుజవీర్యులు మా, యాయోధులు హంసడిభకు - లనువార లని
ర్జేయులు పరస్పరస్నే, హాయత్తసుచిత్తు లతని - యాప్తు లధీశా 14

వ. అయ్యిద్దఱును గౌశికచిత్రసేను లనునామంబులతో మహాసేనాన్వితులై వానికి వామదక్షిణభుజంబులుంబోలె సర్వసాధనసమర్థు లయి ప్రవర్తిల్లుదురు మఱియు వరుణునంతియబలవంతుండు పశ్చిమదిఙ్మహీపతి భగదత్తుం డనువాఁడు పాండురాజసఖుం డగుటం జేసి నీకు మనంబున భక్తుం డయ్యును భయంబున జరాసంధునకు వాక్కర్మంబులం బనిసేయుచుండుఁ జేదిపతులలోనఁ బురుషోత్తముండును నంగ వంగ పౌండ్ర కిరాతపతులలోనఁ బౌండ్రక వాసుదేవుండును మదీయనామచిహ్నంబులు సేకొని జరాసంధుం గొలుతురు ప్రాగ్దక్షిణదిగ్భాగములరాజులు పురుజితుండును గరూశకరభనరకసంకర్షణసూపహిత ముర దంతవక్త్ర సాల్వేయ యవనులును వానిన సేవింతు రుదీచ్యు లయినయష్టాదశక్షత్త్రకులంబులవారు నుత్తర పాంచాల శూరసేన

పుష్కర పుళింద కళింగ కుంతి మత్స్య దేశంబులరాజులును దద్భయంబునఁ దమతమ దేశంబుల విడిచి వానిన కొలుచుచున్నవారు మఱియు. 15

ఉ. ఘోరరణంబులోన నధి - కుం గృతబంధుజనాపకారు నే
దారుణలీలఁ గంసు నతి - దర్పితుఁ జంపుటఁ జేసి యమ్మహా
క్రూరుఁడు గంసభార్య దన - కూఁతురు గావున దానిసంతత
ప్రేరణ నా కుపద్రవముఁ - బెక్కువిధంబులఁ జేసె నీసుతా. 16

క. భూమీశ హంసడిభకులు, నామగధాధీశ్వరుండు - నమ్మువ్వురు ను
ద్దామభుజవీర్యసంపద, తో మూఁడుజగములు నోపు - దురు సాధింపన్. 17

వ. ఆజరాసంధుండును నాయుధనిహతులు గానిహంసడిభకులతోడ వచ్చి మథురపై విడిసిన నతివీరు లయినయదువృష్ణిభోజాంధకవరు లష్టాదశసహస్రరథవ్రాతంబుల తో నేమును సమకట్టి బల్మి మహాయుద్ధంబు సేయుచు వానినెట్లును జయింప రాకున్న నుపాయంబున హంసుండు సమరనిహతుం డయ్యె నని డిభకునకుం జెప్పం బంచిన నప్పలుకులు నిక్కం బకా వగచి 18

చ. అనవరతంబు నిష్టుఁడగు హంసుఁడు లేనిజగంబులోనిజీ
వన మది యేల నా కనుచు వారిధిమగ్నశరీరుఁడై క్షణం
బున డిభకుండు మృత్యుగతిఁ - బొందె ఘనంబుగ దాని నక్కడన్
విని మృతుఁ డయ్యె హంసుఁ డతి - వీరుఁడు ఉద్గతసౌహృదంబునన్ 19

వ. అట్లు కౌశికచిత్రసేనులు పరలోకగతు లయిన నసహాయుండై జరాసంధుండు మగిడి మగధపురంబునకుం జనియె నేమును వానితోడివైరంబు బలవంతంబైన నంత నమ్మథుర నుండ నొల్లక కుశస్థలంబునకు వచ్చి రైవతకపర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించుకొని భవదాశ్రయంబున సుఖం బున్నవారము. 20

చ. ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు - గర్వితుఁడై మహిలోనిరాజులం
బెలుకుఱఁ బట్టి తెచ్చి చెఱఁ - బెట్టి గిరివ్రజ మన్పురంబులో
సొలయక నిత్యమొక్కొకని - సూనరివోలె వధించి పాపముల్
బలిమియు నేర్పడం గడఁగి - భైరవపూజ లొనర్చు నుగ్రుఁడై. 21

క. ధరణీశ వానిఁ జంపుడు, నురుతరసామ్రాజ్యవిభవ - మున్నతితో సు
స్థిర మగు నీకును మఱి భూ, సుర మగ సమకూరు రాజ - సూయము సేయన్. 22

సీ. రక్షణంబున భగీ - రథుఁడు జయంబున, నయ్యౌవనాశ్వుండు - నత్యుదగ్ర
బాహుబలంబున - భరతుండు దపమునఁ, గార్తవీర్యుండును - గరము బుద్ధి

నమ్మరుత్తుండును - నఖిలసామ్రాజ్యంబుఁ, బడసిరి తొల్లి భూ - పాల యిప్పు
డిన్ని గుణంబులు - నెన్నంగఁ గలవు నీ, కిది యేమి దుర్లభం - బిద్ధురాత్ముఁ
డెంతబలియుఁ డయ్యె - నెంతదర్పితుఁ డయ్యెఁ, దనకితోరదుష్ప్ర - తాపమునను
విగతవిభవుఁ డగు వి - వేకవిహీనుల, దైన లక్ష్మి సుచిర - యగునె యెందు. 23

## భీమసేనార్జునులు ధర్మరాజున కుత్సాహంబు గల్గించుట.

వ. అనిన విని భీమసేనుండు ధర్మరాజున కి ట్లనియె. 24

క. ఆరంభరహితుఁ బొందునె, యారయ సంపదలు హీనుఁ - డయ్యును బురుషుం
డారంభశీలుఁ డయి యక్క, తారంభుల నోర్చు నెంత - యధికుల నయినన్ 25

క. కడు నధికుతోడఁ దలపడి, పొడిచిన నొడిచినను బురుషు - పురుషగుణం బే
ర్పడుఁ గాక హీను నొడుచుట, కిడిఁదియె పౌరుషము దానఁ - గలుగునె చెపుమా.

క. ఈహరి కరుణయు నర్జును, సాహాయ్యముఁ గలుగ నీప్ర - సాదమున జగ
ద్ద్రోహు జరాసంధు మహా, సాహసు వధియించు నుగ్ర - సంగ్రామమునన్. 27

తే అనఘ యేము మువ్వురము మూఁ - డగ్నులట్లు, నీమహాయజ్ఞకార్యంబు - నిర్వహించు
మాజరాసంధపశువును నఖిలశాస్త్ర, వాహుతులఁజేసి తృప్తుల- మగుచు బలిమి 28

వ. అనిన భీమసేనువిక్రమవచనంబుల కనుగుణంబుగా నర్జునుం డి ట్లనియె 29

ఉ. భూభుజులన్ జయింపుము వి - భూతి నొనర్పుము రాజసూయమున్
నాభుజవీర్యవిక్రమగు - ణంబులకుం డగు చున్నయాధను
ర్లాభము దివ్యబాణరథ లాభము శోభిత మైనయీసభా
లాభము నొందుపాట సఫ - లత్వముఁ బొందునె కౌరవేశ్వరా. 30

క కులరూపగుణద్రవ్యం బులు విక్రమవంతునందు - భూవిదితము లై
నిలుచు నవిక్రమునకు నవి, గలిగియు లేనిక్రియ నప్ర - కాశంబు లగున్. 31

వ. మఱియు రాజసూయార్థంబు పరాక్రమంబున జరాసంధు వధియించి నిఖిలక్షత్త్రి
యనిగ్రహణమోక్షణంబు సేయునంతకంటె మిక్కిలియశోధర్మంబు లొం డెయ్యవి
యనిన భీమార్జునులపలుకులకు సంతసిల్లి నారాయణుం డి ట్లనియె. 32

క. వెలయ విధిదృష్టనయమున, వలయుఁ బరాక్రమము సేయ - వసుధేశ్వర య
గ్గల మగుబుద్ధియుఁ గడఁకయుఁ, గలపురుషున కిదియ చూవె - కర్తవ్య మిలన్. 33

వ. కావున మేము మువ్వురముఁ గ్రమంబునం బరాక్రమించి యాజరాసంధు డాసి
నదీ ప్రవాహంబులు వృక్షోన్మూలనంబుఁ జేయునట్లు వాని నిర్మూలంబు సేసెద మద్దు
రాత్ముండు భూతంబులయం దంతరాత్మయుంబోలెఁ దనయంతరం బెఱుంగక యేకాం

కంబుండి సుఖం బనుభవించుటంజేసి వానియంతికంబున కరుగుట యశ్రమంబనిన
నారాయణునకు ధర్మరాజి ట్లనియె. 34

క. దనుజాహిత నీ యూహవ, మున నెదిరి మహోగ్రదహన - మునఁ బడియును గా
లనిమిషుతవోలె నతికో, పనుఁడు జరాసంధుఁ డెట్లు - బ్రదుకఁగ నేర్చెన్ 35

క. అట్టియతిదారుణాత్మకు, నట్టియజేయభుజవిక్ర - మాధిక్యము వాఁ
డెట్టి క్రియఁ బడసె నాతని, పుట్టినవిధ మెట్లు సెప్పు - పొలుపుగ నాకున్. 36

వ. అని యడిగిన ధర్మరాజునకుఁ గృష్ణుం డి ట్లనియె. 37

సీ. అతిసమర్థుండు బృ - హద్రథుం డనువాఁడు, మగధనాథుం డస న్మార్గదూరుఁ
డక్షౌహిణీత్రిత - యంబుబలం బునఁ, బరుల నోడించిన - బలిమికాఁడు
కాశిరాజనువాని - గాదిలిసూఁతులఁ, గవలవారల నతి - కాంతిమతుల
నమరంగఁ బెండ్లి యై - యధికతర ప్రీతి న, య్యిరువురయందు భో - గేచ్ఛ సలిపి
యం దపత్యంబు వడయుగు - నని తలంచి, విప్రమునిదేవపూజల - వివిధవిధులఁ
బుత్త్రకామేష్టులను నొండు పుణ్యకర్మ, ముల్ యుక్తులను జేసి పడయంగ - నోప కలసి. 38

వ. పుత్త్రులు లేనివిభవంబు లన్నియు నేల యని నిర్వేదించి పత్నిద్వయసమేతుండయి
వనంబున కరిగి. 39

తే. ఆవిపినాంతరంబున ని - రంతరస్థు ననంతమోక్షకాం
క్షావిధి నొక్క బాలసహ - కారమహీజము క్రింద నుజ్జ్వల
త్పావకతేజుఁ డై తపము - వాయక సేయుచు నున్నధన్యుఁ గా
క్షీవతుఁ గాంచె గౌతము న కిల్బిషమానసుఁ జండకౌశికున్. 40

క. ధరణీశ్వరుఁ డమ్మునియెడఁ, బురాతనమునిని నిరాశుఁ - బుణ్యాత్ము నిరం
తరకృతనియమసపర్యా, పరవశ్యుఁ డగుచు భక్తి - వదలక కొలిచెన్ 41

వ. ఇట్లుపాస్యమానుం డయి చండకౌశికుండు బృహద్రథునకుఁ గరుణించి నీ కిష్టం
బయినదాని నిచ్చెద వేఁడు మనిన ముకుళితకరకమలుం డై వాఁ డి ట్లనియె. 42

తే. సంతత మైనసర్వసుఖ సంపద గల్గియు దానికిం దగన్
సంతతి లేమిఁ జేసి యది - సర్వము హేయముగాఁ దలంచి ని
శ్చింతుఁడ నై ధృతిం దపము - సేయఁగ వచ్చితిఁ బుత్త్రజన్మ మా
నంతకు నేను మీదయఁ గృ - తార్థతఁ బొందుదు సన్మునీశ్వరా. 43

వ. అనినం గరుణించి మునీశ్వరుండు పరమధ్యానముకుళితలోచనుం డై యున్నంత. 44

క. పవనవిధూతము శుకచం, చువిలూనము గాక యొక్క - చూతఫలం బ
య్యవనిజముననుండి ముని, ప్రవరుపృథూత్సంగతలము - పై వడిఁ బడియెన్. 45

వ. దానిం బుచ్చికొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథున కిచ్చి యాఫ లోపయోగంబువలన నీ కొక్కపుత్త్రుం డుద్భవిల్లు నని చెప్పిన నాతండును గృతా ర్థుండ నయితి నని క్రమ్మఱి నిజపురంబునకు వచ్చి తనయిద్దఱు భార్యలకు సమంబు గా విభాగించి పెట్టినం దత్ఫలోపయోగంబున నయ్యిద్దఱు గర్భిణు లయినఁ బదియవ మాసంబున నొక్కనాఁటిరాత్రియందు వారలకు. 46

క ఒక్కొకకన్నును జెవియును, జెక్కును జను బొడ్డు మూపుఁ-జెలు వగుచేయుం బ్రక్కయుఁ బిఱుఁదును గాలును, నక్కజ మయి మనుజశకల-మవు దుదయించెన్

క అమ్మానిసిప్రయ్యలు గని, యమ్ముదితలు వెఱచి వీని-నాత్మజుఁ డని నె య్యమ్మున నెట్టులు సూపుదు, మి మ్మనుజేశ్వరున కనుచు-నెంతయు లజ్జన్. 48

వ. వీని నెవ్వరును నెఱుంగకుండ వెలుపల వైచి రండని తమదాదులం బంచిన వార లారెండుప్రయ్యలుం గొనిపోయి రాజగృహద్వారతోరణసమీపంబునఁ జదుకంబు నొద్ద నొక్కచోట వైచి పోయిన నచ్చదుకంబున నుండెడురాక్షసి జర యనునది వాని బలియకా వగచి పఱతెంచి. 49

ఆ. ఎత్తికొని చనంగ-నిమ్ముగునట్లుగా, మెదలు చున్నప్రయ్య-లదిమి రెంటిఁ గూడఁ బట్టె నవియుఁ-గూడి యొండొంటితోఁ, జక్కనంటి రెండు-నొక్కటయ్యె.

క ఆరాక్షసి కెత్తికొనన్, భారముగా వజ్రకఠిన-బంధురతనుఁడై ధీరుఁడు బాలుం డేడ్చె మ, హారవమున దానిచేతు-లాడక యుండన్ 51

వ. అబ్బాలకురోదనధ్వని విని యంతిపురంబున నున్నముదుసలియవ్వ లెల్లం బఱతెంచి మహాహర్షంబుతో వాని నెత్తికొని రట్టిసంభ్రమం బెఱింగి బృహద్రథుండు వచ్చి తేజోధికుం డయి తామ్రతలముష్టిం దనముఖపద్మంబునం బెట్టికొని దిక్కులు సెలంగ నేడ్చుచున్నకొడుకుం జూచి కృతార్థీకృతలోచనుం డయ్యె నట్టియవసరంబున నా రాక్షసి కామరూపిణి గావున మనుష్యస్త్రీరూపధారిణియయి యమ్మగధరాజున కి ట్లనియె 52

తే ఏను జర యనురాక్షసి-నిప్పురమునఁ, జదుకమును బాయ కుండుదు-సంతతంబు నీకు నిష్టంబు సేయంగ-నెమ్మితోడఁ, గోరు చుండుదు నది సమ-కూరె నేఁడు. 53

వ నీయిద్దఱు దేవులకు నుద్భవిల్లినయిమ్మనుష్యశకలంబులు రెండును నీదాదులు దెచ్చి యిచ్చదుకంబునొద్ద వైచి పోయిన నేను వానిం గూడఁ బట్టుడు నప్పుడ వజ్రఘన ఘటితశరీరుం డై యిక్కుమారుండు మేరుగిరిశృంగంబునుంబోలె నా కెత్తికొన నశ క్యుం డయ్యె వీని నొప్పికొను మనిన విని బృహద్రథుండు ముదితహృదయుం డయి దాని కి ట్లనియె. 54

ఉ. ఇచ్చకు వచ్చుపూజనల - నెంతయు సంతస మంది తొల్లి నా
కిచ్చె మునీశ్వరుండు దయ - నిత్తనయున్ మఱి యిప్డు నెమ్మితో
నిచ్చితి వీవు రాక్షసివె - యిక్కుల మెల్లను విస్తరింపఁగా
వచ్చినపుణ్యదేవతవు - వారిరుహాయతచారులోచనా. 55

వ. అని దాని నతిప్రీతిం బూజించి కొడుకు నెత్తికొని దేవీద్వయంబునకు నిచ్చి జర యనురాక్షసిచేత సంధింపంబడినవాఁడు గావున జరాసంధుం డనుపేరిడి పురం బష్ట శోభనంబు సేయించి యారాక్షసి కేఁటేఁట మహోత్సవంబు సేయించుచుం గొడుకు నతిగారవంబునం బెంచిన. 56

క. ఈహితవిధానముల లం, కాహితదుస్సహతేజుఁ - డయి వాఁడు మహో
త్సాహముతో వర్ధిల్లె ఘృ, తాహుతులఁ బ్రవృద్ధి నొందు - నగ్నియుఁబోలెన్. 57

## జరాసంధునియొద్దకుఁ జండకౌశికుండు వచ్చుట.

వ. ఇట్లు జరాసంధుండు పెరుఁగుచున్నఁ గొండొకకాలంబునకు నొక్కనాఁడు చండకౌశికుం డంగులకు వచ్చిన నతిముదంబుతోఁ బుత్త్రకళత్రమిత్త్రభృత్యామాత్యసహితుం డయి బృహద్రథుం డెదురువోయి యమ్మునీంద్రునకు నమస్కరించి తోడ్కొని వచ్చి సముచితాసనంబున నునిచి యడుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి తనరాజ్యంబుతోడ సర్వస్వంబును నివేదించి కొడుకుం జూపినం జూచి సంతసిల్లి మునివరుం డి ట్లనియె. 58

క. జర యనురాక్షసి నీకుం, గర ముపకారంబు సేసె - ఘనముగ దీనిన్
ధరణీశ యే నెఱింగితి నిరుపమనిరతిశయయోగ - నిష్ఠితబుద్ధిన్. 59

వ. ఇక్కుమారుండు కుమారునంతియశక్తిమంతుం డయి త్రిపురాంతకు నంతకహరుం బరమేశ్వరుం దనకు సన్నిహితుం జేసికొను నెంతబలవంతు లయ్యును వైరివీరులు వీనిం దాఁకి యగ్నిఁ దాఁకినశలభంబులుంబోలె నడంగుదురు గరుడునిగతి నన్యవిహగంబు లనుగమింప నోపనియట్లు మానవులు వీనివీర్యంబు ననుగమింప నోపరు తేజస్వులలోన నాదిత్యుండు వెలుంగునట్లు వీఁడు మూర్ధాభిషిక్తులలోన మిగిలి వెలుంగు నదీరయంబులు మహాపర్వతంబుల భేదింప నోపని యట్లు దివ్యాస్త్రంబులు వీనిదేహంబు భేదింప నోపవు సముద్రంబు మహానదులం జేకొనునట్లు వీఁడు పరమహీపతులసంపదలఁ జేకొను నని జరాసంధుసామర్థ్యంబుఁ జెప్పి చండకౌశికుం డరిగిన. 60

క. తనయు నతిరూపయౌవను, ననుపము నభిషిక్తుఁ జేసి - యవనీభర మా
తనిఁ బూన్చి సభార్యుం డయి, యనఘ తపోవనమునకు బృహద్రథుఁ డరిగెన్. 61

వ. ఆజరాసంధుంశును నస్త్రనిహతులు గానిహంసడిభకులు దనకు సహాయులుగా నప రాజితం బయినపరాక్రమంబునం బరచక్రపతుల భంజించుచు. 62

చ. అయనవిహీనుఁ డౌసవిత్రి - నట్లు విఖండితపక్షతిద్వయుం
డయినఖగేంద్రునట్లు మఱి హంసుఁడు వాడిభకుండు నంతక
క్షయగతు లైన నిష్ఠు గత - గర్వమునన్ మగధేశ్వరుండు ని
శ్చయమతి నున్నవాఁడు నిజ - సంక్షయకాలవిశంకితాత్ముఁ డై. 63

ఉ. అమ్మగధేశు నుగ్రబలు నాయుధయుద్ధమునన్ జయింపఁగా
నిమ్మహి నోప రెవ్వరు ను - మేశ్వరుఁ డట్టిపరమ్ము వానికిన్
నెమ్మి నొసంగెఁ గావున వి - నీతుఁడు వాయుసుతుండు మల్లయు
ద్ధమ్మునఁ జంపు నాతని ను - దగ్రమహాభుజశక్తి యేర్పడన్. 64

క. బలిమి మెయిఁ బార్థురక్షా, బలమును బవనసుతుబాహు - బలమును నాని
ర్మలనీతిబలము నీకుం, గలుగ నసాధ్యములు గలవె - కౌరవనాథా. 65

చ. తడయక యేగి నీతిబల - దర్పము లొప్పఁగ వాని డాసి క
వ్వడియును నేను భీముఁడు న - వశ్యముఁ బోర బృహద్రథాత్మజుం
గడిఁదిరిపున్ ఐధింతుము జ - గన్నుత న న్నెడ నమ్ముదేని ని
ల్లడ యిడు భీము నర్జును న - లంఘ్యబలాఢ్యుల నాహవంబునన్. 66

వ. అని నిశ్చయించి పలికిననారాయణునివీరశ్రీవిభాసితముఖు లైనభీమార్జునులం జూచి సంతుష్టాంతరంగుం డయి ధర్మతనయుం డి ట్లనియె. 67

చ. ప్రియహితసత్యవాక్య యరి - భీషణ కృష్ణ భవన్నియోగసం
శ్రయమున నున్నమా కధిక - శత్రుజయం బగు టేమి పెద్ద ని
శ్చయముగ నింక మోక్షితుల - సర్వమహీశులు నిమ్మహాధ్వర
క్రియయును సిద్ధిఁ బొందెఁ గృప - కృత్యతఁ గీర్తి వెలుంగుచుండఁగన్. 68

క. ధరణీధర సర్వగుణా, కర కరుణానిరత సర్వ - కార్యైకధురం
ధర నినుఁ బడసినమాకును, హరివిక్రమ పడయరాని - యవియుం గలవే. 69

వ. అని సంతసిల్లి మఱియు నాత్మగతంబున. 70

క. నయనములు నాకుఁ బవనత, నయవిజయులు మనము కమల - నాభుఁడు వీరిం
బ్రియహితులఁ బాసి నిమిషం, బయినను నెట్లుండ నేర్తు - నవిచేష్టుఁడ నై. 71

వ. అయినను నాహృదయంబు గరంబు హృద్యం బగుచున్నయది కృష్ణార్జునులం దలం చినవారికి శ్రీవిజయంబు లగు ననిన నిమ్మహాపురుషులఁ దనకు సహాయులఁగాఁ బడ

సినభీమసేనునకు శ్రీవిజయంబు లగుట కేమిసందియం బని నిశ్చయించి మీకుఁ గార్యసిద్ధి యయ్యెడు మరుగుం డని పంచిన. 72

క. పోర రిపుఁ జంప నరిగెదు వీరుల వార్ష్ణేయపాండ - వేయుల సింహా
కారులఁ జూచి మనంబున, ధీరుఁడు ముద మందె నయ్యు - ధిష్ఠిరుఁ డంతన్. 73

## కృష్ణభీమార్జునులు జరాసంధుఁ జంపఁ బోవుట.

వ. కృష్ణభీమపార్థులు వీరశ్రీవిభాసితముఖు లయి కృతస్నాను లయి చని యనేకపర్వతంబులు గడచి తత్ప్రభవంబు లైన కాలకూట శోణ గండకీ సదానీరంబు లను నేఱుల లంఘించి సరయూనదియునుం బూర్వకోసల మిథిలదేశంబులును గంగయుం గడచి పూర్వాభిముఖు లయి నిరంతరప్రయాణంబుల నమ్మగధదేశంబు సొచ్చి గోరథం బనుపర్వతం బెక్కి- 74

చ. ఉరుతరహర్మ్యమాలికల - నొప్పుగిరివ్రజ మన్పురంబుఁ గాం
చిరి నవసౌరభప్రసవ - చిత్రవనావళి గల్గుదాని నె
వ్వరికి దురాసదంబు లగు - వజ్రమయోన్నతవప్రచారుగో
పురములదాని నయ్యలకఁ - బోలెడుగాని మహార్ఘసంపదన్. 75

వ. కని దానియపూర్వరామణీయకసమృద్ధి కచ్చెరుపడి యచ్యుతుండు భీమార్జునుల కి ట్లనియె. 76

క గోరథమును బుషభము వైహారము బుషిగిరియుఁ జైత్య - కాద్రియు ననఁగా
నూరెల గిరు లేనును నివి, శూరభటులువోలెఁ గాచి - చుట్టును నుండున్. 77

వ దానఁ జేసి యిప్పురంబు గిరివ్రజంబు నాఁబరఁగె నిందుఁ దొల్లి గౌతముం డౌశీనరి యనుశూద్రయందుఁ గాక్షీవాదుల సృజియించె నట్టిగౌతమును గ్రహంబున నీదుర్గబలంబునం జేసి యిమ్మాగధుల నెవ్వరును జయింప నోప రనుచుఁ డద్వారంబునం బురంబు సొరనొల్లక చైత్యకగిరిశృంగంబున కరిగి యం దున్నమూఁడుభేరులం జూపి తొల్లిఁటిమాగధులు మానుషాదం బనుబుషభంబు వధియించి దానిచర్మంబున వీని నిర్మించి రివి యిప్పురంబు వింతవారు చొచ్చునప్పు డమ్మునిశక్తిం జేసి మ్రోయు ననిన. 78

ఉ. దారుణవజ్రచారుభుజ - దండములన్ బలవద్విచారగం
భీరులు ధీరు లాక్షణమ - భేరులు మూఁటిని వ్రచ్చి చైత్యక
స్ఫారనితంబదేశమును - భగ్నము సేసి గిరివ్రజంబు న
ద్వారమునందుఁ జొచ్చి రతి - దర్పులు యాదవకౌరవోత్తముల్. 79

క. ఘోరాకారులు మాలా, కారగృహంబులకు గంధ - కరగృహములకుం
దా రరిగి మువ్వురు బలా, త్కారంబునఁ గొనిరి పుష్ప - గంధము లొప్పన్. 80

వ. అందు మాల్యాలంకృతమౌళులుఁ జందనాగరురజోభూషితవక్షులు విస్మయమాన మాగధ నిరీక్ష్యమాణులుఁ నయి రాజమార్గంబు దఱియం జని యం దనవరతంబును బ్రాహ్మణులకు సుప్రవేశం బగుచున్న జరాసంధుమందిరంబు గోవాసంబు హైమ వతసింహంబులు సొచ్చునట్లు యాదవకౌరవసింహంబులుఁ సొచ్చిన. 81

## జరాసంధుఁడు కృష్ణభీమార్జునుల కెదురు వచ్చుట.

ఆ. అర్ధరాత్ర మయిన - నభ్యాగతద్విజ, స్నాతకులకు నెదురు - సని కరంబు
భక్తిఁ బూజ లిచ్చు - పరమవ్రతుం డప్పు, డెదురు వచ్చి వారి కిష్ట మెసఁగ. 82

క. ధీయుతుఁ డయి మధుపర్కము, సేయఁగ సమకట్టి దానిఁ జేకొననిమహా
పాయులగర్వంబునభి, ప్రాయంబు నెఱింగి మగధ - పతి యి ట్లనియెన్. 83

తే. స్నాతకులరేనిపూవులుఁ జందనంబుఁ, జను నె బలిమిని గొని తాల్పఁ - జైత్యకాద్రి
తటముభేరులు వ్రచ్చిదో - ర్దర్ప మెసఁగఁ జులుకనగ్వారమునఁ ద్రోలు - సొరఁగఁ జన్నె.

వ. మఱియు నా కావించినమధుపర్కంబు పరిగ్రహింప నొల్లమి యిదియేమి మీరలు వేష ధారుల కావలయు మీ వేషంబున బ్రాహ్మణత్వంబును మహాసత్త్వదీర్ఘబాహువృషభు లవక్షోలక్షణంబుల క్షత్త్రియత్వంబును బ్రకాశించు చున్న యవి యనిన వానికి నారాయణుం డి ట్లనియె. 85

క. స్నాతకులు పుణ్యకర్మస, నాతిను లనఁ బరఁగు బ్రాహ్మ - ణ క్షత్త్రియ వి
డ్జాతులయందును క్షత్త్రియ, జాతిస్నాతకుల మేము - జనవినుతినిధీ 86

వ. ద్వారంబున మిత్రనివాసంబును నద్వారంబున నమిత్రనివాసంబును జొచ్చుట యిది బాహువీర్యసంపన్ను లయినక్షత్త్రియులకుం గర్తవ్యంబు మఱి గంధమాల్యంబుల యందు లక్ష్మి యుండుం గావున బలాత్కారంబున గంధమాల్యంబులు గొంటిమి నీయందు మాకు నొండుకార్యంబు గలుగుటం జేసి నీయిచ్చునర్ఘ్యంబు గొననొల్ల మనిన వారికి జరాసంధుం డి ట్లనియె 87

ఆ. మీరు నాకు నేను - మీకు నెన్నండు ము, న్నహిత మాచరించి - నదియు లేదు
మీకు నేల నే న - మిత్రుండ నైతి ని, రాగసుండ సద్గు - ణాన్వితుండ. 88

క. సురమునివరులకు వసుధా, మరులకు భక్తుండ నుత్త - మక్షత్త్రకులా
చరితుండ ననిన నవనీ, ధరుఁ డమ్మగధేశ్వరునకుఁ - దా ని ట్లనియెన్. 89

క. కులరక్షార్థ మఖిలనృప, కులోద్వహునియోగమున న - కుంఠితశత్రు
ప్రళయవిధాయుల మయి యిం, దులకుక్ వచ్చితిమి దుష్ట-దూషణబుద్ధిక్. 90

సీ. కడఁగి యత్యుత్తమ - క్షత్త్రియచరితంబు, నందు వర్తిల్లుదు - నంటి జనుల
కెవ్వరి కెన్నండు - నెగ్గొనరింప నే, నంటి సత్క్షత్త్రియు - లవని నొరులు
నీయట్లు క్రూరులై-నృపతులఁ జెఱఁ బెట్టి, పశు వధించుచుఁ బశు-పతి నుమేశు
పేరదుఁ బూజించిన - వారును గలరె ము, న్నింతకు నగ్గలం - బెద్ది యొగ్గు
కారణంబు లేక - దారుణం బగుసాధు, హింస సేయుకుజనుఁ - డెల్లవారి
కప్రియుండ కాక - యప్రియలక్షణం, బొండు గలదె తలఁప - నుత్తములకు. 91

వ. నిర్దయుండ వై నిర్దోషు లైనసధర్ముల వధియించునంతకంటె మిక్కిలిపాతకం బొం డెద్ది నీయట్టిపాపకర్ముల నుపేక్షించిన నఖిలధర్మరక్షణక్షముల మైనమమ్ముఁ దత్పాపం బు వొందు నని పాపభయంబునం జేసి నిన్ను నిగ్రహింప వచ్చితిమి నాకంటె నధి కుం డైనక్షత్త్రియుండు లేఁ డని నీవు గర్వంబున నొరుల నవమానించి పలుక వలదు.

క. అవినీతు లయి మహాత్ముల, నవమానము సేసి మును జ - యద్రథ దంభో
ద్భవకార్తవీర్యు లను వా, రవజితు లయి యొరులచే మ - హాబలు లయ్యుక్. 93

తరలము. అతులవిక్రమసంపదక్ ర(?) - యజ్ఞదీక్షితు లై రిపు
ప్రతతి నోర్చినవీరు లుగ్రత - పంబుసేసినవారు స
ద్గతికిఁ బోదురు గాక యి ట్లపు - కారదారుణవృత్తి ను
ద్ధతిని భైరవపూజ సేసిన - దాన సద్గతి గల్గునే. 94

తరలము చెడకు నావచనంబు సేయుము - చెచ్చెరక్ ధరణీశులక్
విడిచి పుచ్చుము నేను కృష్ణుఁడ - వీఁడు భీముఁడు వాఁడు గ
వ్వడి భవత్కృతదారుణం బను - వహ్ని యార్పఁగ నున్నయి
క్కడిఁదివీరులు వీర లిద్దఱు - గర్వితుల్ కురుసింహముల్. 95

క. కడుఁ గ్రూరుఁడ వయి నృపతుల, విడువనినాఁ డాజిఁ బొండ-వేయులు నీయు
క్కడఁచి భుజశక్తి యేర్పడ, విడిపింతురు గడిమి నఖిల - విషయాధిపులక్. 96

వ. అనిన విని జరాసంధుండు సటాసముత్పాటనకుపితకుంజరవైరియుంబోలెఁ గడు వలిగి పటుకుటిలభ్రుకుటిఘటితనిటలుం డగుచుఁ బురుషోత్తమున కి ట్లనియె. 97

క. అమితపరాక్రమమున నా, క్రమించి పరనృపుల నోర్చి - గర్వించుట దో
షమె యిది సత్క్షత్త్రియధ, ర్మమ యే నెప్పుడుఁ బరాక్ర - మవ్రతుఁడ నిలక్. 98

క. దేవార్థముగాఁ దెచ్చిన, యీవసుధాధిపుల నేల - యే విడుతుఁ బ్రతా
పావజితరిపుఁడఁ గావున, నీ వెఱుఁగవె తొల్లి ధారు -ణీధర నన్నుక్. 99

సీ. సమకట్టి సైన్యంబు - సైన్యంబుతో నొండెఁ, దొడరి మీమువ్వుర - తోడ నొండె
నిద్దఱితో నొండె - నెక్కటి యొక్కని, తో నొండెఁ బొడిచెద - దోర్బలమున
నేయాయుధంబున - నెమ్మెయిఁ బోరంగ, నిష్ట మెయ్యది యుత్స - హింపుఁ డనిన
నొక్కనితోఁ బల్వు - రుద్ధతు లయి పూని, యుద్ధంబు సేయుట - యుచిత మగునె
యధిక బాహుబలుల - మయిన మామువ్వుర, యందు నొక్కరుని మ - హాబలాఢ్యుఁ
గోరికొనుము వాఁడు - ఘోరంబుగా నిన్ను, మొనసి మల్ల యుద్ధ - మున జయించు.

క. అనినమురవైరిపలుకులు, విని బార్హద్రథుఁడు భూరి - వీర్య మరున్నం
దనుఁ గోరికొనియె నీతం, డని నెన యగు నాకు ననుచు - నతిదర్పితుఁ డై. 101

వ. ఇట్లు జరాసంధుండు భీమసేనుతో మల్ల యుద్ధంబు సేయ నిశ్చయించి తనతనయు సహదేవుని రాజ్యంబున నభిషిక్తుం జేసి పురోహితకృతస్వస్త్యయనుం డై 102

ఆ. బలియుఁ డపుడు వెండ్రు - కలు పాచి ముడిచిగం, టెసఁగఁ దాల్చి వీర - రసికవృత్తి
నుద్ధతుండు మల్ల - యుద్ధప్రసాధనం, బమర నిలిచె వేడ్క - నమితబలుఁడు. 103

వ. భీమసేనుండును వానికి నక్కజంబుగా మల్ల యుద్ధసన్నద్ధుం డయి ప్రతిఘటించి నిలిచె నంత. 104

## భీమజరాసంధులమల్లయుద్ధము.

మ. సమసత్త్వాతిశయుల్ వృకోదరజరా - సంధుల్ సముద్యత్పరా
క్రమ మొప్పం గడు నల్గి యొండొరులఁ జా - ల్కం దాఁకి రన్యోన్యదు
ర్దమదోర్దండపటుప్రహారజనిత - ధ్వానంబు బ్రహ్మాండభాం
డము నిండన్ లయకాలదండధరచం - డక్షోభమో నా జనుల్ 105

క. కర్షితరిపు లన్యోన్యా, కర్షణసంకర్షణాప - కర్షణముల సా
మర్షు లయి పెనఁగి రాహవ సార్ష్ణంబునఁ బవనసుత బృహద్రథపుత్త్రుల్ 106

క. వ్యాయామకర్కశస్థిర, కాయులయుద్ధము భయాన - కం బయ్యె మహా
గ్రాయసపరిఘాయితకర, నాయతభుజదండదారు - ణాఘాతములన్. 107

చ. అతులబలుల్ పరస్పరజ - యార్థులు పార్థివపుంగవుల్ మరు
త్సుతమగధేశ్వరుల్ సమర - శూరులు దారుణలీలఁ బోరి రూ
ర్జితభుజశక్తు లేర్పడఁగ - సింహగజేంద్రములట్లు వజ్రప
ర్వతములయట్లు ఘోరతర - వాసవవృత్రులయట్లు నిద్దఱున్. 108

వ. ఇట్లు కార్తికమాసమునం బ్రథమదివసంబునం దొడంగి భీమజరాసంధు లెడ యుడుగక యొండొరులం బట్టియుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాచియుం ద్రోచి యుఁ మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశినాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధకౌశ

లం జేర్పడం బెనంగు నెడఁ జతుర్దశినాఁటిరాత్రియందు జరాసంధునతిశ్రాంతభావం
బుపలక్షించి యధోక్షజుండు భీమున కి ట్లనియె 109

చ. విగహితసత్త్వుఁ డయ్యెఁ బ్రతి - వీరుఁడు వీని నశేషధారుణీ
శ్వరనికరాపకారు నతి - సాహసికున్ వధియించి నీభుజ
స్థిరత యొలర్ప నయ్యనిల - దేవుబలంబును నీబలంబు భా
సురముగ మాకుఁ జూపుము వి - శుద్ధయశోనిధి మారుతాత్మజా. 110

వ. అని ప్రబోధించి పలికిన ననిలతనయుం డనిలదేవునిం దలంచి తత్ప్రసాదంబున నధిక
సత్త్వసమేతుం డై 111

ఉ. ఆతనిఁ బట్టి యెత్తి నిహ - తాహితవీరుఁడు వానిముక్కునన్
వాతను గర్ణరంధ్రముల - వారక శోణితధార లొల్కఁగా
వాతసుతుండు వీచె శత - వారము లుద్ధతిచండవాతసం
ఘాతవివర్త్యమానతృ ణ - ఖండసముం డగు చుండ మాగినన్. 112

క. వెండియుఁ బట్టికొని పడిఁ, జఱచి జరాసంధునొడలి - సంధులయెమ్ముల్
విఱిచి వధియించి యార్చెను, బఱలఁగ భీముండు భువన - వలయముఁ బగులన్. 113

చ అవనితలంబు వ్రస్సెనొ హి - మాచలశృంగము వ్రయ్య లయ్యెనో
శ్రవణవిదారణం బయిన - శబ్దము దా నిది యేమియొకొ భై
రవ మయి వీచె నంచును బు - రంబునవారు భయంబు వొంది రం
దువిదలగర్భముల్ గలఁగె - నుక్కడఁగెన్ మగధేశుసైన్యముల్ 114

వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుఁ జంపి వాని వధియించుట జగద్విదితంబుగాఁ దదీయ
గృహద్వారతోరణసమీపంబునం దత్కళేబరంబు వైచి సర్వజనభయంకరుండయి
యుగాంతకాలరుద్రుండునుంబోలె నున్నంత నాదిత్యోదయం బయిన. 115

సీ. గరుడధ్వజుం డప్డు - కరుణాసమేతుఁ డై, యమ్మాగధుల కెల్ల - నభయ మిచ్చి
యొగి జరాసంధుచే-నిగ్రహీతు లయి యున్న, పృథివీశుల విడి-పించెఁ జెఱల
మోక్షితు లైనస - ర్వక్షత్రియులచేత, సంశుద్ధరత్నపుం - జములఁ జేసి
పూజితుం డయి తన - తేజంబు వెలుఁగంగ, సహదేవు నజ్జరా - సంధతనయు
నోడకుండు మని త - దున్నతిరాజ్యంబు, నందు నిలిపి హృదయ - హారివివిధ
రత్నరాజిసుంద-రం బై నమగధేశు, రథముఁ దేరఁ బనిచె-రయముతోడ. 116

వ. అది దొల్లి తారకాసురసంగ్రామంబున నింద్రారూఢం బయినది దాని నింద్రువలన
వసు వనురాజు వడసె వానివలన బృహద్రథుండు వడసె నని తద్దివ్యరథప్రభావంబు

చెప్పుచు భీమార్జునసమేతుం డయి యారథం బెక్కి చక్రధరుం డఖిలరాజచక్రంబు
తో నింద్రప్రస్థగమనోన్ముఖుం డయి గరుడునిం దలంచుడుఁ దత్క్షణంబ. 117

క. అనలప్రభాభిశోభిత, ఘనతరతనుదీప్తు లెసఁగఁ - గా వచ్చి వడిన్
వినతాతనయుఁడు వినయా, వనతోరుశిరస్కుఁ డయ్యె - వనజాక్షునకున్ 118

వ. ఇట్లు వచ్చినవైనతేయు నతిప్రీతిం దద్దివ్యరథసారథ్యంబునందు నియోగించి మనో
వాయువేగంబునం గృష్ణభీమవిజయు లింద్రప్రస్థపురంబు ప్రవేశించి రంత. 119

మ. జనసంత్రాసకరున్ మదోద్ధతు జరా - సంధున్ బలాఢ్యున్ రణం
బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు భూ - భుగ్వీరులం దన్నిరో
ధనిర్ముక్తులఁ జేసె నింకఁ జతురం - తక్షోణికిన్ ధర్మనం
దనుసామ్రాజ్యము పూజ్య మయ్యె నని మో - దం బంది రుర్వీజనుల్. 120

క. ఆయుధనిహతుఁడుగాని యజేయు జరాసంధు భీమ - సేనుఁడు వీర
శ్రీ యెసఁగ నోర్చెఁగా కి, త్యాయతభుజశక్తి నొరుల-కలవియె యంచున్. 121

క. పురజను లాశ్చర్యంబునఁ, గర మనురాగమునఁ బరమ - కౌతుకమునఁ జూ
చిరి బోరన వచ్చి వృకో, దరదామోదరసురేంద్ర - తనయులఁ బ్రీతిన్. 122

వ. కృష్ణభీమవిజయు లిట్లు విజయవిభాసితు లయి వచ్చి ధర్మరాజునకు మ్రొక్కి జరా
సంధుబంధనంబువలనం దమచేత మోక్షితు లైనమహీపతుల నెల్లం జూపిన 123

క. సవినయనతోత్తమాంగుల, నవనీశుల నందఱను య - థార్హప్రియగౌ
రవమునఁ బూజించి కురు, ప్రవరుఁడు దద్దేశములకుఁ - బరువడిఁ బంచెన్. 124

బెల్ల వెలుంగ వచ్చి పర - మేశ్వరుదేహము సొచ్చె విస్మయో
త్ఫుల్లవిశాలనేత్రు లయి - భూపతు లెల్లను జూచు చుండఁగాన్. 68

క. ఘనజాలము లేకయ పెలు, చన పిడుగులతోడివృష్టి - చైద్యునివాసం
బునఁ గురిసె సముద్రమహీ, ధ్రనికాయములో ధరిత్రి - దిర్దిరఁ దిరిగెన్. 69

క. జయజయనినాదమున న, వ్యయు నంబుజనాభు భువన - వంద్యు నుపేంద్రుం
బ్రియమునఁ బొగడె సుజనముల, దయినమహారవము సెలఁగె - నతితుములంబై

వ. అంత ననంతశయనుండు శిశుపాలు సంస్కారింపం బంచి వానికొడుకుం జేది రాజ్యం
బున కభిషిక్తుం జేసె నట్లు ప్రశాంతవిఘ్నం బయి శుభావహం బయి ప్రభూత
భక్ష్యాన్నధనదానసమన్వితం బయి జగన్నాథరక్షితం బయి రాజసూయమహాధ్వ
రంబు సమాప్తప్రయోగం బయ్యె. 71

# 3. పాండవ వనప్రవేశము.

(ఆరణ్యపర్వము. ఆ. I.)

వ. పాండవులు నిజాయుధంబులు ధరియించి కృష్ణాసహితంబుగ నుత్తరాభిముఖులై యరిగిన నింద్రసేనాదు లైనమూలభృత్యులు పదునాలుగువేలరథంబులతోడ సుభద్రాభిమన్యుప్రతివింధ్యాదులం దోడ్కొని వారిపిఱుందన యరిగి రంత నప్పాండవులం జూచి పౌరులెల్లం బరమదుర్ఖితు లై. 1

క. చనునె యధర్మఖ్యాతం, బున నిట్టుల పాండురాజ - పుత్రులఁ బ్రభులన్
వనగతులఁ జేయ దుర్యో, ధనధృతరాష్ట్రులకు విగత - దయహృదయులకున్. 2

క. క్రూరతరధార్తరాష్ట్రుని, కారము వారింప రైరి - గాంగేయుఁడు న
బ్భారద్వాజుఁడు గృపుఁడు ను, దారుఁడు విదురుండు నేమి - దలఁచిరొ బుద్ధిన్

సీ. కర్ణజయద్రథ - గాంధారు లాప్తు లై, యుండంగ లోభి గు - ర్యోధనుండు
రాజు గా నీతని - రాజ్యంబునం దెట్టు, లుండఁగ నేర్తు మీ - యుర్వి నింక
నేది ధర్మువు ప్రజ - నెవ్వరు గాతురు, పరమధార్మికు లైన - పాండుసుతుల
యరిగినచోటిక - యరుగుద మని వారి, పిఱుఁదన చని పాప - భీతమతులు
వీరులార మమ్ము - విడిచి మీ కరుగంగ, జనునె మాకు నొండు - శరణ మెద్ది
సాధులకు నసాధు - సహవాసమునఁ బాప, సంప్రయోగ మగుట - సందియంబె 4

క. తిలలును నీళ్లును వస్త్రం, బులుఁ బుష్పసుగంధవాస - మున సౌరభముం
బొలు పెసఁగఁ దాల్చుఁ గావున, నలయక సత్సంగమమున - నగు సద్గుణముల్ 5

వ. సాధుసమ్మతంబు లైనగుణంబుల నొప్పి జన్మవిద్యాకర్మంబులం బ్రశ... యహార్ద్ర వృత్తుల రైనమీసహవాసంబున నుండి కృతార్థుల మగుదుము దుష్కృతంబులు ... దనారంభు లయ్యును జనులు దుర్జనదర్శనస్పర్శనసంభాషణసహాసనంబులంజే ధర్మవిహీను లగుదురు గావున నేము దుర్యోధనురాజ్యంబున నుండ నోపక మాయనుగమనంబున కొడంబడవలయు నని కృతాంజలు లైన నప్పౌరులం జూచి ధర్మతనయుం డి ట్లనియె.

క. మాయందు లేనిగుణములు, మీయనురాగమునఁ జేసి మిగిలి వెలింగెన్
మీయనుగతి మాకు నభి, ప్రాయము వనవాసదుర్ఖ - భర మోవుదురే. 7

వంబునకుం బ్రతీకారంబు సేయునంతకు రేయునుం బగలును నాహ్లాదయంబు దపించు చుండు నాకంటె నర్జుననకులసహదేవులుం గుంతీదేవియు నంతస్తాపంబున నెంతయు సంతప్తు లగుచున్నవారు 27

క. వీరలదుర్గఖము దీర్పక, క్రూరనికారు లగురిపుల - కును ముదముగ ను
గ్రారణ్యములో ధర్మువు, గారుణ్యముఁ దాల్చి యునికి - కార్యమె నీకున్. 28

వ. ఇది బ్రాహ్మణధర్మంబుగాని క్షత్రియధర్మంబు గాదు. మనుప్రణీతంబు లైనరాజధర్మంబులు నీ యెఱుంగనియవి లేవు శత్రుసంహారంబు సేయనినాఁ డత్యంతహాని యగు నట్లుం గాక. 29

తే. వనమునందుఁ బంద్రెండువసం - వత్సరంబు, లుండ నేర్చితిమేనియు - నొరులెఱుంగ
కుండ నజ్ఞాతచర్యయం - దొక్కదివస, మైన నుండంగ నేర మె - ట్లనిన వినుము. 30

వ. ఆబాలవృద్ధప్రసిద్ధుండ వై పార్థివసూర్యుండ వైననిన్నును సింహసదృశు లైననీ తమ్ములను నెఱుఁగనివారు లేరు మనగూఢభావంబు మేరువునిగూఢభావంబునుం బోలె నఘటమానం బిట్లేని నిష్వనవాసక్లేశం బెన్నఁడును మనకుఁ బాయ నేరదు మన మిప్పు డిప్వనమునఁ బదుమూఁడుమాసంబులు సలిపితిమి సంవత్సరప్రతినిధి

క. వినవయ్య కర్ణగర్వం, బని నాతఁ డభేద్యకవచుఁ - డగుటయు విలునే
ర్పును నతనిబాహువిక్రమ, మును దలఁచిననాఁడు గన్ను - మూయదు నాకున్

వ. మఱియు భీష్మద్రోణకృపాచార్యులు సము లయ్యును వారియొద్దన యున్నవారు వార లపారదివ్యాస్త్రవిశారదులు వారల నోర్చికాని దుర్యోధను నిర్జింపం బోలదు. 36

## ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేరం బోవుట.

ఁన మురియాడు చుండ నను - మానముతోన సుధేష్ణఁ జూచి నీ
ంనయముఁ గోరినట్టిపని - యర్థిమెయిం జని చేయుదానఁ గా
నుతనమాట కప్పాలఁతి - హర్షము బొందుచు నంది యిచ్చుకాం
నచషకంబు పుచ్చికొని - చారువిలోచన యార్తమూర్తి యై 81

చనుచుండి నీచహృదయుం డగుకీచకుండు దనయెద్ర నప్పు డాడినకర్ణశూలంబు లగుమాటలమీఁదం బిడుగు పడినవానిఁ గొలవిం జూఁడినతెఱంగున సుధేష్ణ ద ... ంబునకు నియోగించుటకు నిర్వేదనం ... బొంది. 82

మాయవిధి - హా యని దైవము మాఱు నిత్తటిం
దిక్కను మొ - ...ంబున నత్రులు వెల్లిగొల్పుఁ దొ
నం జెదరు - డెందము గూడఁగఁ దెచ్చి నన్నుఁ గే
నెవ్వరికి - వచ్చు నను గల గుణ వెనుంబడున్ 83

84

ఁత - బలకొన్నఁ జెలువ కా, వనమున వెల్లఁద - నంబు గదిరె
- పైకొని ముట్టినఁ, గాఁతెకుఁ దనులత - కంప మడరె
స - మిగిలిన నింతికిఁ, బదముల నట దొట్రు - పాటు బెరసెఁ
- దన్వికి నవయవం, బుల నెల్ల ఘర్మాంబు - కళిక లెసఁగెఁ
ంకు - గొలఁదికి మీఱె వె, న్బాటు దోఁచె ముట్టు - పాటు దొడరె
ఁకె - నెఱ నాడె నొప్పు నె, వ్వగలు పగల నీనె - దిగులు వొదివె.

పడుపుత్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహారణంబు యని ఁనహృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించి రంబు వెలువడి దినకరుం గనుంగొని వినయవినమితోత్తమాంగ ంన. 86

మ ద - ప్పనిమనంబు, గలుగుదాననయేని యో - కమలమిత్ర
క - కీడుతెరువు, వోరయ కుండఁగ రక్షింపు - కరుణతోడ.

గచిన 88

ఖగున, త్తరుణిం గాచుటకు నత్యు - దగ్రభుజావి
రక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁ డగుచు - గ్రక్కునఁ బనిచెన్.
వి యంబరంబున నదృశ్యాకారుం డై వచ్చి నిలిచె. 90

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి - యెట్టకేని, సింహబలుమందిరం బల్లఁ - జేర నరి
యొల్లఁబోవుచు బెబ్బులి-యున్న పొదరు, సొచ్చులేడిచందంబునఁ-జొచ్చుటఁ

ఉ. అంబురుహాక్షి వచ్చు తెరు - వారయఁ గీచకముఖ్యుఁ డప్డు దె
ల్లంబుగఁ జూచి యుల్లముక - లంకయు వారకి మేనఁ గమ్ముతా
పంబును డిగ్గఁ ద్రావి గరు - పాఱుచు నుత్కటసంభ్రమంబు హ
ర్షంబుఁ బెనంగొనంగ నతి - చంచలభావపరీతమూర్తి యై

క. చిడిముడిపడుచు నెదురుచనఁ, గడఁగుచు హారములు చిక్కఁ - గాఁ ద్రోచుచు
ల్లడిగొనుచు దుర్విలాసం, బొడలికి నొడఁగూర్చు చుండ - నుగ

వ. తత్ప్రదేశంబునకుం జని.

తే. దేవి దృష వుట్టి వారుణి - దేరఁ బనుచ, నరుగు దెంచితిఁ బోం
నెమ్మొగంబున దృష్టులు - నిలిపి తమక, మడర ని ట్లను నాకీచ

క. దేవిత్పృష దీర్పఁ బూనితి, వా వెలఁదిసహొదరుండ - నగునా
లావతి నీదుసరసనం, భావనమెయిఁ దీర్ప కునికి - పాడియె

సీ. కాంతి దళ్కొత్తు నీ-కడకంటిచూడ్కితోఁ, బొంపఁ గానని మే
దీపారు నీపల్కు - దెల్లంబుగా వినఁ, గాననినీనులు - గంటయ
నిం పగునీచెయ్వు - లెలమి మైఁ గొనియాడఁ, గాననిచూడ్కు
*　　　*　　　*　　　*

బాయ నా దగుజన్మంబు - ఫలము నొంద, భావజన్మునిపూనిక
నన్ను బంటుగా నేలుము - నలినవదన, యింక నీసిగ్గు దెరయో

వ. అనవుడు.

తే. చెలువ యప్పలుకులు పెడ - చెవులఁ బెట్టి, ధీర గావున విగ
మదిరవోయింపుఁడెద్దేవి-యెదురు చూచు,నలుగుఁ దడ వైనమగ

చ. మదిర సుధేష్ణపాలి కొక - మాత్రన పుచ్చెద నొడ్లచేత నిం
పొద వెడునట్టిదీనిచవి - యుల్లము సొక్కఁగ నాను మీవు నీ
వదనసరోజసౌరభ మ - వారణ నన్నును గ్రోల నిమ్ము బె
ట్టిదుఁ డగుకాముతూపులఁ దో - డింబడ కుండఁగఁ గావు

క. కరితురగరథసమితిఁ బొం, పిరివోయెడునాదులక్ష్మి - పెంపు
సరసిరుహవదన నీవ కు, దురుగా నొనరించెదం గు - తూహ

చిరమణిభూషణంబులు, నుచితవిహారప్రకార - యోగ్యాగార
ృచయము సుందరగిణికా, నిచయము నొప్పించువాఁడ - నీకుం దరుణీ. 102

ాకులకాంతల నెల్లను, నీకుం బని సేయఁ బనిచి - నెయ్యంబున నే
కనుసన్నన మెలఁగెద, నేకార్యం బైన నడపు - మీవ తగంగన్. 103

ినుచు సింహబలుండు దనయంతరంగంబున నంత కంత కగ్గలించుతమకంబునఁ
ి న్నెఱుంగిక పయిం బడి పట్టికొనిన. 104

గాచి వెనుక వచ్చిన, దనుజుమహాబలము దనదు - తను వొందిన నా
ి, బునఁ దిన్నందిరిము ద్రుపద - పుత్రిక వెడలెన్. 105

ఋనం గీచకుండు నెను వెంటం దగిలిన నమ్మగువయు మరలి చూచి
యెవ్వలనికిం బోదునో యని తలంచి దైవయోగంబున విరాటుం
వునికిం ేసి తత్సభాభాగంబుదెసకు వెసం బాఱినం గామాయత్త
ేవ న్మత్తుండును గావున జనసమూహంబు సరకు సేయక రహస్య
ారంబు దక్కి. 106

## ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁ దగులుట.

ిం - గమలత వెనుకొని, సరభసంబునఁ బట్టఁ - జనువిధమునఁ
భూ - చారినిట్టి కాఁతెఁ, బొగుపఁ యమ్మునఁ - బోవుభంగి
ుకు - మానినా గాంగనఁ, బటుగతి నొడియంగఁ - బాఱుకరిణిఁ
బాలశారికమీఁ, నడర సత్వరముగ - నరుగుమాడ్కి
ిగ్రుఁ డై చిగురుఁబోఁడి, పజ్జఁ గడువడిఁ దగిలి కో - పంబు గదుర
ిము-హెూగ్రవృత్తిఁ,గొంకు కొసరించుకయు లేక-కూలఁ దాఁచె.
ిలీ క్షకుం డైనరాక్షసుం డతని డొల్ల వ్రేసిన. 108

ి తన, నీచపుదెస యెరు లెఱుంగ - నేరక యుండక
స్మయ, గోచరుఁ డై యసురకితనఁ - గుంతితుఁ డగుచున్. 109

ినాగంబునుంబోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం బగుకోపంబు
చుండె నయ్యవసరంబున. 110

ియ్యా, స్థానమ్మున నుండి పవన - తనయుఁ డసహ్యాం
మానము నాసింహబలుని - మదజృంభణమున్. 111

చ. కనుఁగొని కోపవేగమునఁ - గన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరఁగ సాంద్రఘర్మసలి - లంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవిక - టభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ - దస్ఫురణాపరిణద్ధమూర్తి యై.

సీ. నేలయు నింగియుఁ - దాళముల్ గాఁజేసి, యేపున రేఁగి వా - యించి యాడి
కులపర్వతంబులు - గూల్చి యొండొంటితోఁ, దాఁకంగ వీఁకమైఁ దన్ని యే
నేడుసాగరములు - నిక్కడక్కడఁ బెట్టి, పలుచనిరొంపి మై - నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు - నొక్కచోటికిఁ దెచ్చి, పిసికి పిండలి సేసి - పిడిచికొనఁ
మిగిలి బ్రహ్మాండభాండంబు పగుల వ్రేయ, నప్పళించుచుఁ బళి
గండరించినరూపంబు - కరణి భీముఁ, డతిభయంకరాకారిత

వ. ఇట్లు పేర్చినకోపాటోపంబున నవిచారితసమయవర్తనుం
గీచకుని గీటడంగింపం జూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిః
మత్స్యపతిఁ దనయలుకలోనివానినకాఁ దలంచుచు నచ్చేరు
వృక్షంబు నిరీక్షించి యాననంబు పల్లటిల్ల ధర్మతనయుం గన
యాకారంబు చూచి నయనంబుల వారించి యి ట్లనియె.

మ. వలలుం డెక్కడఁ జూచె నొం డెడ నసే - వ్యత్వోజముల్ పుట్టి
ఫలితం బై పరశాఖ లొప్పఁగ నన - ల్పప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ - విశ్రాంతి గావింపఁగాఁ
గలయీభూజము వంటకట్టియలకై - ఖండింపఁగా నేటికిన్.

తే. అని నిగూఢభాషణముల - నయ్యజాత, శత్రుఁ డనిలజుకోపా
చేతిచే నయ్యన్నదమ్ముల - చేష్టితములు, దెల్లముగ నపు డూచు

సీ. ఎలదీఁగఁ గప్పిన - లలితపరాగంబు, క్రియ మేన మేదినీ -
జంపకంబున నవ - సౌరభం బెసఁగెడు, కరణి నాసిక వేఁడి
దోయజదళముల తుది మంచు దొరఁగెడు, గతిఁ గన్నుఁగవ
నిందుబింబముమీఁది కందుచందంబునఁ, గురులు నెమ్మొగమ
సర్వజనవంద్య యైనవాం - చాలి సింహ, బలునిచే నివ్విధం
దనకు వచ్చిన నెంతయు - దైన్య మొంది, యవ్విరాటునిసభఁ

ద్రౌపది తనభంగపాటు విరాటునితోఁ

ఉ. వంబినకోపమున్ సమయ - భంగభయంబును నగ్గలించి దే
ల్లంబు పెనంగొనంగఁ బతు - లం దగ సభ్యులఁ జూచుమా

ం బగుచూడ్కి నా ద్రుపదు - కన్నియ సూచి సభాజనప్రతా
ంబును మత్స్యనాథుఁడు వి - నంగ నెలుంగు చలింప నిట్లనున్. 118

ఖిలధర్మాధర్మ - నిపుణంబు లైనశు, ద్ధాంతరంగంబుల - నతిశయిల్లి
శిష్టసంరక్షణ - దుష్టనిగ్రహముల, నీతి వాటింపంగ - నేర్పు గలిగి
సకలశస్త్రాస్త్రసం - చయములఁ బరమాద్భు, తంబు సేయు పరిశ్ర - మంబు దాల్చి
దుర్దమప్రతిభట - మర్దనక్రీడమైఁ, జతురులు నా నెందు - నుతికి నెక్కి
యున్న గంధర్వు లేవురు - నన్ను నిట్లు, లోకఁడు పలుపంగ నూరక - యునికి సూడ
రువు గాదె యెవ్వరి - యూంద్రు రింకఁ, బరిభవంబునఁ బొందిక - బ్రదుకువారు.

ు, నొక్కరుఁ డైన ధర్మ - లోపభయమునం
పలు. కైనను ఎలుకంగఁ జాలఁ - డయ్యెడు నకటా. 120

గా నిచట - నిమ్మెయి నన్నుఁ బతివ్రతాగుణా
మ - సాధ్వి ననిందితశీలఁ గీచకుం
ంగనల - నెవ్వరుఁ జేయనియట్లు సేయఁగాఁ
పు కృప - కుం దటి గా దటె యేమి సెప్పుదున్. 121

దేశమున - గూజ్ఞ కితం డొడయుండు గాన నా
ఁ దగు - నెయ్యదియేని యధర్మ మెవ్వ రెం
బ్రభువు - లారసి దండన మాచరింతు రి
ఁ గీచకుని - చూచియు నూరక యుంకి పాడియే. 122

దుల్లమున - నక్కటికం బొలయంగ నంగనం
గినియుఁ గాఁ దగుసత్త్వము లేమిఁ జేసి సాం
రోషభరి - తస్థితిఁ గంపితమూర్తి యైనయా
పిన న - తండును బోయె నివాసభూమికిన్. 123

124

గా - సుందరి సైరంధ్రి, యగు బెట్లొకో యని - పగచువారు
యిట్టిది సేసెనే, మాయుదైవం బని - మఱుఁగువారు
నే రాజు సూడ నీ, దుష్టాత్మకుం డని - దూఱువారు
చూవె యీయమకు ని, ప్పాటు పచ్చుట యని - వ్రందువారు
దఱు - నంత నంత, నల్లనల్లన గుజగుజ - లాడు చుండి
ంబు - పెల్లివిరిసె, నాఁగ మోముల విన్నఁద - నంబు గదుర. 125

ఉ. అప్పుడు ధర్మసూతి హృద - యంబు గలంగ లలాటభాగముం
గప్పఁగ ఘర్మవారి యధి - కం బగురోషము నొంది యుండియుం
దప్పఁగఁ ద్రోచికొంచుఁ దన - ధైర్యముపెంపున నిర్వికారుఁ డై
యెప్పుడుఁ దాను బల్కునెలుఁ - గేర్పడ ద్రౌపదితోడ ని ట్లనున్.

సీ. జననాయకుండు నీ సభవారు నీ దగు, తెఱఁ గెల్ల నెఱిఁగిరి - తెలుప యింక
మానక యీపలు - మాట లాడఁగ నేల, చనుము నీవు సుదేష్ణ - సదనమునకు
నీపరాభవమునఁ - గోపింప నేరరే, గంధర్వులకుఁ దఱి - గాదు గాక
సమయ మెయ్యదియేని - తమకును నీకుఁ గ, ల్గినయట్టు లైనను - గినియ రి
గాన నాథుల గూలింగఁ - గాదు వినుము, సతికిఁ గానెంత గ ౨
దడవుగా నిల్చి యిట్టు లు - దగ్రవృత్తి, శంక నెఱ ధిక్కరిఁ

వ. అని యిట్లు సెప్పినధర్మతనయునిపలుకులు విని వెండియు
గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం జూచి
ని ట్లనియె.

క. పలుపోకలఁ బోవుచు వి, చ్చలవిడి నాట్యంబు సూపు - చాడ్పు
గులసతులగఁబువచందము, దొలఁగఁగ ని ట్లునికి దగునె తోఁ

వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కి ట్లనియె

ఆ. నాదువల్లభుండు - నటుఁ డింత నిక్కంబు, పెద్దవారయట్ల - పిన
గానఁ బతులవిధము - కాక యే శైలూషిఁ, గా ననంగ రాదు

వ. అ ట్లగుటంజేసి నాకు నాట్యంబును బరిచితంబ మత్పతి యై
కీచవుండునుం గావున జూడెరియాలికి గఱువతనం బెక్కుడియది
వాసి తనచిత్తంబున

ఉ. న న్నిటు లాదురాత్ముసద - నంబునకుం జను మన్న జంత కి
బన్నము లన్నియుం దెలిపి - ప్రియ్యుడనే యని పోయి నా
కన్నుల బాష్పపూరములు - గ్రమ్మఁగ మోమున దైన్య మొం
నన్నలినాక్షి తొట్రిలుచు - నంగము దూల సుదేష్ణపాలికిన్.

తే. చనిన నయ్యేలనాఁగయు-సంభ్రమంబు, దెచ్చికొని తా నెఱ
శాత్యమున నుమ్మలించి పాం-చాలితోడ, నెలుఁగు వే ఱొక

సీ. ధరణిపరాగంబు - వొరసి ధూసరిత మై, చేడియ నీమేను -
జిత్తంబు తలపోఁచే వాడు పొదవిన, చెలువ నీసెమ్మోము -

ఉ. నన్నుఁ బరాభవించి సద - నంబునకుం జని కీచకుండు ము
న్నున్నతెఱంగు దప్పక సు - ఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చునూఱటకుఁ - గారణ మెయ్యది భీమసేన మీ
యన్నపరాక్రమంబు వల - దన్ననొకో దయమాలి తక్కటా.

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలిపాణిస్పర్శనంబున లుకని యిది యెవ్వ రనవుడు నే ననునమ్మానినియెలుంగెఱింగి భీమసేన యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించు దై యరుగుదెంచెం గావలయు నత్తెఱం గిత్తెఱవ దాన చెప్ప వింగు నని

తే. ఇంతప్రొద్దేల యిచ్చోటి - కేగుదేరఁ, గారణం బె
నట్లు గాఁ జనుదెంచితె - యంబుజాక్షి, యనిన నయ్యి

చ ఎఱిఁగి యెఱింగి న న్నడుగ - నేమిటి కప్పు డెఱింగి
న్నఱచుట గల్గె నే నది వి - నం బని లే దటుగాక యు
పెఱిఁగియు నేన చెప్ప విన - నిష్టము గల్గుట చాల లెస్స
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము - తెల్లముగా మొదలింటనుం

చ. అధిపుమఱంది సింహబలుఁ - డప్పుకు మ్రొక్కఁగ వచ్చి నన్న
త్యధికమనోజరాగమతి - యై కను గొంచుఁ గడంగి యెన్నియే
విధములఁ బల్కి నాకుఁ దన - విన్నను వెల్లను జూపి చెప్పి వ
నధనవిహీనతం జెనకి - నం గడు నేవము పుట్టి యయ్యెడన్.

క. విడియం బలుకఁగ వెండియు. నుడుగక కీచకుఁడు మన్మ - థా
న్నడరిన న న్నడుగుటకుం, దొడరినఁ గోపించి వాని - తో

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసా-స్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవి - ద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిపు నిను దో - ర్లీలన్ వెసన్ గిట్టి గ
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట త - థ్యం బెమ్మెయిఁ

వ. అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు పలికిన నేనునుం దత
ద్రోచి పుచ్చినం బోయె. పదంపడి పాపాత్మయైనసుదేష్ణ
దేరం గీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడ
నన్నింటికినన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నొల్లక
రికి నేమిసేయ వచ్చు నని మీలావు నచ్చి సూతునింటికి స

కొన్ని వెడమాట లాడుచు, నన్ను నతఁడు సెట్ట వట్టి - నం ద్రోచి వెసం
జన్న వెనుకొనుటయును మీ, యన్నెడ కే నపుడు సంభ్ర-మోపేతగతిన్. 153

హాలుదెంచిన నక్కల - పాంససుండు, గోప మడరంగ వెనుకన - కూడ ముట్టె
ప యొలుంగుదు నీవు మీ-యన్న పెద్ద, తనముఁ జూచితి నే మందు-ననిలతనయ•

ాసుభటత్వముల్ బలము - మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
సభలోన నట్బజిచె - నంతియ కాక జయద్ర థుండు
భరంబు లే కనుచి - తం బొనరించినఁ
ల్ గనుంగొనఁగ - ని ట్లయితిర్

యాఁడుకూ ము-నా
ఁ గీచకుండు -

న విని యత్

కుఁ డ

చ. కినుకకుఁ జాల కెంతయును-గీడ్పడి నాపదుపాటు లెల్ల వ
మ్మునఁ గలయంగ నిట్టు లోక - మూర్ఖునిచేఁ దుదిఁ బోయి కోలుపో
యెదె యభిమాన మన్వగపు - నేడ్తెఱ డెందము గొందలంబుఁ బొం
దెన ధృతి మాలి యేఁ బలికి - తిం దగ వెల్ల నెఱింగి యుండియున్.

## ద్రౌపది భీమునితో ధర్మరాజుమహిమ సెప్పుట.

గీ యుం డగుపాండవాగ్రజు నిక్కంబ నిందించిన

దలఁచుట యరుదే

గాత్రికి నెల్లన్

- పెంపు ద

పతులకు

వి యుగ

ఉ. నీవలమూఁపులావు మును - నేల వహించిననాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల - కారయ నూఱటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ - బండువు గాదె మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ - గాలముచేరువ గాదె పావనీ. 172

తే. బకహిడింబకిమ్మీరుల - బాహుబలము, నాజరాసంధునుగ్రద - ర్పాతిశయము
లోకభీకరములు విజ - యాకరములు, నైన నీకరములకు లో - నయ్యెఁ గాదె 173

ఆ. అట్టినీవు వంట - కట్టియలకు లావు, నూపు చుండ నెపుడుఁ - జూచి చూచి
వగతు నదియుఁ గాక - తగ వేది యమ్మత్స్య, మేదినీశ్వరుఁడు వి - నోదమునకు. 174

మ. మహితవ్యాఘ్రమృగాదిసత్త్వచయముల్ - మల్లవ్రజంబుం గృపా
రహితుం డై యెదు రొడ్డుచుల్ పరుసఁ బో - రం జూచు ని న్నెప్పుడుల్
మహనీయం బగునీశరీరము జగ - న్మాన్యంబు నీచక్రియా
విహితం బైనకుజీవనంబు విధి గా - వించెం గటా దీనికిన్. 175

... మతిహీను ని ట్లనియె వివేకహీనుం డగువిరాటుండు నిన్నుం బోరించునప్పుడు
... పురకాంతలకు వినోదంబు సేయ వారల రావించిన నేనును సుదేష్ణతో
...ంచి చూచు చుండుదు నయ్యవసరంబున 176

... నీపోరెడునెడ, బరమవిషాదంబు నీవు - బలిమి మెఱసి యు
...త్తి జయము గొనినం బరితోషముఁ బొందు నన్ను - భావించి మదిన్ 177

...ంచి సు... ద... జనం... లుం దములోన . 178

...మాలినిచూ, డ్కు... తెఱ... గడపొంగుఁ దెలిపె - డం... గంటిర నీ
...పమయంబును, దల... నొక్కటియ యివ్వి - ధం బెట్లొక్కో. 179

...మం గలదు తే దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవు చుండుదు
...రుడ. 180

...గనీమూర్తిపై... న్ను - మనముఁదగిలి, యుండ నేమటియుండియొ - క్కొక్కమాట
...చికొనివారి దెస మది - నిలుపునప్పు, డెఱుఁగ నగు వారు నా తెఱఁగెఱుఁగు రెల్ల.

...పున మదీయపరిభవాతిరేకంబునకు నీ వుద్రేకించిన జనంబులు మనల భేదింతురు.
...ం బోలినభంగి రహస్యభంగంబు గాకుండ నరిభంగంబు సేయుము మని వెండియు.

...డరినహారు నైన - దోర్బలంబునఁ దన్ను, మిగులంగ నీఁ డను - మేటిమాట
...మరేంద్రునర్ధాస - నమునకు నైన న... దెంతయును నను - రూఢిమాట

జమునిల్లు సొచ్చిన - జంతువు నైనను, గాచు నెమ్మెయి నను - రాచమాట
దనుఁ గోరి యూర్వశి - దాన వచ్చిన నైన, లోలుఁడు గాఁ డను - మేలిమాట
శౌర్యవైభవప్రాభవ - శౌచములకు, నొరుల కైనఁ గైవార మై - యుల్లసిల్లు
నొక్కరుని కివి యెల్లను - నిక్క మట్టె, యెందుఁ గలుగునె యర్జును-నీడువాఁడు.

క. ఆపార్థుఁడు భరతాన్వయ, దీపకుఁ డమరేంద్రసుతుఁడు - దేజోనిధి వి
ద్యాపారగుండు వినుతె, వ్యాపారుం డాపదలకు - నగ్గం బయ్యెన్. 184

చ. అరయ నతండు మానధనుఁ - డక్కట రంగమునందు నిల్చి సుం
దరులకు నాట నూపెడువి - ధం బతిదీనము దానిఁ జూచి యేఁ
బురపురఁ బొక్కుచుం గడుపుఁ - బ్రొచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం
జొరఁ నగువాఁడె దేవపతి - నూనుఁడు దైవము చేతఁ సూచితే. 185

చ. మగలకు మేటి యైనబల - మర్దననందనుఁ బేడిఁ జేయఁ గాఁ
దగునె విధాత నీకు నని - దైవము మూలుదు నోర్వ రానినె
వ్వగఁ బలకొన్న నెంతయును - వందుదు నిద్దురవస్థ యెన్నఁడో
తెగు టని సంతతంబును మ - దిం దలపోయుదు నేమి సేయుదున్.

సీ. తనయొప్పెదురఁ గన్నఁ దగిలి యెవ్వరి కైన, మలఁగి క్రమ్మఱఁ జూడ - వలదె
దనవర్తనము విన్న - మునిజనంబుల కైన నలవరించికొనంగి - వలయువాఁ
డనబంటుతన మాజిఁ - గనిన మార్తుర కైనఁ, బలుమాఱు నగ్గింప - వలయు
దనవితరణకేళి - వినినఁ గల్పకతరు, వుల కైనఁ దల యూఁప వలయువా
నకులుఁ డొరులకు నశ్వశి-క్షకు డు గాఁగ, నగునె యాతనిగుస్థి[illegible]-యనుది
గాంచి కన్నీరు డించుచు-గడప రాని, దైవఘటనకు నొత్తుఁ జి-[illegible]ంలా

శా. ఆరూపం బవికార మాభుజబలం - బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయారసానుగత మా - శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం - బాయీగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడుకే - తన్మాత్రుఁడే చూడఁగన్.

క. సుకుమారుఁ డతఁడు గోపా, లకవృత్తి వహించి యడవు - లం గ్రుమ్మరు చ
న్కికి నాక కాదు పగవా, రికి నైనను నకట మన ము - రియదే వగలన్.

ఉ. ఏమును మీరుఁ గానలకు - నేగునెడన్ ననుఁ జేరి యెంతయున్
దీనత దోఁపఁ గుంతి సహ - దేవుని నిల్లడ వెట్టి నాకు న
మ్మా నిను నమ్మి చాల విష - మం బగునివ్వనవాస మీతఁడుం
బూనఁగ నియ్యకొంటి నని - బోరన నశ్రులు గ్రమ్మ చుండఁగన్.

వ. మఱియును. 191

చ. కడుఁబసిబిడ్డ వీఁ డొకటి - గా దవు నా నెఱుఁగఁడు ముంద ఱె
య్యెడ నొకపా టెఱుంగఁ డెద - యెంతయుఁ గోమల మెప్పు డైన నేఁ
గుడువఁగఁ బిల్తుఁ గాని తన - కుం గలయాఁకటిప్రా ద్దెఱుంగఁ డీ
కొడు కిటు వోకకుఁ డనము - గుండెను నిఁ గని యూఱడిల్లెడున్. 192

తే. ఎప్పు డెయ్యెడ నేమిట - నెట్టు లరయ, వలసె నమ్మేయి నారయు - మలసి డస్సి
నొచ్చి యైనను నేమఱ-కిచ్చఁ దలఁచి, తడెమి నాచేత దీవన-వడయు మమ్మ. 193

వ. అని యప్పగించె నేను వనవాసకాలంబున నానేర్చువిధంబున మీకు నెల్లను
గారా మైనతమ్ముని నమ్మేయుం బరికించికొని వచ్చితి యిపు డజ్ఞాతవాసాయాసితుం
డగునతని నాకు ననుసరింప వెరవు గాకుంజేసి చేయునది లేక చింతిల్లు చున్న
దాన. నా తెఱంగు వినుము. 194

సీ. ద్రుపదభూవిభుఁడు పు-త్రులకంటె నెంతయుఁ, బెంపు సేయుచు గార-వింపఁ బెరిఁగి
కుంతీమహాదేవి - కోడండ్రలోపల, నగ్గలంబుగఁ గొని - యాడఁ బరఁగి
బులకు నెల్లఁ-బ్రాణంబుగా మీరు, నెయ్యంబుతియ్యంబు-నెఱప నడచి
తల్లిదండ్రుల మాటగాఁ గొని జను, లనిశంబు భక్తిసే - యంగ నెగడి
ణవిక్రమం బల - రూఢి కెక్కి, నట్టికొడుకులఁ గని భర - తాన్వయంబు
నాయిల్ల యిల్లు గా-నతిశయిల్లి, తగవు మై బాంధవులచేతఁ-బొగడు వడసి.

రింపం దనరాజసూయ మునఁ బ్ర - శ్వదేవతాకోటి కె
సంతృప్తి యొనర్చి వాఁడియఁ గ - ల్యాణాత్మ నై పుణ్యవ
పాండుక్షితిపాలుకోడ లనఁగా - రాజన్యమాన్య ప్రియాం
లం దెల్లఁ బొగడ్త గంటి నతిలో - కం బైనమీమన్ననన్. 196

మ మనంబు పెంపు సెడి - యిప్పుడు నీచతరప్రచారముం
గాని నికృష్ట నై యుదర - పోషణకై తగవేది యెంతయుఁ
కుఁ బొంది యిమ్మేయి సు - దేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచుఁ
నత నున్కి మీకు వగ - పేమియుఁ జేయద యేమి సేయుదున్. 197

ని పంపఁ గాని యొకతకుఁ, బని సేయ నెఱుంగ నన్నుఁ - బనిగొను నెడఁ బాం
బనియగ్రమహిషి గొంకుచుఁ, బని గఱపెడుచందమునన - పనుచు టెఱుఁగవే.

ఎల్లరు రాజుదేవులును - నొద్దులు రాచినచందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా నలయ - కేను శ్రమంపడి నిల్చి నిల్చి య

ల్లల్లన మార్దవం బొఁటిరు - నల్లుగ నెట్టకు నేని రాచి మీ
తల్లికిఁ భక్తిఁ బెట్టకువి - ధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. 199

ఉ. నున్నఁదనంబుగా నలుఁగు - నూరియుఁ జందన మట్లు రాచియుం
బన్నుగఁ గ్రొత్త లైనకల - పంబులు గూర్చియు నాసు గేష్ణకుం
గన్నులసన్నలం బనులు - గైకొని వారక చేయు చుండుటన్
ము న్నటు లున్నపాణిఁల - ముల్ బలుఁగాయలు గాచెఁ జూచితే. 200

క. అనుచుం దొరఁగెడునశ్రుల, మునిఁగినమో మతనివత్త్ - మునఁ జేర్చిన వ
వ్వనితయవస్థయు తాల్చుచు, ననిలసుతుం డడలె డెంద-మలమటఁ బొందన్. 201

తే. అట్టియెడఁ దన్నుఁ దాన యూ-రార్చుకొనుచు, నంబుజానన నెమ్మొగ-మల్లఁ దుడిచి
యనునయించి తత్తరములు-దనమొగంబుఁ, గదియఁ జేర్చుచు నిట్టూర్పు-గాడ్పు నిగుడ.

వ. చింతాక్రాంతుం డైనకౌంతేయునకు నయ్యింతి యి ట్లనియె. 203

తే. ఇంపెఱుకు నిన్ని భంగుల - నిడుమ సుమువ, వలసె ధర్మతనూభవు - వలనఁ జేసి
దాయ లొడ్డినమాయజూ-దంపుటురులఁ, బడి కులంబున కాతఁ డె ప్పాటు దెచ్చె

ఉ. అక్కట మోసపోయి యడి - యాసలఁ జానక యున్న దాన ము
న్నొక్కొక్కరులన్ దురంతగురి - తోత్కట బాధలఁ బెట్టి యున్న నా
కెక్కడిదుర్గఖశాంతి గడ - యీఁదుట యెమ్మెయిఁ గల్గనేర్చు మీ
ముక్కున నూర్పు గల్గ నొక - మూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్.

క. మీ రేమి సేయుదురు దై, వారంభము గాక శుభము - నశుభంబును సం
సారులఁ దనతనతటి నని, వారణఁ బొందంగ మాన్ప - వచ్చునె దానిన్

ఉ. కావున మీర లభ్యుదయ - గౌరవ మొందుట యాత్మఁ గోరి యే
నేవిధి నైన నాపదల - కెల్లను నోర్చెద దాని కేమి యీ
కావలఁ దైనకీచకుఁడు - గామనిపీడితుఁ డై యలంతులం
బోవక యేచి పట్టుకొనఁ - బోయిన దూఱెదఁ గాక యిమ్మెయిన్.

తే. వానిఁ దెగఁజూడ వైతేని - వాయుపుత్ర, నీవు గనుఁగొన నురి నైన - నీర నైనఁ
నగ్ని నైన విషంబున - నైన నేను, మేను దొఱఁగుదు నెట్టు నీ - యాన సుమ్ము

వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె.

చ. జలజదళాక్షి కీచకునిఁ - జంపుట కిమ్మెయి ముట్టఁ బల్కఁగా
వలయునె యేను జూడ నని - వారణ నిన్నుఁ బరాభవించి వాఁ

డిల మన నింక నాంధ్రకును - నెవ్వరు భంగము నీఁగఁ జాలువా
రలఘుమదీయబాహుబల - మప్పుడ చూపనితప్పు చాలదే 210

తే. ఎల్లి యెల్లవిధంబుల - నెందుఁ జొచ్చె, నేని యాధర్మతనయుండు - దాన వచ్చి
యడ్డపడెనేని నీవ పెం - పారుకరుణఁ, గాచితేని నాచేఁ బడుఁ - గీచకుండు. 211

వ. వానిదెసం జింత యాపంత వలవ దమ్మాటలు విడువు మని యూఱడిల్లం బలికి దుర్ద
శల నలందురున వ్వేలందిడెందంబుకుందు వాపం దలంచి యి ట్లనియె 212

సీ. చ్యవనునివాంఛకు - సంయాతినందన, యిడుమలఁ గుడువదె - యడవిలోన
రాఘవుతోడ న - గణ్యవాసము సేసి, సంతాప మందదె - జనకతనయ
కుంభసంభవునకై - ఘోరదుర్గముల లో, పాముద్ర యలజడి - పాలు గాదె
నలునిపిఱుందఁ గా - నల కేగి దమయంతి, మనుజులు నడనియ - మ్మలికి పడదె
వారు నైరణ సేసి గు - ర్వార మైన నిరతిశయదుఃఖభారంబు - నిస్తరించి
సౌఖ్య మొందరె నీవు నా - చందమునన, యాపదల కోర్చి సంపద లనుభవింపు

వ. దుర్యోధనదుశ్శాసనకర్ణశకునిసైంధవప్రముఖం బగుదుష్టలోకంబు నధోలోకంబున
క. ంతకు మఱియాంతరంగంబు చింతాభరభుగ్నంబును నవమానపంకమగ్నంబు
న పోద్వృత్తంబును నై వేగిరపడుచున్నయది ధార్తరాష్ట్రులకుం గాలావసానంబైన
య సమయకాలావసానం బయ్యె నజ్ఞాతవాసంబునకుం జొచ్చి పదునొకొండు
నెలలు సనిపండ్రెండవనెల ప్రవర్తిల్లుచున్నది దీనికొఱంత దీటిన నీదుపంతయుం దీఱు.
డిల్లి యుండుము. సింహబలుండు నిన్నుఁ బరిభవించి మైమైతోన యునికిం జేసి
గ్గియుం జెనక వచ్చు. నీవుం గ్రమంబున నొడంబడుటభావించికొని వానికి నర్తన
సంకేతప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము. వాఁడు
వ్వన నాసాబగునిం దెగఁజూచి నీపం జూపి నీచిత్తంబు నడసెద ఇత్తెఱంగు దప్ప
ండువిధంబు గర్జంబు గా దిదియ నిశ్చయం బిట్లు చేయువార మిమ్మాటలవలనం
వు గాని వేగుచున్నయది. జనులు మేలుకాంచి మనలం గాంచిరేని వంచన
లువడినం గార్యంబు దప్పు కీచకవధంబునకుం బూనిన నామనోరథంబు దుది
ట్టవలయు నిజశయనస్థానంబునకుం బొమ్మని శయ్యాతలంబు విడిచి యత్తన్వియుం
కిమి కొన్ని యడుగు లనిచి మరలి మారుతాత్మజుండు గలుషితాత్మం డగుచు
జ్జకు వచ్చె. అవ్వెలందియుం దననిద్రించు నెడకుం బోయి పర్యంకభాగంబునం
నువు వైచి యంకిలి దేఱిన డెందంబు గొందలంబుతోడి నిశ్చయం బొరయ నిద్రం
ొరయనికనుదోయి మొగిడ్చి యుండె నంత, 214

## ప్రభాతకాలవర్ణనము.

తే. ద్రుపదనందన పరిభవ - దుర్గ్రహమునకు, నుల్లమున దురపిల్లుచు - నున్నసరసి
వేఁడినిట్టూర్పులో యన - వెడలెఁ గ్రొత్త, తావిమూఁతులు విచ్చెనె - త్తమ్మివిరులు ౨.

క. విచ్చెం దిమిరము గాఁవులు, వచ్చె మధుపకులము లబ్జ - వనముల కురులం
జొచ్చె విరులు తరులతికల, నిచ్చె రథాంగములు వంత - యెల్లఁ దొఁగలకున్ . 216

*          *          *          *          *          *

తే. రాలి యున్నపుష్పప్రక - రము విదిర్చి, చెన్నుగా నున్న సేసిన - సెజ్జ యనఁ
వేగుటయుఁ జుక్కలన్నియు - విరిసి విశద, భాతిఁ జెలువొందెఁ జూడ నం - బరతలంబు.

వ. తదవసరంబున నల్ల నల్లన తెలిపి యిచ్చి యవు లవులం జనునంధకారంబ
బులయందును లేకునికివలనం గడ శ్లప్పళించి నెరసి విరసినం బొలుచుకలుఁ
బోనిదిక్తటంబులును దమపాసినకంను వలు రోసి యెత్తినమెడలును బచరిం-
డ్కులు వేక్కులం గ్రుం దైనడెందంబులుం గలిగి మెలంగుచు నొండొంటి
గాంచి యొదవుసమ్మదంబునం బొదలుమేనులు బెరయించి పరమానంద
జొక్కుచు జక్కవలు గలసి పొలసి నలిరేఁగి చెలంగుచు రేయింటియా
గొదగొని కమిచి చంచువులం దిగిచి త్రుంచి యానుచు నిక్క డిక్కడఁ
జిక్కువడి యున్నమృణాళశకలంబులవలన బాలచంద్రశతాభిరామంబు
జలమూర్తివిశేషంబులుం బోనిసరోవరంబులును జీఁకటి వాసినం బ్రభాతం బ
మానిసి మెలంగి ముసుంగు వుచ్చినట్లు మేలుకని యెలుకలు వొదల విదిర్చి
కొని కలగొనం బలుకుపులుఁగులయెలుంగులవలన నొండొంటిం దెలుపుకొరఁ
ధరణీరుహంబులును బరఁగునరుణోదయరాగపటలంబు నెనయు కెంజాయ
వికసిల్లురక్తారవిందంబుల దండడి నెగసి చరించుచంచరీకంబుల యెలుకల
గిలికొని క్రొత్తయగుకాంతి ప్రవాహంబులం గడలుకొల్పుపుష్పాళ్లుడుల్చి
చం బొలయుమలయానిలంబునం గ్రాలుమవ్వంపుఁదీవలఁ గడివోయి తో
విరులవలన మీనకేతనపురాతనబాణశాలలుం బోనిలతామండపంబులును
యు జగంబుసంధ్యాంజలిపుటకరణంబుల ననుకరించువిధంబునం దర్శనీయంబ
కుముదవనంబులును నేమేనినెపంబున నొండొరుల మేలుకాన్పురమణరమ
బులనర్మాలాపంబులన్ బెరయుదరహాసంబులకాంతిఁ దెలుపెక్కునట్లు వెల
దీపంబులును మునుకడ వచ్చి యెలుక సేయమికి వాతాయనపవనునిపయిం బ
యలుకవిధంబున వేగుఁజోకట నంకురించు మదంబునఁ గెంపు గదురుట నిద్ర

నని శంకింపక యింపునం గదియువిసద్ధవిటజనంబులమనంబులు దిగుచు లలనాలో
చనంబులును రేపకడ వనలక్ష్మి పురశ్రీ నలంకరించువడువున నెడపడక యెల్లెడల
నిగుడువిభాతకుసుమకదంబపరిమళంబును నై యున్నంత. 218

సీ. నీరజాకరములు - నిష్ఠమైఁ జేసిన, భవ్యతపంబుల - ఫల మనంగ
దివసముఖాభినం - దితచక్రయుగ్మకం, బులయనురాగంపుఁ - బ్రోవనంగ
హరిహరబ్రహ్మను - హానుభావంబు లో, క్కటి గాఁగఁ గరఁగిన - గట్టి యనఁగ
నతులవేద త్రయు - లతికాచయము పెను, పొందఁ బట్టెడుమూల - కంద మనఁగ
నఖిలజగముల కన్నైఅ యగుచు జనస మాజకరపుటహృదయస - రోజములకు
ముకుళనఁబును జృంభణంబును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రి-పై వెలింగె.

వ. ఇట్లు సూర్యోదయ మగుటయు సమయసముచితకరణీయంబులు వేగిరంబ నడపి
వేగిరపాటుతో సింగారంబు సేసికొని సింహబలుండు 220

క. లేనమదిఁ గదిసినతమకం, బునఁ జిడిముడి పడుచు ద్రుపద - పుత్రికపై నూ
నినవేడ్క దిగుడ నొక్కటియుఁ, గను గొన విన లేక మదన-కంపితుఁ డగుచున్. 221

వ. అతిత్వరితంబ సుదేష్ణమందిరంబున కరుగుచు నంతరంగంబున. 222

తే. చన్న నేగి యం బజవి - శాలవిలోచనఁ గాంచి ప్రీతిమై
నరుఎ్యడ నేకతంబ హృద - యం బలరం దగఁ బల్కి యొక్కమై
వ్యకొనంగఁ జేసి రొల-యించెద * * *
* * * * * 223

వి యువ్విళ్లూరుచు వెసఁ, జని కేకయరాజపుత్రి - సదనంబున న
వ్యనిమిషచారువిలోచన, యనురూపవిధానని౦త - యై యుండంగన్. 224

మఁగొని యప్డు గ్రొత్త యగు - కౌతుకవృత్తి మునింగి పల్లటి
,నధృతితోఁ గ్రమం బరయ - లేనిమనంబు చలింప నచ్చటన్
ఁనులెడ యాట గాంచునెటి - సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ
జనియె విధాతృలుబ్ధకవ - శంబునఁ బోవుమృగంబుచాడ్పునన్. 225

చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గాననివిధఁబు - గైకొని చిత్తం
బున బెదరక తనమందటి, పనివెరవున నుండె భీము - పలుకులయూఁతన్. 226

వ. అట్టియెడ. 227

సీ. ఎవ్వరితోనైన - నెలుఁ గెత్తి యొక్కింత, పని లేని వెంగలి - పలుకు పలుకు
మట్టియ లాండొంటి - బిట్టు దాఁకఁగ నేల, నందంద మునిగాళ్ల - నప్పళించుఁ
గడు వికారంబుగా - నోడ లెల్ల విఱుచుచు, మలఁగి రిత్తకు రిత్త - సెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గర - తలమునఁ బెలుచఁ గం, బంబు వ్రేయుచు వెడ - పాట వాడు
మలయు నంతంతఁ జేరువఁ-బొలయు నిఁతి దన్నుఁ జూడమి కెంతయుఁ-దల్లడిల్లు
నిక్కడక్కడ పడుఁ దగు-లిన మడింపఁ, జూచు నత్తన్విఁ బొరిఁ బొరిఁ-గీచకుఁడు.

వ. ఇట్లు బహుప్రకారంబు లగుదుర్విలాసంబులు సేయుచు నద్దురాత్ముండు ద్రుపద
నందన డాయంబోయి. 229

ఉ. భాగ్యము గాదె నీచరణ - పద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా
యోగ్యత గల్గెనేని నను - నొక్కని నొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీమనంబునఁ ది - రంబొ నిజం బెఱుఁగంగఁ జెప్పు సౌ
భాగ్యము గుందునే మగల - పై నొకయించుక మోడ్కి నిల్పినన్. 230

ఉ. ఆలము సేసి నాతగుల - మాఱడి పుచ్చఁగ నేల చేల న
న్నేలి యనంతభోగముల - నిచ్చ మెయిన్ విహరింపు నిత్యల
క్ష్మీలలితకాలవాల మగు - జీవన మంతయు నీమొగంబ కాఁ
బాలన సేయు మిప్పురము - భామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్. 231

ఉ. రాజుల నెల్ల నుగ్రసమ - రంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యీ
భూజనకోటి నా దగువి - భుత్వసమగ్రత నాదరించి వి
భ్రాజితరాజ్యతంత్రములు - పాలనసేయుదు నేన వీటికిన్
రా జనఁగా నెపం బిడి వి - రాటునకుం దగఁ గూడు వెట్టుగున్

వ. కావున.

క. నీ వొకత వేల యిలఁ బది, వేవుర నే వలచి పట్ట - వెదకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం, దేవాఁడు మగండు దీని - నెఱుఁగవ కంటే.

చ. విరటుఁడు సూచుచుండ నిను - వేవురముందట నట్లు ద్రోవ నొ
క్కరుఁడును గాదు గూడ దనఁ - గల్గెనె పోటరు లైనభర్త లే
వురు గల రంటి వారియల - వుం జలముం గడగంటి నింక నె
వ్వరు గల రిట్లు దప్పె దని - వారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్.

వ. అనిన నవ్వెలంది వీఁడు దమకించి యున్నవాఁడు నాయంత్రించుమాటలకు మున్న కదియంబడినఁ గర్జంబు దప్పు నని విచారించి. 236

తే. బహువిధంబుల నమ్మెయిఁ - బలుకునతని
పలుకు లేర్పడ విని మెత్తఁ - బడినయట్లు
సుభగ మెయివడిచూపుగాఁ - జూచి తనదు
హృదయ మెఱిఁగించుతెఱఁగున - నిట్టు లనియె. 237

చ. వల దని యెంత సెప్పినను - వావిరి పై కడువేగపాటుమైఁ
బలుమఱు నెల్లెడం దొడఁ - బాలెదు నీహృదయంబునట్లకాఁ
దలఁపు మనోజుతూపులకుఁ - దక్కటిచిత్తములం గడంగి వి
చ్చలవిడి సేఁత గర్జమె వి - చారము గోర్కికిఁ గానివావియే. 238

క. మగ లడఁకువ నుండక తమ, తగులను పాటింతు రెట్టి - తగులం బైనన్
మగువల యొడలవ యలుగుం, దగవు విడిచి యడిచిపడరు - ధైర్యముపేర్మిన్. 239

ఆ. ఇట్లు లగుట యెఱిఁగి - యెల్లభంగుల రహస్యంబు గోలుపోని - యట్లు గాఁగ
నడెరు నీకుకోర్కి - కనురూప మెట్టిది, యట్టిభోగభంగి - ననుభవింపు 240

చ. అని ప్రదుఁ గీచకుంచు హృద - యం గనఁ బొంగి లతాంగితోడ ని
ట్టను ధృతిఁ గోరుపుచ్చెఁ గుసు - మాయుధుఁ డేటివిచారి విట్టు లేఁ
వగనె యైన నీ దయిన - పం పెదఁ గైకొని చేయువాఁడ నే
ననువున నెప్పు డెయ్యెడ ని - జాభిమతం బొడఁగూర్తు చెప్పుమా 241

అని పలికినఁ బాంచాలియుఁ, డనయురులం గీచకుండు - దగులుట భావం
బున నిశ్చయించి యిట్లను, ననురాగాయత్తచిత్త - యైనదివోలెన్. 242

తత్తర లోనుగాఁ గలవ - యోగముఖుల్ పగ లెల్లఁ బ్రీతితో
వృత్తముఁ జేసి పోవఁ గమ - నీయరహస్యవిధిన్ నిశీథినీ
వృత్తము గోరువారలకు-వేడ్కకుఁ బట్టగుచుండునాగృహం
బుత్తమ మిత్తెఱంగునకు - నొఁటిమెయిం దగ నీవు వచ్చినన్. 243

అనిన నతఁడు వికసిల్లుచు, నను నమ్మెయి నేలికొనిన - నలినానన నీ
యనుమతి సేయనె యొక్కెడఁ, జనుదెంచెద నేఁటిరాత్రి - సమ్మదలీలన్. 244

తే. ఇదియ నిశ్చయ మిమ్మాట - యెడల కుండు, మనిన నీ వొక్కరుండవ- యరుగు దేర
వలయు లేకున్న నయ్యేడ-నిలుచుదానఁ, గాను జూ నిక్కవం బని-పూని పలికె

క. మన మిర్వురఁ బెద్దయుఁ బ్ర, చ్ఛనుమానము లేక మాట - లాడుట దగ దీ
వును బో మ్మేనును నా దగు, పని సేసెద ననియెఁ గమల - పత్రేక్షణయున్. 246

చ. సమయము నిర్ణయింప విని - చంద్రనిభాననపల్కు లప్పు చి
త్తమునకు నింపు వెంపఁగ ము - దంబున, గీచకముఖ్యుఁ డాత్మగే
హమునకుఁ బోయె నమ్ముదిత - యచ్చట వెండియుఁ బ్రస్తుతక్రియా
సముచితవర్తనంబుఁ దగఁ - జల్పి మహానసశాలలోనికిన్. 247

## ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట.

క. చని వెస వికసిల్లెడునా, ననపద్మముతోడ ననిల - నందనునకు ని
ట్లనియెఁ జతురోక్తిరీతి య, తనిగూఢక్రోధవహ్ని - దరికొల్పంగన్. 248

క. నాకొఱకుఁ దీర్చి వచ్చితి, నీకొఱకయ యింక నూతు నిం దెగఁ జూడన్
లోకము వంచింపను దగు, చీఁకటి రే యొదవ నేను - సేసెదొ చెపుమా. 249

వ. అనిన విని దరహాసితవదనుం డగుచు నృకోదరుం డి ట్లనియె. 250

క. న న్నడుగ నేల నీవును, నన్నీచుఁడు నేమమాట లాడితి రది నా
కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము, ని న్నే మెచ్చించువాఁడ - నీ జవదనా. 251

వ అనినఁ బాంచాలి సుదేష్ణమందిరంబునం దా నుచితాచరణంబున నునికియు
బలుండు సింగారించుకొని వచ్చుటయు రేయింటిమాటలవలనం దాను బెదర
వాఁడు సామభేదదానదండంబులు సూపి పలుకుటయు దానికి మెయికోల
వించికొని క్రమంబునం దగినసంభాషణంబు సేసి నాట్యమండపంబు సంకేత
బుగాఁ జెప్పి యొక్కరుండ వచ్చువాఁడ వని నియమించుటయు నద్దురాత్ము
ప్రముదితాత్ముం డగుచు రాత్రిసమయంబున నయ్యెడకు నొంటిమెయిం జను
వాఁ డై చనుటయుఁ దెలియం జెప్పిన నతండు పరమాహ్లాదంబునం బొంది

శా. క్రోధం బప్రతికార మై హృదయముం - గుందింప నత్యంతచిం
తాధూతాత్ముఁడ నైననాకుఁ బరమో - త్సాహంబు సంధిల్ల దు
స్సాధం బైనవిరుద్ధకార్య మిటు లా - సన్నంబుగా సంఘటిం
తే ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చఁ బగ సా - ధింపంగఁ గా న్వల్పమే. 2

వ. అని పలికి కొండొక విచారించి. 254

క. వెలవకి సంకేతించిన, తెఱఁగున నచ్చ్యోడకు నరుగు - దెంచునొకో కొం
దఱఁ దెచ్చునొకో వెడఁ గై, యతిమతి వెలివుచ్చునొకొ ర - హస్యం బెల్లన్.

ఉ. అట్టిద యేల చేయు నన - యంబు నయం బొడఁగూడఁ బల్కి నీ
విట్టితెఱంగు సేయు మని - యేర్పడఁ జెప్పిన వాని కత్తిఁ దం
బుట్టినసంతసంబునను - వుం బరికించితి కాదె యింక ని
ట్టట్టనఁ డెట్టు లైన హృద - యంబున నెక్కుడిశంక వానికిన్. 256

ఉ. వచ్చు మదాంధవృత్తి ని - వార ని నొక్కఁడు నాట్యశాలకుం
జొచ్చు నవశ్యముఁ వెదకి - చూచి ననుం గని యప్డు సంగరం
బిచ్చు మదీయబాహుబల - హీనబలుం డయి నీకుఁ బ్రీతిగాఁ
జొచ్చు నసంశయం బిది వి - చారము లిన్నియు నింక నేటికిన్. 257

వ. అని నిశ్చయించి వృకోదరుండు వెండియు ని ట్లనియె 258

మ. బలియుం డాసాబగుండు భావభవద - ర్పభ్రాంతుఁ డై వచ్చి ని
శ్చలసర్వాంగత నున్న న న్నసి నీ - చండంబు గా కున్న నా
కులతం బొందెడు నప్డు మండపము సం - క్షోభింపఁగా నేతుఁ గ
ట్టలుకన్ వెబ్బులి గోల నేచినటు లు - గ్రాకార మేపారఁగన్ 259

క. ఎఱిఁగి [illegible] పనిన వె [illegible], [illegible] సాళువము గాకి - నొడిసినభంగిన్
[illegible] పుగఁ [illegible], పతిసేయుఁడు నీకుపూన్కి - పాటం బెయిదన్.

[illegible]హుబలము-నకు [illegible] ఁ జాలు, భుజబలంబు గలిగి-పోక చిక్కఁ
నన్నుఁ గొంత-గి[illegible]యింప నోపెదు, చంద మైన వినుము - సరసిజాక్షి. 261

[illegible] క్రము సంచలింపఁగ దివం - బల్లాడ నాశాచయం
[illegible]తంబుగ గోత్రశైలనికరం - బాకంపముం బొంద న
ల్ ఘూర్ణన మొందఁ గ్రోధము గృతా - ర్థత్వంబు నొందించి చి
[illegible]ప్రౌఢి వహించి నూతునకు రౌ - ద్రం బేర్పడం జూపెదన్. 262

[illegible] బాంచాలి సంచలితస్వాంత యై నిజాంతర్గతంబున నతనితీవ్రక్రోధంబు
[illegible]గాధనంబునకు బాధకం బగు నని బోధింపం దలంచి యి ట్లనియె. 263

నివారు నప్పు మహీ - మోదధి ధర్మసుతుండు దీనికిన్
గఁ బొంద భూజనులు - నింద యొనర్పఁగ నే నొనర్చునీ

చివ్వకు నీవు నక్కమెయిఁ - జేసినయాపని గూఢవృత్తికిన్
దవ్వగు నేని నాయభిమ - తం బొడఁగూడియు నిష్ఫలం బగున్. 264

క. కావున వంచన బాహిర, పోవక యుండంగ వనరి - పుం బరిమార్పం
గా వచ్చునేని యట్టిద, నావల పటు గాక తక్కి - నను వలదు సుమీ. 265

వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డి ట్లనియె. 266

చ. మదమునఁ గీచకాగ్రజుఁడు - మార్కొని నిల్చిన వీఁక మై మెయిం
గదిసితి నేని యప్పుడు ప్ర - కాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవునె యైన నేఁ దలఁచి - యోపినభంగి నిగూఢవృత్తిమైఁ
బదిలము గల్గి తిన్ననియు - పాయమునం దెగఁ జూతు నాతనిన్. 267

క. అనవుడు జయలక్ష్మిం జే, కొను మని దీవించి యింత - కుం గేకయనం
దన నన్నుఁ దడవుఁ దడయం, జన దియ్యెడ నని లతాంగి - సనియెం శ్రీ

వ. మారుతసుతుండును గృతనిశ్చయుం డై యుండె నట గీచకుండు గందర్ప, దర్పగో
చరుం డై పరిజనంబుల వంచించి యేకాంతస్థలంబున. 269

## కీచకుఁడు ద్రౌపదియందలిమోహంబునఁ బరితాపంబు నొందుట.

సీ. వామాక్షిరుచిరలా వణ్యంబు భావించుఁ, దన్వంగిరూపు చి త్తమున నిలుపుఁ
గంబుకంధర చెన్ను - కైవడి దలపోయు, నంగనసౌకుమా - ర్యము దలంచు
భామినిసహజవి భ్రమ మెదఁ గీలించుఁ, బడఁతి చెయ్వులు మదిఁ-బట్టు
మానినిగరువంపు మాటపొం మూహించు, దళితాబ్జముఖితిన్నఁ-దనము
నవరి కోర్కులు చిట్టుము ట్టాడ వెడఁగు, పడినయుల్లంబు పట్టునఁ-బఱు
వశము గా కున్న నెంతయు-వంతఁబొందుఁ, జింతయోసకంబు నడిగొని-చిక

చ. తలరు నలందురున్ నవయుఁ-దాపభరంబున వెచ్చ నూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు వెగ - డందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి - ధైర్యము మాలిన బెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ బేర్చు నెవ్వగల - సందడి డెందము గంది చేడ్పడున్.

వ. ఇవ్విధంబున మదనవేదనాధూయమానమానసుం డగుచు ని ట్లని వితర్కించు.

సీ. పడఁతి నన్నొల్లఁడఁ - బలికినభంగిన, నిచ్చమై నిక్కకు - వచ్చునొక్కొ
వచ్చి తొల్లిటియట్ల-వడిఁ ద్రోచి పోవక, పొలఁతి యిం పెసలారఁ - బొందు

తలపోఁత గలిగి య - మ్మెలఁత వచ్చుటకు నొం, డొకవింత పుట్టక-యుండునొక్కొ
గంధర్వు లేవురు - గల రని చెప్పె న, న్నెలఁతుకమాటలు - నిక్కమొక్కొ
తెఱవ చిడిముడిపాటు సు- ధేష్ణ యెఱిఁగి, వేష్కఁ బనివంచు టుడిగి రా-విడుచునొక్కొ
మదనుఁ డింతికి నొజ్జయై-మతకములును, నడను నెఱిఁగించి నాకడ కనుచునొక్కొ.

ఉ. నిక్కమపోలె నప్పు డొక-నేరిమిమై ననుఁ ద్రోచి పుచ్చెఁగా
నక్కమలాక్షి పొందు దగ - నాడి తుదిన్ నిజ మేది నేఁటికే
యిక్కకు రాక తక్కిన స - హించునె నన్ మరుఁ డట్టు లైన నా
కెక్కడిప్రాణ మేటికను - వెయ్యది నిల్కడ యేమి సేయుదున్. 274

క. అ క్కైల రాక తక్కుం, గట్టిఁడియే యాలతాంగి - గామాతురు నన్
బెట్టి యుచటఁ దానికి మన, సెట్టు నిలుచుఁ దగవు విడువ-నెట్టులు నేర్చున్. 275

ఉ. దానికి నేఁటినిక్కము వ్య - థా పరితాపము దక్కి బాసమై
పూని కిడిగ్గఁ ద్రావి వెసఁ - బోయెద నిప్పుడ పోయి ముట్టి య
బ్జాననఁ బట్టి తెచ్చి హృద - యం బలరంగ * *
* * * బ్రమదాంబుధి నోలలార్చెదన్. 276

ఆ. అనుచు సంచలించు-నడియాసఁ గ్రమ్మఱ, బాసఁ దలఁచి ధృతికిఁ-బట్టు వెట్టు
మరుని కోపాటించి-యుఱియాడుఁ దుదిముట్టఁ, గాన నిశ్చయించఁ గలఁగుఁ దేలు.

వ. మఱియు నక్కోమలిపలని ప్రేముడిం దగిలి 278

పిన కైన - వడిఁ బట్ట సమకట్టి, పరికించి కానక - బమ్మరించు
యు కైనఁ-బలికింపఁ దలఁచి ని, రూపించి లేమి న-శ్రులు వహించుఁ
యు కైనఁ - గౌఁగిలింపఁ గడఁగి, యారసి బొం కైన - నలఁత నొందు
బద్ధయ కైన-నహరి పైకొనఁ జూచి, చెన్నఁటి యగుట ని-శ్చేష్టఁ బొరయు
విధవిహారంబు - లకు లతాంగి, యొలసి పొలసినయ కైన - నెలమిఁ గలసి
యతక్రీడ సలుపంగ - నప్పళించి, వెదకి రిత్తబయల్ గని - విహ్వలించు. 279

## కీచకుఁ డుద్యానవనంబున విహరించుట.

బహుప్రకారంబు లగుమన్మథవికారంబుల కగపడి వెగ డంది యమందసంభరితాంతఃకరణుం డగుచు సింహబలుండు పరిచారికాప్రార్థనం జేసి మజ్జననంబు లోకభంగి నడపినవాఁ డై తదనంతరంబ మనోవేదనాపనోదనార్థంబు నారామభూమికిం జని తత్ప్రదేశంబున, 280

చ. కమలవనంబుపొంత నును - గా డ్పొకయించుక యాదరించుఁ జి
త్తమునకు దానఁ దల్లడము - దన్కుటయుం జని గారవంపుఁ జూ
తముకడ నిల్చి నిల్చి యది - తాపముఁ బెంచిన లేఁతతీవజొం
పముఁ జొరఁబాఱు నం దలఁత - పైకొనినన్ వెడలున్ వెనుంబడున్. 281

ఆ. సుడిసియగాలిఁ బువ్వుఁ-బొడిఁ దన్నుఁ గప్పునో, యనుచు బెగ్గలించు-నగ్గలముగఁ
గురియు తేనియలకుఁ గొంకులతాగుల్మ, తమసమీపములకు - నరిగి యరిగి 282

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గా లూఁదక లీలోద్యానంబు గలయం ద్రిమ్మ
రుచు. 283

సీ. ఇంపైనప్రియ కౌన - నిచ్చి నిల్చినమగు, వాదట నానుమ - త్తాలివిభునిఁ
జెట్టుపల్ పచరించి - చుట్టుఁ ద్రిమ్మరి మనో, రమ నియ్యకొలుపుమ-రాళవిభుని
ఫలరసమొండొంటి కెలమిఁ జంచులనిచ్చు, మెయిన చొక్కెడుశుక-మిథునములను
గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయి మెయిఁ, దాఁకంగఁ జనుపిక-దంపతులను
జూచి చూచి యుల్లంబున-నేచి కోర్కు లహరఁ జిడిముడిపడు ద్రూను పడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడపడు దురంత చింతబారికి నగపడు-సింహబలుఁడు. 284

వ. ఇట్టివలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 285

క. వగ ముట్టికొనినఁ జిత్తము, వెగడొందఁగ మేను గలయ - వెమ్మఁగ రాఁ
తగల నొకతీవయింటికిఁ, దగి యుండెడుచంద్రకాంత - తల్పము సేరెన్

క. అం దొరగి కీచకుం డా, యిందీవరనయన నాత్మ - నిడి వేడ్కమెయిన్
డెందము చన విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెఱ్ఱిఁ జేయఁ - గా నిట్లనియె

*　　　*　　　*　　　*　　　*

వ. అనుచు వెండియు నిగుడుమనోరథంబులను భావరతంబుల శిశిరోపచా
బ్రొద్దు గడపి కడ గానక.

క. మాయరవి యేల క్రుంకఁడొ, కో యను నిట్టేల తడసె - నో యనుఁ
బోయెడుఁ జూ యిప్పుడ యను, దాయ పటిచె నను మనోజ - తాపముప్మే

ఆ. దివము కాని యింక - భువనంబునం దిటుఁ, బట్టి రాత్రి లేని - యట్టు గాఁ
జేసెనొక్కొ విధి వి - శేషించి నాకకా, నేఁడ దివము సాఁగి - నిలిచెనొక్కొ

తే. అ?చుఁ గ్రుంకింప రానిప్రా - ద్దరసి యరసి, శిశిరపర్యంకమున మేను - నేర్చి చేర్చి
వం?ఁ దలపోసి తలపోసి - వనరి వనరి, మిగుల వందురి వందురి - పొగిలి పొగిలి. 291

సీ. తని?కెడునారటం - బున నంత కంతకు, వెమ్ముచు నునికికి - విడుమరయును
?ఘమసంగెడు - కోర్కుల వెనువెంటఁ, బొఱలుచు నునికికి - నూఱటయును
వా?విరిఁ బొదివెడు - నగలసందడిఁ బడి, యురియుచు నునికికి - నుడుకువయును
నం?నంద కదిరెడు - కొందలపాటుచేఁ, దలఁకుచు నునికికి - నిలుకడయును
లేవి?ఁ దాల్మిగొనఁగ - లేక యలందురి, తనువు నింద్రియములు - మనముధృతియుఁ
దన?వశంబు గాక - తల్లడపడి సింహ, బలుఁడు విషమబాణు - బారిఁ బొరలె. 292

క. ఇమ్మెయి నధికపరీతా, పమ్మునఁ బడుసూతుహృదయ - పద్మం బలరం
దమ్మి?కొలంకులు మొగుడ వ, నమ్ములు సోలంగ దివస - నాథుఁడు గ్రుంకెన్. 293

వ. తదనంతరంబ. 294

## సూర్యాస్తమయవర్ణనము.

క. ఇనుఁడు దనకడకు నేతెం, చినరాగముఁ బొందు టది యు - చిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం, గన జనసంభావనముల - గౌరవ మందెన్. 295

ఉ. చుక్క?లు తోడుతోడఁ దల - చూపఁ దొడంగె మనోభవుండు వి
ల్లెక్కి? చక్రవాకముల - యిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కు? నచ్చె దీవియల - యేడ్తెఱ సోయగ మందె సందడుల్
?బురంబువీథుల మ - దం బొలసెన్ విటచిత్తవృత్తులన్. 296

?డి జారచోరజనంబులమనంబు లలరం జంద్రాస్తమయం బగుటయు 297

?ట్టిది పల్లం బిది, యన కుండఁగ నోలమును బ - యలు నొక్కటిగాఁ
విచ్చుటయును మోడ్చుట, యును సరిగాఁ దమము పర్వె - నుర్విం దోడ్తోన్.

? డాకృశోదరి వృకోదరుకడకుం జని సమయం బయ్యె ననవుడు. 299

?డు పెండ్లికిఁ బిలిచిన - యట్లు విని చ, హృదయుఁ డై తలచీర యా - యితము సేసి
?పదనందనఁ జూచి నా - తోన వెనుక, నల్ల నంతంత నరుగుదె - మ్మని కడంగి.

?నముపీఁక వే బొంకవి - కారము పుట్టక సంగరోత్సవో
?మరభసాతిరేకము బ - యల్పడు టించుక లేక రోషసం
?మ మొకయింత యైనఁ బర - భావనిరూప్యము గాక ద్రౌపదీ
?ణుఁడు వోయె విక్రమధు - రంధరతం దగ నాట్యశాలకున్. 301

వ. చని వివేకరహితుహృదయంబునుంబోలెఁ దమోమూషితంబును విదగ్ధవనితాప్రే
మంబునుంబోలె దుర్నిరూపంబును ఘోరాటవీభాగంబునుంబోలె నిర్మనుష్యంబును
గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపయోగ్యంబును ననభ్యస్తశాస్త్రంబునుం
బోలె దుర్గమంబును స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచరంబును విషమ
కావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశురాజ్యంబునుంబోలె జారచోర
హృద్యంబును నైనయానర్తనాగారంబు ముఖభాగస్థలంబు సేరి. 302

క. కెలకులఁ బిఱిందిదెసయుం, గలయం బరికించి తనయ - ఖండితబాహా
బలగర్వమ యచ్చట ముం, గలిగా మదమత్తభద్ర - గజసదృశగతిన్. 303

శా. ధ్వాంతాకారితకుడ్యకుట్టిమఘన - స్తంభావలీరూపమున్
భ్రాంతాదిప్రవిభాగబోధరహిత - ప్రాగ్ద్వారముం గాతర
స్వాంతత్రాసకరంబు నై దురభివే - శం బైనయాలోను ని
శ్చింతుం డై సతికేలు వట్టికొని చొ - చ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. 304

వ. ఇట్లు సొచ్చి తఱియం జని మధ్యప్రదేశంబున విరాటనందనలీలాపర్యంకం బరసి
కని దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి తా నాతల్పంబున నుండె
నంతం గీచకుండు. 305

క. కైసేసి మదవికారో, ల్లాసంబున మేను వొంగ - లఘుగతి నుత్కఁ
రాసవపానవిధాన, వ్యాసంగతరంగితాంత - రంగుం డగుచున్. 306

శా. సింగం బున్నగుహానికేతమునకున్ - శీఘ్రంబునన్ వచ్చుమా
తంగంబుం బురుడించుచుం బవనపు - త్రస్వీకృతం బైనయా
రంగాగారము సేర వచ్చి మదిలో - రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గాముం డిటుఁ దేఁడె యింత కని యు - ద్వృత్తాంగజోన్మాదుఁ డై

ఉ. స్వాంతము బాహుగర్వఘన - సంతమసాంధము గాఁగ శంక యొ
క్కంతయు లేక కీచకుఁ డ - హంకృతి ముంగలి గాఁగ మండపా
భ్యంతరభూమిఁ జొచ్చి తఱి - యం జని యారసి సెజ్జ గాంచి య
త్యంతముదావహం బగుడు - నందు రయంబునఁ గేలు సాఁచినన్.

చ. ఘనతరకోపవేగమునఁ - గంపము నొందునిజాంగకంబులం
దనధృతిపెంపుసొం పచలి - తంబులఁ జేయ సమీరుకూర్మినం
దనుఁడు దదీయచేష్టలును - దద్వచనంబులచొప్పు నేర్పడం
గనుమతి నూర కుండె నవి - కార్యనిగూఢనిజప్రకారుఁ డై.

ఆ. కీచకాధముండు - గిమ్మీరవైరిపైఁ, గేలు సాఁచి యావి - కాలనయన
గాఁ దలఁచి మేను - గరుపాఱ ని ట్లను, మదనఘూర్ణమాన - హృదయుఁ డగుచు.

చ. వనిత మనోహరంబు లగు - వస్తువు లెల్లను వేడ్క నేఁటి నీ
కని నియమించి తెచ్చితిఁ బ్రి - యంబునఁ గైకొను మెప్డు నంగనా
జ నులు నన్నుఁ జూచి మరు - సాయకముల్ దమచిత్తవృత్తు లే
చో గొని వచ్చి యిత్తురు వి - శిష్టధనంబులు నాకు లంచముల్. 311

సీ. నాదురూపంబు మ - నంబునఁ జిక్కిన, తరుణి దక్కొరు నేల - సరకు సేయు
నాదులావణ్యంబు - నకు నిచ్చ మెచ్చిన, యెలనాఁగ పైఁబడ - కేల నిలుచు
నావిలాసంబులు - భావింపఁ బడసిన, యింతి పుష్పాస్త్రుచే - నెట్లు బ్రదుకు
నావివేకమున కా - నందింపఁ గనినయం గన యెట్లు నిలఁవునఁ - గాఁగ కుండు
మెఱయ నాయాడుమాటలు - దెలియపిండు నల్లములకు నిం పారెదు - నురులుగా వె
యిట్లు నీ వొక్కతవె నన్ను - నేలుకొంటి, గాక మాట లిం కేటికిఁ - గమలవదన.

అనవుడు మనమున నిస్సీ, యని యుచితనిగూఢభంగు - లగుభాషణముల్
దనప్రియ వినిపించుట కి, ట్లనియెఁ మృదురీతి భీముఁ - డాతనితోడన్. 313

తే. ఇట్టివాఁడవు గావున - నీవు నన్నుఁ, బొగడికొనఁ దగ నకట నా - పోల్కి యాడు
దాని వెదకియు నెయ్యెడ - నైన నీకుఁ, బడయ వచ్చునె యెఱుఁగక - పలికి తిట్లు.

క. నాయొడలు సేర్చినప్పుడ, నీయొడ లెట్లగునొ దాని - నీ వెఱిఁగెదు న
న్నేత లలతోడిదిగాఁ, జేయఁ దలంచితివి తప్పు - సేసితి గంటే. 315

ఎట్టి నీవు వెండియు, వనితలసంగతికిఁ బోవు - వాఁడవె యైనం
బేఁ బడసినఫలమే, కనియొద విదె చిత్తభవవి - కారము లెల్లన్. 316

మఱి గ్రక్కున లేచి రోషకరినం - బౌహాస మానూతునె
ముద్వేగముఁ బొందఁ జేయ బలసా - మగ్రిఁ సముజ్జృంభణం
వానిం దల పట్టి పంచుటయు నే - పుం జేవయుం దోఁప వాఁ
మానింపక బె ట్టదల్చికొని కో - పాటోప దీప్తాంగుఁడై. 317

## భీమసేనుఁడు గీచకుని సంహరించుట.

ధర్వాం డనుతలంపున. 318

నతనూజాబాహువులు - పాణియుగంబునఁ బట్టి వీఁక మై
నిపయిం బడం దిగిచి - యంగము జానుల నూఁదనం గడఁక

జవమున దండతాడితభు - జంగముభంగి సముత్థితాంగుఁడై
యవయవముల్ ప్రకోపరభ - సాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్. 319

మ. మగుడం గీచకుఁ బట్టి వాఁడును బలో - న్మాదంబునన్ బాహుగ
ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీ - వ్రక్రోధుఁడై పట్టి బె
ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలా - టోపంబుమై నొండొరున్
మిగులం జాలక కొంతసేపు పడి మే - మేఁ బోరి రుగ్రాకృతిన్. 320

వ. అట్టియెడ. 321

క. తనయగపా టొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సమయుభంగ - మగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే, యనిబాధవిమర్దనప్ర - హారములఁ దగన్. 322

వ. మల్లయుద్ధనైపుణంబు మెఱయం గడంగి. 323

సీ. తిగిచిన నడుగులు - దెరలక యొండొరుఁ, గ్రమ్మఱఁ దిగుచుచుఁ - గడిమి మెఱయఁ
బొడిచిన వెస బీఱు - వోవక యొండొరు, నందంద పొడుచుచు - నవనిఁ బెట్టి
యొత్తిన బెగ్గలం - బొందక యొండొరు, బలువిడి నొత్తుచు - నలవు మిగిలి
యడఁగంగఁ బొదివిన - నడిచిపా టించుక, యును లేక వీఁక నొం - డొరుల నడరి
యడఁగఁ బొదువుచు నలుక యం-తంత కగ్గ, లించి యాయము నొంచి దో-ర్లీల నెఱపి
యుల్లసిల్లిన స్రుక్క-కొం-డొరుల రౌద్ర, వృత్తి నొంచు చొండొరులకు-వెక్కసముగ.

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, నదలుచుచుం బడుచు లేచు చెడఁగొచు పడిగొం
చొద వెడుకినుకం గడుబె, ట్టిదముగఁ బెనఁగిరి చలంబు - డింపక కడి

ఆ. ఇవ్విధమున నేచి - యిరువురుఁ బెద్దయుఁ, బ్రొద్దు పోర వాయు - ష
దోడుతోడఁ బెరుఁగఁ - దొడఁగె నాకీచకా, ధమునిలావు పిదపఁ - దఱుఁ

ఉ. దాని నెఱింగి యెంతయు ను - దగ్రత నాబకవైరి గ్రక్కునన్
వాని నడంగఁ బట్టి పడ - వైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదువు - న ట్లతఁ డూర్జితశక్తి నుద్భటుం
డై నెగసెన్ సమీరసుతు - నల్కకుఁ బ్రాఁకె డినట్లు వీఁకతోన్.

క. నెగయునెడ నగ్గ మైనను, బిగి యారుచుఁ బిఱుఁదుసనినఁ - బిడికిట గొ
ది గడు బెడిదముగఁ బొడిచెం, బగతుఁడు గను మిడిసి నేలఁ - బడి తన్ని

ఆ. పల్లవప్రసూన - ఫలభరితం బగు, మ్రాను గూలఁ ద్రోచు - మత్తగజము
పోల్కి వివిధరత్న - భూషణభూషితుం, డైనసూతుఁ గూల్చె - ననిలసుతుఁ

చ. వికృతపుఁజావు సంప మది - వేడుక వుట్టినఁ గిట్టి పట్టి మ
స్తకమును బీనదీర్ఘభుజ - శాఖలుఁ బాదయుగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁ దుఱిమి - నించిన గ్రంతలతిత్తి యైనకీ
చకుధరణీస్థలిం జదిపి - చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁ డై. 330

క. తనకడిమికలిమి నచ్చియు, మనమునఁ దలఁ కిడర సూతు - మరణంబు గనుం
గొనుటకుఁ దల్లడపడుప్రియ, వనిత కతనిచావు సెప్పి - యడిఁ దస్మాత్రన్. 331

చ. అనలము గూఢయత్నమున - నయ్యెడకుం గొని వచ్చి దానిఁ జ
య్యన వెలుఁగొందఁ జేయుటయు - నచ్చెరువుల్ భయముల్ ప్రియంబునుం
బెనఁగొనఁగాఁ గనుంగొనియె - భీతమృగేక్షణ భీము డాయఁ గాఁ
జని కడునక్కజం బయిన - చందమునం బడి యున్న పీనుఁగున్. 332

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచు - చుం దల యూఁచి విలక్షచిత్త యై
యాచపలాక్షి ముక్కుపయి - నంగుళిముం గఱియించి దీనికై
కీచక యింత సేసితి సు - ఖిత్వముఁ బొందుదుగాక యింక న
క్లేచిన నిట్లు గా కుడుగు - నే యనుచుల్ వెలఁ గిందు చుండఁగన్. 333

కి. పూని కెఱపితి సతియున, మానముఁ బరితాపభరము - మాన్చితి నివు డి
ట్లే నని మదిఁ బొంగెడుపవ, మానసుతుం టిట్టు లనియె - మానినితోడన్. 334

శా. నింత శల్యము వాసెనే భుజబలో - త్సేకంబు నీ కెక్కెనే
౦ బొందెనె రోషపావకుఁడు దు - శ్చారిత్రునిం జూచితే
షించితె యిట్లు గాక బ్రదుకల్ - శక్యంబె దుర్వృత్తి నీ
తం జేరినయట్టివీరులకు నా - చేతం బయోజాననా. 335

విన విని సింహబలము, ర్దను నవలోకించి ద్రుపద - రాజతనయ యి
ముఁ దనమనమున నిండా, రినసమ్మోదంబు వెలి వి - రిసి బెరయంగన్. 336

లువులోపల నిన్ను - కోప మ ల్లెత్తినఁ, దలఁకక నిలిచిన - ధైర్యమహిమ
ఁ డిందుఁ జనుదెంచి - నిర్వికారతఁ బ్రజ, కన్నులు గప్పిన - గౌరవంబు
నవారిలోన నొ - క్కని నైనఁ బిల్వ కు, త్సాహంబు సేసిన - సాహసంబు
కదుర్జయుఁ డగు - నీకీచకునిని వ్రే, ల్మిడి రూపు మాపిన - కడిమిసొంపు
మాడఁ దలపోయ మెచ్చ సం - స్తుతి యొనర్ప, నాదలంబె నీయుత్తమ - నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే - నెంతదాన, మహిత విస్మయానందని - ర్మగ్న నైతి.

క. అనుపలుకులు కర్ణరసా, యనము లగుడు నయ్యుధిష్ఠి - రానుజుఁడు ముదం
బునఁ దేలి యింకఁ దడయం, జన దని ద్రౌపదికిఁ జెప్పి - చయ్యన నేగెన్. 338

వ. పవనతనయుం డట్లు సని మహానసమందిరంబుపరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున నప్రగంధం బుడిపికొని కృతకృత్యుం డై శయ్యాతలంబునం గూర్చుండె. ఇట యాజ్ఞసేనియు భీమసేనుం డింతకు వంటయింటికిం బోయి నిశ్చింతంబున నుండు నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 339

క. నాపతు లగుగంధర్వుల, చే పడి మృతిఁ బొందె వీఁడె - సింహబలుం డీ
పాపాత్మునిఁ జూడుఁడు దు, ర్వ్యాపారఫలంబు గాంచె - నని పలుకుటయున్. 340

ఆ. వారు సంభ్రమించి-వడిఁగాలుదివియలు, గొనుచు నులివు మిగులఁ - గూడఁ బాటి
నృత్తశాలఁ జొచ్చి - రత్తఱి నాకల, కల మెఱింగి కీచ - కవ్రజంబు. 341

చ. కడువెస వచ్చి రూపఱిన - కాయము నున్న తెఱంగుఁ జూచి బి
ట్టడలు మనంబులం గదిరి - హా యనువారును జోద్య మంది మ్రా
న్పడియెడువారు నగ్రజుని - పైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మ - హిం బెఱచోఁ బలవించువారు నై. 342

వ. ఉన్నంత బంధుజనంబులు గూడం బాఱి కీచకశవంబు గనుంగొని. 343

ఉ. మానవకోటి నిట్టివిసు - మానపుఁబీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట - యాఱడి వమ్మయి పోయె దుర్జయం
బైనబలంబు గానితెరు - వై తన కీర్తికిఁ దోడు గాద యు
క్కీనిమనంబు గీడు పరి - కించుచు నె క్రొవ్వినఁ జేటు దప్పునే.

వ. అనుచు డాయంజని.

తే. కరము లెయ్యవి శిరమేది - కాళు లెచటఁ, జొచ్చె గంధర్వవరులచేఁ - జమ
లెల్ల నిట్టుల యగుదురో-యితనితోడి, యలుకఁ జేసిరొ యిది గడు-నక్కజంః

వ. అని వెండియు బహుప్రకారంబులం బలుకుచు శోకవిస్మయపరీతచేతస్కు యున్నంత నొక్కయుపకీచకుండు నిజసహోదరులం జూచి.

క. మన మెంత పనవి పిలిచిన, విన నేర్చునె సింహబలుఁడు - వేగమ యితనిం
గొనిపోవఁగ వలయుం గా, కని యందఱుఁ దేర్చె ననున - యాలాపములన్.

ఉ. నూతులు దాని కియ్యకొను - చుం దమయన్నకు నగ్ని యేర్చువా
రై తగ నాచరించునెడ - నల్లన ద్రౌపది వీరిచందముల్

సూతును గాక యంచునొక - చోఁ దమచేరువ నున్నఁ గాంచి సం
జాతమహోగ్రకోపు లయి - చారువిలోచనఁ బట్టి క్రూరతన్. 349

క. పెడకేలు గట్టి పాపపుఁ, బొడ వగు నిది గాదె యితనిఁ - బొడ వడఁగించెద్
గెడ గూడ దీని నీతని, యొడలిపయిం బెట్టి కాల్చు - టుచితం బరయన్. 350

వ. అని విరాటున కెఱింగించి చేయువా రై యంతకు మున్న యీవృత్తాంతం బంత
యు విని సంక్షుభితహృదయుం డై యున్నయతనిపాలికిం బోయి. 351

తే. ఎల్లభంగుల సైరంధ్రి నేము సింహ, బలునితోఁ జంపువార మై - తలఁచి నీకు
నెఱుఁగఁ జెప్పంగ వచ్చితి - మీవు నింత, వట్టుమన్నన మాకు నీ - వలయు ననిన.

వ. అతండును దనమనంబున నియ్యుపకీచకులచందంబు సూడ నేను వారించితి నేనియు
నుడుగం గలవారు గా రనియు గంధర్వులు బలవంతులు గావునఁ దద్రక్షితయైన
సైరంధ్రి కపాయంబు వొందదనియు నూహించి వారలం గలయం గనుంగొని యట్ల
కాక మీకుం బోలిన తెఱంగు సేయుం డనిన నదియ యనుమతిగాఁ గైకొని సరభ
సంబునం జనుదెంచి 353

ఉ. ఆంగజరాగమత్తుఁ డగు - నన్నకు నిమ్మెయి నైనఁ బ్రీతిసే
యఁ గలవార మీజఱభి - యాతనితోడన తీఱుఁ గాక యం
చుం గొనిపోయి హీనమగు - సూతునిపీనుఁగుమీఁదఁ బాఁడుపు
త్రెంనఁ బెట్టి కట్టిరి ద - యాపరివర్జితచిత్తవృత్తు లై. 354

[illegible] యుఁ గష్టుఁడుఁ లఘువు - నైననిజాగ్రజుమేనితోడ ని
చియుఁ బుణ్యశీలయు ను - దాత్తయు నాఁ జనునింతిఁ గొంచుఁ గ
శమతిఁ గీచకుల్ బహుము - ఖంబుల బాంధవవిప్రలాపముల్
లద్రువం జెలంగఁ గర - దీపనికాయము ప్రజ్వరిల్లఁగన్ 355

తృవనముదెసకుఁ జన న, య్యతివ భయభ్రాంతచిత్త - యై బాష్పజలో
తి మొగముఁ గప్ప నిట్లని, యతిదీనముగా నొనర్చె - నాక్రందనమున్. 356

నద నైతి నిచట - నాలికు య్యాలింపుఁ, డకట మీరు గలుగ - నాక్రమించి
న్నుఁ గట్టి సూత - నందను లిమ్మెయి, వెఱపు లేక భంగ - పఱుచువారు. 357

ఆనతవైరి యోజయ మ - హోద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణమానరిపు - మర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకట - శూరగుణప్రతిభాస యోజయ
త్సేన విరోధిబాహుబల - జృంభణభంజన యోజయద్బలా. 358

సీ. తొడఁగినపని చలం - బెడపక యతిదుష్క, రం బైనఁ గడతేర్చు - ప్రభువులార
పెనఁగిన వైపక్ష - తుని నైనఁ గడిమిమై, ద్రెళ్లిడిఁ బరిమార్చు - వీరులార
శరణార్థి యగుదుష్ట - శాత్రవు నైనను, గరుణ రక్షించుస - త్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు - లైనను డాఁపక, తమకించి యిచ్చును - దారులార
నాథులార గంధర్వర త్నంబులార, నన్ను నుపకీచకులు దమ - యన్న శవము
నందు బంధించికొని వెస-నరుగు చున్న, వారు రక్షింప వేగ రా-వలయు మీరు.

## భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట.

చ. అని పలవించునయ్యెలుఁగు - లాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు - వీండ్రు ను గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమత - నాయిత మై వెసఁ బాటి పప్రలం
ఘన మొనరించె గుప్తముగ - గ్రక్కున ముట్టెడుదానికిం దగన్. 360

తే. ఇట్లు లంఘించిపోయి ప-రేతభూమి, యొద్ద నలుదిక్కులును జూచి-యొక్కయున్న
తావనీజంబు వెలికి రా - ద్రాతిరేక, మడర భుజశిఖరంబున - యం దమర్చి. 361

మ. వికటభ్రూకుటిఘోరఫాలకలిత - స్వేదోద్భటుండుం జలు
ద్వికృతోష్ఠద్వయుండుం బ్రమర్దనవశా - విర్భావసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమ - గ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శం - భన్మూర్తివిస్ఫూర్తితోన్. 362

వ. తదనంతరంబ.

ఆ. సూతుశవముతోడ - నేతెంచు వారలు, దవ్వుపవ్వులన యు - దగ్రరూప
కలితుఁ డైనభీముఁ - గనుఁగొని నడపక, నిలిచి రంత నంతఁ - గలఁగి బా

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రిం - కెట్లొక్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు సమీ - పోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును ని - శ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగడొందియున్ భరితసం - క్షోభాత్ము లై రత్తఱిన్

ఉ. సూతులు భీతు లై ద్రుపద - సూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము వైచి వీటిదెసఁ - బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ వడిన్
వాతసుతుండు ముట్టికొని - వారి బడల్పడ ద్రేసి యందఱం
జేతులలీలఁ బో నులుము - సేసె విశృంఖలవిక్రమంబునన్.

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుండై వచ్చి పాంచాలీబంధమోక్షంబు గావించి యింక నిశ్చింతంబున సుదేష్ణమందిరంబునకుం జనుమని యవ్వేలంది వీడుకొలిపి తానును వేఱొక్కమార్గంబున మహానస గృహంబున కరుగుదెంచె. తత్సమయంబున విరాటుండు గీచకానుజులు గంధర్వులచేత నిరవశేషంబుగా మృతిం బొందిరని విని చకితచేతస్కుం డగుచు సహోదరమరణశోకాయత్తచిత్త యయినజీవితేశ్వరి నుచితాలాపంబుల ననునయించి యిట్లనియె.

ఆ. చంద్రవదన యింక - సైరంధ్ర నిచ్చోట్టు, వాప వలయు నేమి - భంగి నైనఁ
గాన నాదుపలుకు - గాఁ జెప్పు వెడలుట, కనుగుణముగ నమ్ము - గాక్షితోడ. 370

ఆ. పురుషు లాలతాంగి - పొరువునఁ బోయినఁ, జేటు వచ్చుఁ గానఁ - జెప్ప నేను
వెఱతు నాఁడువారు - వెరవుతో మృదువచో, రచనఁ జెప్పు టరయ - నుచితవృత్తి.

ఉ. ఆకమలాక్షిరూపమహి - మాతిశయంబు మనోహరంబు భో
గైకపరాయణుల్ పురుషు - లంగజుఁ డప్రతికారచేష్టిత
స్వీకృతలోకుఁ డట్లగుటఁ - జేటు పురంబునవారి కెప్పుడుం
గా కెటు లుండు నిట్టియవ - గాఢపుఁబొత్తు మనంగ వచ్చునే. 372

క. అని నిశ్చయించి పలికిన, విని కేకయరాజపుత్రి - విభుతలఁపు మనం
బునకుఁ బ్రియం బగుటయుఁ గై, కొని యాపని యట్లచేత - కం బూనెఁ దగన్.

క. అంతం గుంతీనందన, కాంతాచింతామహాంధ - కారముతో న
య మద్భరించెనో, సంతమసం బనఁ బ్రభాతి - సమయం బయ్యెన్. 374

వ. అడి పద్మినీప్రమోదసంపత్కరుం డగునరుణకిరణుం డుదయించె నట మన్నవాలి సచేలస్నానంబు సేసి రాగాదివికారనిరాసంబునం బ్రసన్న యయిన యుంబోలె సింహబలప్రభృతికీచకవిధ్వంసనంబునం దెలి వొంది మందయానం బు బురంబు సొచ్చి రాజవీథి నరుగుదెంచునప్పుడు. 375

సీ. చకుల కెల్ల - మారి యై పుట్టిన, సుదతి వోయెడు నని - చూచువారు
గా నీకుఁ గ్రొ - వ్వఱుగదేఁ జూతు గా, కని తల సూపక - యడఁగువారు
శోక గనుఁగొని యంతరంగము బిట్టు, బెదరి మాఱుమొగింబు - వెట్టువారు
రుగా వచ్చిన - నెంతయేనియు దవ్వు, గలుగ వేఱొకత్రోవఁ - దొలఁగువారు
వెఱఁబడి మేనఁ గంపంబు - పుట్ట నొదిఁగి, యుండువారుఁ గిరంబున - నుదర మప్ప
ని యమ్మరొరక్కస - యంచు నుల్ల, ములుకువారునై పురజనం - బులు దలంకి.

చ. పులిఁ గనుఁగొన్న లేడులను - బోలె విభీతిఁ గలంగ బాల న
న్నేలఁతుక యంతరంగమున - నిండినహాస్యరసంబు మోముపై
వెలి విరియంగ నీక చని - వేచి మహానసశాలవాకిటన్
నిలిచినభీమసేనుఁ గని - నెయ్య మెదం జిగురొత్తు చుండఁగన్. 377

క. తనయంతన యటు నలుకుచుఁ, జనువిధమున నతనిదిక్కు - చక్కనిచూడ్కిం
గనుఁగొనక ద్రుపదనృపనం, దన యిట్లను నిజకృతార్థ - తం దెలుపుటకున్. 378

తే. కీచకులదెసఁ బుట్టిన-కిల్బిషంబు, పాచి నన్ను రక్షించిన - పరమధర్మ
రతికి గంధర్వపతికి ని-రంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి - బ్రదుకుదాన. 379

# 15. విరాటుని కొలువుకూటంబునంబుట్టిన కృష్ణాదుల సంవాదము.

(ఉద్యోగపర్వము. ఆ. I.)

తే. ఎలమి నభిమన్యు పెండిలి - యువ్విధమునఁ, జేసి యుల్లాసలక్ష్మి నై - సేసి మత్స్య
మనుజపతియన్వయంబు పా - వనము సేసి, దినచతుష్టయానంతర - మునఁ బ్రియమున.

వ. ధర్మతనయుండు దమ్ములుం గొడుకులుం బరివేష్టించి యుండ విశాలరమణీయం బగు
విరాటుకొలువుకూటంబున కరిగి యందు. 2

క. విరటుఁడుఁ బాంచాలుండును, హరియును రాముండు వారి - యనుజతనూజుల్
పరిణయసమాగతాఖిల, ధరణీశులు బలసి యుండఁ - దద్దయు నెమ్మిన్. 3

వ. ఉన్న స యంబున సభాసదు లైనమానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణయుధి
ష్ఠిరు సంభాషణంబులు సేయు చుండఁ బాండవకార్యార్థి యై కృష్ణుండు
ద నంబులు వారించి వారలఁ గలయం గనుంగొని యి ట్లనియె. 4

ద్యూతమునందు సౌబలునిచేఁ - గౌంతేయు లాత్మీయరా
జ్యభ్రంశముఁ బొంది సత్యనిరతిఁ - శక్తాత్ము లై యుండియుం
గ్వాంతులు గాక తత్సమయసం - క్షోభంబు గా కుండఁగా
వాసము గూఢచర్యయును గా - వింపం దలం పొప్పదే. 5

వినట్ల వ్రతము - సలిపి యమ్మాడ్కిఁ బం, డ్రెండువత్సరములు - పాండవేయు
క్రూరసత్త్వ - యాతుధానావళి, తోడఁ గాననమునఁ - గూడి మనరె. 6

షి దుస్తర మగునీ, పదుమూఁడవయేఁడు గడవఁ - బడుట యరిది త
రెఱుఁగమికై యాపద, లొదవిన సైరించి రిట్టి - యునికియుఁ గలదే. 7

లు ధర్మజువర్తన, గౌరవ మెఱుఁగుదుర కాదె - కావున నాగాం
తనూభవులకును, వీరలకును హితముగా వి - వేకప్రౌఢిన్. 8

-స్వంబు దప్పక - తలఁపుఁ డొక్క, తెఱఁగు ధర్మువు దప్పి యు ధిష్ఠిరుండు
నొడఁబడఁ డయ్యింద్ర - పదవి యైన, నుచితగతి నెంత వడసిన నల్లనిల్లు.

వ. కావునఁ బాండవులకుఁ బితృధనం బగురాజ్యంబు గపటద్యూతంబున దుర్యోధనుం డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్న పదం బగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడుసేయ రోయమియు నీరెండుదెఱంగులవారికిం బంచి కుడువం దగుటయుం దలపోసి తగినకార్యంబు సెప్ప నర్హుల రేనును నాకన్నంత సెప్పెద వినుండు 10

క. కుంతీతనయులు సమయము, శాంతతమై నడపి తమభు - జాబలమును దు ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁ, గింతు మనుచు నున్నవారు - గిను కెదఁ గదురన్. 11

క. వీరితలం పెఱిఁగినగాం, ధారీతనయుఁడు సుహృద్వి - తానముఁ గూర్చుం బోరఁ బరిమార్తుఁ గొంచెపు, వారై యున్నెడన యని య - వశ్యముఁ గడఁకన్.

క. అలఘుబలవిక్రమోదా, త్తుల కైనను బలము లేక - దోర్గర్వముమై గెలువఁగ వశమె సహాయము, కలిమి ననంతంబు లగుప - గఱసైన్యములన్ 13

క కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ - బ్రోవగు ని నావీరులు నీవీరులు, దేవాసురులట్ల యనికిఁ - దగుదురు గడిమిన్. 14

వ. ఇది యిక్కడితెఱంగునకుఁ దోఁచినతలం పక్కడివారిచిత్తవృత్తి [illegible] దగుట యెఱుంగ మెదిరి మతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప [illegible]గునే కావున నియ్యవసరంబునం దగినమానిసి నందలకుం బుచ్చవలయు నుండు వీరికి రాజ్యంబుపాలిచ్చిన మేలగుఁ గాక తక్కిన నప్పటికి నూచు కొంద మని పలికిన విని బలదేవుం డియ్యకొని రాజలోకంబు యిట్లనియె.

క. హరివాక్యము వింటిరె యది, యిరుదెఱఁగులజనములకును - హితమును ధ ర్తరమును నై యున్నది యీ, వెరవున శక్యంబు మనకు - వీరలఁ దీర్పన్

చ. తమసగపాలు గోలుపడి - దానిన యిప్పుడు గోరువీరికిన్ సముచితవృత్తి నిచ్చి తమ - సామున సంతస మంది యున్కి యు క్తము ధృతరాష్ట్రసూనునకు - దాన నపాయము లేక యుండుఁ గో ప ముడిగి వీరు సేయుదురు - బాంధవ మిజ్జగముం బ్రియంపడున్.

వ. కావున నిక్కార్యం బెడ సేయక యొక్కరుం బనుప వలయు వాఁడునుం [illegible] మతంబు సాధించునప్పుడు.

ఆ. మాటపాం దెటింగి - యోటమై నల్లన, చేరి కౌరవేంద్రు - చిత్తవృత్తి
కనుగుణంబు గాఁగ - నానతుం డగుచుఁ బ్రా, ర్థించి యడుగ కున్నఁ - దెలుఁగుపడదు.

వ. అది యె ట్లనిన ధర్మనందనుం డతనియుద్ధతికిం బుయిలోడి మెయిపడి గలనడపడిం బ్రవర్తిల్లు చుండియు జూదంబువెంట మోసపోయి తొడరి చిక్కనం బడియె నది యును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమింజేసియు బంధుజనంబులు దన్ను వారించుటయుఁ దా నాడుట మాని గాంధారరాజు నియమించినం దత్కళా కౌశలంబునం బరిణతుండు గావున నాశకుని యాడి యుధిష్ఠిరుం డొడ్డినయొడ్డి మియు గెలుచుచు వచ్చినట్లగుట నాతనియందును గొఱంత లే దిత్తెఱంగున వార లధర్మపరు లని నిందింప రా కునికి కారణంబుగా వీరలు వుచ్చినమానిసి వినయంబు తోన యిక్కార్యంబు దీర్చికొని రా వలయు ననిన సాత్యకి గోపించి యి ట్లనియె.

## సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపఁ గూడ దని చెప్పుట.

ఆ. ఇట్టు లాడఁ దగునె - యిది నీక పోలు ని, న్నే మనంగ నేర్తు - నిత్తెఱంగు
పాడి గాఁగఁ బూని - పలుకంగఁ జెవి యొడ్డి, యాదరించువారి - నందుఁ గాక. 21

క. వేడుక వుట్టిన జూదం, బాడెనె ధర్మజుఁడు వార - లందఱుఁ దమలోఁ
గూడికొని పిలిచి బలిమిన, యాడి కపటజయము గొనుట - యది దగ వగునే. 22

క. ధర్మతనూభవు డస దు, ష్కర్మము రూపించి సభ నొ - కండును మైమైఁ
బ్రేర్మి సెసక పో నేర్చునె, ధార్మికు లిం కెట్టివారు - తథ్యం బరయన్. 23

చ. పలి [illegible] ందిముల్ నెఱపి - పైతృక మై చనురాజ్యభాగ మి
మ్ముల్లఁ బడయం దలంచి బల - ముం జలముం నెఱపం గడంగువీ
రల్వు న్గౌరు వేఁడఁ బోదురె య - రాతులు సాధుల మెత్తురే రణం
బులక్ష్మిఁ జేకొనుటఁ - బోలునె యొండొకరాజధర్మముల్. 24

బడక, తక్కనే నుక్కివుం డగు - ధార్తరాష్ట్రుఁ
ని గొంతేయులకు నిచ్చు-నట్లుగాఁగ.

శ్రోఁ

క. నామతమునఁ గార్యము సం, గ్రామము సేయుటయ యిట్లు - గా కేలొనర్పన్
సామవచనంబు లక్కురు, భూమీశ్వరుతోడ నాడఁ - బుచ్చెదరేనిన్. 29

ఉ. దైన్యము దక్కి దూత యుచి - తంబుగఁ బాండునృపాలుపాలు
జన్యవరుండు ధర్మజుఁడు - సమ్మతి వేఁడెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరి - మంబున నిచ్చినఁ బుచ్చికొంద మ
న్యోన్యవిరుద్ధభాషణము - లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్. 30

వ. అనిన ద్రుపదుం డిది వోలు బలదేవుమాట మాట గాదు బలపరాక్రమవంతుండును సహాయసంపన్నుండును దుష్టాత్ముండు నైనదుర్యోధనుండు ప్రియవచనంబుల రాజ్యంబుపా లిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు యుద్ధంబునం గాని చక్కం బడఁ డని పలికి మఱియు ని ట్లనియె. 31

క. మృదుభాషణముల దుర్జన, హృదయములు ప్రసన్నతామ - హిమఁ బొందునె యె
ల్లిదముగఁ గొని యంతంతకు, మద మెక్కుంగాక దురభి - మానము పేర్మిన్. 32

వ. అదియునుం గాక. 33

తే. కూటికై ద్రోణభీష్ములు-గుమతి యనక, యనుసరింతురు ధృతరాష్ట్రుఁ-డును దనూజు
తృష్ణ నూనినవాఁడు రా-ధేయుబోఁటి, తులువ లెల్లను నతని స-ద్బుద్ధియంత్రు. 34

వ. కావున నతండు దుర్వినీతుం డై యుండు నెల్లభంగుల సంగరంబు గాఁ గలయది యీసమయంబున బలంబులం గూర్చికొని పిలువం దగురాజులం బిలిచి పుచ్చవలయు సుయోధనుండును దో డాసపడి పుచ్చు నుచితపరు లగునరపాలురు దొలుతఁ జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయం జూతురు మనము వేగ కాలరుల వేగంబ పుచ్చి శల్యకేకయధృష్టకేతుజరాసంధతనయప్రభృతు లయి భూపతులకును వారివారిబంధుమిత్రజనంబులకును నెఱింగించి పుచ్చుట కార్యంబు నాకుం బోలినతెఱంగు అని పలికి తనకెలన సముచితాసనంబున నున్న

క. ఇతఁడు మదీయాగ్రపురో, హితుఁ డితని
ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు

ఉ. ఆతని

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నే నొక్కరూప - యట్లగుటఁ దగన్
వారును వీరును దమతమ, నేరిమి మెయి ధరణి యేలి - నెగడఁగఁ జూతున్. 39

తే. పెండ్లి కని పిల్వఁ బంచినఁ - బ్రియముతోడ, నేగు దెంచితి మిన్నాళ్లు - నెల్లయొప్పి
దములఁ జూచితి మియ్యెడఁ - దడవుగాఁగ, నిలువఁదీఱదు పోయిరా - వలయుమాకు.

వ. అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మా కెల్లవారికి గురుస్థానంబు మీమాట
యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు మిమ్ము శాంతనవుండునుం గొని
యాడు మీయందు ద్రోణకృపాచార్యులు సఖ్యంబు వాటింతు రట్లగుటం జేసి. 41

తే. పాండవార్థమై యొక్కరుఁ - బనుప మీకె, భరము మీపలు కందఱు - పలుకు మీరు
తెలుఁగుపలుపంగ మిగిలి యు - ద్రేకు లైన, వార చెడువారు విమలవి - చారవిభవ.

క. పాం డైన లెస్స విరసపుఁ, గ్రం దయ్యెడుచంద మైన - రాజుల నెల్లన్
ముందర రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ - డొయ్యన పిదపన్.

క. మీపనుపున రాజ్యముపా, లీపాండుతనూభవులకు - నీ కున్న భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టి - కొనదే వారిన్. 44

చ. అని గమనోన్ముఖుం డయి ము - రాంతకుఁ డా ద్రుపదుండు ధర్మనం
దనుఁడు వృకోదరాదు లగు - తమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప హలాయుధప్రభృతి - యాదవలోకము తోడ రా ముదం
బున నిజపట్టనంబునకుఁ - బోయె సముజ్జ్వలవైభవంబునన్ 45

వ. వివాహమహోత్సవంబునకు వచ్చినతక్కటిరాజులును సంగ్రామసన్నాహంబున
కై తమతమపురంబులకుం జనిరి తదనంతరంబ. 46

క. సమరమ్మునకుఁ దగునుద్యో, గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ - గౌంతేయులు మ
త్స్యమహానాథుఁడు సన్నా, హము సేసెన్ ద్రుపదవిభుఁడు - నాయితమయ్యెన్

వ. ఇట్లు సన్నద్ధు లై వెలివీడు విడిసి తమకు ననురక్తు లైనరాజులపాలికిం దగుదూతలం
బుచ్చి రట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనబంధుమిత్ర గణం బైన
రాజలోకంబు నెల్ల రావించిన. 48

క. ఇభ రగస్యందనగతి, రభసంబునఁ బృథివి యద్రువ - రాఁ దోఁచెఁగిరి భూ
వి [illegible] నలుదిక్కులను లో, కభయంకరలీల నుభయ కటకంబులకున్. 49

## ద్రుపదుఁడు దనపురోహితుని దుర్యోధనుకడకు దూతగాఁ బంపుట.

వ. అట్టి సమయంబున నజాతశత్రునను మతి వడసి పాంచాలపతి పరో
తను రోహితుం గురుపతిపాలికిఁ బుచ్చువాఁ డై యతని గా

క. హితుఁడవు మతిమంతుండవు, చతురవచనకోవిదుఁడవు - సమయజ్ఞుఁడ వు
న్నతవంశవర్ధనుఁడ విం, గితవేదివి నెచ్చెలివి సు - కృతి వ ట్లగుటన్. 51

తే. నాకుఁ గర్తవ్య మగుపని - నీకుఁ జేయఁ, దగవు గావున నెల్లవి - ధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్రు - పాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు - దీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు ని ట్లనియె. 53

క. విను కొడుకు గొన్న వేఁదుఱు, కొని కొట్టినతిండికాఁడు - కుటిలుం డతఁ డా
జనపతిచందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు - దది య ట్లుండెన్. 54

తే. పుడమిపాలు పాండవులకు - నడుగఁ బోయి, నీవు ధృతరాష్ట్రుతో ధర్మ - నిష్ఠ మైన
యుచిత మాడిన నందుఁ బో - టొడ్డి యున్న, దొరలభృత్యులమనములు - దిరుగఁబడవె.

క. గురుభీష్మాదులమనములు, దుర్మమునకుం జొరక యుండ - దుర్యోధనుఁ డా
తురుఁ డై యొడఁబఱుపఁగ ని, ష్పురుసున నెర వైన ఱిచ్చ - వడు బల మెల్లన్. 56

ఉ. పాండుతనూభవుల్ పడిన - పాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం
బండితవృద్ధసజ్జనుల - పాలికిఁ బోయి కులోచితంబు గా
కుండుట సూపి చెప్పుచుఁ బ్రి - యోక్తులఁ దక్కటివారి నిట్లు మే
లొండొకచంద మొప్ప దని - యుల్లములం దలపోయఁ జేయుచున్. 57

వ. మఱియు సమస్తజనంబులమనంబులు నిక్కడ వ్రాలునట్టియుపాయంబు లెన్ని గల వన్నియు నయ్యైతగవులమై నాచరించుచుఁ జరియించునది యిచ్చోట విరాటు కొలువుకూటంబునం బుట్టినకృష్ణాదులసంవాదంబు తెఱంగును మన సూచించిన యదియు తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేజోలాభంబుం గావించుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్రధార్తరాష్ట్రగాంగేయవిదుర గురుకృపాదులకడ కరిగి నానాఁటికి వారివారిచిత్తంబుల తెఱం గెఱింగి ప్రవర్తింపుము దైవగతిం జేసి నీయొడ్డినసూత్రంబునకు సుయోధనుం డొడంబడియె నేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధం బగు దాన నజాతశత్రుండును బ్రీతుం డగు బోయి రమ్మని నిశ్చయంబు సేసిన నమ్మహీసురవరుండు. 58

క. మును పాంచాలవిభుని వీ, డ్కొని ధర్మజు భీము నరు న - కులు సహదేవుం
ననుమతుఁ డై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి - యరిగెం బ్రీతిన్. 59

---

# 16. అర్జునదుర్యోధనులు శ్రీకృష్ణుని సాహాయ్యంబుఁ గోరుట.

(ఉద్యోగపర్వము. ఆ. I.)

వ. దుర్యోధనుండు సకలరాజన్యసామాన్యంబుగా గోపాలదేవుపాలికి దూతం బుచ్చుట
దగ వగునే యని విచారించి 1

క. వెరవు మెయిం దాన కతిపయ, పరిజనసహితముగ నరిగెం - బటుతురగగతి
స్ఫురణానుమోదలీలా, భరితుం డగుచు వేగిరంపుం - బయనములం దగన్. 2

వ. చని దదీయపురప్రవేశంబు సేసె నాదివసంబున ధనంజయుండును గోవిందుం గాన
వచ్చె నట్టియెడ. 3

తే. అతఁడు పవళింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపిదెస నున్న-తాసనమున
నుండెఁ బదపడి కాల్కడ యొద్ద కల్లఁ, జని వినమ్రుఁడై నిలుచుండె సవ్యసాచి.

వ. అంత. 5

క. మేలుకని కృష్ణుఁ డర్జును, నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త
త్కాలోచితబహుమతిమైఁ, జాలఁ బ్రియం బిరువురకుఁ బ్ర-సన్నతఁ జేసెన్. 6

వ. తదనంతరంబ. 7

ఉ. వారలఁ జూచి కేశవుఁడు - వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డి ట్లనియెఁ - గయ్యము సేయువగన్ సహాయముం
గోరి భవత్సకాశమున - కుం జను దెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృద - యంబునఁ జేర్చినబాంధవంబునన్. 8

క. మున్నేను గాన వచ్చితి, నిన్ను సుజను లైనవారు - నెమ్మిని మునుమున్
గన్నం దగఁ గైకొందురు స, మున్నతసౌజన్యసార - యుతుఁడవు నీవున్. 9

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గా వలయు ననిన వాసుదేవుం
డి ట్లనియె. 10

ఉ. నీ విట మున్న వచ్చి తిది - నిక్కము పార్థునిఁ దొల్తఁ గాంచితిం
గావున మీకు నిద్దఱకు - గౌరవ మొప్పఁగఁ దోడుపాటు స
ద్భావము దీనికిం దెలుఁగు - దప్పక యుండఁగ నేర్పరించెద
న్నీవల పెట్టు లట్ల తగ - నీవును నీతఁడుఁ గోరికొం డొగిన్. 11

క. నాపాటియ పదివేవురు, గోపాలురు గలరు సమర - కోవిదబాహా
టోపాభిరామమూర్తులు, చాపాద్యాయుధకళావి - శారదచిత్తుల్. 12

క. నారాయణాభిధానులు వారలు గయ్యంబు సేయు - వా రొక్కఁడ నే
నూరక నిరాయుధవ్యా, పారతమై నుండువాఁడఁ - బరమాప్తుఁడ నై. 13

క. వా రొకతల యే నొకతల, యీరెండుదెఱంగులందు - నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుఁడు దొలితొలి, గోరికొనఁగ బాలునికిఁ దగుం బాడిమెయిన్. 14

అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట.

క. అని పలికి హరి గిరీటిం, గనుఁగొని కొండొకవు నీవు - గావున నీకుఁ
మును గోరఁ బాడి యనవుడు, విని కృష్ణునిఁ గోరికొనియె విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించికొనిన - యట్ల కాఁగఁ
దలఁచి చెన్ను మీఱి - బలములఁ గైకొని, చనియెఁ బ్రీతి రాము - సద మునకు.

వ. చని యతనిం గని సమ్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యోధను
నకు బలదేవుం డి ట్లనియె. 17

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్లఁ గూడఁ - బడి యుండఁగ నా
సభ నీకై యేఁ బలికితి, నిభపురమున మాట వుట్ట - దే యీవు వినన్. 18

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు పలికిన
నవి కృష్ణునకుఁ బ్రియంబు లైయుండె న ట్లగుటం జేసి. 19

తే. అతనిఁ బాసి యొక్కింతప్రా - ద్దైన నిలువఁ, జాలమియు మూలముగ విర సం ప్రమాట
లాడ నొల్లమి నేమియు-ననక యంత, నుండి యొకనిశ్చయమ్ముమై - నున్నవాఁడ. 20

వ. అది యెయ్యది యంటేని. 21

క. మీరును వారును జలమునఁ, బోరెడునెడ నెద్ది యొట్లు - వోయిన నెఱి నే
నూరక యుండుదుఁ దోడె, వ్వారికిఁ బో నింత నిక్కు - వం బెబ్బంగిన్. 22

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని వాసుదేవు నామంత్రణంబు సేసి కృతవర్మపాలికిం జని యాతం డొక్కయక్షౌహిణి తోడ. దన్నుం గలయ వచ్చువాఁ డయి యూఱడం బలికినఁ బ్రియం బంది నిజ పురంబున కరిగెఁ దదనంతరంబ కృష్ణుం డర్జునున కి ట్లనియె. 23

క. నారాయణగోపాలుర, భూరిపరాక్రములఁ గురువి - భుఁడు గొన సంగ్రా
మారంభరహితు నన్నుం, గోరికొనుట నీకు మే ల - గునె తలపోయన్. 24

క. అనుటయు నాతఁడు హరి కి, ట్లను నేను రణంబునకు స - హాయం బొల్లక
విను సుప్రసిద్ధుఁడవు నీ, వని సేసినఁ బేరు నీక - యగు నెప్పాటన్. 25

వ. నీ కీదు రై జయంబు గొన రా ద ట్లగుటంజేసి విజయమూలం బగునీతోడును వల యు నీవు సమరంబు సేయ కునికియుం బ్రియంబు కావున నిన్నుం గోరికొంటి నని చెప్పి మఱియు ని ట్లనియె. 26

క. సారథ్యం బొనరింపు మ, పారకృపాలీల నెల్ల - భంగుల నా కీ
గౌరవమును జిరకాలము, గోరినయది దీని నిమ్ము - గుణరత్ననిధీ. 27

క. అనినఁ గిరీటికి హరి యి, ట్లను నీ దగుకోర్కి దీర్చు - టది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమ - యుద్ధక్రీడన్. 28

క. యూఱడించి నరుఁ డో, డ్కొని ధర్మతనూజునొద్ద - కుం బ్రియ మొసఁగం
చెం గార్యాలో, చనమును దగఁ జేయుబుద్ధి - శౌరి గడంకన్. 29

# 17. శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.

(ఉద్యోగపర్వము. ఆ. I.)

వ. శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమరసహాయత్వం బునకుఁ గోరి పిలిచినం బ్రీతుం డైయతండును బుత్త్రమిత్త్రసమేతంబుగా నానాసేనాతి సంకులంబుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణంబుల నడచుసమ యంబున. 1

## దుర్యోధనుండు శల్యసాహాయ్యంబు గోరుట.

తే. ఇంతయును విని కౌరవా - ధీశ్వరుండు, దక్షు లగునాప్తజనములఁ - దక్షణంబ
మద్రనాథునిచనియెడు-మార్గమునకుఁ, బుచ్చియెడనెడ నతులవి - భూతి మెఱయ. 2

సీ. అరు దారుమేలుక - ట్లాయితం బై చూడ, నొప్పారి తను పగు - చప్పరములఁ
బర పైనచెలువంబు - గరగరికయుఁ దియ్య, తెలినీరుఁ గలిగిన - దీర్ఘికలును
బొడ వైనమువ్వంచఁ బోలుచునట్లుగ నేసుఁ, గులకు గుజ్జములకుఁ - గొట్టములును
ముందర బయలైన - చందంబుఁ జతురాభి, మత మైనయాస్థాన - మండపములు
బియ్యములును నేయుఁ-బెరుఁగును గూర గా, యలును నంటకట్టి-యలును గడ్డి
కవణములును బెల్లు - గా నొడఁ గూర్చి ని, గూఢవృత్తిఁ దానుఁ - గూడ ... 3

వ. ఇవ్విధంబున విడిదలపయనంపుసంపదలు వొంపిరివోవం దనకు సమకట్టి సమస్త వస్తువులయువైకల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుం డై నిజపరిజనంబులం జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకు లైన యుధిష్ఠి రామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాదదానంబున కర్హు లని పలుకునవసరంబున నట మున్న పలుదెఱంగులఁ బనులు సేయుచున్నతనపల్లా యనంబువారిలోఁ గలసి మఱువడి యున్నకౌరవేశ్వరుం డమ్మాటలు విని యుతనికిం బొడనూప నిదియ సమయం బని సముచితప్రకారంబునఁ దన్నెఱింగించికొని విన యంబునఁ గనిన నతండును సంభ్రమంబునం గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్మునుద్యోగంబున నయ్యెం గావలయు నని తలంచి విస్మ యం బంది నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద ననిన గాంధారీనందనుండు పర మానందంబునం బొంది యి ట్లనియె. 4

క. సత్త్వసరస్వతి వగు మా, చిత్త్యవిశారదము నీదు - చిత్తము నియమా
దాత్త్యంబు మెఱయ నాకు న, మాత్త్యుఁడ వై పూని నడపు - మత్సైన్యంబున్. 5

ఆ. తలఁపఁ బాండవులును - ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తి - యుక్తిఁ జాల
నీవు నన్ను మాన - నీయుఁడు గాఁగ న, నుగ్రహించి తగఁ బ - రిగ్రహింపు. 6

చ. అనవుడు శల్యుఁ డియ్యకొని - యట్టిద కాదె విభేదవృత్తి నా
మనమున లేదు పాండవస - మాజము మీరును నొక్కరూప కా
వున నిది లెస్సమాట దగ - వుం దలపోయఁగ మున్న ప్రీతిఁ గాం
చిన నిను నెమ్మిఁ గూడుటయ - చేయుదు నిట్టుల యెల్లభంగులన్. 7

ఉ. దానఁ గొఱంత లే దభిమ - తం బిది గాకయుఁ గల్గెనేనియుం
బూని యొనర్తు నన్నుఁ గురు - పుంగవుఁ డెంతయుఁ బొంగి నీవు స
మ్మానము సేసి నా కిటు ల - మాత్యుఁడ వైనపదంబుకంటె మే
లై నుతి కెక్కుకోర్కి యెటు - లారసి చూచిన నొండు గల్గునే 8

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు. 9

క. చను నీవు హాస్తినగరం, బున కేనును బాండుభూప - పుత్త్రులఁ బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలఁ జూడ వలయుఁ - బోయెద ననినన్. 10

ఆ. అట్లు కాక వేగ - మట వోయి మరలుండు, వరము మఱి కుండ - వలయు మిమ్ముఁ
జేరి వెగడువాఁడ - గారుణ్యమున నిట, యరసి యుండుఁ డనియె - గురువిభుండు.

వ. అనవుడు 12

క. దరహాసయుతో మద్రే, శ్వరుఁ డాలింగనము సేసి - సందియపడకే
వరుగు మని పలికె నాతఁడు, కరిపురికిం జనియె మది వి - కాసముఁ బొందన్. 13

## శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం జొచ్చి ధర్మ
నందననివాసంబున కరిగిన నతండు దమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభి
మన్యుప్రభృతిపుత్త్రవర్గంబును నెదురు వచ్చి కృతప్రణాము లై తోడ్కొనిపోయి
కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన సర్వంబును
గుశలసంపన్నంబ యని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బునరాలింగనంబు
సేసి యి ట్లనియె. 14

క. జనకహితం బగువనమున, ననుజన్ములు ద్రుపదభూపా - త్మజయును నీ
వును నింతకాల మలయక, యునికి కడుం దుష్కరము మ - హోదాత్తమతీ. 15

ఆ. దానికంటె నరిది - దలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగ - భాసమాను
లైనమీకు మీద - యానూనృతాదుల, పెంపు మిమ్ముఁ గడపఁ - బెట్టకున్నె. 16

క. ఇమ్మహి యెల్లను నీమది, యుమ్మలికకుఁ జాల నొచ్చె - నుర్వీవర నీ
విమ్మెయి నిప్పు డఖిలదురి, తమ్ములుఁ గడచుటకు సమ్మ - దమ్మునఁ బొదలెన్. 17

వ. అని యుచితసంభాషణంబులు సేసి దుర్యోధనుండు దన్నుం గాంచినవిధంబును నతండు ప్రార్థించినతెఱంగును దానికిఁ దా నియ్యకొనుటయుం జెప్పిన ధర్మనందనుం డతని కి ట్లనియె. 18

తే. మేలు సేసితి రొక్కరి - మెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దల - గుణము కాదె
యది మదీయచిత్తమునకు - హర్ష కరము, తివిరి యొక్కటి వేఁడెద - నవధరింపు. 19

వ. పార్థునకుఁ గృష్ణుఁడు సారథ్యంబు సేయువాఁ డై యున్నవాఁడు కర్ణుండు పార్థుతో నెప్పుడు మచ్చరించుచు నుండు వీ రిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుఁ బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యక్కడం ద క్కొరుండు లేఁడు గావున నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు గర్తవ్యంబు గాఁగలయది సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపఁగలయది నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠింపవలయు నని యభ్యర్థించిన సమ్మతించి శల్యుం డి ట్లనియె. 20

క. అగు నిది వోలును నాకుం, దగ నట్టిద కర్ణునకు ర - థంబు గడప నీ
వగు దని కోరినకౌరవ, జగతీశ్వరుప్రార్థనంబుఁ - జలుపఁగ వలయున్. 21

క. కర్ణునిసారథి నైనను, నిర్ణయమున కేను బార్థు - నిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి - కలఁతుం బోరన్. 22

తే. దర్పమును దేజమును మాయఁ-దలరఁ బలికి, చిక్కువఱచిన నేయంగఁ-జేతు, లాడ
కునికి రాధాతనూజు న-ర్జునుఁడు దీవ్ర, బహుళబాణపరంపర-పాలు పఱచు. 23

చ. ఇది యొకఁ డేల నీవు మది - నెయ్యది గోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ - నాడినమాటకుఁ జాల నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన - నెంతయుఁ బత్తము సేయ నక్కటా
యదియును గాక మీపడిన - యాపద లెవ్వరి నొవ్వఁ జేయవే. 24

ఆ. ఇట్లు వడితి ననుచు - నెద నీవు వగవకు, గారవమున నీమ - నోరథమ్ము
ఫలము వొందు నెల్ల - భంగుల దేవత, లయినఁ బడుదు రొక్క - యవసరమున.

క. వాసవుఁడు దొల్లి నిజకాం, తాసహితము గాఁగ నధిక - దైన్యము వొందెన్
మీసంపద పెద్దయె విధి, సేసినగతిఁ బడక యుండ - శివునకు వశమే. 26

క. కావున మీపడినయర, ణ్యావాసక్లేశమునకు - నజ్ఞాతవిధిన్
సేవకుల రైనదానికి, నోవకుఁడీ మీరు లఘుమ - నోవృత్తుల రై. 27

వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని. 28

ఉ. కౌరవనాథుఁ డానహుషు - కైవడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁ డై జయము - సేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవి - లాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగముల - సన్నుతి కెక్కెడుఁ దానుఁ దమ్ములున్. 29

వ. అనిపలికి వెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 30

క. సౌఖ్యంబులు వొందు జగ, త్ప్రఖ్యాతులుఁ జెందుఁ దగఁ బు - రందరవిజయో
పాఖ్యానము విన్నను ద, ద్వ్యాఖ్యానము సేసినన్ జ - నావలి కనఘా. 31

క. మోహరము నడమ చుండఁగ, నీహరివిజయంబు వినుట - నింద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం, దేహం బించుకయు లేదు - ధీరవిచారా. 32

వ. అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి మహానుభావా భవదీయభాషణ
శ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె నని సంభావించి యతనికి సముచితంబులగు
మజ్జనభోజనంబు లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు నుద్యోగించిన.

ఆ. అతని నవప నేగి - యధికసంప్రీతి నే, తెంచునప్పు డయ్యు - ధిష్ఠిరుండు
రణములోన మీరు రాధేయుఁ బలుకుట, మఱవకుండ పలయు మమ్ముఁ దలఁచి.

క. అనుటయు మద్రేశ్వరుఁ డా, తని మాఱడఁ బలికి గాఢ - తరముగ నాలిం
గన మొనరించి చనియె హ, స్తినగరికి బలమ్ముతో న - తిత్వరితగతిన్. 35

వ. అట్టియవసరంబున. 36

మ. సకలారాతిభయంకరుం డగుచు ను - త్సాహంబు వాటించి నే
లకు వ్రేఁ గయ్యెడుభంగి వచ్చె రణలీ - లాకౌతుకం బొప్పఁ దా
నొకయక్షౌహిణితోడఁ బాండవబలం - బుల్లాసముం బొంద సా
త్యకి శౌర్యబలగర్వనిర్వహణవి - ద్యాప్రౌఢిసంరూఢుఁ డై. 37

వ. అంతం జేదిపతి యగుధృష్టకేతుండును జరాసంధనందనుం డగుసహదేవుండును
నై యొక్కొకయక్షౌహిణితోడం జనుదెంచిరి సహోదరు లేవు రగుకేకయపతులు
నేకాక్షౌహిణీసమేతు లై యేగుదెంచిరి తదనంతరంబ. 38

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు, దడములఁ గరిఘటల భటర - థవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడు సూపెఁ - గౌంతేయులకున్.

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజ సమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొక్కయక్షౌహిణి యొద్ద నంబు దీర్చి. 40

క. చిందములమ్రోఁతఁ బగతుర, డెందంబులతోడ దిక్త - టీసంఘులు నం
దంద పగులంగఁ గుంతీ, నందనులకుఁ దోడు మత్స్య - నాథుఁడు సూపెన్. 41

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసల నుండి వచ్చినబలం బొక్క యక్షౌహిణికిం గలిగి యొప్పె. 42

క. ఏ డక్షౌహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ - గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతికు - తూహలవృత్తిన్. 43

వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగి యుధిష్ఠిరసైన్యంబు గయ్యంబునకుం గాలుద్రవ్వుచు నుండె నంత నక్కడం గిరాతకాంచనసైన్యనిచయంబులం గూర్చికొని సమరంబునకు నమరి యొక్కయక్షౌహిణి గలభగదత్తుండు సుయోధనుం గలసె భూరిపరాక్రముం డయినభూరిశ్రవుండును మహాబలుం డయినశల్యుండును నేకాక్షౌహిణీసమేతంబుగా నేతెంచిరి వారలయట్ల సన్నద్ధుఁ డై కాంభోజనాథుం డైన సుదక్షిణుం డనుయవనేశ్వరుండును వచ్చె నత్తెఱంగున సమకట్టి జయద్రథప్రముఖు లైనసింధుసౌవీరనరపతు లరుగుదెంచిరి మాహిష్మతీపతి యగునీలుండు యాదవవీరుం డగుకృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగు విందానువిందు లిరువురునుం గా నిన్నలువురు నొక్కొక్కయక్షౌహిణితోడఁ జనుదెంచిరి మఱియునుం బలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁ డక్షౌహిణులకుం గలిగె ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకం డక్షౌహిణులయ్యె నట్టియెడ.

క. సవరణల నొప్పి యునిఁ బాం, డవబలముల మార్కొనం గ - డంగుచు నత్యు
త్సవమునఁ జేర్చినసేనల, కవకాశము లేదు విడియ - హస్తిపురమునన్. 45

క. నానాముఖముల విడియం, గా నియమించెను బలంబుఁ - గౌరవపతి యా
సేనలదొరలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధిక - హర్షం బెసఁగన్. 46

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రోహితకారణ్యంబున మరుదేశంబున నహిచ్ఛత్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున నిచ్ఛలవిడి విడిసి ధనధాన్యాదిసమస్తవస్తువులకలిమిం జేసి యొలమి మిగిలియున్నంత. 47

# 18. శ్రీకృష్ణుని రాయబారము.

(ఉద్యోగపర్వము. ఆ. III, IV.)

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ, సుతుఁడు మఱునాఁడు దమ్ముల-సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి, యెల్లవారును విను చుండ - నిట్టు లనియె. 1

క. మనము జనార్దనుపాలికిఁ, జని కౌరవసభకు నతనిఁ - జను మని ప్రార్థిం
చిన మేలు బంధుహితగురు, జనములతో రణము గాక - సంప్రీతి యగున్. 2

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యతనిచేత సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివేష్టింప నొక్కపార్శ్వంబునం బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ నతండునుం దానును సుఖాసీనుం డై యుండి యతనితో ని ట్లనియె. 3

క. ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభం బైనదాని - నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి - చనియె మహాత్మా. 4

తే. సమయ మిది మిత్రకార్యంబు - చక్కఁజేయ, నీకతంబున నే మవి - నీతుఁ డైన
యాసుయోధనుతోడిపో - రాట దక్కి, యనుభవింతుము మాయంశ - మగుధరిత్రి.

వ. నీకు వేఁము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము మమ్ము దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీపంచినయట్ల చేయం గలవాఁడ నెయ్యది తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులతోడం దగినమాట లాడి తెఱంగు సేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యి ట్లనియె. 6

సీ. మాతఁడ్రితలఁపును - నాతనినందను, చందంబు నిన్న యా - సంజయుండు
పలికినపలుకులఁ - దెలిసెఁగదా నీకు, వారిచిత్తముభంగి - వాఁ డెఱుంగుఁ
బాలుపం పని యీక - యేలిమాటలన మ, మ్మలుక దీర్చెదరు తా - రధికదుష్క
రం బైనయాసమ - యం బేము పదుమూఁడు, వత్సరంబులు సల్పి - వచ్చి యుండఁ
గులవుపాడి నడపఁ - దలఁపఁడ పతి సెడఁ, దలఁచె నేని కొడుకు - వలచినట్టి
వాఁడు గాన నతని - వక్రత మాన్ప లేఁ, డింతకంటెఁ గలదె - యెడరు మాకు. 7

క. జననియు సమస్తబాంధవ, జనములుఁ బ్రియ మంద వారి - శాంతులఁగాఁ జే
యన, నెమ్మిగ నొక్కటి యై, మననుం దెఱఁ గేది యునికి - మాపౌరుషమే. 8

క. ఇచ్చటిబంధులు నీవును, నచ్చెరువడి వినుచు నుండ - నయి దూర్లను మా
కిచ్చినను జాలు నంటిని, బొచ్చెము గా దింతపట్టు - పూర్ణము సుమ్మీ. 9

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జే - యం జాలఁడో కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు సిరి నా - కే లందునే గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నాయరయునీ - చుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గుఁ గౌరవులు నే - ఱుం బొంది శ్రీ నొందినన్. 10

ఉ. అక్కట లాఁతు లైనఁ బగ - లైనను జంపన కోర నేల యిం
డొక్క తెఱంగు లేదె యది - యొప్పదె బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు గణు - తింపక సంపదకై వధించి దూ
టెక్కట దోప మందు టను - నీదురవస్థల కోర్వ వచ్చునే. 11

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 12

ఆ. క్షత్త్రధర్మ మింత - కష్ట మగునె పెఱ, ధర్మ మాచరింపఁ - దగ దటంద్రు
గాన శస్త్రజీవి - కయ తగి యున్నది, యైన వంశనాశ - మనభిమతము. 13

వ. అదియునుం గాక. 14

ఆ. కలహ మగుట లక్ష్మిఁ - గావించుఁ బ్రాణహా, నియును జేయు నింత - నిక్కువంబు
పలువు రొకని గోడి - పాఱుట బల్లిగు, లనదచేతఁ జెడుట యును ఘటించు. 15

క. జయ మగునోడుదు మనుని, శ్చయ మొక్కఁడు లేదు వినుము - సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హ్రా, దయపుటభేదనము సేయుఁ - దథ్యం బ

క. కాన నవశ్యముఁ బెనఁకున, గానియుపాయమునఁ బగఱఁ - గడతేర్చుద్ధ
బూని నడచు నెవ్వఁడు డెం, దానం జెయి వెట్టికొని య - తఁడు నిద్రిం

ఆ. పగయ కలిగెనేని - పా మున్న యింటిలో, నున్నయట్లకాక - యూఱడి
యుండునెట్లు చిత్త - మొకమాటుఁ గావున, వలవ దధికదీర్ఘ - వైరవృత్తి.

చ. పగ యడఁగించు టెంతయు శు - భం బది లెస్స యడంగునే పగం
బగ పగ గొన్న మాఱ్కొనక - పల్కక యుండఁగ వచ్చునే కడుం
దగ మొద లెత్తి పోవఁ బగ - దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు - మేలిమిలేమి ధ్రువంబు కేశవా.

ఉ. కావున శాంతిఁ బొందుటయు - కర్జము దా నది యట్టు లుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము - గామియుఁ గోరద మెల్లసొమ్ములుం
బోవుటయుం గులక్షయము - పుట్టుటయుక్ వెలిగాఁగ నొందుపై
నేవిధి నైనఁ జక్కఁబడు - టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా.

చ. మనమునఁ బక్షపాతగతి - మాదెస మానుము ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హి - తంబును బెంపును గల్గ నట్లిచో
ప్పున విదురాదిసజ్జనుల - బుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పునఁ బరుసందనంబునను - భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ. 21

చ. తగవునఁ బోక రాజు బెడి - దంబులు వల్కెనయేని సైఁచి యొ
ప్పుగ నిలుమీ గురుత్వముఁ బ్ర - భుత్వముసుం గలపెద్దవారిమా
ట గొనమి యాసుయోధనుక - డన్ నిలఁవక్ మన మెల్ల గారవం
బుగఁ గురువృద్ధుపల్కు దలఁ - ఫుం జన నిచ్చిన మెచ్చరే జనుల్. 22

మ. సుతువాఁ డై వినయంబు సేకొనక యే - చొప్పం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సం - ధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు తెంపు సేయు నెడ లో - కం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము ని - శ్చింతంబు గాఁ జేయుమీ. 23

ఆ. ఇన్ని సంకటముల - నిబ్బంగి నెంతయు, నొగులుచిత్తవృత్తి - నొవ్వ దీర్ప
వెజ్జ వీవ కావె - వేయేల యేగతి, నడపఁ దలఁచి తదియ - నాకుఁ బ్రియము. 24

వ. అని చెప్పి తలంచికొని వెండియు ని ట్లనియె. 25

క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్క - బుద్ధి వొడమెడున్
గోవింద యతఁడు మంత్రులుఁ, గాపరములు చక్క వినరు - కార్యవచనముల్. 26

స. నీకు వె ల లవినీతులు - క్రూరకర్మ, లట్టినీచులకడకు ని - న్ననుపఁ జాల
కుండ టపడియెడు - దేవపదవి, యైన నే నొల్ల నొంటి యం-దరుగు టుడుగు 27
నెయ్య ఁ గృష్ణుఁ డి ట్లనియె - నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
తోడ ండ యేల నీ పలుకు - తథ్యము నీతలఁ పే నెఱింగితి
కొలిక్షి న శంక దక్కుము వి - నన్ వలతే విను మేను నిక్క మ
సీ మాతఁ వటం గలండె రణ - కేళికి మార్కొన నొక్కఁ డేనియున్. 28
పఱ ము కౌరవసభ కేఁ, జను టెట్లును మేల యర్థ - సంసిద్ధి యగున్
బాలు కటం బాపము రా, కునికికిఁ గత మైనపలుకు - లొండెను గలుగున్. 29
రం బై లికిన యుధిష్ఠిరుం డి ట్లనియె. 30
గులవ గాక నీకుఁ - బోలిన ట్లయిన నం, దరిగి యేము వారు - నర్థిఁబొంది
వాఁడకునట్లు గాఁగ - నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు - నిదియ లెస్స. 31

క. జనన్నిఁ యుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి - నెటి యెఱుఁగుదు వా
యనులపద్ధతి నెఱుఁగుదు, పా మ్మెవ్వఁడ నేను నీకు - బుద్ధులు సెప్పన్. 32

## కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులనిర్ణయంబు సెప్పుట.

సీ. అనిన ముకుందుఁ డి - ట్లనియె సంజయునిమా, టలును నీ వన్నప - లుకులును వింటి
నీమది ధర్మైక - నిష్ఠమై యున్నది. వైరంబు విడువరు - వారు ద్రోణ
భీష్ములు గల రని - బిరుదు లై యున్నవా, రగునె రాజన్యుల - కడఁగి కుడువ
నక్లేశవృత్తి రా - జ్యముచవి గొన్నవా, రేల యిత్తురు నీకుఁ - బాలు సెపుమ
ధార్తరాష్ట్రులు సడికి న - ధర్మమునకు, నలుక రెన్నఁడు విడువు దై - న్యంబు పొడువు
కయ్య మరివర్గజయమునఁ-గలుగు నిహప, రములుఁ జిరకీర్తియును బాండు-రాజతనయ.

మ గురుభీష్మాదులు సూచు చుండ సభ మీ - కుం గీడు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి యంత సేసియును బ - శ్చాత్తాపముం బొంద రో
పర వా రెన్నఁడు నట్టి కోటఁ గృపయుం - బంధుత్వముం దక్క మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగ - ర్వక్రౌర్యముల్ సూచినన్. 34

వ. కపటపు నెత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధనదుశ్శాసనశకుని సూతనందనులు పురిలోట దక్కి- కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింప వచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతుల రయి యుండియు సత్యంబు పాటించి యూరక పోక సూచి యుచ్చైరువాటుతో నుమ్మలిఁచు చుండిరి తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతు లై యున్న చెడి యుండుదురు గావున వారలం జెఱుపనుఁ జాలుకన క్రూరాత్మ లగుకౌరవు ల్లే వారికి వధ్యులు గాఁ దగుదురు నీ కేల యవధ్యు లైరి పాపాత్మకు లుపేక్షింపకులం బాముల నె ట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు. 35

క. మీతండ్రికి భీష్మునకుం, జేతోముద మొదవ భక్తి - సేయున తగు నీ
కాతలకు నేను జని వి, ఖ్యాతంబుగ నీదువినయ - మభివర్ణింతున్. 36

క. చెలులుం జుట్టలు దేశం, బులరాజులు వినఁగ నీదు - పుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికె - దం గురుసభలోన్. 37

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలినమాట లాడుటయుఁ దండ్రి యతని వారింప నేరమికిఁ దోడుపేక్షకుం డగుటయుఁ జూచి మీతొల్లింటిపాట్లు నుం దలంచి యెల్లవారును వారిన గర్హింతు రింతియ కాక మనకు నొండేమి వలయు నాయోపినంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద నవ్విధంబు సిద్ధించిన మేలు గాదె యట్లు గాక తక్కిన నచ్చోటియుత్సాహంబుచందంబును నందుఁ జేయం గలవారివర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయంబు బగు విధంబునం జనుదెంచెద. 38

తే. ఆసుయోధనుముక్కున - నావి గలుగఁ, బుడమి నీ కీడు గావునఁ - బోర కలుగు
నేను గయ్యపుశకునంబు - లెన్నియేని, కంటి నీ వనుత్సాహివి - గాఁగ వలదు. 39

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాల
స్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండ వలయు నని పలికిన విని
వృకోదరుండు దామోదరున కిట్లనియె. 40

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱపింపంగ వలదు - మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు, శమించుకార్యంబు నడపు - సౌజన్యమునన్. 41

వ. అని వెండియు. 42

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీ - పం పెట్లునుం జేయఁగా
నోపం డద్దము సెప్ప రెవ్వరును మా - నోద్రేకముం గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం - గుందించుటం బోయిన
ట్లే పో నిత్తురు గాన ని న్నతఁడు జా - లిం బెట్టెడుం జూడుమీ. 43

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁ - జూచెద నంచుఁ గడంగు చుండు న
న్నెచ్చఁడు బాహుగర్వమున - నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ - బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురు - వంశముచేటున కోప కుండుటన్. 44

ఉ. పాండవకౌరవుల్ గలసి - పాలును నీరును బోలె నెమ్మిమై
నుండ గ దుష్టచేష్టల సు - యోధనుఁ డింతలు సేసె నాతఁ డో
క్కండ కులక్షయంబునకుఁ - గారణ మం ద్రది దప్పు దైన నీ
వొం డన నేల యాబిరుదు - నోపినయంతయుఁ దీర్పు నేర్పునన్. 45

చ. తన పొరిపోవునంతకు ను - దగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు య - శోభరితం బగు భారతాన్వయం
బున నొకనిండ వచ్చు నను - బుద్ధి దురాత్మున కేల కల్గు నా
యనమెయిఁ బోయి హీనగతి - నైన ఘటించిన నెంత యొప్పునో. 46

వ. మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ సుయోధనుతోడం గురు
కులేశ్వరునాస్థానంబున నావచనంబులుగా ని ట్లనుము. 47

తే. అన్నదమ్ములమైయుండి - యకట మనల, నొరులుదలయెత్తిచూడనొం - డొరులతోడఁ
బెనఁగ నేటికి నీ నేల - పెద్దవారి, బుద్ధి విని పంచి కుడుచుట - పోలదొక్కొ. 48

క. అని యెవ్విధమున నైనను, వనజోదర సంధి సేయ - వలయుం దగ నే
మును వారును గలయుట భూ, జనులకు నెల్లను హితంబు - సౌఖ్యకరంబున్. 49

చ. అనుటయుఁ బిన్న నవ్వు నగి - యంబుజనాభుఁడు పల్కె నెన్నఁడున్
విననివి భీముపాలఁ గడు - వింతలు వింటిమి మాట లగ్గి చ
ల్లనగుట భూరిభూధరము - లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ - బొందుట యింకిటఁ జెప్ప నేటికిన్. 50

## శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట.

తే. అని సహోదరు లాజి నా - యాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప - నొల్లమియును
గలుగునెయ్యంబు పెంపునఁ - గరుణ నార్ద్రుఁ
డైనపవనజుఁ బురికొల్ప - నాత్మఁ దలఁచి. 51

వ. మురమర్దనుం డతనితో ని ట్లనియె. 52

ఉ. యుద్ధముమీఁది వేడ్కయును మ - హోగ్రవిరోధుల నల్కఁ జేయుద
రోద్ధతియున్ సుయోధనుని - యున్నతి సైఁపనియేపు రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ - జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు - పల్కుట యొప్పునె కీచకాంతకా. 53

వ. అని యంత నిలుపక. 54

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు, నెఱుఁగనినీయట్టివాని - కెవ్వరొకో యా
పిఱికితన మింత యలవడెఁ, గఱపినవా రనుచు శౌరి - గలకల నవ్వెన్. 55

వ. దానికి దరహసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కి ట్లనియె. 56

ఉ. బంటుతనంబుమాటలకుఁ - బాఱకు పాండునృపాలుపాలు గై
కొంటయె చాలు నన్నృప - కుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును సు - యోధను చందముఁ జూపి యప్పుడే
మంటి యుపేంద్ర న న్నని ర - ణాగ్రమునన్ నిను మూదలించెదన్. 57

క. నాకోలఁది విచారింపక, నీ కి ట్లనఁ దగునె మిన్ను - నేలయు నిక్కైఁ
గాక తిరుగంగఁ బడినం, బో కే ముంజేతు లొడ్డి - పోవఁగఁ ద్రోతున్. 58

ఉ. నావుడు నవ్వుటాల కని - నం బవనాత్మజ యింత యేటికిం
గేవలయోధవే పరుల - కిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్
జావడ మైనఁ జూచి యిది - చందము గాదని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును - చేసినభంగులు నే నెఱుంగనే. 59

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 60

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడ - పం దనకున్ నను గోరి యెంతయుం
బ్రార్థన సేసె దాని కను - రాగము వొందితి నేను గాన యు
ద్ధార్థుల మైనమాకు నిను - నాసపడం దగదే యశంబు నా
నార్థములున్ విరోధివిజ - యంబునఁ దక్కఁగ నొంటఁ గల్గునే. 61

వ. అనవుడు. 62

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగ లై - యీపచ్చుకౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీ - ర్పం బెద్దమి ట్టెక్కి మి
మ్మే మెల్లన్ వెలుఁ గంది చూచెదము గా - కీసారెకుం బోయి రా
భీముం డిత్తటి రిత్తమాటలకుఁ గో - పింపండు నూ పెం పఱన్. 63

వ. అని పలికి యివ్విధంబున గోపాలదేవు మేలంపుమెయివడికార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం బాడుటయ కా మఱుమాట లాడి యంతటఁ దని వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె. 64

ఉ. కయ్యము గల్గిన ట్లయిన - గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులుఁ ధ - రం బడఁ దేరగముల్ బడల్పడన్
డయ్యమి కీవు వెక్కసప - డన్ గదపండువు సేయఁ గోరునా
దయ్యముసైత్తికోలు దుది - దాఁకుట గాదె భుజంగభంజనా. 65

చ. అన విని దేవకీతనయుఁ - డాతని కిట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు గ - డిందిమగండవు నిన్నుఁ దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదల - కున్ భయ మొందక దుఃఖవార్ధు లీఁ
దినమును నెల్ల నిక్కొఱఁతి - దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ. 66

క. ఇద పోయెదఁ గౌరవ్యులఁ, బదనికి రాఁ బలికి సంధి - పాటించెద నా
శది యొప్పద కాని తుదిం, గుదు రింతకు నీవ కావె - గుణరత్న నిధీ. 67

## అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు సెప్పుట.

వ. అనిన వాసుదేవున కర్జునుం డి ట్లనియె. 68

తే. చెప్పఁ గలయంతవట్టును - జెప్పె నీక, జాతశత్రుండు వింటి వీ వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ - మాట లొండు, గలవె యైనను జెప్పెదఁ గన్నయంత. 69

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధా-త్రీభాగ మీ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నం చున్ మున్న కై పెక్కైన
ట్టితలం బచ్యుత నీకుఁ గల్గినది గాం-డీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జిం-తం బాప రాదో కదే. 70

ఉ. నీ వొనరింపఁ బూనినప-నిం గమలోదర కీడు పుట్టునే
కా వనినట్ల యుండి యవుఁ-గార్యము లట్లగుటం బ్రయత్నసం
భావన సేఁత పౌరుషము-పద్ధతి తత్ఫలసిద్ధి పొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ-దథ్యము రెండును నీ వినోదముల్. 71

ఉ. వైరిమి ధర్మజుం బరిభ-వించిన ద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజన-వత్సల నీ విటు లంట వారు మ
మ్మారస మెత్తి కేడ్పఱిచి-యింతలు సేసినదాన నీమదిం
గూరిన నొవ్వు సొంపునను-గోపము పెంపునఁ గాదె యారయన్. 72

ఉ. వినను జిత్తగింపు ద్రుప-దాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్స యని-దైన్యముఁ బొందుట కోర్చి యమ్మెయిం
గాననభూమికిం జనుట-కారుణికోత్తమ నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ-గౌరవులం దగఁ గూర్ప నేర్పనన్. 73

తే. అలవి యెఱుఁగక ధార్తరా-ష్ట్రులు గడంగి, మమ్ముఁ బఱచినపాటులు-మానసమునఁ
జవుటఁ బెట్టినవిత్తుల-చంద మొంది, యంకురింపక చెడి పోయె-నంబుజాక్ష. 74

వ. అమ్మొఱకుల నెమ్మెయి నయినను 75

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి-పొంది పొసఁగి యుం
డెడునట్టితెఱఁగు సేయుట, కడు మే లది గౌరవము సు-ఖంబును జేయన్. 76

క. నీ కిట్టిది చిత్తమునకు, రా కుండిన నేని వలదు-రం డిమ్మెయి మీ
రీకార్యము సేయుం డని, మా కానతి యిమ్ము కంస-మర్దన తెలియన్. 77

మ. హిత మిబ్బంగిది మాకు ధర్మము తెఱం-గిట్లుండు నం చేను నీ
మతి బోధింప వలంతినే హితము ధ-ర్మంబున్ విచారించి చూ
చి తగం బొమ్మని యేది పంచి తది ని-శ్చింతంబుగం జేసి యా
న్నతిఁ బొందం గలవార మై యునికి కృ-ష్ణా నేఁడుగా వచ్చునే. 78

వ. అనిన విని కృష్ణుండు విజయున కిట్లనియె. 79

చ. వెరవున లావునం గృషికి - వేయువిధంబుల మేలొనర్చినం
దొరకొను నే ఫలంబు దతి - తోఁ దగువర్షము లేకయున్న నె
ప్పురుసున లెస్స సేసినను - బౌరుషముల్ ఫలియించు టెల్ల నా
దరణమునం బ్రసన్న మగు - దైవముచేతన చూవె ఫల్గునా. 80

ఉ. కావున సంధికిం బురుష - కార మొనర్చెద నోపినంతయుం
దైవముచేత యె ట్లగునొ - దాని నెఱుంగ సుయోధనుండు సం
భావన సేసి పాలొసఁగు - పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప - నింతలు పాపము లాచరించు నే. 81

వ. అది యెల్ల నట్లుండె నిచ్చట విరాటుపసులం బట్టింప నీవు వోయినయప్పుడు భీష్ముండు దుర్యోధనుతోఁ జెప్పిన తెఱంగు. 82

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డ - వశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నై పెనంగిన బ - లంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు - టెల్లవిధంబుల కోర్చు నట్లు గా
కిచ్చ దలంచి యొక్కమెయి - నిత్తఱిఁ బొం దగుచేతయుం దగున్. 83

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 84

ఆ. మనకుఁ బాండురాజ-తనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు - నేను రాజ్య
భాగ మీఁ సమర - భంగిక విక్రమ, నిరతిఁ బూను టిదియ - నిశ్చయంబు. 85

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ కాదె యామాటలఫలం బప్పుడ యనియు నాకస్ట్రాత్ముండు వెండియుఁ గెలియండు. 86

తే. అతనిగూఢదోషములచంద - మట్ల యుండె, నాకు ధర్మజుబుద్ధిన - నచెప వలయు
నిత్తెఱం గానతింపంగ - నేగి యచట, నెల్లతెఱఁగును నేర్పడ - నెఱిఁగి పత్తు. 87

చ. అనిన ముకుందుతో నకులుఁ - డల్లన యిట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁ - డుం దగఁ జెప్పుట రిత్త గాదు మా
మనము లరణ్యవాసమున - మత్స్యమహీపతిపాల నున్నయ
ద్దినములభంగి గాదు కృపఁ - దీవ్రగుందినచంప మయ్యెడున్. 88

క. కడచఁగ నొక్కట్లు పసరము, నడిచిన నొక్కటులుఁ బెయ్య - నడువ వలయు నే
చెడుతెరు వాకారవృష్యల, కడ నిలుచుం గాక మనకుఁ - గార్యం బేలా. 89

సీ. గోగ్రహణంబునఁ - గోలె నెంతయు మెత్తఁ, బడ కుండుదురె వారు - పద్మనాభ
నీయనుగ్రహమున - నెమ్మిమైఁ గూడిన, బలము లే దక్షౌహి - ణులును దొరలుఁ

బాంచాలయాదవ-పాండ్య కేకయమాత్స్య, లోకతెంపు నెఱుఁగక-యున్న వారె
భీమార్జునులలావు పెంపును నీసహా, యంబును గలుగుట - కలఁక లెట్లు
గురుఁడుఁ గృపుఁడు బాహ్లి-కుండు భీష్ముఁడును బుద్ధి, సెప్పి వారిఁ జక్క-ఁజేయ లెట్లు
కార్య మీవు సెప్పఁ-గా విదురుండు వి, నంగ నెట్లు గా ద-నంగ వచ్చు. 90

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింప కుండ వెఱవరే నీ పోయినప్పుడ యీకార్యంబు చక్క నగు ననిన విని సహదేవుండు వాసుదేవున కి ట్లనియె. 91

ఉ. రక్కసమాట లాడెదరు - రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటి యైనఁ గాదనక - యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొన - నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ - మిచ్చుట యెక్కడ దానవాంతకా. 92

మ. తలఁపం గూడునె యింతలేసివొర లీ - దైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాఁతిరాజులకు మె - చ్చే యివ్విధం బిట్టిదిం
గలదే వేఁడఁగఁ ధర్మజుం డడుగఁ బోఁ - గాఁ గృష్ణుఁ డాధార్తరా
ష్ట్రులు పాలీక చలంబునం బెనఁగి నె - ట్లుం గూడు దీ పయ్యోనే. 93

ఉ. వీరలు ధర్మమార్గము స - విస్తరతం దగ నాడిరేనియు
న్వారలు దాని కియ్యకొని - నన్ విను మచ్యుత యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే యుచిత - మైనది కయ్యము వంకమాట లే 110
నేరఁ గురుప్రవీరుసభ - నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. 111

మ. తుది రాజ్యమ్ము సగమ్ము గొ మ్మడవియం - దుం బేరు వంచించియుం
బదుమూఁడేఁడులు నీవునుం దిరిగి రాఁ - బా లీక పో వచ్చునే
యది గాదేఁ దెగి బంట వై యఱుము మా - యల్ వన్ను నే ర్పింకఁ జె
ల్లదు నూ నీ కని యాసుయోధనుని యం - ల్లం బుచ్చి పో నాడుమీ. 112

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁ డై యితఁడు లె - స్సైన్ యుండఁ బల్కెం బ్రయో 113
జనముం గల్గదు గౌరవంబుఁ జెడు దు - శ్చారిత్రకుం డాసుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసో - త్సాహంబుమై నున్న వీ 114
రనికాయంబున కెల్లనుం బ్రియము సం - గ్రామంబు మే లెమ్మెయిన్. సేను

వ. అనిన విని రథికవరు లందఱు సహదేవుం డింత యొప్ప నాడునే సాత్యకి లి ట్లుండునే తక్కటివి యెక్కడిమాటలు పగవారి నడిగికొనం బోవుట యు బఁట కయ్యంబు కర్జంబు గా దఁట భంగంబు నీఁగికొనం దగ దఁట య ంఁ గాక ం

మొదలుగా ననేకు లనేకప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్కమ్రో
తగాఁ జెలంగినయెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 97

## ద్రౌపది గృష్ణునితోఁ దనమున్ను పడినభంగపాట్లు సెప్పుట.

తే. ధర్మనందనుపలుకులు - దనకు హృదయ, తాపమొనరింప మోమున - దైన్యమొంద
నున్న పాంచాలి యిట్లని-యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గద-కంఠి యగుచు.

ఉ. అంతలు సేసి పో నడిచి - యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టియూఱట మ - ఱిం బ్రియ మందె యుధిష్ఠిరుండు దా
నంతన యూళ్లు లేవురకు - నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి - నాతఁడు నొంచునె యన్నదమ్ములన్ 99

చ. తనమునుపడ్డబన్నములుఁ - దమ్మునిపైఁ గలశూర్తిపేర్మి నీ
జనపతి సైప కున్నె యది - సక్కన రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన నె - ఱుంగమి వెట్టరె చాల నైరి వీ
రనరొకొ నాన లేమి యని - యాడరె లోకమువారు కేశవా. 100

శా. పెం పేదం దమ కిట్టితక్కువలు రూ - పింపంగ నేలా విచా
రింపన్ వారికి మేలు సంధి దమ వా - రిం జూచినం దారు సా
ధింపం జాలరొ కాక పోరఁ దగ మ - ర్దింపం దలంపేని శం
బులు [illegible] వారు బ్రాహ్మణులె యే - కీడైన సైరింపఁగన్. 101

క. యమసుశిక్షిత యేనియు సు - యోధనుచిత్తమునందు లేదు నీ
త్తములుకోవునే దురభి - మానము యెక్కుడు పూనుఁ గాక య

క. మొదలన సం[illegible] లను - చొప్పులు వుట్టిన నైనఁ గాండవుల్
మదిఁ కిచ్చగింతుకొకొ - పోదురొ కానల నుండ నచ్యుతా. 102

తే. పూని లంటి నావలవ - దింకను నీవును రాజుఁ దమ్ములుం
లైనపా తెంబు సూచి మన - కార్యము మీసుజనత్వముం జెడం
భంగి సేయక [illegible] - గం గురువర్గముతో డిసంధి మీ
క. అని [illegible]
గుననే పలచి - నట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్. 103
గన [illegible]
టియు నిట్లనియె. 104

తే. పాం[illegible]
గొకయుక్ ఫలము - నందుటయుం గని పల్క నేరమిన్
మూ[illegible]
నోరిదాన నయి - మాటలు చిత్తమునందు నిల్ప కేఁ

క. ధర్మ ప్రేలెదరే వినుఁడు - కర్జము నెగ్గను గాన నల్కమై
దుర్మద్యైనమానిసికి - వెండి వివేకము గల్గ నేర్చునే. 105

చ. వరమునఁ బుట్టితిన్ భరత - వంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతి జన - వంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్త్రులం బడసి - తిన్ సహజన్ములప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్ర - శస్తికి నెక్కినదాన నెంతయున్. 106

వ. అట్లుం గాక. 107

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు - నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టిననుఁ - బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి - యై పెను పాఁదినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు - నీడ్చెఁ గులాంగన లిట్టులోర్తురే. 108

ఉ. ఆసభ కేకవస్త్ర యగు - నట్టిననుం గొని వచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతు ల - సంభ్రము లై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రముల - యాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ - వచ్చె మనం బది యుం దలంపవే. 109

చ. అరయమిఁ జేసి కోడలన - కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు - పోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ - జేయుదునో యటు గాక పాడిమై
వరవుడ మోపి చేయుదునొ - వారికి మాధవ నిశ్చయింపుమా. 10

వ. అని య ట్లుగ్గడించి.

ఉ. ద్రోవది బంధురం బయిన - క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దా వలచేతఁ బూని యసి - తచ్ఛవిఁ బొల్చుమహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మ - నంబునఁ బొంగువిషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు - గ్రమ్మఁగ దిగ్గన లేచి యార్త యై.

వ. గోవిందుముందటం బెట్టి యి ట్లనియె.

క. ఇవి దుస్ససేనువ్రేళ్లం, దవిలి సగము ద్రెవ్వి పోయి - తక్కినయవి కౌ
రవులకడఁ దీఱుమాటల, యవసరమునఁ దలఁపవలయు - నచ్యుత వీనిన్.

సీ. ఈవెండ్రుకలు పట్టి - యీడ్చినయాచేయి, దొలఁతగాఁ బోరిలో-దుస్స
తను వింతలింతలు-దునియలై చెదరి రూ, పటి యున్నఁగని యుడు-కాఱ
యలుపాలఁ బొనుపడు - నట్టిచిచ్చే యిది, పెనుగద పట్టిన - భీమసేను
బాహుబలంబును-బాటించి గాండీవ, మనునొకవి ల్లెప్పు-డును వహించ

కట్టివిక్రమంబుఁ - గాల్పనే యిట్లు బ, న్నములు పడినధర్మ - నందనుండు
నేను రాజరాజు-పీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయమైతి - మేని కృష్ణ. 115

ఉ. నెట్టన యిట్టియుల్కు మది - నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును - గాలము దీనికి నాలు కెన్నఁడుం
బుట్టను దుష్టనిగ్రహము - పూని జగంబులు గాచునట్టితోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ - బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా. 116

## శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట.

వ. అనుచు నెఱుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారా
యణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను బెన్నెఱివేణి ముడు
వనుం దగువారి నియోగించి యమ్మానినితో ని ట్లనియె. 117

ఉ. మ్రుచ్చిర నేల నేఁ గలుగ - ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జన - వంద్యుఁడు ధర్మసుతుండు వంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము - మేకొని చేసెదఁగాక వే లోకం
డచ్చుపడంగ నేర్చునె దు - రాత్ములు గౌరవు లుర్వి యిత్తురే. 118

క. లలనా యిమ్మగుము నీయే, డ్పులకొలఁదియె కురునృపాల - పుత్రకళత్రం
బేడ్పు లింక వానిం, గలకల నవ్వుచు వినంగఁ - గాలం బయ్యెన్. 119

రాసఘంటికానా, దము వినఁ గౌతూహలంబు - దలకొత్తెడుచి
గలకౌరవుల కి, ష్టము లగునే సంధికార్య - శాంతవచనముల్. 120

విధినియతియును న, ట్టిద యందురు పెద్ద లది ఘ - టింపక పో దే
జూచి చెప్పినను ద, ప్పదు మేరువు దిరిగనేని - పాంచాలసుతా. 121

పలికెద వినుము రి-పుక్షయంబుఁ, జేసి యుజ్జ్వలపుణ్యల - క్ష్మీసమేతు
ంమకుమారుల-యధికవిభవ, మీవు నూచెదు తడవు లే-దిది నిజంబు. 122

మూబడిల గఁ బలికిన, విని యంకిలి దేలుచిత్త - వృత్తి గలుగునం
మీ ద్పుడిగెం దగ ఫ, ల్గునుఁ డి ట్లని పలికె నపుడు గోవిందునితోన్. 123

శవులు ధార్తరాష్ట్రులుఁ - బుండరీక, నేత్ర చుట్టతికంబున - నీకు నొక్క
కావునఁ గోరియే-రూపునందు, నుభయపక్షంబులకుఁ జేయు-ముచితహితము.

ర్థసంగతంబుగ, ధర్మతనయుచెప్పినట్ల - తగఁ బల్కఁగ నా
తులు కౌరవులు స, త్కర్మమునకుఁ జొరక యున్న - దైవమె యెఱుఁగున్.

క. అన విని కౌరవులకు మీ, కును హితముఁ బ్రియంబుఁ జేయఁ - గోరియు కుంతీ
తనయాగ్రజుపని ధృతరా, ష్ట్రునికడకుం బోయెదను గడుం బ్రీతి మెయిన్. 126

క. అని పలికినహరిధర్మవ, చనముల తెఱఁగున కజాత - శత్రుఁడు చిత్తం
బునఁ బొంగి యట్ల చేయుము, మననిశ్చయ మిదియ దీని - మఱవకు మనఘా.

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయణుం జూచి నీనక్షత్రంబు రోహిణి గదా యెల్లి రేవతి నీకుఁ జంద్రతారాబలంబులు గలవు గమనంబునకు రేప కడయ మేలు పయనం బగుట లెస్స యని చెప్పిన నప్పలుకుల కతండు సగౌరవం బుగా నియ్యకొనినం బాండవాగ్రజుండు గొలువుం గలయం గనుఁగొని యెల్లవా రును విన నది యట్ల కాకయని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ బాంచాలి యుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనిరి మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు గాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాఁ బ్ర యాణదానప్రముఖపూజావిశేషంబులం బ్రీతులం గావించి వారల యిచ్చునాశీర్వా దంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి 128

క. మనప్రజలోఁ గరిపురికిం, జను దేరఁగ వలయువారి - సవరణతో రం
డని యేర్పడ నియమింపు ప, యన మై యేతెమ్ము నీవు - నని తగ మఱి

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించు మానుసులునుం గ గావునఁ జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింప వలయు నని సమయజ్ఞతం బొడసూపి నిలుచున్నదారుకుం జూచి తేరు పూన్ప ని నతండును మణిగణప్రభాపటలజటిలం బగునరదంబు వన్ని సైన్యసుగ్రీవ వలాహకంబు లనం బరఁగుతురంగంబులం బూన్చి గరుడధ్వజం బెత్తి దానునుం బయనంపుఁజందంబునఁ గట్టాయితం బై జనంబులమూఁకలఁ వగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యంబులు సెలంగఁ జామరంబు లఁ బెక్కినయవసరంబున యాదవపరివారంబుతో నరుగుదెంచినసాత్యకిం బెక్కించుకొని యాంగికంబు లైనశుభసూచకంబులు గైకొనుచుఁ బూర్ణక భాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేసలొలుకఁ జిత్తం న్నతం బొంద వెడలునప్పుడు.

సీ. పాండవ యాదవ - పాంచాల కేకయ, పాండ్యమాత్స్యాదులు - భద్రదంతి
హయరథంబులతోడ-నతికుతూహలమున, వచ్చినఁ గనుఁగొని - వారి నెల్ల

సంభావనంబుల-సంభాషణంబుల, నాదరించుచుఁ దగ - నల్ల నల్ల
విభవంబు మెఱయంగ - విడిదలపఱ పెల్లఁ, గడచినయత్తఱిఁ - గరము శుభము
లైనశకునములకు - నండఱుఁ బ్రియ మంద, నరుగు చున్నయట్టి - యవసరమున
రథము రథముఁ గదియ - రా నిచ్చి ధర్మనం, దనుఁడు నెమ్మి నిట్టు-లనియె హరికి.

ఉ. వచ్చె జనార్దనుం డనిన - వార్తకుఁ బ్రాణము మేని కంతకున్
వచ్చిన నేద దేఱుఁ గురు - వంశపవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చటి కేగి పాండవుల - యందఱమా అని చెప్పి మ్రొక్కు మన్
గ్రుచ్చి కవుంగిలించికొని - కుందినచిత్తమునొప్పి దీర్పుమీ. 132

చ. అడవికి నేగునాఁడు మము - నంపఁగ నెంతయు దవ్వ వచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁ - గొందెడునశ్రులుఁ జూచి చూచి య
ట్లాడ బడి డించి పో వలసె - నుమ్మలికిమ్మున గొంతి యింతకున్
బగు గయి పాలలోఁ బడిన బల్లివిధంబున నుండ కుండునే. 133

క లక్కఱలు గాలినది మొద, లక్కట మాతల్లి మాకు - నై నెవ్వగతోఁ
బె క్కిడుముల బడు చున్నది, ది క్కెవ్వరు లేనియట్లు - దీనత్వమునన్. 134

క. ఏ ననుట గాఁగ దుర్గఖము, లైనవి తెగుసనయ మయ్యె - నని చెప్పుము మా
మేనత్త నూఱడింపుము, దా నెప్పుడు నీవు గెలవు - తన కను చుండున్. 135

వ. అని చెప్పి వెండియు. 136

ఆ. గురు డు బాహ్లికాది-కురువృద్ధులను సుహృ, ద్బాంధవులు నశేష-ధరణిపతులుఁ
బ్రీతి గొండ నెవ్వ-రికి నేది దగుఁ బ్రణా, మాదివినుల నడపు-నా డుపలకు. 137

క. పరమప్రియమున నాక్కై, పరరంధ్ర నేసి గాథ - బాంధవసాంద్రా
దరమున సంభావింపు వి, దురుతో మధ్యస్థు డగుహి - తుం డతఁ డనఘా. 138

వ. అనియెఁ దదనంతరంబ యర్జునుండు. 139

చ. జనులు వినంగ రాజ్యమున - సాము గొనం గలవార మన్న యీ
జనపతి కార్యనిశ్చయము - సమ్మతి గైకొని చేసినన్ సుయో
ధనుఁడున దమ్ములున్ సఖులు - దానికి నేమును నియ్యకొందు మెుం
డనిన సశృత్రమిత్రముగ - నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతుదున్. 140

మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కా - ర్యం బింతి దెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరలుఁగు సాం - పుం బొంద వక్త్రంబు పొ
ల్పున దర్పం బొలయంగ నంగములకుం - బొం గారునుద్వృంహిత
స్వని దైఁ పొల్చుమహాగ్రసింధురముచం - దం బొంది యొప్పెం గడున్. 141

క. నకులసహదేవులును దా, నికి సంతస మంది యిట్లు - నెయ్యము కయ్యం
బొకతెఱఁగు సేసికొని తడ, యక ర మ్మని పలికి రప్పు - డచ్యుతుతోడన్. 142

## శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభావించుట.

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయుమాటలు సెప్పి యతనిఁ గౌఁగిలించికొని యథోచితప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి తక్కినవారలు నర్హంబు లగుతెఱంగుల నామంత్రితు లై మరలిరి మాధవుండును బ్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయం గనుంగొని తగినసల్లాపంబులుసేసి కరినగరంబుపెందెరువు గైకొని దారుకునిచతురత్వంబునఁ దురంగంబులపటుత్వంబున నత్యంతసమీచీనం బైనయానంబున మనం బలరం జనిచని యొక్కయెడ నారద జమదగ్ని కణ్వాదు లగుమహామునులం గొందఱం గని రథంబు డిగ్గి నమస్కరించి సద్భక్తితాత్పర్యంబునఁ గుశలం బడిగి మీ రిక్కడకు విజయంచేయుటకుఁ గతం బేమి సేయం గలపని యెయ్యది నా కానతిం డనిన నారాయణునకు నారదుం డి ట్లనియె. 143

సీ. అనఘ పుణ్యాత్ముఁడ - వగునిన్నుఁ గనుఁగొనఁ, గౌరవసభ నీవు - గారవమునఁ
బలికెడిపలుకుల - భంగు లాకర్ణింప, విదురభీష్మాదులు - వినుతెఱంగు
నుత్తరం బిచ్చుకా - రోక్తులు నెఱుఁగంగ, వేడుక వచ్చిరి వీర లెల్ల
నని చెప్ప విని లెస్స - యట్ల చేయుదురు గా, కని హరి వల్కిన - 
లతని దీవించి నీవు పో - మ్మచటి కేను, నరుగుదెంచెద మని ప్రీతి - న
యొక్కపుణ్యాశ్రమంబున - యొద్దియేట, విడిసి దివసప్రవర్తన - విధు లు

వ. కమలనాభుండు గదలిపోయి సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థ
జనునప్పు డందలివిప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదె
చినం బ్రసన్నవదనుం డగుచు సమ్మర్దంబు వలవ దని పలికి విశాలరమణీ
బహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారునుం దాన
గృహంబుల కరిగి యభ్యాగతపూజలు గైకొని వారని సంభావించి విడి
సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లుచుండె నంత నక్కడ.

తే. వార్త విని యాత్మనమ కౌర - వక్షితీశ్వ, రుండు గాంగేయగురువిదు - రుల
సంజయునిఁ గర్ణ సైంధవు - శకునిఁ బిలువఁ, బనిచి తా నిట్టు లనియె నం దఱ

వ. కృష్ణుండు పాండవకార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్న వాఁడు కు
స్థలంబున విడిసె రే పిందు వచ్చు నని వింటి మిట్టియాశ్చర్యంబునుం గ

లోకాభిగమ్యుం డగునమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి మన కింత కంటెను బెం పెయ్యది యతం డెవ్వరివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును నెవ్వరిదెస ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్ప దతనికి వలయుపూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము గృహాలంకరణాదిమంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు మతనిచిత్తంబునకు నీవిభవంబును దనమీఁది ప్రియంబునుం దోఁచునట్టితెఱంగున సమస్తంబును సమకట్టుము. 147

క. అనిన ధృతరాష్ట్రుపలుకులు, గొనియాడిరి సంతసిల్లి - గురుఁడును భీష్ముం డును నౌఁగా కని దుర్యో, ధనుఁడుం బరిచారక ప్ర - తతిఁ బిలిపించెన్. 148

వ. ఇట్లుచితపరివారంబు రావించి యతండు 149

క. అలుకుఁడు మృగమదమున మ్రు, గ్గులు వెట్టుఁడు గప్పురమునఁ - గుంకుమమున గో డలు పూయుఁడు మణిదామక, ములు గట్టుఁడు పెద్దకూట-మున సొంపారన్. 150

వ. మఱియు నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. 151

క. పెనుపుం జతురత మెఱయఁగ, మనయింటను దుస్ససేను - మందిరమున శో భనశిల్పము లొనరింపుఁడు, చనుఁడు వృకస్థలమునందుఁ - జప్పరము లిడన్. 152

వ. అది విడిపట్టు గాఁదగియెడుపట్టని పలికి వాసుదేవుండు రేపకడయ వచ్చు నంతకు మున్నయింతియుఁ గావింప వలయు నని పనిచి పురంబున నుత్సవంబు సాటుం డని నియోగించి వివిధగంధమహితమాల్యంబులు సంపాదింపను మణిభూషణచిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదుపానద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరు లగుతజ్జ్ఞుల నియమించె నట్టియెడ నాంబికేయుండు విదురున కిట్లనియె. 153

## ధృతరాష్ట్రుఁడు విదురునితో శ్రీకృష్ణునిరాక సెప్పి సంతోషించుట.

క. వివిధమణిమయరథంబులు, జవనాశ్వంబులును భద్ర - సామజములు ర త్నవిభూషణములు దాసీ, నివహంబులుఁ జాలఁ గృష్ణు - నికి నే నిత్తున్. 154

క. మనయింట సుయోధనుగృహ, మున దుశ్శాసనునికేత - మున నెయ్యది యా తని మాడ్కిఁ గించు నది యె, ల్లను గౌరవ మొప్ప నీవ - లయు మన కనఘా. 155

చ. అన విని యాతఁ డిట్లనియె - నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయఁ గం టెను హిత మైనకృత్య మొక - టెం గలదే యది మేలు పాండునం దనులకు నైద యూళ్లు లుచి - తస్థితి నిచ్చుట కోప మన్నయు న్నిన యిటు లోపుకల్మి ధర - ణీవర యేమిట వచ్చెఁ జెప్పుమా. 156

ఉ. నీతలఁ పేను గంటి నొక - నేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి - భేదము సేయఁగఁ జూచె దింత పే
లైతిగదే సుమేరుసదృ - శార్థముఁ జూచియుఁ బార్థుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును - నచ్యుతు పెంపును నీ వెఱుంగవే. 157

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు - హరికి నట్లు, గాన జలపూర్ణమంగళ - కలశమునకుఁ
బాద్యమునకును గుశలసం - ప్రశ్నమునకు, మిగుల నొండు జనార్దను - మెచ్చ గాదు.

క. మనకడకు నేమిగార్యం, బునకై యాతండు వచ్చెఁ - బూనికి మెయి నా
పని వంచింపక చేయుట, విను మతనికిఁ బ్రియము దక్క - వేయును నేలా. 159

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కి ట్లనియె. 160

క. అది విదురుచెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతుల - తో వే ఱగునే
పద నెఱుఁగ కీఁగి యిచ్చిన, బెదరి రనరె యెచ్చె మైనఁ - బిమ్మట నగరే 161

ఆ. అతఁడు పూజనీయుఁ - డగు నే నెఱుంగుదు, నైన ధనము లీఁగి - నవదతనము
వచ్చుఁ బెచ్చుపెరిఁగి - వైరులు గర్వింతు, రేల పగ యడంగు - నిట్టు లైన. 162

క. అనవుడు భీష్ముఁడు ధృతరా, ష్ట్రున కి ట్లను నీవునుం గొ - డుకు నేమే ని
చ్చిన నొకటి యీఁగి లే కు, న్నను వే ఱొక్కటి దలంచు - నా కేశవుఁడున్ 163

క. విను మతఁడు సేయఁ బూనిన, పని దప్పింపంగ రాదు - పాండవులం దే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ, చ్చిన మే లాపురుషపనుపు - సేయుము పుత్రా.

క. నారాయణుండు ధర్మా, ర్థారూఢము గాఁగఁ బలుకు - నది నీవును నీ
వారును గైకొని యెంతయు, గారవమునఁ జేయ నెల్ల - కార్యంబు నగున్. 165

క. అనుటయు సుయోధనుఁడు భీ, ష్మున కి ట్లనుఁ బాండురాజ - సుతులకు నిమ్మే
దిని హరి సగపా లీఁ దగు, ననుఁ బో యే నీను గాని - యది య ట్లుండెన్. 166

వ. వే ఱొకకార్యంబు సేయం దలంచితి నది వినుము పాండవులకు నేడుగడయు జనార్దనుం డతనిం బట్టి బంధించిన నెక్కలు విఱిగినపులుఁగులుంబోలె వారు నాకు విధేయు లగుదురు పాంచాలయాదవాదు లైనతదీయబంధుమిత్త్రులు నావశం బున వర్తిల్లుదురు సమస్తదేశంబులు నేన యేలుదు దీనికిం దగినయుపాయు సహా యంబు లనువు సేసెద నీవింక నేమి సెప్పెదవు చెప్పు మనిన విని యతిఘోరం బగునవ్విచారంబునకు నమాత్యసహితంబుగా సంతప్తచిత్తుం డై వైచిత్రవీర్యుండు గొడుకున కి ట్లనియె. 167

క. ఓహో యి ట్లనుట జగ, ద్ద్రోహం బిమ్మాట మఱవు - దూతత్వంబుక
మాహాత్మ్యంబును ధర్మో, త్సాహంబును విను మబాధ్య - తకుఁ గారణముల్. 168

క. ఈకారణములు గల వను, నాకొలఁదియె వాసుదేవుఁ - డది గాకయుఁ గీ
డే కురువంశమున కతని, రాక యతం డేమి సేసె - రా పాపాత్మా. 169

వ. అని యదల్చె నప్పుడు గాంగేయుం డాంబికేయున కి ట్లను నీకొడుకు ప్రాణగో
ష్ఠం బైనకార్యంబు సేయం దలంచె దామోదరు నిట్లు సేయం జూచెనేని తానును
ప్రధానులును వినాశంబుఁ బొందుదు రింతియ యిది సేసి రేమి సేయ రేమి య
మ్మహాత్ము నెడ నీయపకారంబు విచారించినదుష్టాత్ములు నష్టాత్ముల కాక యని పలికి
యే నిట్టిదాని వినంజాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గనలేచి పోయె
ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటికొఱగాములు మనంబునం దలంచి
నప్పుడు సేయం గలవాఁడవు గావున దీనం జేటు వచ్చు నుడుగు మయ్యా యని
చెప్పి యతనిం దక్కినవారినిం బోవం బనిచి తగినవర్తనంబున నుండె మఱునాఁడు.

సీ కాలోచితము లగు - కరణీయములు దీర్చి, కమలనాభుఁడు రేప - కడయ కదలి
తనుఁ గుశస్థలవాసు - లనుప రా నందఱు, నాదరంబున నిల్పి - యరుగునపుడు
గజ్జంబులును బండ్లు - గంధమాల్యంబులు, ధృతరాష్ట్రసుతుఁడు పు - త్తేరఁ బ్రీతి
నెడ నెడఁ గొని వచ్చి - యిచ్చిన వాని నె. ల్లను వేడ్క ననుభవిం - చినవిధంబు
పలిపి యనుభవ మొల్లక - చనఁగ నెదురు, బాహ్లిక ద్రోణభీష్మాది - బంధుమిత్ర
గణము పృథ్వీభూపాలలో - కంబుఁ గురుకు, మారవర్గంబుఁ దెంచె - మనుజవిభుఁడు.

## శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునిమందిరంబునకుఁ బోవుట.

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క నెల్లవారిం దూర్వాదిశోభనపదార్థం
బులు సమకట్టి ధృతరాష్ట్రుండు వనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల నందఱ
నర్హ్యోక్తులంగుల సంభావించి కృతిపర్వ దమవాఁడు గావున నతనికి సవిశేష
స్నేహంబు సేసి యతండు సేరువ రా సమస్తజనంబులుం బరివేష్టింపం జని తన
రాకకు నలంకృతంబును బ్రమోదచాపలశుభగజనంబును నైనపురంబు సొచ్చి రాజ
మార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధలుళితంబులునగు
నక్షత్రప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ
జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపైనిలిచి పొలిచి కనుంగొనునంగనా
జనంబులు దమలోన. 172

సీ. ప్రాణంబుతోఁ గూడ - రక్కసిచన్నుల, పాలు ద్రావినప్రౌఢ - బాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు - విఱిచి లోకముల మె, చ్చించినయాజగ - జెట్టి యితఁడె
దుర్వృత్తుఁ డగుకంసుఁ - దునిమి యాతనితండ్రిఁ, బట్టంబు గట్టిన - ప్రభు వితండె
సత్యభామకుఁ బారి - జాతంబుపైఁ గల, కోర్కి దీర్చినరసి - కుం డితండె
వెన్నలును గోపికాచిత్త - వృత్తములును, నరసి ముచ్చిల నేర్చిన - హరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దన-సుభగచరణ, సరసిజామోదమునుగూర్చు-చతురుఁ డితఁడె.

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగుపౌరలోకం బాలోకనకౌతుకంబునఁ దనరథంబు గదిసిన సందడి జడియువేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని మణితోరణసుందరం బగురాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మద్రోణప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బొదువ నతండుఁ బ్రత్యుత్థానంబుసేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనం జేరి. 174

ఆ. అతనిఁ గౌఁగిలించి - యచ్చటఁ గలవిదు, రాదిశిష్టజనుల - నాదరార్ద్ర
బంధుదృష్టిఁ జూచి - పరిరంభసంభావ, నము లొనర్చి శౌరి - ప్రమద మెసఁగ. 175

వ. వార లందఱకును సాత్యకిని దగినసమాచారంబులు నడపం బనిచె నట మున్న ధృతరాష్ట్రపనుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్నయున్నతకనకాసనంబున నతండు నుపనాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణు లగునగరిపురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారంబు లాచరించి యతనితమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి నరనాథుండును దొరలును నిజోచితాసనంబుల నుండిరి కొలు వెల్లను సూర్యోదయసమయంబునఁ గమలాకరంబువిధంబున వికసించి యుండె. అయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందనువచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామపరిరంభణప్రముఖ సముచిత సంభావనంబులు వలికి సంభాషణంబులకుం జొచ్చి 176

క. రాజునకుఁ డియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్య - పుంబలుకులఁ జే
రోజమెయి బంధుమిత్త్రస, మాజములకు మేలములఁ గు - మారులకుఁ దగన్. 177

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురసదనంబునకుం జనియెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద నని పలికి యాంబికేయు ననుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి చని మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయభక్తివినయస్నేహానందంబులఁ గందళితుండగుచు

గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారంబుల నర్చన లిచ్చి కౌంతేయుల కుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 178

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ, సదనమునకుఁ జనియె నపుడు - సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరిం, చెద నని త న్నడుగ నట్ల - చేయుం డనుచున్. 179

వ. చని కాంచిన నద్దేవియు నతనితోడు నీడయుం బోనితనకొడుకులం దలంచి యడలు వుట్టిన నమ్మాధవు మెడ పట్టికొని యెలుం గెత్తి యేడ్చిన నతండు సంబోధించి యూరార్ప నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసపాద్యుపచారంబులు సేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో ని ట్లనియె. 180

సీ. నీశిక్షఁ బెరుఁగుట - నీతిమంతులుఁ బుణ్య, పరులు శూరులుఁ గదా - పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రు - మూఁకలఁ గొలువ నుం, డెడువార లిడుమలఁ - బడుచు నిర్జ
నం బైన కానలో - నన యెట్లు నిలిచిరి, ననుఁ బెట్టి నాయెద - గొనుచుఁ జనిరి
యేను వర్డింపంగ - నిం పారఁ గుడిచి మె, త్తనిశయ్య నిద్రించి వినుతభద్ర
గానకరిబృంహితముల మే - ల్కాంచునట్టి
వారు కంటకమూలంబు లా - హారములుగఁ
బొదలఁ గట్టలఁ బడి యుండి - పులుఁగుమెకము
లావ మేల్కాను చుండిరే - యక్కటకట. 181

ఆ. తండ్రిలేనిప్రజలు - దల్లిని బాసి పె, ద్దయునుగాల మివ్వి - ధమునఁ బడిరి
భంగిపాటు గుఃఖ - పాటును సంకట, పాటుఁ గలిగె విరటు - పాలఁ బిదప. 182

వ. అని వెండియు. 183

ఉ. దానదయాపరుం డె యున - ధర్మతనూభవుఁ డేమ యెట్లు పం
చాననవిక్రముం డగుబ - కారికె భద్రమె యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖి - యా వినయాభరణుల్ గవల్ సమా
ధానసమేతులే యకట - ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్. 184

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ - గోడలి కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కట - కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది - పుణ్యచరిత్ర కులాగ్రగణ్య కొ
త్తడి సకలంబుఁ జూడ సభ - దైన్యముఁ బొందుట నూచి పొక్కిలిన్. 185

తే. నాఁడు ద్రౌపది పడినబ - న్నములు సూడ, నోర్చినప్పుడ యెంతకు - నోర్వఁ జెపుమ
యంత గడచినదుఃఖంబు - లనుభవింపఁ, గలవె లోకంబువారికిఁ - గమలనాభ. 186

వ. అట్టియెడ. 187

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వరును ధర్మ - సంశయ మిది గూ
డదు నార యతనిశీలము, కుదు రీలోకమున కింత - కుం దలఁపంగన్. 188

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ ద్రవ్వికొని శోకం
బు వెల్లిగొనఁ గొండొక దిగంబాటెడుచిత్తంబుతో మఱియు ని ట్లనియె. 189

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు - బావకొడుకుచే
నదయ మగుకూడు గుడుచుట, యది యొకతల యయ్యె నేమి - యనఁ గల దనఘా.

క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకులట్ల తలఁతుఁ - గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి, వెన్నఁడ దైవంబ సాక్షి - వినుము పలికెదన్ 191

క. ఇది నిక్కం బగు నేనియుఁ, దుది నీవుం బాండవులును - దురితరహితు లై
ముద మందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్వె - యంబుజనాభా. 192

సీ. బావ యొప్పం డను - పలుకుల నే మగు, నాతనికొడుకుఁ గీ - డాడ నేల
కురువృద్ధుఁ డగుబాహ్లి - కుని దూఱ నేటికి, భీష్మునిపైఁ బ్రియి - పెట్ట నగునె
యిట్టి క్రూరులయింటి - కిచ్చినమనవారి, నందుఁ గా కట్లు దా - ననుట మేలె
యర్జునుపుట్టిన-యప్పుడు వీఁడు లో, కము లెల్ల గెల్చుపా - గత్తె మొగులు
ముట్టునట్టిద యగు రణ-మున జయించుఁ, గౌరవుల సోదరులుఁ దాను-భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశ-రీరవాణి, పలికె నది దిట్టువడుఁగాక-పలయు నేని.

వ. ధర్మంబు గలుగు నేనియది నిక్కం బయ్యెడు దాని కెల్లను నిర్వాహకుండవు నీవు గలవు
గాదె నీమన్నించుబెచ్చెలులకు జెప్పెడుమాటలు గలవు విను మయ్యుధిష్ఠిరుతో
ని ట్లనుము. 194

క. వేఁడికొని కృపణు లై కను, పోఁడిమి యది యేల రాజ - పుత్త్రులు దమమై
వాఁడిమి దప్పిన నిప్పులు, వేఁడిమి సెడినట్లు జనులు - విని యలుకుదురే. 195

వ. భీమార్జునుల కి ట్లని చెప్పుము. 196

ఆ. కొడుకుఁ గాంచు రాచ - కూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచిత - మైనసమయ
మొదవెఁ దడయ టింక-నొప్పదు జనములు, నట్లు గాని పురుషు - లనరు మిమ్ము.

క. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట - నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా, త్మజఁ గార్యం బడుగు మనుము-తగ నందఱతోన్.

చ. అలిగిన భీమఫల్గునుల - కడ్డము లేమి యెఱుంగు దంతలం
తలు వడి వాని నీఁగ వల - దా విను మాపని కెల్లఁ బాండు పు
త్రులె కలవారు నీ కిటులు - దోఁచిన నట్టులు సేయువారు గా
కలుషవిచార నాయలఁత - యార్పు ము నన్ గడతేర్పు మెమ్మెయిన్. 199

వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యి ట్లనియె. 200

## శ్రీకృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట.

చ. సుగుణవు పుట్టినింటికిని - జొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచు - ధన్యవు ధీరవు దేవి నీ వెద
న్వగ లడఁగింప కున్న భువ - నంబుల నిం కిట నెవ్వ రోర్చువా
రు గలరె దక్కుమీ హృదయ - రోగము లన్నియుఁ బుచ్చి వైచెదన్. 201

క. తనయులుఁ గోడలు సేమం, బున నున్నా రధికభక్తి - పూర్వముగా దం
డనమస్కారంబులు నీ, కొనరించిరి కౌఁగిలించి - రుల్లములఁ దగన్. 202

క. నీకొడుకు లొండుసుఖములు, సేకొన రవ్వీఁ సుఖమ - చిత్తముల గరం
బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లల్ప - బుద్ధులె వారల్. 203

క. ఉత్సాహంబున శత్రుసు, లోత్సాదనవిధి యొనర్చి - యున్నతిసామ్రా
జ్యోత్సవము నొందు పుత్రుల, నుత్సుకతం జూతు గాక - యూఱడు మింకన్.

చ. అన విని మోము విచ్చుచు ము - రారికి ని ట్లనుఁ గుంతి పాండునం
దనులకుఁ దండ్రియున్ గురువు - దైవము నారయ నీవ కావె నీ
మనమున ధర్మమున్ హితము - మంచిగఁ జూచి విధించినట్ల చే
సి నెగడువారు గాక నినుఁ - జేరిన నాపద లొంద నేర్చునే. 205

క. వారలక యేల మాధవ, కౌరవులకు మఱియు నీజ - గంబుల కెల్లం
జేరుగడ నీవ నీపలు, కారయ వేదంబ కాదె - యఖిలంబునకున్. 206

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు సేసి తదావాసంబు వెలువడి తనరాకకు నలంకృతం బైనదుర్యోధనుమందిరంబునకుఁ గృతవర్మసాత్యకిసమేతుం డయి పోవుగోవిందునిం గని తదీయద్వారపాలకులు సంభ్రమంబునం బఱచి యతని కెఱిఁగించి తదనుమతంబునం బఱతెంచి యెదుర్కొని కక్ష్యాం

తరంబుల సందడి సెడ గలుగ జడియుచు వినయంబునం దోడ్కొని చన నమ్మనుజ విభుండు శైలాసశిఖరాకారం బగుసౌధంబున బాహ్లీక భీష్మ ద్రోణప్రభృతులును గర్ణశకునిసైంధవాదులును దుశ్శాసనవికర్ణదుర్ముఖప్రముఖులును మఱియు ననేకదేశాధీశులునుం బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుం డై యున్నయెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారంబులు దానుం దమ్ముండును నాచరించి.

క. అతఁ డునుపఁగఁ గనకమయో, న్నతపర్యంకంబునందు - నారాయణుఁ డూ
ర్జితమహిమ నుండి యభ్య, ర్చితుఁ డయ్యెఁ దగంగ నతని - చే సత్కృతులన్. 208

## శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట.

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యెఁ దదనంతరంబ నిజాసనాసీను లయి తనమొగంబునం జూడ్కి నిలిపి యున్నదుర్యోధనాదులతో మాధవుండు మధురసంభాషణంబులు సేయుచుండె నట్టియెడ. 209

తే. సముచితంబుగఁ గూరల - చంద మర్గ, డించి కుడుపు తెఱంగు వు - ట్టించి పలుకు
నాసుయోధనుతోఁ గృష్ణుఁ - డచటఁ దాను, గుడువనొల్లక యునికి యే - ర్పడఁగఁ జెప్పె.

వ. చెప్పిన విని దుర్యోధనుండు సూర్యసూనువదనం బవలోకించి యల్లన ని ట్లనియె.

క. హరి పలికినవిధ మెంతయు, నెర వై యున్నయది వింటె - యిమ్మాట తెఱం
గరయుదము లోలుత నీ పెను, పరిచందం బెల్ల నెఱుక పడియెడుఁ బిదపన్. 212

వ. అని యచ్యుతున కి ట్లనియె. 213

తే. వలయునన్నపానంబులు - పలుతెఱఁగుల, నేర్చువిధముల నే మొదఁ - గూర్చి వేడ్క
నున్న నీ వుపయోగింప - నొల్ల కునికి, బాంధవమునకు నీతికి - బాహిరంబు. 214

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్కరూప - యసదృశధర్మా
చారుండవు రాజునకుం, గూరుతు గత మేమి యి ట్లు - గుటకుం జెపుమా. 215

క. అనుడు సుపేంద్రుఁడు మనుజేం, ద్రున కి ట్లను దూత లెందుఁ - దొలిదొలి గుడుపం
గొనఁ గట్టఁ దొడఁగుదురె వ, చ్చినకార్యము దీర్చి పిదపఁ - జేయుం డెల్లన్. 216

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కి ట్లనియె. 217

ఆ. వేగపడుట మేలె - వినుము కార్యము దీఱుఁ, దీఱ కుండు దాని - తెఱఁగు దగిన
యప్పు డాడ రాదె - యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వ నేల - కమలనాభ.

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుఁ గాక కుడువ నొల్ల ననం దగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది లేదు విచారింపక పలికి తనిన మందరధరుండు మందస్మితంబుతో నందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రకరంబు గజంబు పల్లవం బల్లనఁ దెమల్చులీలం గేల నమర్చి యిట్టిమాటలు తేటపఱుప వలయు నేని విను మని యతని కి ట్లనియె. 219

చ. ప్రియ మొసఁగం దగం బిలిచి - పెట్టెదుకూడ దది లెస్సకూడు ద
క్కియునయహీనతం దమకు - నాపద యైనెడ నిట్టు నట్టు నే
మియు నన లేనికూడు దిరి - మేవడి యై చను నీవు మా దెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతి - పెంపఱ నాపద లేదొ కింతయున్. 220

వ. అట్లుం గాక. 221

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కనుమాన మమృత - మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగ దొడళుల కెప్పు డెవ్వ గము వాటిలునో. 222

వ. ఏను బగతుండనె యంటేని. 223

క. అలుగుగు పాండవులకు వా, రలు నాకుం బ్రాణములు ధ - రావల్లభ యి
ట్టులముగ దెముప్రా ణములకు, నలుగుజనులు పగతు రగుట - యనుమానంబే. 224

ఆ. కారణంబు లేక - కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె - యాచరింతు
పుణ్యపరులు దోడఁ - బుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె - వారతోడ. 225

వ. ఇట్లున్న మీయుందఱయన్నంబులు దుష్టాన్నంబులు విదురుం డొక్కనియన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞనపతి యనుమతిసేయఁ జనునప్పుడు తోడన బాహ్లికభీష్మాదికౌరవులును గుంభసంభవప్రముఖులైనమాన్యులును జని మాధవుతోడ మాయిండ్ల నెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్లు చూచు చున్నవార మని పల్కి ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన యందఱయర్చనలుం గైకొంటివ మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృహంబునకుం బోయిన. 226

సీ. సంభ్రమస్నేహాని - శ్చలభక్తియుక్తిఁ బ, వి త్రమజ్జనము గా - వించి విదురుఁ
డెల్లవంటకములు - నేర్పడ బోనాలు, వేర్పింప నెంతయుఁ - బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణ - భోజనం బొనరించి, సపరివారముగ వి - శాలరమ్య
పూతస్థలంబునఁ - బుండరీకాక్షుండు, దమ్ముండుఁ దాను ను - త్సవ మొలర్ప

సరసరంజకమహనీయ - సంప్రయోగ, మగుచతుర్విధవ్యాద్యాన్న - మారగించె
లలితసంభావనామంజు-లంబు లైన, పలుకు లెడనెడ విదురున-కెలమి యొసఁగ.

వ. అతండును. 228

క. గోవింద సంభ్రమము సం, భావింపుము మాకు నిదియ - పరమధనం బొం
డేవిధమున నీ కర్చన, గావింపం జాలువాఁడు - గలఁడే యెందున్. 229

వ. అని మఱియు నత్యంతవినయవాక్యమ్ముల నారాధించు చుండె నిట్లు కృతాహారుం
డైనహరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుఁడు కృతార్థుం డై
యుండఁ గవిగణికప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాంశికవైణికాది
వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు పుచ్చి యభిమతార్థంబులు
వడసి చనిరి రాత్రి యగుటయుం దగినయభ్యంతరమందిరంబున హంసతూలికాత
ల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి. 230

ఆ. విదురుఁ డిట్టు లనియె నిదియొకకార్యంబు, గాఁగఁబూని యిందు-రాఁగఁ దగునె
దుష్టబుద్ధి నీచు - దుర్యోధనుండు నీ, మాట వినునె దురభి - మానఘనుఁడు. 231

క. వచ్చినసైన్యంబులఁ గని, పెచ్చువెరిఁగినాఁడు ద్రోణ - భీష్ములావుల్
నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ, యిచ్చుఁ దనకు విజయ మనియు-నెంతయుఁబొంగున్.

వ. నీ విట వచ్చుట విని నయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బాటి తమలో నిశ్చ
యించినతెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు
నీ కుండువారు దార యీధాత్రి యంతయు బీలు వోవ కుండ నేలువారు వారిం
గూడినరాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ
గర్ణుతో నేకార్థుల మై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లే దని నిశ్చ
యించికొని యున్నవా రట్లగుటంజేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్న
వాఁడు సంధి గానేరదు వారల కందఱకు నిది ప్రాప్తకాలం బై యున్నయది యె
ట్లును నడుగ నేర్చినవారు గా రిట్లు ద మ్మెఱుంగనిదుష్టాత్ములనడుమం గూర్చుం
డుటయు నవ్వెంగలివిత్తు లఱచుపిటీఁడియఱపులకు వంక లొత్తి మాఱు సెప్పుటయు
నొప్పక యుండు వెడంగు లగుటం గార్యవచనంబు లెఱుంగరు మొఱకు లగుటం
బ్రతాపభాషణంబులకు వెఱవరు వారలతలంపులు గీడు నీ మహనీయప్రభావబుద్ధి
పౌరుషంబు లే నెఱుంగుదు నయినను బాండవేయులపై స్నేహంబునను నీమీఁది
భక్తినిం జెప్పెద నందుఁ బో వలవ దనిన వాసుదేవుం డతని కి ట్లనియె. 233

తే. నీవివేకంబు నాప్తియు - నెఱపి తీవు, తల్లిదండ్రులమాడ్కి హి - తంబు సెప్పి
లేను నారాకతెఱఁ గెల్ల- నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ - జేయువాఁడ.

## శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట.

క. ఎఱుఁగుదు నేను సుయోధను, గొఱగామియు నతనితోడఁ - గూడినన్నృపు లం
దఱుఁ బగ మనమున నిడికొని, యఱుమటయును సంధి పొసఁగ దనియు మహాత్మా.

ఆ. పుడమి యెల్ల నొద్ద - గూడ వయి గజవాజి, యుతముగాఁ గడంగి యుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు-మూర్ఖత మాన్చుట, యధిక మైనపుణ్య - మనఘచరిత.

వ. మానుప వచ్చునే యంటేని. 237

క. దొరఁకొని పుణ్యముఁ బాపము, నరుఁ డర్థిం జేయుచుండ - నడుమ నొకట న
వ్వెరవు వెడలి తప్పినను ద, త్పరిణతిఫల మొందు నండ్రు - ధర్మవిధిజ్ఞుల్. 238

వ. అట్లుం గాక. 239

తే. చుట్టములలోన నొప్పము - పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గొ - ట్లాడి యైనఁ
దాని యుడుపంగఁ జొర కున్న - వానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మ - కాండవిదులు. 240

వ. కావున నీ రెండు దెఱంగులవారికి శాంతి గావింపం బ్రయత్నంబు సేసెద ధర్మార్థసహితం బైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుం డైనసుయోధనునకుం జెప్పెదఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితం బయినవిధంబు వంచన లేక చెప్పెదు నన్ను బాండవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యెనేనియు మేల కాక యిట్లు వచ్చి చెప్ప కున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞు లైన జను లాడుదు రల్లభంగులం గార్యం బార్యు లియ్యకొనం జెప్పుదు ధార్తరాష్ట్రులుం దమకు బ్రదుకు తెరు వైన నాపలుకులు సట్టుదురు పట్టకి నీతిలంచినచందమునం దులువ లై కలంగం బాఱిన వారు నాముందర నిలువం జాలుదురే యని పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు సేసి నిజశయనస్థానంబునకుం జనియె నంతరంబ.

ఆ. అతనివచనరచన-యాత్మలోఁ దలపోసి, యిట్టివాఁడు గలఁడె - యెందు ననుచుఁ
బాలకడలికడల - పాటి యై యొప్పున, పాన్పునందు శౌరి - పవ్వళించె. 242

వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి సమయకర్తవ్యంబులు సలిపె నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గలయిష్టజనంబులు పరివేష్టింప నుచితప్రదేశంబున నున్నంత. 243

క. ఇనతనయశకునిదుశ్శా, సనసహితము గాఁగ నెలమిఁ - జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా, రును దానును వారిజోద - రుం గొనియాడెన్.

వ. అతండును మధురసంభాషణంబులు సేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధుమిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱింగించినఁ బ్రియంబునఁ గట్టాయితం బైనతే రెక్కి భేరీశంఖచామరప్రముఖభద్రచిహ్నంబులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబునను దుర్యోధనాది దుష్టచతుష్టయం బొక్కరథంబునను బార్శ్వంబుల రాఁ బౌరులకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబు సేర నరుగునప్పటియులివునకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకులై యెదురుచూడ రథోత్తమంబు నవతరించి యరవిందనాభుండు. 245

తే. ఎదురువచ్చినవిదురుని-యిచ్చకరమ్ముఁ, దమ్ముచేయును రెండుహ - స్తములఁ బట్టి
నడచె ముందటఁ గదియుసం-దడిఁ గడంగి, కర్ణదుర్యోధనులు దొలఁ-గంగ జడియ.

వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁ గలయభ్యంతరు లైనబలుమానుసులు పొదివికొని పోవఁ దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధిఁ దారాగ్రహంబులచందం బగుచుండం దేజోరాశి యగురాజీవాక్షుండు సని తనకుం బ్రత్యుత్థానంబు సేసిన కురురాజును దొరలను నభినందించుచు 247

క. తన కని పెట్టినమణిమయ, కనకోన్నతపీఠమునఁ బ్ర - కాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖు లంతరిక్ష - మున సుజ్జ్వలు లై. 248

వ. ఇవ్విధంబున సన్నిహితు లయినయమ్మహామునులం గురుపితామహునకుం జూపి నారాయణుం డి ట్లనియె. 249

ఆ. మనలఁ జూచువేడ్కఁ - జను దెంచినారు మ, హాత్ము లైననార - దాదిమునులు
వీరి కర్ఘ్యపాద్య-విధు లొనరింపు మా, సనము లిడఁగఁ బనుపు-సత్వరముగ. 250

వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా దనినం గొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన చూచుచుండ భీష్ముండు పరచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప వార లరుగుదెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు సేయించి కృష్ణుఁడు గూర్చున్న యనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటివారును నుచితప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరుసంకెలం గూర్చుండిరి కర్ణదుర్యోధనులుం జేరువ నొక్కగద్దియ నుండిరి విదురుండును మణి

పీఠంబునఁ గృష్ణుని వెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బత్తమిల్లియుండె గాంధారరాజు నిజపుత్రపరివృతుం డై యొక్కదిక్కున నుచితపీఠాసీనుం డయ్యె నట్టి సమయంబున. 251

క. అంబుదశుభగాత్రుం బీ, తాంబరధరుఁ గమలదళని - భాక్షుఁ హరిఁ జూ
డం బడసి లోచనము లమ్మ, తం బానినమాడ్కి సమ్ము - దంబునఁ దేలన్. 252

క ఆకొలువువారు గర మచ, లాకృతి నొకపలుకు లేక - యందఱు వింజం
బాఁ కిడినకరణి నవశము, దాకారితచిత్తవృత్తు - లై యుండంగన్. 253

## శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునితో సంభాషించుట.

క. జలదస్వనగంభీరత, నెలుఁగొప్పఁగ డంతదీప్తు - లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం, బులు విన ధృతరాష్ట్రభూవి - భున కి ట్లనియె. 254

క. జననాథ నీయెఱుంగని, పనులు గలవె యైనఁ దెగవుఁ - బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు, నని పచ్చితి భారతాన్వ - యము ప్రియ మొందన్. 255

క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవు లొడఁగూడి మనికి - కార్యం బది నీ
వారసి నడపుము వా రన, వీ రనఁ గురుముఖ్య నీకు - వేఱుం గలదే. 256

చ. భరతకులంబు ధర్మమును - బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁ - గా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయను గు - దమ్ము డు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసు చరి - తక్రము మిప్పుడు దప్ప నేటికిన్. 257

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం - దెవ్వారిచందంబు లె
ట్లై పర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీ - యం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలివృ - త్తంబుఁ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం - గౌరవ్యవంశాగ్రణీ. 258

చ. వినుము సుయోధనాదు లగు - వీరు సధర్ములు గాక కార్యము
ల్గొనక మహార్థసిద్ధి యెడ - లం దమ కి ట్లన కన్వయంబువ
ర్తన మిది గాదు నాక బెడి - దంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగు - ణంబులకుం బుయిలోడ రేమియున్. 259

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు - గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల - మంతికు నీనృపకోటి కుర్వికిం

బోరిత మైన నింతకును - బుట్టు మహాపద గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య గణు - తించి యవశ్యముఁ బొం దొనర్పవే. 260

తే. నీకు వలసినఁ దీర్పంగ - నేర వచ్చు, నధిప తెఱఁగు నీవశమున - యదియ కాన
నీకు వీరలఁ దేర్చుట - నెఱియ కాదె, సిద్ధ మెవ్వారిఁ దెలి పొందఁ - జేయ నేర్తు.

ఉ. అందు వృకోదరార్జునుల - నాహవరంగమునందు మీఱువా
రెందఱో యెన్నుమా యిచట - నీగురుభీష్ములఁ గ్రేణి సేయువా
రెందఱో వారు వీరు నని - నీల్గుటకంటె భవద్బలంబు లై
యందఱుఁ గూడు టొప్పదె జ - నాధిప శాంతి యొనర్ప మెమ్మెయిన్. 262

తే. జగతిఁ గలజనపతులు నీ - చరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవే - లావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే - తల్లి ప్రజల, యెడ విరోధంబు వాటించు - టెంతమేలు.

క. నరనాథ నీ వుపేక్షా, పరుఁడ వయినఁ గౌరవులక - పాండవులక కా
దరయఁగ భూప్రజ కెల్లను, దురితం బొనరించినట్ల - తుదిఁ గీడు సుమీ. 264

క. కౌరవపాండవులం దె, వ్వారలకుం జావు నొవ్వు - వచ్చిన మే లు
ర్వీరమణ చిత్తమున నె, ట్లారయుమా నీకు దుఃఖ - మగు నె ట్లయినన్. 265

ఉ. వీరును వారుఁ బండితులు - విక్రమవంతులు బాహుగర్వదు
ర్వారులు పూనిరిత్తబవ - రంబున నాజిఁ జావఁ బోవ నె
ట్లూరక యుండ వచ్చు కడు - నొప్పెడుమేనులు వాఁడికైదువుల్
గూరఁగ నాటినం బుడమిఁ - గూలుట కక్కట యోర్వ వచ్చునే. 266

ఆ. ఇట్లు గాక యుండ - నీ రెండు దెఱఁగుల, వారిఁ గాచికొనుము - వసుమతీశ
నీకు ప్రాభవంబు - నీతియు శాంతియు, నఖిలజనులుఁ బొగడు - నట్లు గాఁగ. 267

వ. అని చెప్పి వెండియు 268

## శ్రీకృష్ణుఁడు పాండవులు సెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. పాండవులు దండ్రి సచ్చిన - ప్రజలు వారి, నరసి ప్రోచితి శైశవ - మాది గాఁగ
నడుమ నిష్కారణమ దిగ - విడువఁ దగునె, పార మొందంగ రక్షింపు - గారవమున.

వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణమిల్లి యందఱు నొక్కమాటగా నీతోఁ
జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము తనపంపునం బండ్రెండువత్సరంబులు

వనంబున వసియించితిమి పదుమూఁడగు నేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబు నుం జలిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించి యే మర్ధరాజ్యం బెట్టునుం బడయుదు మని కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేఁడుగడయును మాకుఁ దాన మావలన నేఁరమి గల్గినం గినిసి యిట్లు గా దట్లని చక్కంబెట్టునది తనగలపదివేలేండ్లకుం దన్న కాని మఱి యెఱుంగ మెట్టివార మై నను మమ్మును దుర్యోధనాదులను నొక్కరూపకా తలఁపు తనయందుఁ దెఱంగు గలిగిన నెవ్వరు గొఱ గాకున్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని పలికి మఱియు ని ట్లనియె. 270

ఉ. సారపుధర్మమున్ విమల - సత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొంద లేక చెడఁ - బాఱిన దైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది - వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యశుభ - దాయక మయ్యును దైవ ముండెడున్. 271

వ. అని యీసభ్యులకుం జెప్పు మనిరి నీవును సభాసదు లైనరాజులు నే మనియెద రనుం డేను ధర్మంబును నీతియును మున్నిడికొని మనోవాక్ప్రకారంబు లేక రూపం బైనసత్యంబ కాఁ జెప్పితి నిత్తెఱంగు మీకు మేలు క్రోధమానమత్సరంబులు విడిచి యిట్లు సేయుండు. 272

ఆ. పాండవులకుఁ దగిన - పాలు మేదినిఁ బంచి, యిచ్చుకంటెఁ గార్య - మెద్ది గలదు
ధర్మ మెద్ది సముచి - తం బగువిధ మెద్ది, శక్య మెద్ది చెపుఁడ - వాక్యవిదులు. 273

క. అని పలికి మహారాజా, విను మని ధృతరాష్ట్రుతోడ - వెండియుఁ దా ని
ట్లని చెప్పె వాసుదేవుఁడు, తనమది నఱ లేక కార్య - దశ దెలియంగన్. 274

ఆ. వారితండ్రిపాలు - వారికి నిచ్చి నీ, పాలు నీవుఁ బుత్ర - పౌత్రచయము
ననుభవించి సుఖుల - రై యుండుఁ డిది బంధు, మిత్రసుజనకోటి - మెచ్చు తెఱఁగు.

క. ఎఱుఁగవె యజాతశత్రుని, నెఱియును ధర్మంబు సత్య నిష్ఠయు మిము నె
త్తెఱఁగున ననువర్తించెనొ, యెఱుఁగవె తెగుచేవ గలుగు - టెఱుఁగవె యధిపా. 276

వ. నీ వెఱుంగు దైనను జెప్పెద విను మింద్రప్రస్థపురంబుననుండి పాండవాగ్రజుండు నీకుం బెంపునుం బేరునుం జేయం గోరి. 277

చ. మద మడఁగించి భూపతిస - మాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే
యుదు నని పూని దిగ్విజయ - మున్నతిఁ జేసి మహావిభూతితో

మదిమది నుండ నీసుతుఁడు - మంత్రులు సౌబలు జూద మార్చి సం
పద గొని యంతఁ బోవక స - భక్తి ద్రుపదాత్మజ భంగపెట్టరే. 278

ఉ. దానికి నీ వొడంబడితి - ధర్మజుఁ డంతయుఁ జూచి సత్యముం
బూని వృకోదరార్జునులు - భుగ్నులు గాఁ బెడచేతఁ గన్ను నీ
రూనఁగ నొత్తుకొంచుఁ జని - యుగ్రవనంబున దుఃఖమగ్నుఁడై
దీనత నుండి పూన్కి దగఁ - దీర్చియుఁ గూడి మనంగఁ గోరెడిన్. 279

క. తనుఁ దాన పోలుఁ గా కే, మన వచ్చు నజాతశత్రు - నతిశాంతతయున్
వినయము గౌరవమును నే, జనపతులకుఁ గలవు సెపుమ - సౌజన్యనిధీ. 280

క. ఏ నిం తాడితి నీసం, తానం బిరుదెఱఁగునకు హి - తము గోరి భవ
త్సూనునిమతియతిలోభము, మానిచి పాండవులఁ దెమ్ము - మనుజాధీశా. 281

ఉ. వారలు శాంతశూరులు భ - వచ్చరణంబులు గొల్వఁ బూని యు
న్నా రటు గాక మీ కది మ - నంబున కప్రియమేని యింతకుం
బోరికి వచ్చుచుండుదురు - భూవర రెండుదెఱంగులందు నీ
కారయఁ బథ్య మేది యగు - నవ్విధ మేర్పడ నిశ్చయింపుమా. 282

చ. అనవుడు రోమహర్షణము - లంగములం బొడమన్ సదస్యు లె
ల్లను బ్రియ మంది సెమ్మనము - లం బురుషోత్తముఁ డింత యొప్పఁ బ
ల్కునె మఱుమాట లాడ నయ - కోవిదుఁ డెవ్వఁడు ధీరుఁ డెవ్వఁ డిం
దనువరి యెవ్వఁ డంచు నచ - లాకృతు లై సెటి నూర కుండఁగన్. 283

వ. జామదగ్న్యమహాముని సుయోధనుతో ని ట్లనియె. 284

సీ. వినుము దంభోద్భవుం - డనురాజు దన కెదు, రెవ్వరు లే రంచుఁ - గ్రొవ్వి నరుఁడు
నారాయణుం డను - వారలు గంధమా, దన మనునగమునఁ - దపము సేయ
వారిపైఁ జని యాహ - వమునకుఁ బిలిచిన, నమ్మునీంద్రులు వల - దని యనేక
విధములఁ జెప్పంగ - వెండియుఁ బో కున్నఁ, గుశముష్టి నుజ్జ్వల - విశిఖవృష్టి
గురిసి నరుఁడు సేనఁ - గూల్చి యాతని భంగ, పెట్టి పట్టి విడిచె - నట్టియమ్మ
హాత్ము లిపుడు పార్థుఁ - డనఁ గృష్ణుఁ డనఁగ లీ, లార్థకలితజన్ము - లైరి నూవె. 285

వ. కావున నాదంభోద్భవుచందంబున నుద్ధతి వాటించుటయు నరనారాయణులతోడఁ దొడరుటయు మీఁద మే లయి యుండదు పాండవులతోడిపొందు మే లనిన యనంతరంబ కణ్వుండు దుర్యోధనున కి ట్లనియె. 286

## కణ్వుండు దుర్యోధనునితో గరుత్మంతునివృత్తాంతంబు సెప్పుట.

క. అది వోలఁ దన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్రహించి - మద మెత్తుట యొ
ప్ప దహంకారం బొనరిం, పదె పౌరుషహానిఁ దొల్లి - పక్షీంద్రునకున్. 287

వ. అది యె ట్లనిన. 288

సీ. అమరేంద్రరథసూతుఁ - డైనమాతలి దన, సుత గుణకేశికిఁ - బతిఁ దగంగ
నారసి యార్యకుం - డనుభుజంగాధిపు, మనుమనిఁ జికురుని - తనయు సుముఖు
నర్థమైఁ గోరిన - నార్యకుం డుమ్మలి, కంటితో ని ట్లను - గరుడుఁ డితని
తండ్రి వధించి యెం - తయు నల్కమై వీని, నిం కిట నెల సమ - యించువాఁడు
గానఁ బూని పోయెఁ - గావున నే మియ్య, కొనఁగ నేర మనిన - విని బలారి
నడిగి పడసి యిత్తు - నాయువు రం డని, వారిఁ గొనుచు నరిగె - సారథియును.

వ. వారలభాగ్యంబున నప్పు డింద్రుండును నుపేంద్రుండును నొక్కచో నుండం
గని మాతలి యక్కార్యంబు విన్నవించినఁ గరుణించి జిష్ణుండు విష్ణునకుం జెప్పి
చేయించువాఁ డై వైనతేయు దసకుం దాన చాలి సుముఖుం జిరాయురుపేతుం
జేసిన. 290

క. మాతలి పాణిగ్రహణం, బాతనిఁ జేయించి యున్న - నంతయు విని తా
నేతెంచి గరుడుఁ డలికో, పాతురుఁ డై రేఁగి పెలుచ - నమరాధిపుతోన్. 291

వ. వాసుదేవుసన్నిధి ని ట్లనియె. 292

క. విను నీ వదితిసుతుండవు, వినతకొడుక నేను విత్త - వీఁగెడుమనకున్
జనకుఁడు గశ్యపుఁ డొక్కఁడ, దనుజుల శోధించి చంపు - దమ యిరువురమున్.

క. ఏమిట నీ కేఁ దక్కువ, నామేరకు నడ్డపడితి - నావుడు నింద్రుం
డీమహనీయమహిమకును, ధామము విష్ణుండు గాక - తక్కొరుఁ డెగునే. 294

వ. అనినఁ గటకటంబడి గరుత్మంతుండు. 295

ఉ. తమ్ముఁడ నీవు నాకొలఁది - తథ్య మెఱుంగక నాకు నీచభా
వ మ్మగుభంగిఁ జేసితివి - వాసవ యియ్యదితిప్రసూతవం
శ మ్మఖిలమ్ముఁ దాల్తు నొక - సన్నపుటీఁకన యిట్టినన్ను నీ
వి మ్మెయిఁ దూలవుత్తె యని - యీక్షణరోచులఁ గెం పెలర్పఁగన్. 296

వ. ఉన్నం గనుంగొని కోపించి వాసుదేవుండు వెడనవ్వు నవ్వుచు. 297

క. నీవేటిమోపుకాఁడవు, నావెరవున నిన్ను నడపి - నను గర్వం జే
లా వెడఁగ యంచుఁ దనముం, జే పీఁపున నిడ సురేంద్ర - జిత్తు వికలుఁ డై. 298

క. ఎఱకలు విచ్చుచుఁ దుండము, దెఱచుచు వ్రేఁ గడరి సొగసి - త్రెళ్లి వివశుఁ డై
యఱచిన నోడకు మని హరి, నెఱి సక్కఁగఁ ద్రోచి యెత్తె - నెగయంగఁ గృపన్.

వ. ఇవ్విధంబునం గేశవుండు గరుణించి గరుడుని ననునయించి యింక నవుదానికి నుద్ధతి మాని బుద్ధి గలిగి యుండు మని వీడ్కొలిపి పుచ్చినం బోయెం గావున గర్వంబు గొఱ గా దింతయు నీమహానుభావుం డెఱుంగు నని నారదుం జూపి యితండు మాతలి కన్యాకార్యంబునకుఁ దోడ్పడ నడచె నడుగు మదియకాదు సర్వేశ్వరుం డగుమాధవుమాహాత్మ్యం బితనికిం గరతలామలకం బయియుండుఁ బ్రభవిష్ణుం డగునాదివిష్ణుఁడు గదా యీకృష్ణుం డీతనిసహాయత్వంబు గలకౌంతేయులతోడం గూడి మనికి కార్యం బనిన నారదుండు ధార్తరాష్ట్రు నాలోకించి. 300

క. బలవంతులబలములు న, గ్గల మగుబల మెదురఁ గలుగఁ - గాఁ గీడ్పడు నే
కొలఁదులవారికి గర్వము, నిలుచునె నయమార్గవృత్తి - నిలిచిన భంగిన్. 301

వ. అని వెండియు ని ట్లనియె. 302

ఆ. ఇదియ కాని చేయ - నెద్దియే ననుచు ని, ర్బంధవృత్తిఁ దలఁపు - పట్టికొనిన
నట్టివాని కెందు - నలజడి వాటిల్లు, గాలవుండు గుటియ - కాఁడె మనకు 303

వ. వినుము విశ్వామిత్రుపాల విద్యాభ్యాసంబు సేసి గాలవుం డనుమునికుమారుండు గురుదక్షిణ యేమి సమర్పింతు నని యడిగిన నతం డేమియు నేల యని యుడిపిన నుడుగక యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినఁ గటకటంబడి యత్తపోధనవర్యుం డట్లేని శుద్ధధవళవర్ణంబు లై యొక్కకర్ణంబు నీలం బైనయుత్తమాశ్వంబు లెనమన్నూఱు దెచ్చి యి మ్మని పలికినం బోయి. 304

తే. గాలవుం డవ్విధముఘోట-కముల నెందుఁ, బడయ లేక చింతాభర-భ్రాంతుఁ డగుచు
వెడలి యాహారనిద్రలు - విడిచి తా మ, హాపథముఁ బోదుఁ గా కని - యరిగి యరిగి.

వ. ఒక్కచో గరుడునిం గని బాలసఖుండు గావున నతనికిం దనవృత్తాంతంబు సెప్పిన నతండు గరుణాభరితుం డై. 306

క. దేవతలు గాని యిట్టివి, గావింపం జాల రీస - కలదిక్కులలో
దేవేంద్రుదిక్కు బహుదివి, జావాసం బందుఁ బోద - మని మునిపుత్రున్ 307

క. అఱకడ నిడి ప్రాఙ్ముఖుఁ డై, పఱచి జలధిలోనఁ జదలఁ - బాఱెడునెడఁ జె
య్వాఱి దప్పి నిలువఁ జాలక, యొఱగినగాలవుని డించె - నొకగిరిమీఁదన్. 308

వ. ఇట్లు డించి డప్పి దేర్చి యందుఁ గశ్యపనందనుండు శాండిలి యనునొక్క తపస్వి శాపంబునఁ బక్షంబులు డుల్లి యనుగ్రహంబునం గ్రమ్మఱ వచ్చిన విషాదమోదంబు లనుభవించి యట సనుట సాలించి మగుడ మహీతలంబునకు మునికుమారుం దెచ్చి యయాతి తనసెచ్చెలి యని ప్రతిష్ఠానపురనాథుం డగునతనికడకు నాతనిం దోడ్కొని చని యగ్గాలవుతెఱం గెఱింగించిన నతండు. 309

క. తన కట్టిగుఱ్ఱములు లే, కునికిని మాధవి యనంగ - నొప్పెడుపుత్త్రిక
ముని కొసఁగె దీనికై యే, మను జేశుఁడు నీఁడె హయస - మాజము ననుచున్. 310

వ. ఇట్లొసంగినం దోడుకొని. 311

తే. ఇట్టిహయములు గలరాజు-లెవ్వరొక్కొ, యనుచుఁ దిరిగి యయోధ్యకుఁ-జని తదీయ
నాథు నిక్ష్వాకుఁ గనిన న-న్నరవరుండు, దనకు నిన్నూఱు కాని లే-వనియె హరులు.

క. అన విని మాధవి ఋషి కి, ట్లను నొక్కమహానుభావు - నతులవరమునం
దనయపతి నయ్యె నేఁ గ, న్యన యగుదుం గాన నిమ్ము - న న్నీతనికిన్. 313

వ. ఒక్కసమయంబు సేసికొని యిచ్చి గుఱ్ఱంబులు వచ్చినవి యెల్ల రాఁ బుచ్చికొమ్మనిన గాలవుండు నవ్విధంబునకు సమ్మతించె నపత్యార్థి యై యిక్ష్వాకుండును నయ్యుంకువునకు భార్య యగుట పుత్త్రజన్మావధిగా నొడివి యశ్వంబుల నొసంగి కన్యకం బరిగ్రహించి దానియందు వసుమనస్సుం డనుకొడుకుం బడసి గాలవునకు నమ్మగువను మగుడ సమర్పించినఁ జూచి యబ్బంగిం గలచోట్ల నెల్ల నరసి తురంగంబులం గావించి కొమ్మని యతనికిం జెప్పి సుపర్ణుండు సనియె మఱియు మహీతలంబునం గ్రుమ్మరి యమ్మునికుమారుండు గందువ లెఱింగి పోవం బోవ. 314

క. ఆసమయంబునను దివో, దాసుఁడు నాశీనరుండుఁ - దరుణికి నిన్నూ
ఱేసిహయంబుల నిచ్చి మ, హాసత్త్వుల సుతులఁ బడసి - రధికప్రీతిన్. 315

వ. ఇట్లు క్రమంబునఁ గాశీశ్వరునకుఁ బ్రతర్దనుని భోజపురనాథునకు శిబిం గనిన యక్కన్యకం గొని వెండియు వసుంధరం దిరుగు చుండ గరుత్మంతుండు గ్రమ్మఱ వచ్చి యమ్మునితో నీ వింక జాలింబడ వలవ దొక్కకారణంబున నీరాజులు మువ్వురకు నివ్వాజులు గలిగె నింతియకాని యొండెడ నీచందంబున మొత్తంబు లై దొరక వేర వియ్యాఱునూఱు గుఱ్ఱంబులను గురునకు సమర్పింపు మొక్కటి సెప్పెద విను మని యి ట్లనియె. 316

క. ఈమువ్వుర తెఱంగునఁ దగ, నామునియుం గొడుకుఁ బడయు - నట్లుగ ని మ్మీ
కోమలిని గొంతకు వి, శ్వామిత్త్రున కట్టు లైన సంప్రార్థనతోన్. 317

వ. అని తానునుం దోడు సని యత్తపస్విపాలికిం బోయి యత్తెఱం గెఱింగించి గాలవుం గానిపించి యీతండు బాలుండు నీవు దయాళుండ వితనిం గృతార్థుం జేయ వలయునని ప్రార్థించి పక్షిరా జక్కార్యంబు చక్కంజేసి పోయిన. 318

క. మునివరుఁ డష్టకుఁ డనియెడు, తనయుఁ బడసి శిష్యునకు సు-దతి నొప్పించెన్
వనితయుఁ దపంబు సేయం, జనియెను గాలవున కిట్టి - చరితము గలిగెన్. 319

వ. కావున నెట్టివారికి నిర్బంధము దగదు దుర్మానంబు దుర్దశ నాపాదించు నయ్యయాతి దుర్మానంబునం గాదె పుణ్యలోకపరిభ్రష్టుం డై మాధవీపుత్రు లగు నన్నలువురు దౌహిత్రులకతంబున నూర్ధ్వగతి గనియె న ట్లగుటంజేసి. 320

క. నిర్బంధము దుర్మానము, దుర్బుద్ధికిఁ గాక తగునె - దుర్యోధన నీ
మార్బలమె పాండవులకున్, దౌర్బల్యము వాపు శుభము - దలఁకొను సంధిన్.

వ. కృష్ణునిమాట విని నీ విక్కురువాన్వయంబు రక్షింపు మనియె నివ్విధంబున నమ్మువ్వురుమునీంద్రులు సెప్పినహితోపదేశంబులదెస ననాదరంబు సేసి గాంధారేయుండు రాధేయుం గనుంగొని చే యప్పళించి నవ్వి వీర లింతవెట్టు లగుదురే యని పలికి వారల నవలోకించి. 322

## దుర్యోధనుఁడు నారదాదిమునులమాటలు వినక నిరాకరించుట.

క. మునులార నన్ను విధి యే, మని మును పుట్టించె నట్టు - లయ్యెదఁ గాకీ
వినఁ జవి గానిపలుకులకుఁ, బని గలదే యుడుగుఁ డింక - బహుభాషణముల్.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డమ్మహామునులతో ని ట్లనియె. 324

తే. మీరు సెప్పినబుద్ధులు - గారవమునఁ, జేయఁ గాంచినఁ బుణ్యంబు-సేయ నెట్లు
నాముఖంబునఁ గార్యంబు-నడవ దేమి, సేయువాఁడ నొం డెద్దియుఁ-జెప్ప లేదు.

క. అని యతఁడు శౌరితో ని, ట్లను నిహముం బరముఁ గలుగు - నట్టివిధము నీ
వనఘా చెప్పితి నాకుం, జన వేదియు లేదు దీని - సన్మతి నడుపన్. 326

ఆ. మందబుద్ధి నాదు - నందనుఁ డీవు పో, రానిచుట్టమవు మ - హానుభావుఁ
డవు దయార్ద్రచిత్తుఁ - డవు వీనిఁ దేర్పవే, యనునయించి యెట్టు-లైనఁ గృష్ణ. 327

క. అనిన ముకుందుఁడు దుర్యో, ధనుతో ని ట్లనియె విమల - భరవంశమునన్
జనియించి తెల్లగుణముల, ననూనుఁడవు నీకు నీదు - రాగ్రహ మగునే. 328

చ. తులువలు గాక యిట్టిదొర - దుర్ణయవృత్తికిఁ జొత్తురయ్య పు
త్రులు ననుజన్ములుం జెలులు - దుష్టపథంబునఁ బోవ కుండఁ జూ

ట్టలుఁ దగువారుఁ దండ్రియు నొ - డంబడఁ జేయుము కార్య మల్పబు
ద్ధులవెడమాట లూఁకొనకు - దోసము సేగియు వచ్చు నమ్మెయిన్. 329

క. పాండిత్యశౌర్యనిత్యులు, పాండుసుతులు వారిఁ గూడి - బ్రదుకుట ధృతరా
ష్ట్రుండును బాహ్లికుఁడును భీ ష్ముండు గురుఁడుఁ గోరుతెఱఁగు-సూవె నరేంద్రా.

ఆ. విను మసత్యలోభ-మున సిరి యగునె యాఁ, కొని మునిండి దినినఁ గ్రొవ్వు లావుఁ
గలుగునయ్య శకుని - కర్ణదుశ్శాసన మంత్రితంబు గార్య-తంత్ర మగునె 331

శా. తోడం బుట్టినభీమపార్థులమహా - దోర్దర్పముల్ లాఁతి గాఁ
దో డంచుం బెఱవారి దుర్బలుల నెం - దుం జొచ్చి దైన్యంబునం
గూడం బెట్టెదు నీవ పాండుసుతులం - గుందింపఁగా సత్యముం
బాడిం దప్ప రొకప్పుడుం గినియ రా - బంధుత్వ మే లొల్లవో. 332

ఉ. వారును మీరుఁ బొంది జన - వల్లభు లెల్లను భృత్యభావనం
జేర సమస్తవస్తువులుఁ - జేకుఱఁగా బ్రదు కొప్పఁ గాక నీ
కీరస మెత్తికోల్ గఱపి - యిప్పుడు కార్యము దప్పఁ జూచునీ
వారలు ముట్ట వచ్చిన న - వశ్యము నంతకుఁ జాలరుం జుమీ. 333

ఆ వీర కారు పాండ-వేయులఁ బోర మా, ర్కొన సురాసురులకుఁ-గోలఁది గాదు
గాన వారితోడి-కయ్యంబునకు నిర్గ, యింప వలదు సంధి - పెంపుఁ జేయు. 334

క. ఈయున్న రాజు లందఱు, వాయుసుతున కొక్క యెత్తు-వాఁ డలిగిన శూ
లాయుధుఁడు వడఁకు నాకాం, తేయులతోఁ బొడుచు టుడుగు- ధీరవిచారా.

క. ఒకకార్యము సెప్పెద మీ, సకలబలములంగు సవ్య - సాచి కెదురుగా
నొకరుఁడు గలిగినఁ గయ్యము, నకుఁ బూనుఁడు రిత్త బహుజ - నక్షయ మేలా.

క. పెక్కండ్రు గోవులం గొని, యుక్కు మిగిలి నడవ వెనుక - నుద్దవిడిం దా
నొక్కఁడె నరుఁ డేతెంచినఁ, జిక్కె సమస్తంబు నది ప్ర - సిద్ధమ కాదే. 337

క. తోడుదొన లేనియప్పటి, క్రీడికొలఁది యట్టి దధిప - కినియక విను మేఁ
దోడై రా నెదురుట గడుఁ, గీడు వలవ దుడుగవయ్య - గెలు పరిది సుమీ. 338

తే. అనుజతనుజులుఁ జెలులు వి - య్యములు నడుగు
మాలి పోదురు నీకుఁ గా - మనుజనాథ
దొరకుఁ గులనాశనుం డను - దూఱు మేలె
పాండవులతోడ నొడఁగూడి - బ్రదుకవయ్య. 339

ఉ. రాజ్యముభార మెల్ల ధృత - రాష్ట్రునియంద వెలుంగు చుండఁ ద
త్త్వాజ్యకుమారపట్టమునఁ - బొల్చి చరింపఁగ నీవు పాండవుల్
సజ్యతఁ దండ్రిచిత్తము ప్ర - సన్నతఁ బొందఁగఁ గొల్చి యున్కి సా
మ్రాజ్యముగాఁ దలంతు రను - రక్తమతిం దమకుర్ ధరాధిపా. 340

క. కౌరవనాయక పాండుకు, మారులు నీతోడిపొత్తు - మనియెద మనఁగా
శ్రీ రా మోఁకా లొడ్డిన, వారివిధమ కాదె నీవు - వల దను టెల్లన్. 341

## భీష్మద్రోణులు దుర్యోధనునకు హితంబు సెప్పుట.

చ. అన విని భీష్ముఁ డి ట్లనియె నాధృతరాష్ట్రతనూజుతోడ నీ
జనకునిమాట పట్టుము ప్ర - సన్నమతిన్ మననంశ మెల్లఁ బా
వనముగ నిందు వచ్చి బుధ - వత్సలుఁ డీహరి యిట్లు సెప్పఁగా
వినమిఁ గడుం జెడుందెరువు - వీరలపం పొనరింపు పెంపుగన్. 342

క. మానక ధృతరాష్ట్రుఁడు ప్రా, ణానం గలుగంగ బంధు - నాశము రాజ్య
శ్రీనాశము నుద్ధామయశో, నాశముఁ జేయ నేల - చూచెదు చెపుమా. 343

వ. కృష్ణార్జునులతోడివిరోధం బీబంధులోకంబునక కాదు లోకంబున నెవ్వారికినిం జూడం బోలదు లోకంబులు రెంటికిని హానిం జేయక కూడి బ్రదుకుట మే లనినఁ దదనంతరంబ ద్రోణాచార్యుండు దుర్యోధనున కి ట్లనియె. 344

తే. పితృపితామహగురుల మై-ప్రీతిఁ గోరు, చున్న యట్టిమాపరమహి - తోపదేశ
వాక్యములు విని దుర్జన-వచనరచనఁ, గొనక బంధులతో నొడఁ-గూడి మనుము.

ఉ. వెన్నుఁడు ప్రీతిఁ జెప్పినస - విస్తరవాక్ప్రచయంబుత్రోవఁ బో
వన్న కుమార య ట్లయిన - నాయువు శ్రీయును నీకుఁ గల్గు మా
కన్నులు సల్లగా నకట - గన్గొను చుండుదు మేము నట్లు గా
కున్నను నీవ నేర్తు నిను - నొం డన నేరము నిందుకొల్వునన్. 346

చ. అనవుడు నాంబికేయుఁడు ని - జాత్మజుదిక్కు మొగంబు సేసి యి
ట్లను హరి నాశ్రయించి భవ - దగ్రజుఁ బుణ్యు నజాతశత్రునిం
గను మట వోయి దీన మన కార్యము లన్నియుఁ సిద్ధిఁ బొందు నీ
తనిపలు కాదరింపమిఁ బ - దంపడి పాటిలు నెల్లచేటులున్. 347

వ. అనియె నట్టియెడ గురుభీష్ము లొత్తి చెప్పం దలంచి గాంధారేయున కి ట్లనిరి. 348

క. ఈకృష్ణునిసారథ్యము, నాకృష్ణునిగాండివంబు - నై తోడ్పడక ము
న్నీకొలఁదిఁ జక్కఁబడి నీ, వీకురువంశంబు గావు - మిభపురనాథా. 349

వ. అని పలికి మఱియు. 350

సీ. ధర్మపుత్త్రునిపద - ద్వయమున కతిభక్తి, నెఱఁగిన నతఁడు ని - న్నెత్తి గ్రుచ్చి
నిడుఁగేలఁ బెద్దయుఁ-దడవుగాఁ గౌఁగిలిం, పఁగ భీముఁడును నీవుఁ-బరమహర్ష
మునఁ జారుతరవక్షు-ములు సంగతములు గాఁ, బరిరంభణం బొన-ర్పంగ నరుఁడుఁ
గవలును మ్రొక్కినఁ-గర మర్థిఁ దిగిచి నీ, వాలింగనంబు సే యంగ నిట్లు
వారు మీరును దగ బాంధ-వమునఁ బొదలి, యింపు దళుకొత్తఁ దామర-తంప రైనఁ
జెలులుఁ జుట్టలుఁ గలసి పే రెలమిఁ బొంది, యుల్లసిల్లంగఁ గుల మెంత-యొప్పునొక్కొ.

క. సమరమునకు వచ్చినభూ, రమణు లుభయకటకములను - బ్రమదం బెసఁగం
దమతమపురములకుం బో, వ మహీజను లెట్టియుత్స-వముఁ బొందుదురో. 352

వ. అని వెండియు ననేకవిధంబులం జెప్పి యీరెండుదెఱంగులవారును బంచి కుడిచి సుఖం బున్న నఖిలభూప్రజకును బ్రమోదం బగుం గావున నట్లు సేసి యందఱ చేత దీవనలు వడయు వయ్యా నీ వనిన విని దుర్యోధనుం డప్పుండరీకాక్షు వీక్షించి యి ట్లనియె. 353

క. గురుఁడును బితామహుఁడు నీ, నరనాథుఁడు నెల్లప్రొద్దు - నను దూఱుదు రి
ప్పురుసున నీవును దామో, దర దూఱెదు గాని తెగవుఁ దలఁపవు కంటే. 354

క. వనితం బఱిచి రరణ్యం, బున నిడుములఁ బడితి మనుచుఁ - బోటరు లై చం
పను జెఱుపఁ దలఁచి మాదెసఁ, గనలుదు రప్పాండుసుతు ల-కారణమ కడున్.

మ. అరయం దప్పొకయింత నావలన లే - దాధర్మపుత్త్రుండు జూ
దరివెంటం దమకించి సౌబలునిచే - తన్ భూమి గోల్పోయి ము
ష్కరుఁ డై వెండియు నొడ్డఁగా నతఁడు న - క్షప్రౌఢిమై గెల్చె నే
తెరు వైనం దనయిచ్చ తోఁ బడియె నిం - తే కాక యేఁ బూఁటయే. 356

తే. మాత్స్యపాంచాలపాండ్యాది - మనుజపతులఁ
గూర్చికొని తార కయ్యంబు - గోరి యెత్తి
విడిసి రింతియ కాక యి - వ్విధము నుగ్ర
కర్మమున కేము దొడఁగుట - గలదె చెపుమ. 357

క. ఉక్కఱి సురపతి కైనను, మ్రొక్కము నృపధర్మ మూఁది - మొనతలఁ బడినన్
మిక్కిలిపేరును నిట దివి, నక్కజముగఁ బెంపుఁ బడయ - నగుట నుపేంద్రా.

చ. చిఱుతతనంబునం దగవు - చిత్తమునం దలపోయ లేక ముం
దఱ యటు వోవ నిచ్చితిఁ బి - తామహుఁడుణ్ జనకుండు నింకఁ గ్ర
చ్చఱ నిలఁ బంచి చక్కసగ - మక్కడ నెవ్వరికేని మద్బలం
బెఱుఁగక యీఁ దలంచినను - నే నది యేటికి సమ్మతించెదన్. 359

తే. తొంటిచవి గని యిప్పుడుఁ - దోఁచి పాండు
సుతులు రాజ్యంబు సేయంగఁ - జూచుకలుచ
నాకు నీఁ దీఱునే యింక - నాఁటిచూఱ
లెక్కడివి ద్రోణభీష్మ లీ - దిక్కు సుమ్ము. 360

ఉ. ఏమను వారుఁ బంచికొని - యేలుట గిల్గదు పల్కు కుండు మిం
కేమియు వాఁడిసూదిమొన - యించుక మోపినయంతమాత్రయుణ్
భూమి యొనర్చి పాండునృప - పుత్త్రుల కిత్తునె యెవ్వ రైన సం
గ్రామమునణ్ జయంబు గొని - రాజ్యము సేయుట నిశ్చయించితిన్. 361

తే. అనిన విని కిన్కఁ బూనిన - యలఁతినగవు
చెలువు మొగమున కొకక్రొ - త్త పొలు పొనర్పఁ
బుండరీకాక్షుఁ డగు ఱెల్లఁ - బోయి యప్పు
డరుణకమలాక్షుఁ డగుచు ము - రాంతకుండు. 362

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో ము న్నతండు సేసిన
దుర్ణయంబు సెప్పుట.

క. మొనతలఁ బడియెదు నీచె, ప్పినయట్లుల తడవు లేదు - బిరుదుల రై నీ
వును వీరు నిలువుఁ డిదె భం, డన మెల్లియ వచ్చె నూఱ - టలు గనుఁ డింకన్.

సీ. అరయంగఁ దప్పు లే - దంటి నీవలనఁ గీ, డొకనాఁడు సేసియు - నొక్కనాఁడు
సేయవె నీజనిం - చినయది యాదిగా, నుడుగక పాండవే - యులకుఁ జాల
నెగ్గు సేసితి విష - మిడి పెనుఁబాములఁ, గఱపించి నీరిలోఁ - గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి - పెక్కుభంగులఁ జంపఁ, దలఁచినఁ జావక - ధర్మరక్షఁ
జేసి నెగడి రాచ - సిరి నొంది యున్నఁ జూ, పోప కీవు తీవ్ర - పాపబుద్ధిఁ
గనమి జూద మొకటి-కల్పించి కపటంబు, సేయ దాన నెల్ల - చేటుఁ బుట్టె. 364

తే. అన్నదమ్ములు నెత్తంబు - లాడి సతుల, తలలు వట్టి సభాస్థలం - బులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టి-వారి నెందుఁ, దడవుమా నీ వొకండవు-దక్కనధిప. 365

ఉ. అప్పుడు నీవుఁ గర్ణుఁడును - నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెదునట్టివే కులము - శీలముఁ గల్గినపుణ్యకాంత క
ట్లొప్పమి సేయ నెల్లఁ గని - యున్నజనంబులు వించు నుండఁగాఁ
ద ప్పాకయింత లే దనువి - ధం బది నీక చనుం గుమారకా. 366

తే. ఎత్తి విడిచినవా రని - యెల్లతప్పుఁ, బాండవులమీఁదఁ బెట్టిన - బ్రదుకు గలదె
ద్రోణభీష్ములు దండ్రియు - దోడుతోడఁ, జెప్పతగుమాటలేమియుఁ-జెవులుసొరవు.

క. శాంతిం బొందుట నీకుం, గుంతీపుత్త్రులకు మే ల - గుణ్ దానిక యే
నింతయు నాడెద నది నీ, కెంతయు రుచియింప కునికి-యెఱిఁగి యెఱిఁగియున్.

వ. అని యిట్లు నారాయణుండు నానాప్రకారంబులం జెప్పుటకుఁ గటకటం బడి
యెదుదుర్యోధనునకు దుశ్శాసనుం డి ట్లనియె. 369

మ. జనకుండున్ గురుభీష్ములుం దగినక - ర్జం బొప్పు లై నీకుఁ బ్రీ
తి నెఱింగించు తెఱంగు గాదు తమబు - ద్ధిం బోయి సంధాన మి
ట్లొనరం జేయక యున్నఁ గృష్ణునకు ని - న్నొప్పించువా రింతవ
ట్టు నిజం బిచ్చుట నింక నీయునికి నె - ట్లుం గీడు పుట్టుం జుమీ. 370

ఆ. అనిన బాహ్లికాదు-లగుకురువృద్ధుల, నాత్మజనకుఁ గృష్ణు - నాదరింప
కతఁడు రాజసమున - నప్పుడు దిగ్గన, లేచి పోయె సంచ - లించెఁ గొలువు. 371

తే. అతనివెనుకన కర్ణుండు-ననుజగణము, శకునియును వారిపొం దైన-జనపతులును
బోయి సమ్మెయిఁ జని యొక్క-ప్రోవు గట్టి, వేఱ యఁతంత యుండిరి-గోలెడమున.

వ. ఇ ట్లున్నం గనుంగొని గాంగేయుండు. 373

చ ఇగెఁ డిది యేల క్రొవ్వి ధర - ణీశుఁడ నంచు వృథాభిమాని యై
మతి సెడి లోభమోహమద - మత్సరముల్ దనుఁ ద్రిప్ప ని ట్లసం
గతమునఁ బోయె వీనివెను - కం జని రేమి దలంచియో మహీ
పతులను వీరు గొంద ఱతి - భారపుమానుసు లేమి సేయుదున్. 374

తే అని జనార్దనుఁ గనుఁగొని-యకట కాల, పక్వ మయ్యె నీనరపతి ప్రతతి యెల్ల
ననుడుఁ దగువారి దనఁ గల-యంగఁజూచి, తగవు మెయి నిట్టు లనియె న-న్నగధరుండు.

శా. ఈదుర్యోధనుఁ డింతగర్వి యగు నే - యీయున్నవా రెల్ల నా
చే సైన్యంబునఁ బొందు టొప్ప దని చ - ర్చింపండ యీభంగికిన్
లేదే యొండుదెఱంగు సత్కులముఁ బా - లింపంగ నర్జింప రా
దే దుష్టాత్మకు నీచు నొక్కరునిఁ బో - దే భేద మీజాతికిన్. 376

ఉ. కంసుఁడు నిట్ల తండ్రిమది - గందెసుచుండ మొనర్చి ధర్మవి
ధ్వంసము సేసినం గులము - వారలు నా కెఱింగింప నేను దు
ర్మాంసము గోయువైద్యునిక్ర - మంబున నాతనిఁ ద్రుంచి యన్వయో
త్తంసముఁ జేయనే జనకుఁ - దద్విధ మొప్పదె మీరుఁ జేసినన్. 377

ఆ. అంతతోడ నెల్ల - యాపదలును దీఱు, వంశ మధికగౌర - వంబు నొందుఁ
గూడి మనుట గలుగుఁ-గురుపాండవులకు ని, త్తెఱఁగు సూడ మీకు-నుఱవకాదె.

వ. అనిన విని ధృతరాష్ట్రం డదరిపడి విదురున కి ట్లనియె. 379

ఆ. బుద్ధిమంతురాలు - పొందుగఁ బలుకంగ, నేర్చు వచ్చి కొడుకుఁ - దేర్చి పోవుఁ
గాన వేగ నీవు - గాంధారిఁ దోడి తె, మ్మనుడు నరిగి యతఁడు - నట్ల చేసె. 380

వ. అద్దేవియు. 381

క. చనుదెంచి యుచితపీఠం, బున నున్నం గురువిభుండు - పొలఁతుకతో ని
ట్లను నీతనూభవుఁడు దు, ర్వినయంబునఁ జనియె నిట్టి - వెంగలి గలఁడే. 382

క. నీ వైనఁ జెప్పి శాంతుం, గావింపఁగ నోపుదేని - కౌరవకుల మీ
గోవిందుశాసనము సం, భావింపం గాంచి చెడక - బ్రదుకుం జుమ్మీ. 383

తే. అనుడు నీపుత్త్రుఁ డవినీతుఁ-డగుట యెఱిఁగి, యెఱిఁగి వానివశంబున- నేల పోయె
దీవు పాండవులకు నేమి-యిచ్చితేని. యడ్డపడ నెవ్వరికి వచ్చు - నధిప చెపుమ.

క. అని గాంధారి పతియుఁ దా, నును విదురుం బనిచె నంద - నుం బిలువ నతం
డును మొగము జేవుఱింపఁగఁ, జనుదెంచెను సభకు విదుర - సంప్రార్థితుఁ డై.

వ. మున్ను దనతోడం జనినవార లందఱు నచ్చోటన నిలువ నిట్లు వచ్చి సుయోధనుండు నిజాసనాసీనుం డై యున్నఁ జూచి తల్లి చిత్తంబున గర్హించుచు నతనికి ధర్మంబును నీతియును జుట్టఱికంబును బ్రదుకుఁదెరువును నిజశక్తియు సహాయంబుకొలందియుఁ గులజనచిత్తప్రకారంబును బాండుపుత్త్రులబలపరాక్రమంబులుఁ దెలియునట్లుగాఁ దెలుంగుపడం జెప్పి బుజ్జగించియుం గినిసియు ననేకవిధంబుల నాడిన నమ్మాటలదెస ననాదరంబు సేసి యుద్ధతిం గ్రమ్మఱం జని యతండు కర్ణాదులం గలసి వారునుం దానును దుర్మంత్రంబునకుం జొచ్చి. 386

## దుర్యోధనాదులు శ్రీకృష్ణునిం బట్టికొని చెఱం బెట్టఁ దలంచుట.

క. హరితలఁ పొప్పదు భీష్ముని, గురునిం గూర్చికొని మనలఁ - గ్రొవ్వఱఁ బట్టం
గర ముత్సహించు చున్నాఁ, డరయ నతనివచనరచన - నంతయుఁ దెలిసెన్. 387

క. మును దాఁ గంసునిఁ బరిమా, ర్చినచందము వారి కెల్లఁ - జెప్పెడుఁ దనకున్
మును మనము గడఁగి వెసఁ బ, ట్టినఁ గార్యం బగుఁ జలంబు - డింపకుఁ డింకన్.

తే. పట్టి యీతనిఁ జెఱఁ బెట్టి - పాండవులకు, దిగులు పుట్టింత మంతటఁ - దెగక యెత్తి
వచ్చిరేనియు నిర్జింప - వచ్చుఁ గోఱ, లెల్లఁ బుచ్చిన నురగంబు - లేమి సేయు. 389

వ. అని విచారించె నిట్లు దుష్కార్యాలోచనంబు సేసి దుర్యోధనదుశ్శాసనశకునికర్ణులగుదుష్టచతుష్టయంబు మొదలుగాఁ గలయవినీతులు దైతేయమర్దను మర్దింప నిశ్చయించి రయ్యవసరంబున. 390

చ. అడఁకువ లేమి నక్కి యుఱి - యాడుట నొండొరుఁ గూడ కుండుటన్
బుడిబుడి మాటలాడుటను - బోవుచు వచ్చుచుఁ గ్రందు గ్రమ్మఱం
బడుటను దెల్ల మైన మును - పన్నుగఁ దాఁ బరికించి యున్కి న
ప్పుడు హరిఁ బట్టుసంకులము - పుట్టుట సాత్యకి నిశ్చయించుచున్. 391

తే. బఱటి కొనిపోయి కృతవర్మఁ - బన్నఁ బనిచె. నీవు బలమును వాకిట - నిలువు మేను
లోపలికి నెల్లఁ జాలుదుఁ - బాపబుద్ధు, లన్న దెసఁ జెప్పి రని నిర్భ - యమునఁ జెప్పె.

వ. ఇట్లు పరమాప్తుం డగుహార్దిక్యు నటఁ బుచ్చి సాత్యకి సత్వరంబుగాఁ జనుదెంచి జనార్దనునకు నత్తెఱం గెల్ల నెఱింగించి తదనుమతిం గౌరవేశ్వరబాహ్లీకభీష్మవిదురులతో ని ట్లనియె. 393

మ. అదె కౌరవ్యు లశక్తదుర్జనతఁ జే - యం బూని పై బాఱఁ జూ
చెద రస్మైడమచేతఁ దీఱునె జయ - శ్రీకాంతు దైత్యాంతకుం
బోదుసం దారు దలంచు టెల్ల ననలం - బుం జీర బంధింపఁగా
మది నూహించినయట్ల కాక తమదు - ర్మంత్రంబులం బోవునే. 394

వ. అనిన విదురుం డదరిపడి వైచిత్రవీర్యున కి ట్లనియె. 395

ఉ. భూవర నీతనూభవులు - పుణ్యు నగణ్యపరాక్రమున్ హరిం
గేవలమర్త్యుఁ గాఁ దలఁచి కిట్టినఁ బట్టినఁ దారు మంటపై
వావిరిఁ గ్రమ్ము నాశలభ - వర్గముచాడ్పున గ్రుంది పోరె కా
లావధి యయ్యెఁ గావలయు - నక్కట వారికి వారివారికిన్. 396

ఎ. అనుటయు గోవిందుం డందఱు విన నంబికానందనున కి ట్లనియె. 397

ఉ. రోషము నాపయిం గలిగి - క్రూరతఁ గౌరవు లింత సేఁత సం
తోషము నీవు ప్రాభవము - తోఁ దగ నాకు ననుజ్ఞ యిమ్ము ని

ర్ద్రోషత నేను నోపుగతి - దోర్బలదుర్జయు లైనవారి వి
ద్వేషముఁ జక్కఁబెట్టి జగ - తీవర యింతక పోయి వచ్చెదన్. 393

క. అనుడు ససంభ్రమముగ న, జ్జనపతి దుశ్శాసనాది - సకలపరిజనం
బును నాదుర్జనునిం దో, డ్కొని రమ్మని విదురుఁ బనుచు - డుం జని యతఁడున్.

వ. సపరివారంబుగా దుర్యోధనుం దోడ్తెచ్చినం జూచి యతనికి ధృతరాష్ట్రుం డిట్లనియె.

చ. అలవి యెఱుంగ కిట్లు దను - జారికిఁ గీ డొనరింప నీవు నీ
తులువలు నుత్సహించితిరి - దుర్మతులార సమీరు మీకుఁ జోఁ
కలవడి పట్ట వచ్చునె మ - హాద్రిఁ గదల్పఁగఁ బోలునే దవా
నలుఁ జమరంగ శక్యమె వి - నాశముఁ బొందెద రేమి సేయుదున్. 401

ఆ. అనిన విదురుఁ డిట్టు - లను సుయోధనుతోడ, బాలకేళిఁ దొడఁగి - లీలఁ గృష్ణుఁ
డెచట నెచట నెవ్వ - రెవ్వరి నేమేమి, సేసె వినవె యేల - చెడియె దిట్లు. 402

వ. అనియె నట్టియెడఁ గట్టెదుర నున్నయక్కురుపతికుమారుం జక్కం జూచి యే నొక్కరుండన యని తలంచియె దుర్మదంబునం బొదివి పట్ట నుత్సాహంబు సేసి తనుచు దరహాసంబు సేయువాసుదేవునిఫాలప్రదేశంబున బ్రహ్మయు వక్షంబున విరూపాక్షుండును వదనంబున వహ్నియుఁ బార్శ్వంబుల నింద్ర యమ వరుణ కుబేరులు నాదిత్యమరుద్విశ్వదేవాశ్వినులు నుద్భవించిరి హలగాండీవమండిత బాహు లగుబలదేవార్జునులు సవ్యదక్షిణభుజంబులను నిజాయుధహస్తు లగు యుధిష్ఠిరభీమనకులసహదేవులు వీఁపునను వివిధ ప్రహరణపాణు లగుయదువృష్ణిభోజాంధకవీరు లూరులను బ్రభవించిరి జనితనానాహస్తవిన్యస్తంబు లయి శంఖచక్ర గదాఖడ్గశక్తిశార్ఙ్గప్రముఖనిఖిలసాధనంబులు వెలింగె నేత్రశ్రోత్రనాసావివరంబుల సధూమధూమకేతుజ్వాలాజాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణ నిభ ప్రభలువెడలె నిట్లు దుర్నిరీక్ష్యం బగునత్తేజోరూపంబుఁ గనుంగొనం గొలఁది గాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి యద్భుతభయానకరసంబుల జొత్తిల్లు చిత్తంబులతోడం గదల కుండ నప్పుండరీకాక్షుండు నారదాదిమహామునులవలనను భీష్మవిదురద్రోణసంజయులయందును గరుణాతరంగితం బగుకటాక్షవీక్షణంబొలయ వారలకు దివ్యదృష్టి యొసంగిన నాపుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలు చుండి రయ్యవసరంబున. 403

తే. దేవదుందుభివ్రాతంబు - దివి రెఁ గల్ప, వృక్షపుష్ప ధారామయ వృష్టి గురిసె
సిద్ధసాధ్యవిద్యాధర - శ్రేణి భక్తి, నిచ్చజయజయశబ్దంబు - లెసఁగెఁ జదల. 404

వ. అప్పుడు ధృతరాష్ట్రుం డమ్మహాసంకులంబు విష్ణునిదివ్యవిజృంభణంబు గావలయునని యూహించి. 405

క. కరుణింపుము సంశ్రితభయ, హరణధురీణా సహింపు - మజ్ఞానంబుల్
శరణంబు వేఁడెద భవ, చ్చరణంబులు గనుఁగొనం బ్ర - సాదింపఁగదే. 406

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు - నప్పరమేశ్వరుఁ డిచ్చె దృష్టి య
జ్జనపతి కద్భుతం బడర - సమ్మదపూరము గ్రమ్మ నాతఁడుం
గనుఁగొని భక్తి మ్రొక్కి నినుఁ - గంటిఁ గృతార్థుఁడ నైతి నింక నొ
ల్ల నొరులఁ జూడ లోచనము - లం బురుషోత్తమ సంహరింపవే. 407

క. అనినపలుకులకు నచ్చటి, జను లెల్ల నృపాలు సితవి - శాలాక్షుఁ గనుం
గొను చుండి రపుడు దమనె, మ్మనమ్ము లాశ్చర్యరసని - మగ్నంబులు గాన్. 408

వ. తదనంతరంబ దామోదరుండు ధృతరాష్ట్రు నభిమతం బొడఁగూడ నతనికన్ను లెప్పటియట్ల కావించి నిజవిశ్వరూపప్రపంచంబు నుపసంహరించి మునీంద్రుల నామంత్రణంబు సేయ నమ్మహాత్ము లంతర్ధానంబుసేసిరి. తానును సముత్థానంబుసేసి యంతకు మున్న సన్నిహితు లై యున్న కృతవర్మకరంబును సాత్యకిహస్తంబును నవలంబించి యూరక వెడలెఁ గృష్ణుం డత్తెఱంగున వెడలిన విస్మిత యై గాంధారి యభ్యంతరమందిరంబున కరుగం గౌరవు లెల్లను బంధుమిత్త్రసహాయసహితంబుగాఁ దనతోడన వెడల మొగింబు గంటు వెట్టికొని కక్ష్యాంతరంబులు గడచినప్పుడు దారుకుండు తేరినొగలపై నుండి పొడసూపి కేలు మొగిడ్చి ఫాలభాగంబునం గదియించినం దత్ప్రదేశంబున నిలిచి వారల దెస మరలి చూచి మీ రింక నిలువుం డని పలికిన నాంబికేయుండు పుండరీకాక్షుం జేరి నిజతనూజుల నుపలక్షించి. 409

ఉ. వీరును బాండుపుత్త్రులును - వేరము దక్కి పొసంగి మన్కికై
పోరిత మాడి యే నటులు - బుద్ధులు సెప్పినభంగియుం గులా
చారము నిర్వహింపఁ బలు - చందములం దగ దుఃఖపాటు నీ
కౌరవజాతికిం దెలిసెఁ - గాదె గదాధర నీదుసన్నిధిన్. 410

వ. అని వెండియు. 411

తే. నీకు శుద్ధుండ నగుటయు - నిఖిలబంధు, మిత్త్రగురుజనకోటికి - ధాత్రి కెల్ల
నంబుజాక్ష నిర్దోషుండ - నగుట గాన, నాతెఱంగు నీవెఱుఁగుట-నాకుఁ జాలు. 412

వ. అనిన విని యచ్యుతుండు బాహ్లీకభీష్మద్రోణకృపప్రముఖనిఖిలవిశిష్టజనంబుల నాలోకించి. 413

తే. ఇప్పు డీసభఁ బుట్టిన - యింతవట్టు, మీకుఁ దెల్లంబు గాదె యీ - మేదినీవి
భుండు దా నేమిటికిని ము - ఖ్యుండఁ గాను, దప్పు దనదెస లేదని - చెప్పి విడిచె.

వ. కావున నాకు నియ్యెడం దడయం బని లేదు పోయి వచ్చెద ధర్మపుత్రునకు నింత వృత్తాంతం బెఱింగింప వలయు నని పలికి వారల నామంత్రణంబు సేసినవాఁ డై రథారోహణంబు సేసి ధృతరాష్ట్రుండును నచటిజనంబులును వెనుకం జనఁ జని కుంతీగృహద్వారంబున నరదంబు డిగ్గి. 415

క. వా రందఱుఁ దనతోడన, గారవమున నరుగుదేరఁ - గాఁ జొచ్చి మహో
దారుఁడు గుంతీచరణాం, భోరుహముల కెఱఁగి వినయ - భూషణుఁ డగుచున్. 416

క. కౌరవసభఁ దా నాడిన, గౌరవవాక్యములుఁ గార్య - ఖడ్గక్రమవా
క్పారములు సుయోధనుదు, ష్ప్రారంభము నల్పవచన - పద్ధతిఁ జెప్పెన్. 417

వ. ఇట్లు ధృతరాష్ట్రుకొలువునం బుట్టినవిశేషంబులు పాండురాజమహిషి కెఱింగించి మాధవుండు మఱియును. 418

తే. కురుకుమారులు దమయంతఁ - గుడిచి క్రొవ్వి, మీఁ దెఱుంగరు మాకేమి - మేలకాక
నాలుకలు గ్రోయ నర్జునా - నలము దగిన, యెరగొనం గని సంతృప్తి-యొసక మెసఁగు.

వ. పాండుకుమారులపాలికిం బోయి వచ్చెద వారికిం దగినబుద్ధు లానతి మ్మనిన నద్దేవి విక్రమోపజీవిత లయినముచుకుందుండును సృంజయుండును నను తొంటినరపతుల చరిత్రంబులు సెప్పి యుధిష్ఠిరుండు వీరిని వినండో కాక యని పలికి యెల్లవారును విను చుండ వెండియు ని ట్లనియె. 420

ఉ. రాజుల కెందు నారయఁ బ - రాక్రమజీవనవృత్తి దక్క నొం
డోజ నిషిద్ధ మంద్రు మును - లుత్తమసత్త్వులు వంశధర్మముల్
పూజితభంగిఁ జేయుదురు - బుద్ధివిహీనులు వానిఁ దక్కి ని
స్తేజపుఁగూటి కియ్యకొని - దీనతఁ బొందుదు రంబుజోదరా. 421

క. నీవియ్యంబులు సంధియు, కావింపం బడిరి వీరిఁ - గలయుట కష్టం
బావెరవు దప్పుటయు మే, లై వచ్చెం బొమ్ము విడుపు మనుమానంబున్. 422

మ. నిజవంశోచితవీరవృత్తమున కు - న్మేషంబుగా నాకపి
ధ్వజుఁ డుత్సాహము సేయ కున్న నకటా - దైన్యంబు వాటిల్లదే
భుజదర్పోద్ధతుఁ డైనభీమునకు నీ - పొం దొప్పునే నీవు స
ర్వజగన్నాథుఁడ విందు రాఁ దగునె దై - వం బిట్లు దప్పించునే. 423

వ. అని యంత నిలువక గొంతి యి ట్లనియె. 424

క. మఱచిరె కొలువున ద్రౌపదిఁ, బఱచినబన్నంబు ధర్మ - పథము దొఱంగన్
వెఱచుట కప్పటి కది దగుఁ, జెఱచినచో వెదక వలదె - చిరతరకీర్తిన్. 425

## శ్రీకృష్ణుఁడు కర్ణునిఁ దనరథం బెక్కించుకొని కొన్ని రహస్యోక్తులు వలుకుట.

వ అని పలికి పుండరీకాక్షుం గౌఁగిలించికొని యచ్యుతుండు మ్రొక్కిన దీవించి యేను సుఖం బున్నదాన నని పాండవులకుం జెప్పుము చేతులలావునం గనినజీవనంబున బ్రదుకుం డనుము పోయి రమ్మని వీడుకొల్పిన సింహగమనసుందరంబుగా వెడలి తనతోడన కదలి వచ్చినధృతరాష్ట్రాదుల నిలువం బనిచి రథారోహణంబుసేసి గోవిందుండు కర్ణుదెసం గనుంగొని న న్ననిచి వత్తు గాని ర మ్మని కరఁబు సాఁచి చెయి పట్టి తనయరదం బెక్కించికొని సాత్యకి వేసరి నెక్కి కెలనం జనుదేరం గదలి చని యనుప వచ్చినకృతవర్మ నుచితప్రకారంబున సస్నేహంబుగా నిలిపి యరుగునవసరంబునం బౌరలోకంబు. 426

ఉ. అక్కట వాసుదేవుపను - పాదరణంబునఁ జేయ రైరి వీ
రెక్కుడిబుద్ధిమంతు లని - నిందును నందును లోక మెల్లఁ బే
రుక్కున మ్రుగ్గుటం దలఁప - నొల్ల కపాయము సేసి రట్టె యీ
యుక్కివు లెంకునుం గలరె - యొప్పరు వో ధృతరాష్ట్రనందనుల్. 427

వ. అని మఱియు ననేకు లనేకప్రకారంబులం బలుకుచు నిరుగెలంకులం జూచుచుండఁ బుండరీకాక్షుండు పురంబు నిర్గమించె నిట ధృతరాష్ట్రుండును మగిడి కొలువు కూటంబునకు వచ్చి యొప్పటివారలు పరివేష్టింప నుండి కృష్ణునివలనిమాటలాడు చున్నసమయంబున సుయోధనుతో భీష్మద్రోణు లి ట్లనిరి. 428

చ. పలుకునె యిట్లు గొంతి విని - బమ్మెరపోయితి మింతబెట్టిదం
బు లగునె మాట లయ్యమయుఁ - బుణ్యుఁడు గృష్ణుఁడుఁ గార్యవాదముల్
పలికెడువార లిట్లు దెగఁ - బాతెరి ధర్మజవారిరాశికిం
జెలియలికట్ట వాసె మన - చే నగుకర్జముచంద మెట్టిదో. 429

వ. అని పలికి వెండియు. 430

శా. మాకుం జూడఁగఁ బోలుకార్య మిది ధ - ర్మప్రీతి నీ వేగి ను
శ్లోకుం దైనయుధిష్ఠిరుం గని జన - స్తుత్యంబుగా శాంతిమై
నీకౌరవ్యుల నెల్లఁ గాచికొనవే - యే పొప్ప దెందుం దుదిన్
శోకం బొందక వేగమైఁ గదలి కృ - ష్ణుం గూడఁ బోవే నృపా. 431

వ. అనిన విని దుర్యోధనుండు మొగంబు రాఁజ చుండ నూర కుండె గాంగేయుండును గురుండును దిగ్గన లేచి యతని నవలోకించి. 432

క. కురునృప వినుము సంసారము, దరి ద్రొక్కినవార మింకఁ - దలఁకెదమే సం
గరమునకు నేము నీకై, పొరలితి మె ట్లైన నగును - బోయెద మనుచున్. 433

క. అరిగిరి రాజును నభ్యం, తరమునకుం జనియె రాజ - తనయుండు బహిః
పరివారముఁ బో మ్మని మిత, పరిజనుఁ డై యేగె నాత్మ - భవనంబునకున్. 434

తే. అంత నక్కడ నచ్యుతుఁ - డరిగి యరిగి, యధికసంప్రీతి దలకొన - నర్కతనయు
నాననంబు వీక్షించి యి - ట్లనియె నెమ్మి, నన్యు లెవ్వరు విన కుండ - నతనితోడ.

సీ. నీవు వృద్ధజనోప - సేవివి ధర్మసం, వేదివి తెలియుంగ - వినుము సిద్ధ
మంత్రబలంబున - మార్తాండువరమునఁ, గన్నియతటి గొంతి - గన్న వాఁడ
వగుటఁ బాండునృపాలు - నగ్రసుతుండవు, ధర్మమార్గం బిది - ధర్మతనయుఁ
డాదిగాఁ గలతమ్ము - లందఱు నాచేత, నెఱిఁగి నీయడుగుల - కెఱఁగి సకల
పుత్త్రమిత్త్రబంధు - భూరిసేనాసమ, న్వితము గాఁగఁ గొలిచి - నిన్ను రాజ్య
భారవహనమునకుఁ - బట్టంబు గట్టె ను, జ్జ్వలుఁడ వగుదు రమ్ము - వారికడకు. 436

వ. ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు నీవు దొలుత వెడలునప్పటి మహోత్సవంబునకు యువరాజై యుధిష్ఠిరుండు నీరథంబున నుండి నీకు ధవళ చామరంబులు వైచు వాయుపుత్త్రుండు సితచ్ఛత్త్రంబు పట్టు సవ్యసాచి సారథ్యంబు సేయు మఱియుఁ బాంచాలయాదవపాండ్యమాత్స్యులు లోనుగాఁగల రాజలోకంబుతోడఁ గవలు నభిమన్యుప్రభృతికుమారులు బెరయ నే మెల్లం బలసి పరివేష్టించి వత్తు మిట్టిమహేంద్రవిభవంబున మహనీయుండ వగుచు మహీచక్రం బేలు మని చెప్పి మఱియును. 437

క. పాంచాలరాజపుత్త్రియు, నంచితముగ నిన్నుఁ బొందు - నార్వురపరుసన్
సంచితపుణ్యుఁడ వీ వొక, యించుకయును వేలు సేయ - కేతె మ్మెలమిన్. 438

వ. ఇ ట్లైనఁ గుంతికి సమస్తబంధుమిత్త్రులకుఁ బ్రియం బగు ననిన విని రహస్యంబుగా రాధేయుండు మాధవున కి ట్లనియె. 439

## కర్ణుఁడు శ్రీకృష్ణునకుఁ దగినయుత్తరంబు లిచ్చుట.

చ. వెడవెడ యేనుఁ దొల్లి యిది - వింటి ననుం గని కుంతి యొంతయుం
జెడ నది వైచి పోయెఁ గృపఁ - జేకొని సూతుఁడు దెచ్చి తాను మన్

కొడుకులఁ గాన కున్కిఁ బ్రియ - కుం దగ నిచ్చినఁ జేఁపెఁ జన్ను ల
ప్పడఁతియు నప్పు డాదిగ శు - భస్థితిఁ బెంచెఁ బ్రయత్నశీల యై. 440

క. మూత్రపురీషాదులు దమ, గాత్రములం దింక వారు - గారవ మెసఁగం
బుత్త్రుం డని సంవర్ధిత, గాత్రునిఁ గాఁ జేసి రింత - కాలముఁ గూర్మిన్. 441

క. నేఁ డింక నెఱిఁగి యొరువుల, వాఁడఁ గదా యనుచు నేను - వారిఁ దొఱఁగినం
బోఁడిమి సెడదే మదిఁ గడు, వాఁడి గలదె నీకు నకట - వారిజనాభా. 442

వ. వృద్ధోపసేవనంబును ధర్మసంవేదనంబునుం గలవాఁడ వని నన్ను నీవ చెప్పితివి. రాధయు నధిరథుండును నాకు జాతకర్మాదిసమస్తసంస్కారంబులు నిజకులోచితం బుగా నాచరించిరి. అట్టితల్లిదండ్రులకుఁ బుత్త్రకృత్యంబులు నిర్వర్తింపక వారలం బాసి యేను వచ్చుట ధర్మం బగునే యని పలికి వెండియు. 443

క. సోదరులుఁ బ్రియులు ననుజులు, నాదెసఁ బెక్కండ్రు వారి-నందఱ విడువం
గా దని యూహింపక దా, మోదర నన్నిట్లు పిలుచు-టుచితమె చెపుమా. 444

వ. అదియునుం గాక. 445

ఉ. సూతసుతుండు వీఁ డనక - మానుల తమ్ములకంటె నాకు సం
ప్రీతి యొనర్చి తేజమును - బెంపును నాఁటికి నాఁటి కగ్గలం
బై తనరార నన్నుఁ దన - యంటిమానిసిఁ జేసి యుండ నే
నే తగ వూఁది యాకురుకు - లేశ్వరుఁ బాయుదు ముట్ట వచ్చినన్. 446

క. నను నయ్యర్జుననకు నెదు, రని పెద్దయు నమ్మి యుండు - నక్కట దుర్యో
ధనుఁ డానమ్మిగ వమ్ముగఁ, జను నే పాండవులఁ గలయఁ - జన నా కనఘా. 447

ఆ. ఏను నర్జునుండు - నెక్క టెక్కటి దల, పడక యున్న నగరె - పుడమిజనము
లందు నాదువచ్చు - టతనికి నపకీర్తి, యనిన నాకు వేఱె - యడుగ నేల. 448

క. హిత ముపదేశించితి నీ, వతినిర్మలబుద్ధి వగుట - నైనను నిది నా
మతి సొరదు రహస్యము ర, క్షితముగఁ బాటింపుమయ్య - చిత్తములోనన్. 449

వ. అది యేమిటి కంటేని. 450

తే. ధర్మతనయుండు దాను నా-తమ్ముఁడగుట, యెఱిఁగె నేనియు సామ్రాజ్య-మేల వూను
నట్టిధార్మికుఁ డాధిప-త్యంబుఁ జేయ, వలయుదే శాశ్వతంబుగ - వసుధ కెల్ల. 451

క. అనుజులు ఋత్విజులు గ నీ, వని యిటు సేయు మని నీ వు-పద్రష్టవు గా
విను కురుకుమారపశువిశ, సనమున రణయజ్ఞ మతఁడు - సమ్మతిఁ జేయున్. 452

వ. దానం బుణ్యభూమి యగుకురుక్షేత్రంబున మముబోంట్లెల్లను సద్గతి వడయుదురు
గాక యనిన విని వసుదేవనందనుండు సూతనందనున కి ట్లనియె. 453

మ. దయ నాయాడినమాట గైకొనవు సం - తాపంబుఁ దెచ్చుం జుమీ
స్త్రయ మెట్లుం దుది నీకు నర్జునునితో - మాత్సర్య మైనం బరా
జయ మొండెన్ మృతి యొండెఁ గాక గెలువన్ - శక్యంబె పెక్కండ్రు కిం
తియకాలం బగున ట్టె నీమనము శాం - తిం బొందఁగా నేర్చునే. 454

క. గాండీవముఁ గవదొనలు న, ఖండితదివ్యాస్త్రములు నా - గలపై నేనుం
జండభుజబలము నై యు, ద్దండత నరుఁ డడర నెదురఁ - దరమే నీకున్. 455

వ. ఎల్లభంగులం బాండవుల గెల్తురు. అది య ట్లుండె. నీవు పొమ్ము. ఇప్పుడ పోయి
సుయోధనునకును గురుభీష్ములకును మీకుం దోడు వచ్చినరాజుల కందఱకుం జెప్పు
ము. ఇమ్మాసంబు సౌమ్యం బై సమశీతోష్ణం బై పుష్పఫలోపేతంబును సమగ్ర
ధాన్యంబును సులభయవసైంధవంబును నగుచు నొప్పి యున్నయది. ఏడెనిమిది
దివసంబులకు నమావాస్య వచ్చును. అది పుణ్యదినంబు. నాఁడు భండనంబు గా
వలయు ననినఁ గానీనుండు గమలనాభున కి ట్లనియె. 456

క. కలవు నిమిత్తస్వప్నం, బులు గౌరవపాండవులకుఁ - బో టగు దానన్
గెలు పయ్యుధిష్ఠిరునకును, గల దెఱుఁగుదు నీవు సెప్పఁ - గా నేమిటికిన్. 457

వ. అట్లు గానఁ గదా యే నందు రా నని పలికి మఱియును. 458

క. దీనికి మూలము శకునియు, నేనును దుశ్శాసనుండు - నింతియ కుంతీ
సూనుల వారలు గలసిన, రా నేరఁగ వచ్చు నాకు - రాజీవాక్షా. 459

వ. ఈసమరసముద్రంబు దఱియ నీఁది నిన్నుం గనియెదఁ గా దేని యూర్ధ్వలోకంబు
నం గాంచెద నీ వింక నేమియుం బలుకకుము పనివినియెద నని కౌఁగిలించుకొనిన
నట్ల కాక పొ మ్మని విష్ణుండు వీడుకొలుప రాధేయుండు రథావతరణంబు సేసి
కనకరత్నమయం బగుతనయరదం బెక్కి కరిపురంబున కరిగె. అచ్యుతుండును
సాత్యకిం దనరథం బెక్కించికొని దారుకుం జూచి పద పద పో నిమ్ము పో ని మ్మని
పలికి లలితాటోపకలితుం డగుచుఁ జనియె. అట్టియెడ విదురుండు విషాదంబు
తోఁ బాండురాజమహిషిపాలికిం జని యి ట్లనియె. 460

ఉ. అక్కట కౌరవాన్వయమ - హార్ణవ మింకెడునట్లు పుట్టె నిం
దొక్కరుఁ డైనఁ గేశవుహి - తోక్తికి మేకొనఁ డయ్యె నర్జునుం

డెక్కటి దాన చాలుఁ దము - నిందఱుఁ దీవ్రశరాగ్నిఁ గాల్పఁ బెం
పెక్కినపాండునందనుల - యేర్తెఱుఁ దొల్లియుఁ దా రెఱుంగరే. 461

తే. అన్ని వడియును బంధుత్వ - యంబు సేయ, నొల్ల కెల్లవిధంబుల - నుపశమంబ
కోరి రప్పాండవేయులు - వారి కిట్టి, దొసఁగు వచ్చునె తులువల - తోడఁ బుట్టి. 462

వ అని వెండియు నివ్విధంబుమాటలఁ బాండవులకుఁ గయ్యంపుటలజడి యైనవగపు
దోఁప నాడుచుం గొండొకప్రొద్దు నిలిచి నిజనివాసంబునకుం బోయినయనంత
రంబ కుంతి యి ట్లని వితర్కించె. 463

మ. తమవారిం సిరికై వధించు టిది స - ద్ధర్మంబె యక్లేశకృ
త్యమె తాఁ గయ్యము ద్రోణభీష్మకృపక - ర్ణాటోపముల్ మాన్చు ట
ల్పములం దీఱునె యందు నర్జునియు - ల్లం బెప్పుడుం గ్రోధదీ
ప్తము భీమాదులమీఁదఁ దక్కొరుల కు - త్సాహంబు లే దాజికిన్. 464

వ. అని యిత్తెఱంగునఁ బెక్కులు చింతించుకొని కర్ణునకుం బుట్టువు దెలిపి సహో
దరస్నేహం బావహించెద న ట్లయిన నాహవంబువలనికడంక యుడుగ కుండునె
యని విచారించి యతనిపాలికిం బోవ నిశ్చయించి యుచితప్రకారంబున వెడలి
యతం డనుష్ఠానార్థంబు భాగీరథికిం జనుట విని తత్ప్రదేశంబున కరిగి యతనికి జప
కాలం బయి యునికిం జూచి వెనుకవలనఁ గూర్చుండఁ గొండొకసేపునకు జపంబు
దీఱె కలయం గనుంగొని యమ్మహాదేవిం గాంచి కానీనుండు సంభ్రమ విన
యంబులతోడం జేరి సూతగోత్రంబును రాధేయనామంబునుం జెప్పి యభివాద
నంబు సేసి నీవు విజయంచేసినకార్యం బేమి నాకుం జేయంగలపని యెయ్యది
యాన తి మ్మనినఁ గుంతి యేకాంతంబుగా ని ట్లనియె. 465

## కుంతీదేవి గర్ణునకు నతండు దనపుత్త్రుం డగుట దెలుపుట.

సీ. వినుము సూతాన్వయం - బున నీవు పుట్టుట, బొంకేను మాకుంతి - భోజునింటఁ
గన్నియనాఁడు భా - స్కరుని రావించితి, వరమంత్రబలమున - వచ్చి యతఁడు
సంప్రీతి నొసఁగంగ - జన్మించినాఁడవు, నాకుఁ గావునఁ బాండు - నందనుండ
వగుదు ధర్మస్థితి - నట్టినీ వితరులఁ, గొలువ నేటికిఁ గురు - కులవరేణ్యా
ధర్మతనయాదు లైననీ - తమ్ములకును, ధార్తరాష్ట్రులకును నీవ - తగువిభుండ
వేలు మీలోక మెల్ల నీ - కేల రాధ, కొడు కితం డనుతక్కువ - కొడుకుఁగుట్టి.

క. అని పలికినయవసరమున, నినబింబములోన నుండి - యిది నిజ మిబ్బం
గిన నెగడ వన్న మే లగు, ననువాక్యము వెడలెఁ గర్ణుఁ - డాకర్ణింపన్. 467

తే. దాని వినియును నపుడు రా-ధాసుతుండు, దిరుగఁబడనిమనంబుతో-ధీరవృత్తిఁ
దల్లి కి ట్లను నీమాట-తథ్య మగున, య్యైన నొక్కటి సెప్పెద-నవధరింపు. 468

క. క్షత్రియసంస్కారమునకుఁ, బాత్రముగా నీవు నన్నుఁ-బాటింప విహా
మిత్రఫలములకు నీ కేఁ, బుత్త్రుఁడ నని వచ్చు టింకఁ-బొసఁగునె చెపుమా. 469

వ. సూర్యానుగ్రహంబునంజేసి నింద్యంబు గాక తక్కొనేనియు నాజన్మంబు పరమ రహస్యంబు నై యున్నయది. దీనిఁ బ్రకాశంబు సేయుట మన కెంతె మేలుఁ. అట్లుం గాక. 470

ఆ. విజయువిక్రమంబు-విఖ్యాత మై యుండ, నేను గుంతికొడుక-భాను జుండ
ననుచు నతనిఁ జేర-నరిగిన నతనికి, వెఱచి పోయె ననరె-వేయు నేల. 471

క. కడిఁదిపగఱ నేఁ దప్పఁగఁ, గడవంగా నీఁదఁ దలఁచు-కౌరవనాథుం
జెడుఁ గాక యంచు నిత్తఱి, విడువఁ దగునె యతనివలన-వెలసినవాఁడన్. 472

క. కౌరవులచేతఁ గుడిచిన, వారికి నిది సమయ మెట్టి-వారును సంగ్రా
మారంభంబునఁ బాయుదు, రే రాజులు మనలఁ దిట్ట-రే య ట్లయినన్. 473

వ. ఏ నవశ్యంబును దుర్యోధనునకై నీకొడుకులతోడం బెనంగుదు. 474

ఉ. నీపలు కెంత వోలినను-నిర్ణయ మిట్టిద కాని యొండు లే
దీపనిమీఁదిభారమున-నీ విట వచ్చితి గానఁ బాండవుల్
నేపడిరేని చంప నఱి-సేయక చెప్పెద సవ్యసాచిపైఁ
గోపము పెద్ద వాఁడు సమ-కూరిన బి ట్టుఱఁ జంపుదుం జుమీ. 475

ఆ. సవ్యసాచిచేతఁ-జచ్చుటయును గీర్తి, కరమ యతఁడు లోను-గాఁగ నేవు
రేను లోనుగాఁగ-నేవురు గాని నీ, కొడుకు లార్వు రనుట-విడువు మింక. 476

చ. అనుటయు నవ్వు గొంతి హృదయంబున శోకము నివ్వటిల్ల ని
ట్లను నిది దైవసంఘటన-మక్కట యెట్లును దప్ప నేర్చునే
యనుపమసత్త్వవిస్ఫురణ-నాడినమాటలు మఱ్వ కన్న నీ
యనుజుల నల్వురం గడపు-మర్జును చేఁతకు సమ్మతించితిన్. 477

ఆ. అనుచుఁ గౌఁగిలింప-నర్కజుం డట్లు కా, క ని ప్రియంబు మెఱయ-వినతుఁ డైన
నరిగె సదనమునకు-నద్దేవి యతఁడును, జనియె నిజనివాస-మునకుఁ బ్రీతి. 478

వ. అక్కడ వాసుదేవుం డుచితప్రయాణంబుల నుపప్లావ్యంబునకుం జని ధర్మతనయుచేతం బూజితుం డయి భీమసేనాదులు విరాటద్రుపదముఖ్యు లగుతగువారలుఁ దన్నుం గాంచిన వారి నెల్ల నభినందించి కొలువున నుండి యుధిష్ఠిరుతో నిట్లనియె.

తే. ధార్తరాష్ట్ర లున్మత్తులు - దగినపలుకు, లేల విని సంధి సేయుట - కిచ్చగింతు
రెదిరిఁ దమ్మును సెటిఁగిర-యేని వార, లంత లంతలు సేయుదు - రయ్య నాఁడు.

వ. అని యెల్లవారును వినఁ దనపోయివచ్చిన కార్యంబు తెఱం గెఱింగించి పథిశ్రమంబు వుచ్చు వాఁ డయి పుండరీకాక్షుండు నిజమందిరంబున కరిగె. నాఁటిరాత్రి ధర్మనందనుం డనుజసహితంబుగా నుచితప్రదేశంబున నుండి గోవిందుని రావించి నీవు సుయోధనుతోఁ బలికినచందం బెట్టు లతండు విని యెవ్విధంబున నుత్తరం బిచ్చెనని యడిగిన నచ్యుతుం డి ట్లనియె. 481.

## శ్రీకృష్ణుఁడు ధర్మరాజునకుఁ గౌరవసభం బుట్టినవిశేషంబులు దెలుపుట.

క. కయ్యము గానితెఱంగున, నెయ్యం బగునట్లు గాఁగ - నెటిఁ బలికితి నే
నెయ్యది సుఖంబు పథ్యం, బెయ్యది యెటుఁగంగఁ దథ్య - మెయ్యది దానిన్.

తే. బహువిధంబులఁ బలుకునా - పలుకు లెల్లఁ, జీఁదిక న్నిడి తనపెడ - చెవులఁ బెట్టి
యీఱతొఱలు మఱుమాట-లిచ్చి యపహ, సించెదుర్యోధనుఁడు వేయుఁ-జెప్పనేల.

క. అనిన విని ధర్మజుం డి, ట్లను నప్పుడు దండ్రి యుచిత - మాడఁడె భీష్మం
డును గురుఁడు విదురుఁడుం ద, క్కిన పెద్దలుఁ బలుక రే త - గినచందమునన్. 484

క. నావుడు హరి యి ట్లను స, ద్భావమున విచిత్రవీర్య - తనయుఁడు దగ నా
నావిధములఁ జెప్పిన సం, భావన వినఁ డతఁడు వలుకుఁ - బ్రతికూలంబుల్. 485

సీ. శంతనుపుణ్యావం - శం బంకురించిన, చందంబు నంబికా - నందనుండు
జాత్యంధుఁ డై యుండ-సామ్రాజ్య మంతయుఁ, బాలించి పాండునృ-పాలుఁ డతనిఁ
గొలిచి యుండుటయును-గురుకులంబున కెల్లఁ, దేజంబుగా మీరు-దిగ్విజయము
సేసి కావించిన - సిరి వారు వంచనఁ, గొనుటయు సత్యా మ - కుంఠితముగ
నీవు సమయంబు నడపిన-నెటియుఁ దండ్రి, పాలు మీకు నీఁ దగుటయుఁ బాడిలేమి
నడరఁ జెడుదురు కౌరవు-లనియుఁ బెద్ద, లెల్లఁ జెప్పిరి మొగమోట-యింత లేక. 486

క. అలయక యందఱుఁ జెప్పం, గలయంతయుఁ జెప్పి రతఁడు - గటకటఁబడి య
క్కొలువు వెడలి పోయెం ద, మ్ములుఁ గర్ణుఁడు రాజలోక - ముం దో నరుగన్.

వ. ఇట్లు గొడుకు ముష్కరుం డై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి రావించి. 488

క. తగ విదురుఁ బంచి యాతని, మగుడఁగఁ బిలిపించె నాయ-మయుఁ దనయునకున్
వగయును గూర్మియు వెరవును, మిగిలినవచనముల సంధి-మెయికొనఁ జెప్పెన్.

వ. ఎవ్వ రెంత సెప్పినను గైకొనక కడంగి దుర్యోధనుండు దనకుం గలవారల నెల్లను గురుక్షేత్రంబునకు నడవుం డని చెప్పం బనిచె. భీష్ముని సేనాముఖంబు సేసికొని యొత్తి విడియం గలవాఁడు. ఇది ధార్తరాష్ట్రులనిశ్చయంబు. ఏనును నాయోపినంత సామవాదంబు లాడితి. నారదాదిమహామునులను సుయోధనునకు బుద్ధులు సెప్ప నట్లు సేసితి. ఏమిసెప్పినను నెంతటం బో కున్నం గినుక దెచ్చికొని జంకించియు భంగించియు ధిక్కరించియుఁ దృణీకరించియుం జూచితి. కార్యంబు భగ్నం బగుట కొల్లక వెండియు శాంతవచనంబులు వలికితి. అతం డశక్తదుర్జనత సేయం జూచిన నమానుషంబు లగువానిం గొన్ని వెడమాయలం బన్ని పెక్కుపోకలం బోయితి. ఎన్నిభంగుల సంధియ కావలయు నని పొరలం గలయంతయుం బొరలితి. అప్పాపాత్ముం డెట్టునుం జక్కంబడక తనచలంబుతోన పొట్టుపొర లయ్యుఁ గయ్యంబు వోడుచుం గాని యవశ్యంబును రాజ్యంబుపా లిచ్చువాఁడు గాఁడు. కౌరవులయెడ దండంబు దక్క నొం డుపాయంబు లేదు. మీకుం బోలిన తెఱంగు సేయుం డనిన ధర్మతనయుండు దమ్ములం గనుంగొని యి ట్లనియె. 490

క. కురుసభఁ బుట్టినచందము, హరి యంతయుఁ జెప్పె నింక - ననుమానము లే
దరిమర్దనమున కయ్యెడు, వెరవుం జేపయును మెఱయ-వెడలుఁడు గడఁకన్. 491

వ. అని పలికి యజాతశత్రుండు కరుణాయత్తచిత్తుం డై యచ్యుతు నాలోకించి. 492

క. కురువంశము ద్రుంచుటకుం, జొరఁ జాలక నామనంబు - సుడివడియెడు నే
వెరవును దొరకొనదు గదే, సరసీరుహనాభ పొందు - సంపాదింపన్. 493

వ. నామనంబును దమ్ములతలంపును నీ వెఱుంగుదు. ధార్తరాష్ట్రులచందంబును భీష్మద్రోణవిదురాదులచిత్తంబులును నెఱింగి వచ్చితి. మాకు ధర్మచ్యుతి లే కుండునట్టి కార్యంబు నిశ్చయింపు మనిన నారాయణుం డి ట్లనియె. 494

ఉ. యుద్ధమ కాక కార్యమున - నొండొక టెద్దియుఁ గల్గ నేర్చునే
బుద్ధులు సెప్ప వాక్యములు - పోల వినం డన నేల యట్టిచో
బద్ధునిఁ జేయఁ జూచె ననుఁ - బట్టి సుయోధనుఁ డింక నయ్యసం
బద్ధునితోడిసంధికి ను - పాయము నామదిఁ దోఁప దెమ్మెయిన్. 495

వ. అని చెప్పి విదురుం డేకాంతంబున నాడినమాటలును భీష్మద్రోణబాహ్లీకాదులగు పెద్దలకు ధార్తరాష్ట్రులదెసం బుట్టినమనఃక్షోభంబును గుంతి గౌరవులు వినంబలికిన పలుకులుం బ్రకటించి ధర్మపుత్త్రుపైఁ బాపంబులే కునికిఁ దెలిపి సమరం బవశ్యకర్తవ్యంబుగా నిశ్చయించె. అట్టియెడఁ దమ్ము లన్నమొగంబునం జూడ్కి నిలిపి యూరకుండిరి. అతండు వారలం గలయం గనుంగొని యి ట్లనియె. 496

ఉ. కౌరవకోటిచేత మన - కష్టపుఁబాటు దలంపు వచ్చినం
గ్రూరవిచేష్టితంబునకు - గొంతి యొడంబడె బంధువర్గముం
ఘోరముగా వధించుటకుఁ - గోల్కొన కున్నది బుద్ధి మీరు ని
ర్ధారణ సేయుఁడా హితము - ధర్మము నయ్యెడువృత్తి మెట్టిదో. 497

వ. అనిన విని యర్జునుం డతని కి ట్లనియె. 498

చ. హితమును ధర్మముం దగవు - నిట్టిది నా మన మేమి సేర్తు మ
చ్యుతుఁడు సమస్తధర్మపరి - శోధకుఁ డావిదురుండుఁ బాండుభూ
పతిసతియుం దగం బలుకు - పల్కుల సందియ మెల్లఁ బాసె ని
ట్లితఁడు రణంబు సేయుఁ డన - నింక విచారము లెల్ల నేటికిన్. 499

ఆ. అనిన నట్ల కాక - యఖిలధర్మజ్ఞాన, ఘనుఁడు మనకు నేఁడు - గడయుఁ దాన
శౌరి నిశ్చయింప - సంశయం బేటికి, సంఘటింపుఁ డుగ్ర - సమరవిధము. 500

---

# 19. భారతయుద్ధారంభము.

(భీష్మపర్వము. ఆ. I.)

వ. పుణ్యక్షేత్రోత్తమం బయినయాకురుక్షేత్రంబున నాఱెండుదెఱంగులవారికటకంబులును విడిసి కయ్యంబునకుఁ గాలుద్రవ్వునట్టిసమయంబున ధృతరాష్ట్రుండు గొడుకులదుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది సంజయద్వితీయుం డై చింతించుచున్నయెడకుం ద్రికాలవేది యగువేదవ్యాసుండు విజయంచేసి యమ్మహీపతి సేయునర్చనంబులం గైకొని యతని కిట్లనియె. 1

క. కాలం బగుటయు నృపులకు, నాలము సమకూరె దీని - కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన, నీ లోనికి దివ్యదృష్టి - నిచ్చెదఁ బుత్రా. 2

చ. అనుడు నతండు ఘోరముగ - నన్నలుఁ దమ్ములుఁ బోరఁ గ్రూరతం
గనుఁగొనఁ జాల నేను వినఁ - గా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్స యన్న ముని - చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరి - పాటిమెయిన్ సకలంబుఁ జెప్పఁగన్. 3

వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబుతెఱంగు వినిపింప నియోగించి యాసూతనందనునకు నాఱెండుదెఱంగులవారిదివారాత్రప్రవర్తనంబులు గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగునట్లునుం గా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారతసమరధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁక కుండునట్టిప్రభావంబుఁ బ్రసాదించి దివ్యులయాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టిమహనీయబోధంబును గలుగ ననుగ్రహించి యావైచిత్రవీర్యు నాలోకించి యిదిప్రాప్తకాలం బైవచ్చినభూప్రజాక్షయంబు. దీనికి వగవం బని లేదు. ‘‘ధర్మోజయ’’ తనుచు నిశ్చింతంబుగ నుండుము. ఏనును గురుపాండవులకీర్తిఁ బ్రకటింపం గలవాఁడ నని యతని నాశ్వాసించి సాత్యవతేయుండు (కులక్షయంబు నానానరేంద్ర నాశంబును గాఁదగు ననేక దుర్నిమిత్తంబులను గయ్యంబున గెలుపు దెలుపునిమిత్తంబులను నెఱింగించి) వెండియు. 4

* * * * * *

వ. కొంచెంబు పెద్ద యన లేదు. సమరంబున జయంబు దైవాధీనంబు. కావునం బెద్దలు పెనఁకువ లొప్ప వని చెప్పుదురు. ఏను బోయి వచ్చెద నని చెప్పి సముచితప్రకారంబున నంతర్ధానంబు సేసె. తదనంతరంబ యక్కౌరవేంద్రుండు కొండొకసేపు చింతించి నిట్టూర్పు నిగిడించి సంజయున కిట్లనియె 5

ఉ. భూమికిఁ గాఁగఁ బ్రాణముల - పోక దలంపక రౌద్రఘోరసం
గ్రామము సేయుచుండుదురు - రాజులు దొల్లియు నెంతదీపొకో
భూమి మునీంద్రసంగతి సు - బుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్ర - బోధనిరూఢముగా సమస్తమున్. 6

వ. అనిన విని సంజయుం డతనికి (భూపరిమాణంబును భారతవర్షంబునంగల విశేషంబులను దెల్పి) యి ట్లనియె. 7

క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడఁ బాడి - నాయతు లెల్లం
గొనుచుఁ దగ నేలి పొగడొం, దినరాజున కుర్వి గాదు - ధేనువు గాదే. 8

ఆ. వెరవు లావుఁ గలుగు - నరనాథు లింతదే, శంబు గలదు తమకుఁ - జాలు ననరు
దండ్రి బిడ్డ యన్న - దమ్ముఁడు నా కెత్తి, పోయి పోటు లాడి - పుడమిఁ గొంద్రు. 9

క. కావునఁ గౌరవపాండవు, లీవసుధకు నై పెనంగు - టెగ్గే దైవం
బేవంక బ్రాలె వారికి, పోవుం గా కిది నరేంద్ర - పొగలకు మింకన్. 10

వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో నీ వింక సంగరంబుఁ జూడం బొమ్మని సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారతరణప్రకారం బనుసంధించి యతండు కతిపయదినంబులకుం జనుదెంచి తగినతెఱంగునం గాంచి. 11

క. కొడుకులదెస నెవ్వగఁ జే, డ్పడి వందురి యున్నయాన్ప - పాలునడుగులం
బడి భీష్మపాటు సెప్పుచు, నడలి కరుణనాద మెసఁగ - నాక్రందించెన్. 12

* * * * * *

వ. సంజయుండు పలవించుపలుకులకుఁ జిత్తంబు జల్లన నొల్లంబోయి మూర్ఛిల్లి కొండొకసేపునకు శిశిరవిధానంబుల నేద దేటి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరంగ గద్గదకంఠుం డై. 13

క. దేవాసురవరు లొక్కటి, యై వచ్చినఁ జిక్కువఱచు - నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండిశ, రావలిపా లయ్యె నేమి - యనఁ గల దింకన్. 14

* * * * * *

తే. పెరిఁగి పాండవాంబుధి వెల్లి - విరిసినపుడు, నిలువ నిమ్మగుదీవిగా - నిన్నుఁ దలఁచి
యుండ నత్యంతతుచ్ఛశి - ఖండిపల్వ, లాక్రమంబున మునిఁగితే - యకట తండ్రి. 15

ఉ. వీరరసాంబుపూరమును - విశ్రుతబాహుమహోగ్రసత్త్వముం
జారుగదాధ్వజాచలవి - శాలము నంబకజాలవీచికా
స్ఫారము సైనభీష్ముఁ డను - సాగరముం గడవంగ నీఁదఁగా
నేరిమి యెట్లొకో గలుగ - నేర్చె శిఖండికి నేమి సేయుదున్. 16

తే. అంబకై పూని వచ్చి బ - లాధికుండు, జామదగ్న్యుండు సాధింపఁ - జాల కున్న
వాని భీష్ముఁ బాండవులకై - పూని వచ్చి, కడిమి సాధించి తౌర శి - ఖండి పోర. 17

క. ఆశౌర్యం బాసత్త్వం, బాశీలం బాపరాక్ర - మాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు న, నాశము లని భీష్ముఁ బెద్ద - నమ్మితిమి గదే. 18

వ. అని బహుప్రకారంబులం బలవించి యాసూతనందనుచే సేతం గీలించి. 19

సీ. అతఁడు నొచ్చినతఱి - నడ్డంబు సొచ్చెద, మని వచ్చువారు లే - రైరె యచట
నడరి పోరాడక - యన్నియక్షౌహిణు, లొప్పరికించెనె - యొకనిఁ గలన
నతని నోర్వఁగఁ జాల - వని నిశ్చయించితి, మంతకు నోపెనే - యరిబలములు
ద్రోణుండుఁ గృపుఁడును-ద్రోణసుతుండును, శల్యుండుఁ గ్రేడించి-చని రెయపుడు
పాండుసుతులు శిఖండియుఁ - జండశక్తి, మొఱయ నొక్కటఁ బై పడ్డ - వెఱచి తాత
విడిచి నాపుత్త్రు లందఱు - విఱిగి యడవిఁ, గలసిరో కో యాతెనికిఁ బడ - వలసె నకట.

వ. దేవవ్రతుండు దెగినయప్పుడ తక్కినయంతవట్టునుం దెగియెన కాఁ దలంచెద నని మఱియు నిట్లనియె. 21

సీ. కులగురు వృద్ధు ని - ర్మలచిత్తు గాంగేయుఁ, జంపి రాజ్యము సేయ - సమ్మతించి
తొడరినపాండుపు - త్త్రులకును దైవంబుఁ, దోడయ్యె ధర్మంబు - గీడుపఱిచి
పరఁగి యధర్మంబు - పెరిఁగిన ట్లున్నది, వార లాతెనిఁ గూల్చి - వసుధఁ గొనఁగ
నిశ్చయించుట గడు - నిష్ఠురత్వము దాని, కంటెను బాపంబు - గాదె మనకు
సంగరంబున నాతండు - సచ్చు టోర్చి, సంపదకుఁ గాఁ బెనంగిన - చంద మరయఁ
గులములం దెల్ల నీరాచ - కులము చాల, బెట్టిదం బిక్కులంబునఁ - బుట్ట నగునె. 22

వ. అని పలుమాట లాడి వెండియు. 23

ఆ. మగఁడు లేనిమగువ - మాడ్కి గా కున్నె నా, సేన భీష్ములేమిఁ - జేసి నేఁడు
కురుకుమారు లెంత - గుందిరో యెవ్వ రే, మైరో యింక నెట్టు - లగుదు రొక్కొ. 24

క. రాజులు మంత్రులు ననియెదు, నాజూదరు లాత్మ నేమి - యని తలఁచిరో యే
యోజం బలికిరొకో తమ, కాజికి నిట మీఁద నెవ్వ - రాధారంబో. 25

వ. అని పలికి సంజయుకరంబు విడిచి కయ్యం బెయ్యెడం బొడిచిరి. పదిదినంబులు నుభయబలంబులవారలు నెవ్విధంబున మోహరించిరి. ఎవ్వ రెవ్వ రెప్పు డెప్పు డేమి సేసిరి. ఇన్నాళ్లు గాంగేయుఁ డెబ్భంగుల సంగరంబు సేసె. తుది నెత్తెఱంగునం దెగియె. అంతయు వివరించి పరిపాటిం దేటపడం జెప్పుము. 26

ఉ. నెట్టన యాపగాసుతుఁడు - నేలకు వ్రాలె ననంగ విన్న నా
కట్టెఁడివీను లేమి విను - కాఁతియ కోర్వవు దుర్వినీతికిం
బుట్టినయిల్లు నై వినక - పోవఁగ వచ్చునె యింక నాకు నే
డిట్టఁడ నైతి నెల్లవియుఁ - దెల్లముగా విన నేర్తు సంజయా. 27

వ. అనిన విని సంజయుం డతని కిట్లనియె. . . ఆరాత్రి నిన్ను వీడుకొని మనదండునకుం జని నీకొడుకునగరు సముచితప్రకారంబునం బ్రవేశించినప్పు డతండు గాంగే యాది కౌరవులును దగురాజులును బరివేష్టింపఁ బరిమితస్థానంబుననుండ నేనునుం బొడసూపి యతని యాదరణంబు నడసి కొలిచి యుండితిని. పదంపడి సమరవిష యంబులైన సంభాషణసమయం బులు . . . (జరిగె). అంతఁ బ్రభాతంబగుటయు నమ్మహీపతి పడవాళ్లం బనిచి బలుమానుసులను బలఁబులను బవరంబునకు వెడల నియోగించిన శంఖదుందుభిప్రముఖమంగళతూర్యనిస్వనంబులను నయ్యైసాధనం బులు సమకట్ట సముచితపరివారంబునకుం జెప్పెడు దొరల పలుకులగంభీరనాదం బులను గట్టుఁబట్లకడలఁ దిగిచినం జెలంగుకరితురంగంబుల బృంహితహేషితఘోషం బులను బూన్పం దిగుచురథంబులనేమిస్వనంబులను బెలుచ నొండొరులం బిలుచు పదాతులరొలుంగులవిపులధ్వనులనుం బేర్చిన మహారవంబున శిబిరంబు చంద్రోదయ ఘూర్ణమానమహార్ణవంబును గ్రేణిసేయుచుండ సూర్యోదయం బైన సైన్యంబులు సెలంగుచు వెడలునప్పుడు. 28

తే. కనకభూషణజాలంబు - కతన గజము, లెరవళులప్రోవుకొండల - నెనసి యొప్పె
వల్గనంబుల హేషల - వలన నబ్ధి, ఘనతరంగంబు లనఁ దురం - గములు వొలిచె. 29

క. అరదములు సవరణలతోఁ, బర పై యొక్కొక్కయూరి - పరపున నరిగెం
బరుసనిపలుకుల నాకృతి, పరుషత నసురాలివోలె - భటతతి మెఱసెన్. 30

వ. అట్టియెడ. 31

మ. పరిధానంబును దేరు నశ్వములుఁ జా - పంబుం బరిస్ఫీతవ
జ్రరుచివ్యాప్తసువర్ణతాళమయచం - చత్కేతువున్ వర్మముం
గర మొప్పం దెలు పారు వెల్గొడుగుతో - గంగాసుతుం డానుధా
కరుఁడుంబోలె వెలింగె దర్ప మెసఁగం - గౌరవ్యసైన్యాబ్ధికిన్. 32

సీ. కాంచనమయవేది - కాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమం బొప్పఁ - గలశజుండు
గనకగోవృషసాంద్ర - కాంతికాంతధ్వజ, విభవవిలాసంబు - వెలయఁ గృపుఁడు
మణిసింహలాంగూల - మహితకేతుప్రభా, స్ఫురణంబు మెఱయంగ - గురుసుతుండు
రత్నశిలారశ్మి - రాజితకదళికా, మహిమ శోభిల్లంగ - మద్రవిభుఁడు
వెడలి తమతమచతురంగ-వితతు లెల్ల, నుచితగతి నూల్కొనంగఁ జే-యుచుఁ గడంగి
సంగరోత్సవసంభృతో-త్సాహు లగుచు, నగుచుఁ దగుమాట లాడుచు-నడచి రెలమి.

క. సమర క్రీడాసన్నా, హము లొప్పఁగఁ దక్కుఁ గలుగు - నట్టిదొరలు ద
ర్పము పల్లవింప వెడలిరి, తమతమకేతువులు గ్రాల - ధరణీనాథా. 34

* * * * * *

వ. అనేకదేశాధీశు లాత్మీయచతురంగబలసమన్వితులును నిజధ్వజవిరాజమానులును నానాభరణోజ్జ్వలాంగులును నయి సంగరకౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగిరి. ఇవ్విధంబునం బది యక్షౌహిణులు నడవం బదునొకొండవయక్షౌహిణితోఁ గురుక్షోణీవల్లభుండు విస్ఫురితభూషణభూషితం బైనగంధసింధురంబు నెక్కి వెలి గొడుగులు మెఱయం దొడవులం దఱచైనవజ్రంబులయుద్దామంబు లగుదీధితిస్తోమంబులును జామరంబులుం గలయం బొలయ బహురత్నప్రభావిభాసితం బయిన భుజంగకేతనంబు గ్రాలఁ గెలంకుల దుశ్శాసనదుర్మర్షణవివింశతివికర్ణాదు లగుసోదరులు వాహన వల్గనంబులు మెఱసి మెఱుఁ గారుతమతమసిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చనుదేరం జనియె. ఇట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండ గదా దండ కుంత క్షురికా ముసల ముద్గర తోమర పరశు భిందిపాల శూలప్రముఖనిఖిలహేతివ్రాతంబులను భర్మపరికర్మనిర్మాణశోభితవర్మంబులను వివిధవర్ణవిచిత్రతనుత్రాణంబులను మణిగణోజ్జ్వలజ్వాలాజటిలకేతనంబులం బరమాభీలసుందరసమ్మర్దం బయ్యె.

* * * * * *

భీష్ముఁడు నిజయోధుల కెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట.

వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభుల నెల్లం గూడం బిలిపించి వారలతో ని ట్లనియె.

క. ఆరయ వివృతస్వర్గ, ద్వారము రాజులకు నాహ - వం బందు మహా
దారులు దొల్లియు నరిగిరి, మీ రీమార్గమున నడవ - మెయికొను టొప్పున్. 37

క. ఇంటం దెవులునం జచ్చుట, కంటెను బాపంబు లొండు - గలవె నృపులకుఁ
బంటై కలనం బొలియుటఁ, గంట నిధానంబుఁ గంట - కాదే మనకున్. 38

తే. అనిన విని వార లందఱు-నగ్గలికలు, సెలయుమాటలఁ దమతమ-తెఱఁగు మెఱయ
బహువిధంబుల నతనికి - బాస లిచ్చి, యేచి నిజసైన్యములలోని - కేగి రధిప. 39

వ. అయ్యవసరంబున గాంగేయుండు గాంధారేయు నాలోకించి మదీయసంగరసమ
యంబునఁ గర్ణుండు పుత్త్రమిత్త్రామాత్యబంధుసహితంబుగాఁ గయ్యంబునకు రాకుం
డం గలవాఁ డని తేటపడం బలికిన. 40

క. చలముకొని యొరుల నుడుపుట, బలియుం డై తెంపు సేసి - బవరమునకుఁ దాఁ
దెలియుట గాదే యని కురు, కులముఖ్యుఁడు పొంగి యతనిఁ-గొనియాడెఁ దగన్.

వ. ఇట్లు పితామహునెత్తికోలునకుం జిత్తంబు వికసిల్లి' ననుజసహితంబుగా నతనిం బరి
వేష్టించి యన్నరపతి నిబిడచారుసన్నాహంబుగా నుచితవ్యూహం బమర్పు మని
యతనికిం జెప్పిన నతండును బడమరమొగం బయి తాను ద్రోణుండును దాల
ధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలు చుండ ముందర నిలిచి వలపటఁ గృపాశ్వ
త్థామలును దాపటం గృతవర్మమద్రేశ్వరులు వెనుక బాహ్లికసోమదత్తభూరిశ్రవసు
లును నడుమం గురుకుమారసమేతంబుగా నమ్మహీనాథుండును నతని యగ్రభాగం
బున నర్జునుఁ జంపుదుము చత్తు మింతియ కాని యొండు లే దని శపథంబులు పలికి
సంశప్తకు లనం బ్రఖ్యాతు లయినసుశర్మ మొదలుగాఁ గలపది వేవురు రథికముఖ్యు
లును గలయ నెడనెడం దక్షిణయోధవీరులును నిలుచునట్లుగా నియమించి తగ
నయ్యైసైన్యంబుల కేనుంగులు నేనుంగుల కరదంబులు నరదంబులకుం దురంగంబులుఁ
దురంగంబులకు విండ్లవారు విండ్లవారికి నృద్ధాయుధులు నడ్డం బగుతెఱంగున నిలువ
నియోగించి మానుషవ్యూహంబు సమకట్టిన నెన్నండును నిట్టిదృఢవ్యూహంబు గని
యును వినియు నెఱుంగ మని యెల్లవారు నచ్చెరువునం బొరయుచుఁ బ్రియం
బందు చుండిరి. బృందారకప్రముఖదేవయోనులును దివంబున నున్నపురాతనధరార
మణులును భారతరణంబు గనుంగొను కుతూహలంబున వివిధవిమానారూఢు లై
యేతెంచిరి. అంతకు మున్న యక్కడ 42

## పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట.

సీ. ఏనికమదమున - కెలయుతేఁటులమొత్త, ములు వెలిగొడుగుల - చెలువు గొలుపఁ
దురగఖురోద్ధూత - ధూళి యప్సరసల, చిన్నిపువ్వులతోడఁ - జెలిమి సేయఁ

గేతనంబులమణి - వ్రాతంబురోచులు, రవికిరణంబుల - నవలఁ ద్రోవ
జైత్రభేరులమహా - స్వనములు సకలప, ర్వతములఁ బ్రతివిరా - వముల నీన
నంబరము రథఘోషభీ - షాభిరామ, కింకిణీగణఝణఝణ త్కృతిమయము గఁ
బటుపదాతిహేతిప్రభా-పటలి యెల్ల, దిశలు వెలిఁగింప వెడలె యు-ధిష్ఠిరుండు.

మ. ప్రమదం బాననకాంతిఁ గ్రొత్తవలుపం - బాదాతిభూయిష్ఠసై
న్యముతో భీముఁడు భూషణద్యుతినికా - యంబుల్ గదాద్యాయుధో
గ్రమరీచిప్రకరంబునుం గలిసి చి - త్రస్ఫూర్తి శోభిల్లఁ గా
సమరక్రీడకు వచ్చె జృంభితభుజా - స్తంభోజ్జ్వలాకారుఁడై. 44

సీ. దివ్యరథస్ఫార - దీప్తిజాలంబులు, పద్మరాగోజ్జ్వల - ప్రభలు గాఁగ
మహనీయరథ్యవి - గ్రహములజిగిసొంపు, ఘనవజ్రరుచిసము - త్కరము గాఁగ
నొగలపై నున్నకృ - ష్ణుని మేనినునుఁజాయ, హరినీలకాంతివి - స్ఫురణ గాఁగఁ
బ్రస్ఫీతకేతనా - గ్రస్థితకపిదేహ, రోచులు గరుడాశ్మ - రుచులు గాఁగ
నంపపొదుల నిగుడు - నంశువితానంబు, దీప్రమరకతముల - దీధితులు గఁ
దాలిమియును బెంపుఁ-దనకు నైజములు గ, విజయరోహణాద్రి-వెడలి వెలిఁగె.

క. అతులితరథప్రతానో, ద్ధతసైన్యము గొలువ దేవ - దత్తం బంగీ
కృతసకలతూర్యనాదో, ద్ధతి యగుచుఁ జెలంగఁ గ్రీడి - గడు నొప్పారెన్. 46

తే. గాండివం బింద్రచాపంబు - కరణి నొప్ప, మెఱసి దివ్యకిరీటంబు - మెఱుఁగు లడర
జ్యానినాదంబు గర్జగా-మేనికృష్ణ, కాంతిఁ బొలిచెఁ గవ్వడి యను-కారుమొగులు.

మ. వివిధోద్దామహయావళీబహుళ మై - విక్రాంతికేళీసము
త్సవకౌతూహలసుందరం బగుమహా - సైన్యంబుతో మేదినీ
ధవసందోహము ప్రీతిఁ బొంద మహిమో - దాత్తోగ్రయానంబులం
గవ లేతెంచిరి వేడ్కఁ నొండొరులకుం - గయ్యంబు మైఁ జెప్పుచున్. 48

మ. రభసక్షోభితమేదినీతలముపై - రథ్యప్రచారంబు లొ
ప్ప భుజాగర్వము నెమ్మొగంబులఁ దలి - ర్పం గన్నెకయ్యంబున
ర్థి భవత్పుత్రులమీఁదికోపమున ను - ద్దీపింప నేతెంచి ర
య్యభిమన్యుండును ద్రౌపదేయులును మా - ద్యద్దంతియూథాకృతిన్. 49

*　　*　　*　　*　　*　　*

వ. బహుదేశాధీశులును దమతమబలంబుల దళంబులసవరణలయొప్పును గయ్యంపుఁ
గడంకయు నెఱయం గేతనంబులు మెఱయం దోఁతెంచిరి. ఇత్తెఱంగునం గూడి సప్తా
క్షౌహిణీబంధురంబుగాఁ బేర్చినపాండవసేన మొగంబునకుం దిలకం బై. 50

శా. పుష్టోదంచితసారవీరరససం పూర్ణాంగముల్ సంగరా
వష్టంభోజ్జ్వలవీరరేఖయును భా - స్వద్వాహసంవల్గనో
త్కృష్టస్యందనముం గనద్ధనువు ను - ద్దీప్తధ్వజంబుం దగన్
ధృష్టద్యుమ్నుఁడు వొల్చె నైజవిలస - త్తేజోవిరాజద్గతిన్. 51

వ. ఇట్లొప్పి సేనాపతి యగునాద్రుపదసుతుండు ముంగలి యై నడపించుచుండ. 52

సీ. ఇల ధూళి యెగసినఁ - బలుచ గా కుండంగ, రాసినతోడవుల - రజము దొరఁగు
సమరవికాసంబు - చెమట నొ ప్పఱ కుండ, హేతిదీధితులు రే - యెండ నొడుచు
భేరీధ్వనుల నింగి - బీఁటలు వో కుండఁ, గరికరశీకరో - త్కరము దడుపు
దర్పంబు గనుఁబాటు - దాఁక కుండఁగ గొడుఁ, గుల పెల్లు ఖచరదృ - క్కోటి నాఁగు
నని నిజ మైనయ ట్లుండె మనుజనాథ, ధరణి వడవడ వడఁకె ది - క్తటము లద్రువ
భూరిచతురంగ చండమై - స్ఫూర్తిఁ బొండు, నందనులసేన గలనికి - నడచునపుడు. 53

వ. ఇట్లు నడచి కురుక్షేత్రంబులోన నుత్తమప్రదేశం బగుశమంతపంచకసమీపస్థలం
బు సేరిరి. 54

* * * * * *

వ. తదవసరంబున నుభయబలంబులవారును 55

చ. బవరము సేయుచుండియును భాషణముల్ దగఁ బల్కుచుండఁగా
నవినయవృత్తి మై పలవ - దాయుధ మార్చుటఁ దాఁకి పడ్డఁ గై
దువు వడినం దొలంగినను - దోర్బల మేది భయంబుఁ బొందినం
గవియక బీఱు వోయినను - గాదు వధింపఁగ నెట్టిశత్రునిన్. 56

వ. అని సమయంబు సేసిరి. ఆసమయంబున. 57

క పలుచాయల నొప్పినయా, బలము లొకటి కొకటి కెదురఁ - బల్లవపుష్పా
వలి గలవనముల క్రియ ని, శ్చలత నిలిచి పొలిచె నశమ - సమధైర్యములన్. 58

క. అత్తఱి సురఖచరాదుల, చిత్తము లనిఁ జూచువేడ్కఁ - జిడిముడి వడఁగా
నొత్తొరవున నిరుదెఱఁగుల, యుత్తమవీరులును దాఁక - నుంకింపంగన్. 59

## ధర్మరాజు పాదచారి యై భీష్మునియొద్దకుఁ బోవుట.

తే. సమరకౌతుకి యైనయ - జాతశత్రుఁ, డొప్పు మిగిలెడు మైమఱు - వూడ్చి యాయు
ధములతోఁ గూడఁ దనయర-దమునఁ బెట్టి, యిలకు డిగి మౌనియై కరం-బులు మొగిడ్చి.

వ. భీష్ముదెసకుం జను చున్నం గనుంగొని యమ్మహీవల్లభుతమ్ములును శౌరిసాత్యకులును బరమాప్తు లగుధరణీశులు నతనిచేతోవృత్తం బెఱుంగమి నుత్తలపడుచిత్తంబులతో వాహనంబులు డిగ్గి యతనిం గూడం జని యప్పుడు. 61

సీ. ఏ మెల్ల నుండ నీ - విట్లొంటి గాల్నడ, నేగు చున్కికిఁ గత - మెద్దియొక్కొ
పన్నినపగఱపై - సన్నాహ మంతయు, నెడలించి నడచుట - యెట్టులొక్కొ
రిపులు దేఁకువ సెడఁ - గృపణత దుర్బలు, చాడ్పునఁ జను టేమి - చందమొక్కొ
యడరి పోరాటకు - నద నైనచో నొప్ప, పాలివోవఁ బోవుట - పోలునొక్కొ
యని క్రమంబున నామరు-త్తనయవిజయ, నకులసహదేవు లడుగ భూ-నాథుఁ డొక్క
పలుకుఁ బలుకక యరుగంగఁ - బద్మనాభుఁ, డక్కుమారులతో నిట్టు - లనియె నగుచు.

వ. ఇతనితలం పే నెఱింగితి. ఇతండు భీష్మద్రోణకృపశల్యులకు నమస్కరించి వారల చేత ననుజ్ఞాతుం డై భండనంబు సేయువాఁడుగాఁ దలంచి చనియెడు. పెద్దల యనుజ్ఞ గొని కయ్యంబు సేసిన జయం బగుట నిశ్చయం బని యార్యులు సెప్పుదురు. కావున నాసుకర్మం బాచరించుట మేలకాక యనిన విని యజాతశత్రు వెనుక నప్పు డరిగినవారలు పలుకు లుడిగి నిలిచి వెఱఁగుపడి చిత్రరూపంబుల చందం బై చూచు చుండిరి. కృష్ణార్జునులును భీముండును గవలును దోన చనం గౌంతేయాగ్రజుండు గాంగేయుతేరు సేరం బోవం గౌరవసైన్యంబు లేపుమిగిలి మెడ లెత్తి కనుంగొనిరి . . . అయ్యుధిష్ఠిరుండు సముద్యత నానాయుధబహుళం బైనకురువ్యూహంబు దఱిసి పితామహుపాలికిం బోయి తత్పాదంబులకుఁ బ్రణామంబు సేసి సవినయంబుగా నతని కి ట్లనియె. 63

ఆ. అనఘ నీ కెదిర్చి - యని సేయువాఁడ నై, ము న్ననుజ్ఞ గొనఁగ - నిన్నుఁ గాన
నెమ్మి వచ్చినాఁడ - నీచేత దీవన, వడసి చనిన నేను - బగఱ గెలుతు. 64

సీ. అన విని గాంగేయుఁ - డక్కట నీ విట్లు, చనుదేక తక్కిన - శాప మిత్తు
వచ్చితి మే లయ్యె - వైరుల నిర్జింపు, మిది గాకయును వర - మెద్ది యైన
నడుగుము నీకుఁ గా - నని సేయు టొక్కటి, దక్కంగ నావుడు - ధర్మసుతుఁడు
రారాజుపక్షు మై - రణము సేయుము నాకు, హిత మగుకార్యంబు - మతిఁ దలంపు
మనుడు నట్ల కాక - యట నీతలం పేమి, యనినభీష్ముతోడ - నతఁడు నిన్నుఁ
బోర గెలుచువిధము - బోధింపు మనుటయు, సస్మితాస్యుఁ డగుచు - శాంతనవుఁడు.

క. నను మార్కొని గెలువఁగ న, య్యనిమిషులకు నరిది యనుడు - న ట్లగుటఁ గదా
నిను వేఁడెద నని కుంతీ, తనయుఁడు వలుకుటయుఁ దత్పి - తామహుఁడు గృపన్.

ఉ. చుట్టఱికంబునన్ మనసు - సొచ్చి ననుం గరఁగించి వేఁడినన్
దిట్టతనంబు వో విడిచి - తీవ్రరణంబుకడంక దక్కి నేఁ
బట్టినయాయుధంబు వెడఁ - బాసినఁ గాని వధింపఁ బోల ది
ట్టి ట్టన కేగు మిప్పరుస - యింతక కాలము గాదు దానికిన్. 67

## ధర్మరాజు గురుకృపశల్యులచేత యుద్ధమున కనుజ్ఞాతుం డగుట.

తే. క్రమ్మఱంగ నేతెంచెదు - గాక యనుడు, నతిముదంబునఁ బ్రణమిల్లి - యతనివాక్య
మవుడు దలనిడుకొనినవాఁ-డగుచు నప్పి, తామహుని నెమ్మివీడ్కొని-ధర్మసుతుఁడు

వ. కృష్ణార్జునాదులుం దోడన చనుదేర గురుకృపశల్యులకడకుం గ్రమంబున నరిగి పాదప్రణామంబు లాచరించి వారలచేత రణంబునకు ననుజ్ఞ వడసి యమ్మనుజపతి దనకు జయం బాశాసింపు మని యభ్యర్థించిన నయ్యాచార్యుండు నీకుం గృష్ణుండు మంత్రి యై యుండ నొరుల జయం బాశాసింపు మన నేల ధర్మం బెవ్వలనం గలుగు నవ్వలన కృష్ణుండు గైకొను నవ్వలనికి జయం బగు ననియె. నిజవధో పాయంబు వేఁడిన నతండు నాచేత నాయుధం బున్నంతసేపు నన్నుం జంప నెట్టి వారికి నశక్యంబు. ఏను బ్రాయోపవేశంబున సన్న్యస్తశస్త్రుండ నైనం జంపుటకు నోపునట్టివారికి నది దొరకొను. పెద్దయు నమ్మఁ గలవాఁడు సెప్ప నత్యంతదుస్స హం బైనకీడుమాట వింటి నేని యట్టివాఁడ నగుదు. అప్పు డట్టిపగఱకు నప్పని దీర్ప నను వై యుండు. అని చెప్పినఁ గృపాచార్యునిం బరిమార్చు తెఱంగు నడుగం దొడంగి యేర్పడం బలుక నేర కున్న నతం డెఱింగి తాను వధ్యుండు గామి యెఱిం గించి గెలువు మని దీవించె. మద్రపతితో నీవు రాధేయునకు సారథి వగుట సంభ వింప నోపు నని చెప్పి కయ్యంబునప్పుడు కర్ణుతేజంబు దూలం బలికి యతనిఁ జిక్కువఱుప వలయు నని వరంబు గోరిన నతం డవ్విధంబు నీయుద్యోగసమయం బున నియ్యకొనినయది గాదే యట్ల చేయుదు నని పలికె. ఇత్తెఱంగున నందఱ వీడ్కొని యజాతశత్రుం డనుజవర్గానుగతుం డై మరలె. అయ్యవసరంబున. 69

క. మొనలవినోదంబునకుం, గనుఁగొన నేతెంచి యున్న - కర్ణునికడకుం
జని హరి యి ట్లను నొండొరుఁ, గని యప్పటియుచితభంగి - గడతేర్చ తగన్. 70

తే. అమరతటినీతనూజుపై - నలుకఁ జేసి, యనికిఁ జొరవచ్చె యట్లైన - నతఁడు సచ్చు
నంతదాఁకఁ బాండవులకై - కొంత సమర, కేళి వేడుకఁ జలుపుట - పోలదొక్కొ.

వ. అనిన విని దేవకీనందనునకు రాధానందనుం డి ట్లనియె. 72

క. కినుక వొడమి గంగాపు, త్రునికయ్యమునప్పు డనికిఁ - దొలఁగితి నేనిం
జనుఁ గాకేఁ గురుపతి క, చ్చినప్రాణం బొండువలనఁ - జేర్పం దగునే. 73

వ. అనవుడు నప్పలుకులకు సంతోషించినవాఁ డయి వాసుదేవుండు గాంగేయులం
గూడఁ జనుదెంచె. ఇవ్విధంబున ధర్మనందనుండు గౌరవసైన్యంబు వెడలి నిలిచి
యద్దిక్కు మొగంబు సేసి యెలుం గెత్తి యి ట్లనియె. 74

తే. మమ్ము నెమ్మిమైఁ గలయఁ జి - త్తమ్ము గలుగు, వారలెవ్వరు గలిగిన - వచ్చికలయుఁ
డట్టివారిని నాతిమ్ము - లంతవారిఁ, గాఁగఁ బాటింతు నెంతయు - గారవమున. 75

వ. అనిన విని నీపుత్త్రుండు యుయుత్సుం డేను వచ్చెద నన్నుం గలపికొను మని
పలికిన దానికిం బాండవాగ్రజుండు ప్రియం బందినపలుకులు వలుకుటయు నతండు
దుర్యోధనాదులదుశ్చేష్టితంబు లుగ్గడించుచుఁ గాంగేయులగుణంబు లగ్గించుచు
నిజసేనాసమేతుండుగా నిస్సాణాదిరావంబులు సెలంగం జని ధర్మనందనుబలంబులం
గలసె. అది యట్టిద కాక సవతాలిప్రజలు పొంద నేర్తురే. అది య ట్లుండె. ఇట్లు
దన్నుం గలసిన సంతుష్టాంతరంగుం డగుచు నయ్యుధిష్ఠిరుండు యుయుత్సునకు
నత్యుపచారసమాచారంబులం బ్రమోదం బొనరించి 76

తే. రథముమీఁదికిఁ జనుదెంచి - పృథులసైన్య, హర్షఘోషణధ్వనులుఁ దూ - ర్యస్వనములు
నెగసి దివి ముట్ట మైమఱు - విడి తలిర్చ్చు, నెలమిఁ గోదండతూణీర - ములు ధరించె.

వ. తదవసరంబున నతనితమ్ములుం దక్కటిదొరలును దమతమరథంబు లెక్కి యెప్పటి
నెలవుల నిలిచినం దదీయవ్యూహంబు పూర్వప్రకారసన్నాహం బైయొప్పె. 78

* * * * * *

వ. తదనంతరంబ శస్త్రసంపాతనంబునకు సమయం బగుటయుఁ గపిధ్వజుండు గాండీ
వంబు పుచ్చికొని గుణంబు సారించి బాణపాణి యై నీకొడుకులం జూచి కృష్ణుని
తో ని ట్లనియె. 79

తే. కౌరవులలోన నిప్పు డె - వ్వారితోడ, ననికిఁ గడఁగుదునో చూచి - కొనఁగ వలయు
నరద మల్లన యుభయసై - న్యములనడిమి, నేల కటు వోవఁగా నిచ్చి-నిలుపు మచట.

## అర్జునుఁడు స్వజనసంహారంబునకు శంకించి మోహావిష్టుం డగుట.

వ. అనినగుడాకేశుపలుకులకు హృషీకేశుండు భీష్మద్రోణప్రముఖయోధవీరులు గనుం గొనుచుండ నత్తెఱంగున రథోత్తమంబు నిలిపి యతనితో నీ వీకూడినకౌరవులం జూడు మనవుడు నప్పార్థుండు రెండుబలంబులయందు నున్నసోదర సుత మాతు లాచార్యాదు లగుబంధుశిష్టజనంబుల నాలోకించి పరమకృపావేశంబున నత్యంత విషాదంబు నొంది గోవిందుమొగంబు గనుంగొని దుర్మదాంధుం డయినదుర్యో ధనుదుర్వినయంబున నింత వుట్టెం జూచితే యని పలికి వెండియు. 81

చ. సరసిజనాభ బంధుజన - సంతతిఁ గయ్యపునేలఁ జూడఁగా
విరవిరఁ బోయి మేను నిడు - వెండ్రుక వెట్టుచుఁ గంప మొందెఁ జే
నిరతము గాదు గాండివము - నిల్వఁగ నోర్వవు గాళ్లు నేను ని
ష్ఠురతికిఁ జాల నొల్ల నొకఁ - డున్ మహి యేలుట యేటిసౌఖ్యముల్. 82

తే. ఎవ్వరికిఁ గాఁగ ధరణియు - నెల్లసుఖముఁ, గోరెదము వార లందఱు - వీరె వచ్చి
ప్రాణములు నర్థములు నొల్లఁ-బాటు సేసి, కయ్యమునఁ జావ నఱుముట-గంటి గాదె.

ఉ. తాతల మామలన్ సుతులఁ - దండ్రులఁ దమ్ముల నన్నలన్ గురు
వ్రాతము శిష్టకోటి సఖి - వర్గముఁ దుచ్ఛజనానురూపదు
ర్నీతి వధించి యేఁ బడయు - నెత్తుటఁ దోఁగినరాజ్యభోగముల్
ప్రీతి యొనర్చునే యశము - పెల్లొడఁగూర్చునె పెం పొనర్చునే. 84

క. అక్కడిబంధులఁ జంపుచు, నిక్కడిబాంధవులు సచ్చు - టియ్యకొనుచు నిం
దెక్కడిపెం పొందెదఁ దుదిఁ, ద్రెక్కొనుఁ బాపంబు రణము - తెరు వే నొల్లన్.

ఆ. ఎల్లభువనములను - నేలుటకైనను, నిట్టిక్రూరకర్మ - మెట్లు సేయ
వచ్చుఁ గడఁగి;యెదిరి - వారేమి సేసిన, మాఱుసేయ నాకు - మనసు రాదు. 86

చ. అకట నితాంతలోభమున - నావలఁ బాటిలుకీడు గానఁ జా
లక ధృతరాష్ట్రసూనులు కు - లక్షయ మయ్యెడుదాని కోర్చి పో
రికిఁ దెగి వచ్చి రక్కలుచ - రెండు నెఱింగెడునీవు నేను దీ
నికిఁ జొర నేల వీరి నిటు - నిర్దయఁ జంపిన నేమి యయ్యెడున్. 87

క. కులనాశము సేసినఁ ద, త్కులధర్మము లడఁగు నష్ట - కులధర్ములకుం
గలుగును దుస్సంకర మ, క్కులఘ్నులు లేగుదురు నరక - కూపంబులకున్. 88

తే. ఇంతపాపంబు సేయంగ - నెత్తికొందు
రయ్య రాజ్యలోభంబున - నఖిలబంధు
జనుల వధియింపఁ దొడఁగితి - నని రథంబు
మీఁదఁ గూర్చుండఁబడియెఁ జే - యూఁదికొనుచు. 89

వ. ఇవ్విధంబున శోకసంవిగ్నమానసుండును విషాదవిహ్వలుండును బరమకరుణాభరితుండును నై శరశరాసనంబులు విడిచి కన్నీరు దొరంగ నూర కున్న సవ్యసాచిం జూచి మధుసూదనుం డి ట్లనియె. 90

క. దెప్పరపుఁజోట నీ కీ, యొప్పనివిధ మెచటనుండి - యొదవెను విను మీ
చొ ప్పవివేకులయది యిది, దప్పించును సద్గతియు ను - దాత్తయశంబున్. 91

వ. అని మఱియును. 92

తే. తగునె యర్జున యీ పెంటి - తనము నీకు, దండి వై లెమ్ము మనసు పే - దఱిమి విడిచి
యనిన న ట్లున్న భంగిన - యల్ల నిట్టు, లనియె నాతండు పుండరీ - కాక్షుతోడ. 93

సీ. అక్కట పూజార్హు - లగుద్రోణభీష్ముల, నమ్ముల నొప్పింప - నగునె చెపుమ
మాన్యులఁ జంపుట - మగపాడి గాదు భి, క్షాశనం బైన న - త్యంతసుఖము
కడఁగి యెవ్వరిఁ జంపఁ - గాఁ బెద్ద బ్రదు కయ్యు, నూహింప బ్రదుకుగా - కుండునాకు
విను మట్టిధృతరాష్ట్ర - తనయులు గారె యీ, యొడ్డిన మొనలలో - నున్న వార
లింద్రియముల నెల్ల - నివురంగఁ జేయుచు, నడరుశోకవహ్ని - యాఱ నేర
దింద్రపదవి సేరె - నేనియుఁ గావున, భండనంబు సేయ - కుండువాఁడ. 94

వ. ఎల్లభంగుల గురుజనంబుల నొప్పించుటకుం జాల. వారిని గెలిపించుటయును మనము వారల గెలిచినవారల మగుటయు ననునీరెంటియందును బెద్ద మేలెయ్యది. ఏను గార్పణ్యదోషోపహతస్వభావుండను ధర్మసమ్మూఢచేతస్కుండను నై నిన్ను శరణు సొచ్చి యడిగెద. నీశిష్యుండ నగునన్ను శాసింపుము. అనిన విని కలకల నవ్వి నారాయణుండు నరున కి ట్లనియె. 95

చ. వగవఁగ నేమియుం దగని - వారికి నై హృదయంబు గుందఁగా
వగచెదు బుద్ధిమాటలును - వావిరి నాడెదు నీవు పండితుల్
వగతుర యున్నవారికి న - వశ్యవిధేయతఁ జన్నవారికిం
దెగ వగ లెల్లఁ జిత్తము ప్ర - దీప్తవివేక మయత్వ మొందినన్. 96

వ. అని పలికి పార్థునిం బరమజ్ఞానంబునకుఁ గారణంబు లగువాక్యంబులు వినుటకుం జొనిపి యుద్దేహంబునందు బాల్యంబు యౌవనంబు వార్ధకంబు ననం గలుగు

నవస్థలం బొందినట్లును జీర్ణంబు లైనవస్త్రంబులు విడిచి నూతనంబు లైనవానిం గైకొనినచాడ్పునను గాని దేహాంతరగమనం బాత్మహానిం జేయ దనియుఁ బుట్టువుఁ జావు నననివి లేమింజేసి శరీరంబువోలె శస్త్రచ్ఛేదనంబు మొదలైన వికృతికారణం బులకు నాత్మండు లోను గాఁ డనియు నప్పురుషుండు నొప్పించువాఁడును నొప్పింపంబడియెడువాఁడును గాఁ డనియుం జెప్పి మఱియు ననేకవాక్యంబుల నాత్మకు నభావంబును శరీరంబునకు భావంబును గలుగమి దెలిపి యాత్మతత్త్వంబు శాశ్వతం బగుట యెఱింగించి యి ట్లనియె. 97

## శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానోపదేశంబు సేయుట.

ఆ. ఇట్టు లగుటఁ జేసి - యెవ్వరిదెసకు శో, కంబుఁ బొందఁ గార - ణంబు లేదు
జీవుఁ డెల్లభంగిఁ - జెడువాఁడు గాఁడని, తలఁచితేని వగపు - వలదు మున్న. 98

క. పురుషుఁడు సెడు ననువాఁడును, బురుషుఁడు సెఱుచు నని పలుకు - పురుషుండును న
య్యిరువురు నవివేకుల య, ప్పురుషుఁడు సెఱుపండు సెడఁడు - భుజవీర్యనిధీ. 99

క. పురుషుఁ డన వే ఱొకండే, పురుషోత్తముఁ డైనయేన - పురుషోత్తమతా
స్ఫురణకుఁ బురుషత్వం బను, మెరమెర గల దదియ కాదె - మెయికొనుఁ గ్రియకున్.

వ. అని వెండియు వివిధవాక్యంబుల నాత్మునకు బాధ్యబాధకత్వంబులు లే కునికి వివరించి విప్వచ్చునకుం గృపాశోకంబులకు మూలంబు లగునహంకారమమకా రంబులు వారించి యతనికి రణోత్సాహంబునకుం గారణం బైనస్వకర్మావలంబనంబు వదలం దగమి దెలియుటకు వలయువాక్యంబులు పెక్కు లుపన్యసించి. 101

క. సమరంబు రాజులకు ను, త్తమకర్మం బది యపాప్య - తస్వర్గద్వా
రము సుమ్ము లెమ్ము దగఁ గ, య్యము సేయుము దీని కేల - యనుమానింపన్. 102

క. ఫలములయెడ బ్రహ్మార్పణ, కలనపరుం డగుచుఁ గార్య - కర్మము నడపన్
వలయుం దత్త్వజ్ఞానము, తలకొనినం గర్మశమము - దానై కలుగున్. 103

వ. అని మఱియు నీదృశంబు లగువాక్యంబు లనేకంబు లనుగ్రహించుచు వివిధ ప్రకారంబుల వికల్పించి విజయుం డడిగినవాని కెల్ల సదుత్తరంబు లిచ్చి సందే హంబు వాపుచు. 104

క. వైరమున నులిచి త్రెంపక, కారాకులు డుల్లినట్లు - కర్మము లెల్లం
దార పెడఁబాయవలయుట, సారకృపం దెలియఁ జెప్పె - శౌరి యతనికిన్. 105

వ. ఇవ్విధంబునం జెప్పిన విని కవ్వడి సముత్థితుం డై జగన్నాథున కి ట్లనియె. 106

మ. అతిగుహ్యం బిది నీవు భూరికృప నీ - యధ్యాత్మముం గానఁ జే
సితి నా కిమ్మెయి విన్కిఁ గొంతిభ్రమ వా - సెన్ యోగిహృద్ధ్యేయ మై
యతులైశ్వర్యవిభూతి నొప్పుభవదీ - యం బైనరూపంబు చూ
చుతలం పెత్తెదుఁ బోలునేని దయఁ జ - క్షుర్గ్రప్రీతిఁ గావింపవే. 107

వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 108

క. నానాస్ఫుటవర్ణంబులు, నానాభంగులును గలుగు - నారూపములో
నానాశ్చర్యవిధంబులు, గానఁగ నగుఁ జూపెదం బ్ర - కాశంబొప్పారిన్. 109

క. విను మానుషచక్షుర్గతిఁ, గనుఁగొన శక్యంబు గాదు - గావున దానిం
గనుటకయి దివ్యచక్షు, ర్జననం బొనరింతు నీకు - శత్రువిదారీ. 110

వ. అని యతనికి దివ్యదృష్టి యొసంగి యోగీశ్వరేశ్వరుం డైనయాలక్ష్మీశ్వరుండు దన దివ్యరూపంబు సూపె ఆవిశ్వరూపునిదివ్యతేజంబు సహస్రసూర్యప్రభానిభం బనుటయుం జాల కుండెం గావున వాక్రువ్వం గొలఁది గాదు. అట్టిమహామూర్తిఁ గనుంగొని ధనంజయుండు విస్మయరోమహర్షణప్రహర్షోత్కర్షంబులతో దండ ప్రణామంబులు సేసి నిలిచి కేలు మొగిడ్చి యి ట్లనియె. 111

## అర్జునుఁడు శ్రీకృష్ణునివిశ్వరూపంబు గనుంగొని స్తుతించుట.

సీ. దేవ నీ దగుదివ్య - దేహంబునందు సు, రసుగంధర్వ - లాది గాఁగఁ
గలదేవయోనులుఁ - గమలాసనుండును, సచరాచరం బైన - జగము నాకుఁ
దోఁచె మొగంబులు-దోర్దండములును బా, దములుఁ గన్నులు న నే - కములు గంటి
మకుటాదిభూషణ - నికరంబుఁ జక్రగ, దాద్యాయుధములు మా - ల్యాంబరములుఁ
బెక్కు గాన వచ్చె - నక్కజ మై యిది, నడుము మొదలు దుది య - నంగ రాదు
తేజ మప్రమేయ - దేదీప్యమానని, ర్వికృతిమహిమ దుర్ని - రీక్ష్య మయ్యె. 112

క. జగములకు నాదికారణ, మగుపరమజ్ఞేయ మీవ - యని కనియెద భూ
గగన దిగంతర మంతయుు, నగణితమూర్తి భవన్మ - యం బై తోఁచెన్. 113

వ. చంద్రార్కులు లోచనంబులుగాఁ గలిగి దంష్ట్రాక రాళంబు లైననీముఖంబులు ప్రజ్వరిల్లుచున్నయవి. నిన్ను రుద్రాదిత్య మరుద్వసువులు ప్రవేశించెదరు. సంఘంబు లై వచ్చి మహామునులు ప్రస్తుతించెదరు. సిద్ధసాధ్యవియచ్చరులు వెఱఁ గంది వీక్షించెదరు. ఇట్లు దీప్తోగ్రం బగుభవదీయదివ్యరూపంబు గనుంగొని నాకు విభ్రాంతి వొడమి ధృతి దూలి సుఖంబు వడయ నేరక చిక్కువడి యున్నవాఁడ. ప్రసన్నుండవగుము. రక్షింపుము. 114

మ. అనలజ్వాలలు పర్వనీముఖములం - దాధార్తరాష్ట్రప్రజం
బును భీష్మాదులు నిర్దేసం గలుగునీ - భూపాలలోకంబు గ్ర
క్కున నొక్కుమ్మడి వచ్చి చొచ్చెదరు నా - కుం జెప్పవే యెవ్వరో
యని శంకించెద నిన్ను భూరికరుణా - యత్తైకచిత్తుండ వై. 115

వ. అనవుడు నప్పరమేశ్వరుం డేను లోకక్షయకర్త యగు కాలుండ. ఇచ్చో జనసమాజ సమాహరణంబునకుఁ బ్రవృత్తుడ నైతి నీవు చంప వలయు నని లేదు. ఈగురు భీష్మాదు లెల్లను లే కుండువార నా చేతం జచ్చినవారి నెల్లను జయించినవాఁడ వగుటకు నిమిత్తమాత్రమ్ము గమ్ము లెమ్ము రాజ్యమ్ము గైకొను మనిన విని వడవడ వడంకుచుం జేతులు మొగిడ్చి గద్గదకంఠంబుతో గాండీవి యి ట్లనియె. 116

తే. అంబుపవమానయమార్కచం - ద్రానలాది వివిధతత్త్వంబులును నీవ - విశ్వలోక
సంప్రవర్తనకరుఁడవు - శాశ్వతుండ, వచ్యుతుండవు పుండరీ - కాక్ష నీవు. 117

క. నిను నెఱుఁగక కుండె యాదవుఁ, డని సఖుఁ డని మేనబావ - యని యే సహాభో
జనములు సల్లాపంబుల, నొనరించుచు మేల మాడు - చుందుదు నెప్పుడున్. 118

తే. మఱియుఁ బెక్కులు లోకసా - మాన్యభంగు, లాచరించితి నీ దెస - నంతవట్టు
దల్లిదండ్రులు ప్రజలకుఁ - దప్పు దారు, లెల్ల సైరించునట్లు స - హింపవలయు 119

వ. అని సంప్రార్థనంబు సేసి పార్థుండు వెండియు ని ట్లను అదృష్టపూర్వం బైనభవదీయరూపంబు గనుంగొనం బడయుటం బ్రమోదంబును బిట్టు చూచిన వెక్కసంబును బ్రవ్యథయును బుట్టియున్నయవి నీ తొంటి సౌమ్యాకారంబు గైకొని నిలిచి నాకు నాహ్లాదంబు సేయుము. 120

చ. అనుడు దయార్ద్రచిత్తుఁ డగు - నప్పరమేశ్వరుఁ డక్కిరీటి క
ట్లనుఁ దయ మాచరించి నిని - క్కాస్యయనం బొనరించి కానవా
దవఘు మదీయవిశ్వపర - మాకృతి నిచ్చినయేకభక్తిభా
వనమునఁ దోఁచు దీని జన - వర్గము గానదు నీక చూపితిన్. 121

వ. నీకు హృదయవ్యథం బొంద నేల. మూఢత్వంబు విడిచి విగతభయుండ వై సంప్రీతచేతస్కుఁడవు గమ్ము. అని చెప్పి పూర్వప్రకారరూపంబు దాల్చి నిల్చినం గనుంగొని కౌంతేయుండు సౌమ్యరూపంబు చూచి సచేతనత్వంబు నొందితిఁ బ్రకృతిస్థుండ నైతి నని పలుకుటయు వాసుదేవుండు మత్కర్మపరుండును మద్భక్తుండును నైన వానికి నన్నుఁ బడయ వచ్చు నని యతని నాశ్వాసించి. 122

తే. అతఁడు మఱియును బ్రహ్మవి - ద్యాన్వయమునఁ
దనకు సందిగ్ధమైనట్టి - దాని నెల్ల
నడుగఁగా నమ్మహాత్ముఁ డ - త్యంతకరుణఁ
దెలియఁ జెప్పుచు హృదయసం - చలత మాన్చె. 123

వ. ఇవ్విధంబునఁ బార్థున కుపనిషదర్థజాతం బవగతంబు సేసి మనసుకసటు వాపి వివేకంబునకుం జేవ గలిగించి కృష్ణుం డీగుహ్యాతిరజ్ఞానం బుపదేశించితి దీని నెఱింగి కొని నీ కెట్లు చూడం బోలె నట్లు ప్రవర్తింపు మని పలికి యింతకంటెం బరమ రహస్యం బొక్కటి సెప్పెద వినుమని యతని కిట్లనియె. 124

తే. క్రందుకొను సర్వధర్మవి - కల్పములను
నెడల విడిచి దృఢంబుగ - నే నొకండ
శరణముగ నాశ్రయింపుము - సకలగురిత
ములకుఁ దొలఁగింతు నిన్నుఁ బ్ర - మోద మొంద. 125

వ. ఇప్పరమోపాయంబు. 126

క. నియతియుఁ దపమును నీదెస, భయభక్తులుఁ గలిగి నాకు - భక్తుం డై ని
శ్చయనిష్ఠుఁ డయినవానికిఁ, బ్రియమున నెఱిఁగింపవలదు - పెఱవారలకున్. 127

వ. అని వెండియుఁ బుండరీకాక్షుండు నాచెప్పినయది లెస్సగా నాకర్ణించితే నీయ జ్ఞానసమ్మోహం బంతయుం బాసెనే యనవుడు నర్జునుండు 128

ఉ. మోహతమంబు వాసెఁ దుది - ముట్టిననీదుప్రపత్తి వీతసం
దేహుఁడ నైతి గాఢపరి - దీప్తమహాకృతిఁ గాంచి బోధస
న్నాహనిరామయస్థిరమ - నష్ఠ్నితిఁ బొందితి సర్వలోకని
ర్వాహవినోద నీవిమల - వాక్యముచొప్పున నెల్లఁ జేసెదన్. 129

వ. అని పలికి యప్పరమపురుషునకు సభక్తికసాష్టాంగదండప్రణామంబు సేసి పార్థుండు కృతార్థుం డై ధృతాయుధుం డయ్యె. అని చెప్పి సంజయుండు వెండియు నిట్లను. కురుకులేశ్వరా యేను మునిగణేశ్వరుం డైనపారాశర్యు కారుణ్యంబునఁ గృష్ణార్జునుల యద్భుతపుణ్యసంవాదంబు వినుటకు మహాయోగీంద్రహృదయానందకరుం డైన యద్దేవునిదివ్యరూపంబు గనుటకుం బాత్రభూతుండ నైతి. అమ్మహాత్ముండు దన మధురవాక్యంబుల నుపదేశింప నత్యంతగుహ్యం బైనయోగప్రకారంబు విశదంబుగా ననుసంధించితి. అమ్మహానుభావులసంభాషణంబులు నవ్విశ్వరూపునిమహనీయా

కారంబునుం దలంచి తలంచి యచ్చెరు వందుచుఁ బ్రియం బందుచు నుండుదు నని మఱియును. 130

తే. అధిప యోగేశ్వరేశ్వరుం - డైనకృష్ణుఁ, డును ధనుర్ధరవర్యుఁ డ - ర్జునుఁడు నెచట
నిలిచి రచ్చట విజయంబు - నీతి సిరియు, భూతి నిత్యంబు లగు నిది - నాతలంపు.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డి ట్లనియె. 132

క. ఇవ్విధమున నాయిత మై, క్రొ వ్వేలరారంగ నిలిచి - కురుపాండవులం
దెవ్వరు మును గడఁగిరి రణ, మెవ్విధి నూలుకొని చెల్లె - నెఱిఁగింపు తగన్. 133

---

# 20. భీష్ముని నవమదివసయుద్ధము.

(భీష్మపర్వము. ఆ. III.)

వ ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగమథనం బగుప్రధనంబు సేసె. అట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబు లను కిరణంబులు పఱఁగించి. 1

సీ. పంద్రెంటఁ బంద్రెంటఁ-బాండవాగ్రజునిభీ, మునిమాద్రికొడుకుల-మూఁటమూఁట
నేడింట నేడింట-నేచి సాత్యకిని ధృ, ష్టద్యుమ్ను నొప్పించి-సమదవృత్తి
నార్చిన మాత్స్యపాం-డ్యానీకములును సో, మకవరూథినియును-మగధబలముఁ
గాశసైన్యంబుఁ గ-రూశసేనయు నొక్క, పెట్ట రయంబున-భీష్ముమీఁద
నురవడించినఁ బాండవో-త్కరముఁ గృష్ణు, తమ్ముఁ బాంచాలనందను-సమ్ముఖమున
కడర నీ కాఁగి యందఱ-కన్నిరూపు, లై మహారణ మొనరించె-నస్త్రగురుఁడు. 2

ఉ. శాంతనవుం డనేకబల-సంతతి నుద్భటశౌర్యసారదు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ-దాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథిత-కంపితపాతితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దనర-ధంబు గతుల్ మెఱయం బ్రదీప్తుఁ డై. 3

మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురం-గప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూ-ర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులన్ శరాసనగుణ-వ్రాతంబుఁ దుస్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదో-ర్గర్వం బఖర్వంబుగాన్. 4

వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడి గొని మార్కొన మగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడ మఱియునుం గడంగి దుర్వారంబులగు దివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేదిక్కు సూచినం దాన యై రథికులను హాస్తికులను నాశ్వికులనుం దునిమిన గంధసింధుర క్రీడనంబున మ్రోడుపడినయుద్యానంబుచందంబున నగు మన్నచోట్లును గాలుబలంబులం గనుపుగొట్టినం గాలుచేయి తల డొక్క యని యేఱుపాటు లేక వండం దఱిగినయట్లున్నయెడలును బెక్కుదెఱంగుల చప్పళ్లు నిగుడ రథచయంబులవయవంబులుం గరిహయనికరంబుల యొమ్ములు

విఱుగం గార్చిచ్చు పొదివిన వెదురుటడవి తెఱంగునం దోఁచుపట్లును దఱచుగోడు గులు విటతాటనంబు సేసినం బెనుగాలిం జిక్కుపడినకుసుమితకాశవనంబునుం బోలుచక్కట్లును బహురత్నమయమకుటాదిభూషణవ్రజంబు వివిధవర్ణచామరజాతంబు నఱికి పడ వైచినం బ్రబలోద్ధతలులాయలులితం బయి కమలకైరవోత్పలాకీర్ణం బగుకొలని ననుకరించుప్రదేశంబులును నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండుగొనియు బెండుపడియుఁ గలంగం బాఱియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహుళంబు లగుట గనుంగొని గోవిందుండు. 5

ఉ. అర్జున చూచితే మనబ - లావళి నెల్లఁ గలంచుచున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు - నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ - జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయదర్పవిభ్రమము - దోఁపఁగఁ జేయకి యున్కి యొప్పునే. 6

వ. అనిన విష్వచ్చుండు విచారడోలాయత్తం బగుచిత్తంబుతోడ నిరుత్సాహుం డై యున్నం జూచి వెన్నుం డతని కిట్లనియె. 7

క. మును మత్స్యనాథునగరం, బున సంజయుతోడ నీవు - పొంగుచు బెట్టా
డినమాట లెల్ల మఱచిన, నిను నగరె రథికవరు ల - నింద్యచరిత్రా. 8

వ అనుటయు నర్జునుండు. 9

ఆ. సకలబంధుజనులఁ - జంపి కౌరవహీన, మైనరాజ్యమహిమ - యేను బడసి
యనఘ యేమి సుకృత - మాచరించినవాఁడ, నగుదు మనసు గొలుప - దయ్యె ననికి.

వ. అయిన నీతో నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటికొడుకుం బడ వైచెదం దేరు నడపు మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు సమ్ముఖంబుగా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం దెరలినసైన్యంబులు గూడికొని గాంగేయుపయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు నిలువరించి సింహనాదంబు సేసి. 11

మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిన్ - గాండీవియంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగా - త్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశర - స్ఫూర్యత్పాస్యముల్ గాఁగ స
త్వరుఁ డై యేసి రథంబు గూడఁ బొదివెన్ - వాలంపమొత్తంబునన్. 12

వ. అప్పుడు. 13

తే. బీఱువోయి రథ్యంబులు - మాఱు మొగము, వడినఁ దా నొచ్చియుండియుఁ - దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన - వ్రాలి తీవ్ర, భల్లమునఁ గ్రీడి భీష్ముని - విల్లు దునిమె.

క. అతఁ డొండొకవి ల్లెత్తిన, నతిరయమున నదియుఁ దునుమ - నాతం డౌరా
శతమఖనందన యనుచును, ధృతి వేఱొకవింట శరత - తిం బరఁగించెన్. 15

క. ఆ బెట్టిదంపుటంపఱ, చే బీభత్సుం డొచ్చి - చేడ్పడి మఱియుం
దా బంటుతనము పటుబా, హాబలముగఁ బోరు చుండె - నంగము దూలన్. 16

క. వివ్వచ్చునొవ్వ నెంతయుఁ, గ్రొవ్వున భీష్ముండు గడఁగు - కోల్తలయుం ద
క్కెవ్వరు నాతనిఁ జేరక, దవ్వుల నిల్చుటయుఁ జూచి - తనచిత్తమునన్. 17

క. దారుణరోషం బడరఁగ, నారాయణుఁ డపుడు సైర - ణం దొరఁగి వెసం
దేరినొగలఁ బగ్గము లిడి, క్రూరత మునికోల యెత్తి - కొని యిల కుఱికెన్. 18

## శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిం బోవుట.

వ. ఇట్లు లంఘించి. 19

మ. ధరణీచక్రము గ్రక్కునం గదల ది - గ్దంతావళశ్రేణికం
ధరముల్ మ్రొగ్గఁబడన్ దిశావలయ ము - త్కంపంబు గా నీబలం
బురులం బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌ - ద్రోద్రేకముం జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చం - చద్బాహుఘోరాకృతిన్. 20

తే. లలితపీతాంబరంబువి - లాస మొప్ప, సింహనాదోద్భటం బగు - చెలువుతోడ
మెఱుఁగు వెలుఁగునుగర్జయు - మెఱయవచ్చు, కారుమొగులనఁ గృష్ణునా - కార మొప్పె.

వ. అట్టియెడ. 22

క. బలుజీవము వోయిన వెల, వెలఁ బాఱుచు నీదుయోధ - వీరులు వొలిసెం
బొలిసె నదె భీష్ముఁ డనుచును, గలఁగం బడి యఱ్ఱు లెత్తి - కనుఁగొను చుండన్. 23

చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వి - కాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మ - హాత్మ వికస్వరపుండరీక లో
చన యిది లెస్స నా కిచట - శాశ్వత మైనయశంబు వచ్చుట
న్నినుతికి నెక్కుసద్గతియు - నీదయఁ జేకుఱఁ జేయు మిష్టమున్. 24

వ. అని పలుకునంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గ నుఱికి వెన్ను
వెనుక నొయిది కరంబులఁ గ్రుచ్చి పట్టిన నతండును దిగిచికొని వెండియుం బోవం

బోవఁ బదియడుగులకొలంది నాకౌంతేయుండు పదస్థైర్యంబును బాహువీర్యంబును మెఱయ మహీతలం బూని మెట్టి నిలువం బట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దను జమర్దనుతో ని ట్లనియె. 25

ఉ. కయ్యము సేయ నే నని య-కల్మషబుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ-మే మను నించుకసేపు పోరులన్
డయ్యుట దప్పె నాపయిఁ గ-డంగినభీష్మునిపాటు సూతు రా
వయ్య రథంబుమీఁది కిటు-లాశ్రితమానము వీఁటిఁబుత్తురే. 26

వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె. అయ్యిరువురు నెక్కినయరదంబు శిఖరద్వయసుందరం బైనశైలంబునుంబోలెఁ బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగువారిదంబుకరణి గర్జిల్లుచుఁ బటునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడుపఱిచి యచ్చట నొండొరుల మెచ్చక యఱిమి తఱిమిన వైరివీరుల రూపుమాపి భీష్ముండు భీషణాకారుం డై పరిశ్రాంతులైనకృష్ణార్జునులును భీతు లగుభీమసేనప్రముఖులును జేయునది లేక చూచుచుండం బాంచాలబలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి సలిచీమలం గాలం జమరుచందంబు దోఁచె నయ్యవసరంబున. 27

క. తా నస్త్రశిఖరి మఱువడఁ, బోనియపుడు పాండురాజ-పుత్త్రవిరాజ
త్సేన పొడ వడఁగు ననుకృప, నో నలినాప్తుండు గ్రుంకె-నుర్వీనాథా 28

వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయంబునం బంకనిర్మగ్నయైన గోవునుం బోలె నున్ననిజసేనం జూచి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యప్పటికిం దిగుచుటయ కర్జంబుగాఁ దలంచి తిగువారలనెల్లం దివియ నియమించి. 29

క. గాంగేయుచేత నెంతయు, భంగపడితి మనుచు వగచు-పార్థాదులు ద
న్నుం గొలిచి చనఁగ విడిదల, కుం గడు విన్న నయి పోయెఁ-గురువంశనిధీ. 30

వ. ఇట్లు పాండవవ్యూహంబు లోఁహటించి పోయినం దారును దమబలంబులఁ దివియ నియమించి. 31

చ. ఎలమి నమస్కరించుచు న-హీనపరాక్రమభంగు లేర్పడం
బలికి యుదాత్తవాక్యములఁ-బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్బలసి భవత్తనూజులు మ-నంబులు నిండి ముదంబు మోములన్
వెలి విరియంగ నేగిరి న-వీనవిభూతి నివాసభూమికిన్. 32

వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవనాఁటిబవరంబున బెండువడి యానిశాసమయంబు
నందు రహస్యప్రకారంబున. 33

క. మనమున విషాద మడరఁగ, ననుజులఁ గూర్చికొని దాన - వాంతకుసదనం
బునకుం జని యిట్లను నా, తనితో నాత్మీయకార్య - దశ దెలియుటకున్. 34

క. కార్చిచ్చు గవిసి మృగతతి, నేర్చుకరణి నేఁడు భీష్ముఁ - డేచినకడిమిం
బేర్చి మనసేనఁ బొదివె శ, రార్చుల నవ్వీరుఁ గన్ను - లారం గంటే. 35

మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దు - ర్మానంబునంజేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను ని - ర్మూలంబుగాఁ బోరఁ జ
చ్చిన సామ్రాజ్యము గొన్నయట్లగునె ని - శ్చింతంబునం గాననం
బునకుం బోయెదఁ దమ్ములం గొని తపః - పూజ్యుండ నై యుండెదన్. 36

క. మున్నును నేఁ గారణము గ, నన్నియిడుమ లనుభవించి - రనుజులు వీరిం
గ న్నారఁ జూతుఁగాని జ, గన్నుతి భీష్మునకుఁ గోలు - గా నీఁ జాలన్. 37

వ. నీకు మాదెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు దక్కి ధర్మవిరోధంబు గాకుండు
నట్టియొక్క తెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి సాంత్వనవచ
నంబుల ననునయించి యతని కిట్లనియె. 38

క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ, వత్యద్భుతబాహువీర్య - లనుజన్ములు దో
ర్గత్యము గల్గునె నీకు న, మాత్యుఁడ నై యేను రాజ్య - మహిమ నొనర్తున్. 39

క. వగవఁగ నేటికిఁ బార్థుఁడు, దెగువకుఁ జొర కున్న భీష్ముఁ - దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నా, మగిడింపక చూచు చుండు - మనుజాధీశా. 40

తే. సఖుఁడు సంబంధి శిష్యుండు - సవ్యసాచి, నాకు నతనికినై యేను - నరప రేణ్య
కూర్మిమై నిత్తుఁ గండలు - గోసి యైన, నరయ నాతండు నాయెడ - నట్టివాఁడ. 41

వ. ఉపప్లావ్యంబున నతండు సంజయుతో నాడినబలుమాటలకు నులూకుండు వచ్చి
నప్పు డతనిపలుకులం బుట్టినబెట్టిదంపుఁ దనంబునకుం దగినయంత నాకుం జేయ
వలయు. నేను నీరెండెడలం బెక్కులు పలికినవాఁడ. మాకిరువురకు నొండొరువుల
పలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మ
నందనుం డిట్లనియె. 42

క. కయ్యము సేయక తగునా, హాయ్యము సేయఁ గలవాఁడ - నని పలికితి, ని
న్నియ్యెడ నే బొంకింతునె, దయ్యము నా కేల యిట్టి - దైన్యము దెచ్చెన్. 43

వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబు గలదు. అమ్మహాత్ముండు గౌరవులకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం బగుకార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁడు. అతండు రాజ్యం బొసంగు నని పలికి సఖేదంబుగా ని ట్లనియె. 44

ఆ. అకట తండ్రి సచ్చి - నంతనుండియు మము, నరసి ప్రోచినట్టి - యనుఁగుఁదాతఁ
జంప మదిఁ దలంచు - తెంపు సూచితె రాజ, ధర్మ మింత క్రూర - కర్మ మగునె 45

వ. అనవుడు. 46

తే. విని మురాంతకుఁ డితఁడు శాం-తనవుఁ డకు, నరుగఁ జూచినవాఁ డని-యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నేతెంచెదు-గాక యనిన, యన్నదీసూనుతోఁ ంటివా-క్యములు దలఁచి.

వ. అజాతశత్రున కి ట్లనియె 48

ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట.

ఆ. నీతలంపు లెస్స - నీవు ము న్ననినట్ల, కాక భీష్ముఁ దలుక - గదిరి పోరఁ
జక్కఁ జూచె నేని - శత్రువుల్ వోలియరె, యిప్పు డతనిపాలి - కేగు మధిప. 49

సీ. నీవు ద న్నడిగిన - నిజవధోపాయం బ, వశ్యంబుఁ జెప్పు దే - వవ్రతుండు
మనము రహస్యవ - ర్తనమున నందఱ, మును చని యమ్మహా - త్మునకు భక్తి
నెఱఁగి తెల్లంబుగ - హితకార్యగతి విన, యంబుస్పైఁ బ్రార్థించి - యడిగి యతని
సదయమంత్రోపదే - శంబున నెగడుద, ముని యిట్లు హరి నిశ్చ - యంబు సేయ
నయ్యజాతశత్రుఁ - డనుజులు నతఁడును, దాను సౌమ్యవేష - ధరణ మొప్ప
నతినిగూఢవృత్తి - నాపగాసుతుమంది, రమున కరిగి సముచి-తముగఁ జొచ్చి. 50

వ. అతనిం గాంచి యధికభక్తిం బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం బ్రణమిల్లిన నతిం డత్యాదరంబునఁ బేరువేర వార లందఱ సేమంబు లడిగి యి ట్లనియె. 51

క. ఇచ్చటికి మీర లందఱు, వచ్చినపని యేమి యేది - వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను, జెచ్చెరఁ దలకొని ఘటింపఁ - జేసెదఁ బ్రీతిన్. 52

వ. అని తెలి వొందినమొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం డతని కి ట్లనియె. 53

క. మాకెమ్మెయి సామ్రాజ్యము, సేకుఱు నెబ్బంగి బహుళ - సేనోత్పాద
వ్యాకులత రాక తక్కుం, జేకొని యత్తెఱఁగు కరుణఁ - జెప్పఁగ వలయున్. 54

క. అనవుడు నేఁ బెనఁగఁగఁ మీ, కనఘా సైన్యక్షయంబు - నగు సామ్రాజ్యం
బును గా నేరదు గావున, నను నిర్జింపంగ శోభ - నము లెల్ల నగున్. 55

వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుండు. 56

ఉ. చిచ్చఱకన్ను మూసికొని - చేత త్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున - వ్రాలుదు వీ వనిలోన నోర్వఁ గా
వచ్చునె నిన్ను నెట్టిమగ - వారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిన్ గెలువ - వచ్చు మహాత్మ యెఱుంగఁ జెప్పవే. 57

క. అనుటయు నిట్లను గంగా, తనయుఁడు నీ చెప్పినట్ల - తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురే చే, ధను వుండఁగ వినుము తద్వి - ధము దేటపడన్. 58

తే. ఇట్టివానిఁగ నన్ను మీ - రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా - యిట్టు లడుగ
మీకుఁ బ్రియ మైనకార్యంబు - మెయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు - గలదె నాకు. 59

వ ఏ నాయుధవ్యాపారంబువలన నుదాసీనత్వంబు నొందిన నన్నుజయింప సమకూ
రు. జోడు వుచ్చినవానిని గైదువుఁ బెట్టినవానిని సిడంబు డించినవానిని నంగనను
నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ దలచీర వీడినవానిని భ్రాతృహీనుని నపుత్ర
కునిం గని యేటుఁ బోటుఁ దక్కి సమరంబు సేయ మానుదు. మఱియు నొక్క
వ్రతంబు పూనినవాఁడను పుట్టినప్పుడు లేక నడుమ దైవం బిచ్చినపురుషత్వంబు
గలవానితోడఁ గయ్యంబు సేయను. కావున మీకు నుపాయంబు సెప్పెద ద్రుపదు
నపత్యం బైనశిఖండి యట్టివాఁ డగుట మీరెఱుంగుదురకాదె. విశేషించి ముందటి
పుట్టువున నంగన యగుట వాని కెదు రేయ కుండుదు. అర్జునుండు వానిం బురస్క
రించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడ వైచునది. పడంపడి
బంధుమిత్త్రు లగుధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు. ఇది నావనువు. ఏను
బనిచినట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత ననుజ్ఞాతు
లై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవు చున్నసమయంబున
బీభత్సుండు. 60

ఆ. సురనదీసుతుండు - పరలోకగతి నిరీ, క్షించుటకును దాను - కృతకవృత్తిఁ
జంప వలయుటకును - సవిషాదమానసుం, డగుచు నిట్టు లనియె - నచ్యుతునకు. 61

క. గురునిఁ గృతప్రజ్ఞుని ధ, ర్మరతు వయోవృద్ధు లోక - మాన్యు దయాళున్
సురతటినీసుతు వంచనఁ, బురుషోత్తమ చంప బుద్ధి - పుట్టదు నాకున్. 62

ఆ. నన్నుఁ బాంసుకేలి - నున్న నర్మిలి నెత్తి, మేనిధూళి దనదు - మేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి - మాతండ్రిగుణము ల, గ్గించి కన్నునీరు - నించు నతఁడు. 63

ఉ. అక్కట తండ్రి లేనిమము - నమ్మెయిఁ బెంచిన తాత నిమ్మెయిం
ద్రెక్కొనఁగా దతండు సము - దీర్ణభుజాబలశౌర్యశాలి యై
యిక్కడిసేనఁ జక్కడిచె - నేనియుఁ జాతునకాక ధర్మముం
దక్కట కోర్వఁ జాలుదునె - ధర్మజుతమ్ములు క్రూరకర్ములే. 64

వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కిట్లనియె. 65

ఉ. క్రూరత కోర్చి యించుకయు - రోయక పైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు - వర్ధనముం గలిగించి పాడిమైఁ
గో గరి గొంచు సద్వ్యయము - గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి బృ - హస్పతి సెప్పుట యప్రసిద్ధమే. 66

చ. అనిమొన నోర్తు భీష్ము నని - యాడిననీదగుపూన్కి లోకమె
ల్లను విని యుండఁగా నిటు చ - లం బెడలం జన దెట్టు లైనఁ జం
పన తగు రాజధర్మపరి - పాలన గాకది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవు - నిం దెగటార్పఁగ వేయు నేటికిన్. 67

చ. అనుటయుఁ గ్రీడి యిట్టు లను - నా ద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయవధార్థ మం డ్రడియుఁ - దప్ప దతండును వాని నేయఁ డే
ను నతని నేయుచుండుమున - నూల్కొని యన్యుల నేయుచుందు వాఁ
డనితరవధ్యకాయుఁ డగు - నాయనఁ దాఁ బడ నేయు నుగ్రతన్. 68

వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డిట్లనియె. 69

ఉ. నీ వొకరుండు దక్కఁగ న - నింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును - జాలఁడు నీతెలఁ బెన్నిభంగులన్
దైవముచూపుపోలెఁ దుది - దాఁకునె యవ్విధ మిట్టు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యెటులుఁ - ద్రోచినఁ బోవదు చూచుచుండుమీ. 70

వ. అని పలికిన విని యతం డట్లు గాక యప్పటికి నెట్లయిన నట్లయ్యెడు నని యర్జు
నుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం బ్రమోదంబు నొందిరి. 71

---

# 21. భీష్ముని దశమదివసయుద్ధము.

(భీష్మపర్వము. ఆ. III.)

క. మొన లెల్ల విఱుగ మధ్యం, దినమునయినమాడ్కిఁ బయలఁ - దేజోనిధి శం
తనుసూనుఁ డొప్పె నప్పుడు, గనుఁగొని యి ట్లనియె శౌరి - గాండివితోడన్. 1

క. మనమోహరములు సెడి కను, కనిఁ బాఱెదు నిప్పు డాప - గాసుతునకు గ్ర
క్కున నీవు మార్కొనక త, క్కినఁ గార్యము దప్పుఁ బొదివి - గెలువుము కడఁకన్.

వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబు గా సురనదీనందను నమందమార్గణ
పుంజంబునం బొదివె. శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు
వాని నేయ నొల్లనిసందున నాసవ్యసాచి యతనివిల్లు దునిమి పెల్లేయు చున్నం
జూచి సైరింపక శల శల్య కృప కృతవర్మ చిత్రసేన భూరిశ్రవః ప్రభృతివీరలోకం
బతిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు నేయుచు భీష్మున కడ్డపడుండు
దలకడవుం డను నెలుంగులు నింగి ముట్ట బలసమేతంబుగా నడరినం గని సమీర
నందనసాత్యకిసౌభద్ర విరాటద్రుపదఘటోత్కచప్రముఖయోధవర్గం బనర్గళభంగిం
దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాతసమయసమరం
బయ్యె. అందుఁ బురందరనందనుండు మనసైనికుల కందఱ కన్నిరూపు లయి
యైంద్రవారుణాగ్నేయాదిమహాశరంబులం దెరల్చుచు సురక్షితుం డైనశిఖండిం
బురికొల్పికొని మీతండ్రి నేయించుచు నతం డెన్నివిం డ్లెత్తిన నన్నిటిం దోడ్తోన
తునుమాడు చుండె. ఆ క్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగింప నదియునుం ద్రుంచి
సూతునిం గేతనంబునుం గూల్చిన. 3

సీ. మనమున భీష్ముఁ డి - ట్లని వితర్కించుఁ బాం, డవుల నాయొక్కవిం - టన కడంగి
గెలువనే వీరికిఁ - గృష్ణుండు ప్రాపు గా, కున్న నిం కది యట్టు - లుండ నిమ్ము
కృష్ణుఁ దోడుగఁ గొని - కీడ్పడి వీరలు, వచ్చినఁ జెప్పితి - వధవిధంబు
సమర ముపేక్షించి - శాంతిమై నుండెద, నడిచిపా టేటికి - ననఁగ నెఱిఁగి
చదల సుర లిట్లు మే లిది - సమ్మతంబు, మాకు నని ప్రీతిమైఁ జెప్పు - మాట లాతఁ
డొక్కరుండును వినియె నే - నొకఁడు వింటి, మునిమహానుభావంబున - మనుజనాథ.

వ. తదవసరంబున సూక్ష్మజలశీకరశిశిరం బగుమారుతంబు మరుత్తటినీతనయుమీఁద సుడిసె. సురదుందుభులు మ్రోసె. కుసుమవర్షంబులు గురిసె. అవియు ననన్యగోచ రంబు లయ్యె. ఇట్లు నిశ్చయించియు నమ్మహాత్ముం డూర కున్నం గెలని కొకభంగి యై తోఁచు నని తలంచి. 5

తే. ఒక్కవి లెక్కు వెట్టంగ - నుఱక వెస శి, ఖండిపటుమార్గణంబులఁ - గడఁగి యేయ నతఁడుమిసిమింతుఁడును గామి - కల్లనవ్వి, పఱపెఁ దనయమ్ములతనిపై - ఫల్గునుండు·

వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన. 7

క. నరుఁడు దనమీఁదఁ దొరఁగొడు, శరములు వారించి యతని - చాపం బధిక త్వరితగతిఁ ద్రుంచి యతిని, క్షురనారాచంబు దనువు - సార నేయుటయున్. 8

వ. తమకుం దమయోధవరులకును వారింపం జేరం జనయం గొలఁది కాక వెల్లివిరిసిన శరనిధిభంగింబొంగినవివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం దన్ను విడువక కెలంకుల నున్నకొడుకులం గనుంగొని మీతండ్రి రారాజుతో ని ట్లనియె. 9

మ. అని దేవాసురకోటి కైనను నశ - క్యం బిమ్మహావీరు మా
ర్కొన వీఁ డల్గిన మర్త్య లేయెదు రుదా - రుం డైనయీక్రీడి ద
క్కిన నిప్పాండవసైన్య మింతయును మ్ర - గ్గింపంగ నేఁ జాలుదున్
విను సత్యం బిది వీనివింటి కెదురన్ - వి ల్లెత్త లేఁ డెవ్వఁడున్. 10

క. అనునెడ శిఖండిచాపము, వెనుకం దనవిల్లు నిల్పి - వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను, జననాయక దొడ్డనార - సంబుల భీష్మున్. 11

వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి. 12

సీ. అశనికల్పము లివి - యర్జునుబాణముల్, గాని శిఖండివి - గావు సుమ్ము
కర్కటి గర్భంబు - కరణి గాత్రము వ్రచ్చె, నిట్టివి వీనికి - నెందుఁ గలవు
బ్రహ్మదండంబుల - పాటి యై మర్మంబు, లిట్టు నొ నాటునే - యితనిచేత
జముదూత లట్ల ప్రా - ణముల వెలార్పంగ, నీద్రుపదాత్మజుఁ - డెన్నఁ డేసె
దృఢవిముక్తములును - దీప్తాక్సతులు లక్ష్య, శుద్ధిమంతములును - సునిశితములు
నైన నారసంబు - లతనివి గాక యీ, తనివి యగునె యెవ్వి - ధమునఁ జూడ. 13

క. అనుచుఁ బటుశక్తి నప్పా, ర్థుని వైచిన నది యతండు - దునుమాడుడు శాం
తనవుఁడు వాలుం బలకయుఁ, గొని యరదము డిగ్గఁ జూచు - కొలఁదిం బెలుచన్.

తే. ఏసి యారెంటిఁ దునియలు - సేసి యెలుఁగు
సూపి యే నుండ వెఱ పేల - నాపగాత

నూఱుఁ బొదువుఁడు మీ రని - యోజఁ జెప్పె
శక్రతనయుండు దనయోధ - జనుల కెల్ల. 15

వ. అప్పలుకు లాకర్ణించి. 16

క. ఏయుఁడు పొదువుం డడువుఁడు, వ్రేయుఁ డనుచు వారు జాహ్నవీసనయుఁ గదురన్
డాయుడు మనసైనికులుం, గో యని పిలపడ్డఁ బోరు - ఘోరం బయ్యెన్. 17

వ. అప్పుడు. 18

తే. ఏచి గాండీవి కురుసేన - నెగవ నతని, వారు వెఱనక భీష్మునిఁ - జేరి యొడల
వ్రేలెఁ డెడ లేనియట్లుగ - వివిధభంగి, నిష్ఠురాస్త్రశస్త్రంబుల - నినిచి రధిప. 19

## భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట.

వ. అంత నంశుమంతుండు శాంతుం డగుచు వచ్చె. అట్టియెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడం ద్రోచిన 20

క. తూర్పుతల గాఁగ నీసుతు, లేర్పడఁ గనుఁగొనుచు నుండ - నిల గంపింపన్
దర్పోజ్జ్వలుఁ డాభీష్ముఁడు, పార్వతి యస్తాద్రి సేరు - వట్లుగఁ బడియెన్ 21

తే. తనువు ధరఁ బొంద కుండఁగఁ - దల్పభంగి
శరము లూఁత లై పోలు పారె - నరవరేణ్య
యట్లు శరతల్పగతుఁ డగు - నమ్మహాను
భావు దేవవ్రతుని దేవ - భావ మొందె. 22

చ. అనిమిషు లప్డు సూచి మృతుఁ - డయ్యెడు నక్కట దక్షిణాయనం
బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ - బొందిన భీష్ముఁ డెఱింగి వారి క
ట్లను సురలార కాలగతి - నాత్మఁ దలంచియకాదె మేనిలో
నునిచినవాఁడఁ బ్రాణముల - నుమ్మలికింపకుఁ డించుకేనియున్. 23

వ. సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రి మెచ్చి యవధ్యత్వంబును స్వచ్ఛంద మరణంబును నిచ్చినవాఁడు. కావునఁ దద్వరప్రభావంబున నావధంబున కే నోడం బడక కానేర దయ్యెడు. ప్రాణంబులు నావశంబ యనిన విని వారలు సంతోషించిరి. ఆసమయంబున భాగీరథిపనుపునం గొందఱు మునివరులు హంసరూపంబుల నమ్మహాత్మునకు దక్షిణాయనం బెఱింగింపం జనుదెంచి యతండు దెలిసి యునికి నతనిచేత నెఱింగి ప్రియం బంది యేగిరి. అట్టియెడ దుర్యోధనుండు వచ్చిన

దుశ్శాసనుండు గుంభసంభవుపాలికిం బోయి భీష్ముపాటు సెప్పిన నతండు మూర్ఛిల్లి యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథుకడకుం జనియె. 24

* * * * * *

వ. అప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు లూడ్చి యాయుధంబులు వెట్టి గాంగేయుకడకుం బోయిరి. కౌంతేయులు నట బంధుమిత్రసహితు లయి యచటికిం జనిరి. ధనంజయుం డొక్కరుండును ధనుష్పాణియై యరిగె. ఇట్లయ్యిరు దెఱంగులవారలుం దత్కాలప్రశాంతస్వాంతు లై యన్యోన్యవిషయరోషంబులు దక్కి తన్నుం బరివేష్టించినం గులగురుం డగునమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించికొని యుండె. 25

తే. తనకుఁ గ్రిందల యని భవ - త్తనయులకు నె
ఱుంగఁ జెప్పిన వారు గ - డంగి మెత్తఁ
దనము గలతలగడలు దేఁ - బనుచుటయును
జూచి చిఱునవ్వుతో సవ్య - సాచిఁ బిలిచె. 26

క. పిలుచుటయు నతఁడు బాష్పము, లొలుకఁగ గాండీవము వెట్టి - యొయ్యన చనినం
దలగడ తూపులు సెజ్జకు, నలనడఁ బెట్టు మని భీష్ముఁ - డాతనిఁ బనిచెన్. 27

వ. ఇట్లు పనిచినం బార్థుం డట్లు చేయుదు నని గాండీవంబు పుచ్చికొని మఱియు ననుజ్ఞ గొని మూఁడువాలమ్ము లభిమంత్రించి పెడతలఁ దాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి మోచి నిలుచునట్లుగా నేసినం దాత ప్రీతుం డై తల్పంబునకుం దగినయుపధానంబు వెట్టి తని యతనిం గొనియాడి సకలపౌత్రులను ధాత్రీపతులను నవలోకించి. 28

క. రవిఁ గొల్చి యుత్తరాయణ, మవునంతకు నంపపాన్పు - నం దిట్లు మహో
త్సవలీల నిలుతు నా కీ, దివసంబులఁ జేయ వలయు - దృఢరక్ష దగన్. 29

క. అలయక కరయ నోపినవా, రలు గ్రక్కునఁ బరిఖతోడి - ప్రాకారం బి
ట్టులముగఁ గావింపుఁ డనుడుఁ, దలకొని నీసుతులుఁ బాండు - తనయులు భక్తిన్.

వ. అత్తెఱం గాచరింపనుం దాత్పర్యంబున రక్షింపనుం దమతమయందుఁ దగినవారల నియోగించిరి. అంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స సేసెద మని తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి వీడుకొల్పె. గీతవాద్యనృత్తప్రవీణంబు లగుపాత్రంబు లమ్మహాత్మునకు వినోదంబు సలుపుచుండె. అట్టియెడ నాదేవవ్రతుండు నీళ్లు ద్రావ నడిగినం దనుపారునీ రనేకులు గొని వచ్చిన నతండు.

తే. వినుఁడు శరతల్పగతుఁడ నై - యునికిఁ జేసి, యన్యసలిలంబు సేవింప - ననుచితంబు
నాకుఁ దేజోమయాస్త్ర వి - న్యాసవిధిస, ముత్థితం బైనభూజల - మొసఁగుఁడు దక్క.

వ. అనుటయుఁ గౌరవులును దక్కటిరాజులును వెఱఁగుపడి యున్నం గవ్వడిం గనుం గొని గాంగేయుండు. 33

క. శరవేదన సర్వాంగము, నెరియఁగ నా కిపుడు పెదవు - లెండెడుఁ దృష్ణా
భర ముడుపఁ దగిననీళులు, వెరవునఁ దే నేర్తు వీవ - వే తె మ్మనఘా. 34

వ. అనిన నట్ల కాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు సేసి తేజోమయం బయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబు గావించి మహీతలంబు గాడ నేసిన భాసురచ్ఛాయం బగుతోయంబు ధారారూపంబున దివ్యగంధరసోపేతం బయి యెగసిన. 35

ఆ. కౌరవులు ప్రకంప - గాఢవిస్మయు లైరి, పాండుసుతులు వారి - బలము నుబ్బి
యార్చి సంకు లొత్తి - రాజలంబుల నమ్మ, హాత్ముఁ దృప్తుఁ జేసె - నర్జునుండు. 36

వ. ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీనందనుండు పురందరనందనున కి ట్లనియె. 37

ఉ. నారదుచేత నిన్ను ముని - నాథునిఁ గాఁగ నెఱింగి యుండుదున్
శౌరియు నీవుఁ గూడిన న - సాధ్యము లెవ్వియు లేవు దర్పదు
ర్వారుఁడ వైననీవలని - వైరము గీ డని చెప్పఁ జెప్ప నీ
కౌరవరాజు మానఁడు ద - గం జెడుఁ గా కిట మీఁద భీముచేన్. 38

వ. అని పలికి దీనమానసుం డగు చున్నభవత్సూనుతో ని ట్లనియె. 39

మ. నరుఁ డత్యద్భుతవిక్రముం డతని కా - నారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింప రాదు సమరా - వష్టంభముం దక్కి ధ
ర్మరతుం డైనయజాతశత్రునకు నిం - ద్రప్రస్థ మి మ్మర్ధరా
జ్యరమం బొందుము మీరు గొంద ఱయినం - జా కున్న నీ కొప్పదే. 40

వ. అని పలికి యూరకుండినం గౌరవపాండవులును మాఱుపలుకక యతనికి నమస్కరించి నిజనివాసంబులకుం జనిరి. 41

* * * * * *

వ. తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తివినయంబులు దోఁపం బాద ప్రణామం బాచరించి. 42

ఆ. అలుక దక్కి నన్ను - నధికవాత్సల్యశీ, తలముగాఁగఁ జూచి - తగినమాట
లాడవే మహాత్మ - యనుటయు నాతండు, గారవమున నతనిఁ - జేరఁ బిలిచి. 43

వ. ఒక్క కరంబు మలంచి కౌఁగిలించికొని యచ్చట నున్నరక్షకాదిజనంబుల నపలం
బోవం బనిచి యతనితో ని ట్లనియె. 44

క. నీదెసఁ గోపింతునె కుల, భేదముగాఁ బలుకుటయును - బిడ్డలఁ జెలుపం
గా దని కినియుదు లే దన, రా దలఁతును నిన్ను నిష్ఠు - రంపుఁబలుకులన్. 45

వ. అది శిక్ష గాని రోషంబు గా దట్లుం గాక.. 46

క. నీయుదయము దైవికగ, ర్భాయత్తము నీకు మర్త్య - లసదృక్షులు గాం
తేయుఁడవు గాని విను రా, ధేయుండవు గావు నీవు - ధీరవిచారా. 47

వ. ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె. నేనును భవదీయతేజో
విశేషంబువలనను గనుంగొని యుండుదు. పాండుతనయుండ వగుటం జేసి నీయెడ
వాత్సల్యంబ కాని మాత్సర్యంబు లేదు. ఒక్కటి సెప్పెద వినుము. ఏను గురుపాండ
వులవైరం బుడిపి పుచ్చితి. అప్పాండవేయు లజయ్యులు. అప్రమేయుం డగు
కృష్ణుండు వారికి విధేయుండు. కావున వారలతోడివిరోధం బొప్పదు. నీవును
నొండుదలంపు తక్కి యక్కౌంతేయులం గలసి యుండు మనినం గర్ణుం డతని
కి ట్లనియె. 48

క. కౌంతేయుండ నగుదు నది, యంతయుఁ దొల్లియును వింటి - నార్యులచే ని
ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ, సంతానము తోడిపొత్తు - సను నే నాకున్. 49

ఉ. వారు మహాబలుల్ హరియు - వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింప రామియును - బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
శ్వారమణుండు సేయుతగు - మన్నన లెల్లఁ దలంచి చూచినన్
భూరివివేక యే విడిచి - పోవుట ధర్మమె వీరకర్మమే. 50

వ. అదియునుం గాక. 51

ఉ. మాటలు పెక్కు లాడి యను - మానము లేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జ - లంబునఁ బాండవకోటి కెప్పుడుం
జేటు దలంచి యే బలువు - సేసితి వైరము నాకు నింక నీ
పీటికి వారిపీటికిని - వెక్కస మయ్యెడు కయ్య మొ ప్పగున్. 52

శా. దైవాధీనము సర్వముల్ మనమతిం - దప్పింపఁగా వచ్చునే
నీ వింకన్ నను నొండు వల్కక పరా - నీకంబుపైఁ బంపు మ

తన్నేవాధర్మము నిర్వహించెద బలో - త్సేకంబు లోకంబు సం
భావింపఁ విహరించెదఁ మురరిపుం - బార్థుం దలంకించెదన్. 53

చ. అన విని భీష్ముఁ డిట్టు లను - నంతకుఁ జాలు పెఱుంగనే సుయో
ధనునకు నెప్డు నీదుభుజ - దర్పము కాదె సహాయ మెద్ది యా
తనికిఁ బ్రియంబు దానిన యు - దాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున సంతసిల్లు మను - మానము దక్కు మనుజ్ఞ యిచ్చితిన్. 54

వ. అని తెలి వొంది పలికినదేవవ్రతుబంధుభావంబునకుం బరమానందంబు నొంది
రాధేయుండును నిజనివాసంబునకుం జనియె. 55

# 22. అభిమన్యువధ.

—•⋟•⋞•—

(ద్రోణపర్వము. ఆ. II)

వ. అట్లు భారద్వాజుండు పద్మవ్యూహంబు సంఘటించు నెడ వివిధదేశంబులరాజులు దళంబులును రాజకుమారులుం గేసరంబులును గర్ణదుశ్శాసనబహుళసేనాపరివృతుం డయి కురువిభుండు గర్ణికయునుం గా నభేద్యభంగి నొనర్చిన నది వలయాకారం బగుటం జేసి చక్రవ్యూహంబు ననం జను. అమ్మొగ్గరంబు మొగంబునం దాను దర్పంబు మెఱయ నెఱయం బొలిచి నిలిచె. మఱియు నలయు నెడలకు లావై జయద్రథగురుపుత్త్రకృపశకునికృతవర్మభూరిశ్రవశ్శలశల్యులును నీకొడుకులును మనుములును రక్తమాల్యానులేపనాంబరాభరణంబులు శోభిల్లం బొలిచి నిలిచిరి. అంత భీమసేనప్రముఖం బైనపాండవబలంబును గదియ నడచె. అందు సాత్యకిధృష్టద్యుమ్నకుంతిభోజులును జేకితానక్షత్త్రధర్మక్షత్త్రవర్మలును ధృష్టకేతునకులసహదేవులును నుత్తమౌజశ్శిఖండియుధామన్యులును ఘటోత్కచవిరాటద్రుపదులును ద్రౌపదేయకేకయసృంజయసముదయంబును నుక్కునం దఱిమి యక్కుంభసంభవుం దలపడిన నవ్వి యవ్విప్రుండు వాఁడి మిగులం బలుగాఁపులం దనవేఁడిమి సూపిన నమ్మేటివిలుకాని మొగంబున నిలువ నోర్వక యాసైనికప్రకరంబు దిరుగుడువడిన వెక్కసంబును వెఱఁగుపాటును వెల్లఁదనంబునుం గదురఁ గౌంతేయాగ్రజుం డార కుండికర్ణికారకేతుస్థితుండును నుత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుండును నగుసౌభద్రుం గనుంగొని వీఁడు దక్క నొరు లీదృఢవ్యూహంబు భేదింపం జాల రని మనంబున నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి. 1

సీ. ఈయొడ్డు భేదింప - నే మెవ్వరము నేర, మర్జునుండును నీవు - నచ్యుతుండుఁ
బ్రద్యుమ్నుఁడును దక్కఁ - బార్థుండు మనల ను, ల్లస మాడ కుండ నీ - లావు మెఱసి
భేదించి మాకెల్లఁ - బ్రియ మొనర్పు కుమార, యనవుడు నతఁ డాన - నాబ్జ మలర
దీనిముఖంబు భే - దించు తెఱంగు నా, కెఱిఁగించె మాతండ్రి - యేను దెఱపి
సేయ నేర్తుఁ జొచ్చి - చించి చెండాడెద, మూఁక బోరఁ జుట్టు - ముట్టినపుడు
వెడలు నట్టి వెరవు - విన దాని కేమి నా, చొచ్చునేర్పు బలువుఁ - జూడు మధిప. 2

వ. అనిన విని ధర్మనందనుండు ధనంజయనందనున కి ట్లనియె. 3

క. తెలుపి గొని నీవు సొచ్చినఁ, బిలుఁదన చొచ్చెదము రిపులు - పెల్లగిలఁగ నం
దలమును మా కిది యెంతయు, నులునట్టివరంబు దీని - నొసఁగుము పుత్రా. 4

ద. అనవుడు భీముఁ డిట్టులను - నర్జుననందన నీవు ముండ టి
మ్మొన యొకయింత సించిన న - మోఘరయంబునఁ బార్షతుండు నే
నును ద్రుపదుండు సత్యకత - నూభవుఁడుర్ విరటుండు నంత నం
త నడరి చింతు మెల్లెడలు - దారుణవిక్రమణక్రమంబునన్. 5

వ. అనిన విని యభిమన్యుం డాతనియాననం బాలోకించి. 6

చ. నను విను కీచకాంతక మ - నంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య
మ్మొనఁ గలఁగింప కిట్లు కురు - ముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చినజతనంబు నిష్ఫలము - సేయుదునే నరుఁడుర్ సుభద్రయుం
దనయునిఁ గాంచి సంతసము - దాల్చుట యంతయు రిత్తఁ బుత్తునే. 7

చ. ఇదె యొకపిన్నవాఁ డడరి - యెక్కుడుమూఁకలఁ గ్రందు దోలెడుం
గదుపుల వెల్చుగోపకుని - కైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద విని మామ ప్రీతి విల - సిల్లఁగఁ దండ్రియు సంలసిల్ల బె
ట్టిదుఁ డగుకౌరవేంద్రునకు - డెప్పర మయ్యెడుభంగిఁ బేర్చెదన్. 8

క. అనిన విని ధర్మసూనుఁడు, దనుఁ బ్రీతిం జూచి నీదు - ధైర్యము శౌర్యం
బును బలమును గీర్తియు వ, ర్ధన మొందెడు మనుడుఁ బార్థ - తనయుం డెలమిన్. 9

వ. తనసారథిం గనుంగొని మనయరదంబు ద్రోణానీకంబుపైఁ బఱపు మనుటయు
నాసుమిత్త్రుం డర్జునపుత్త్రున కిట్లనియె. 10

తే. బాలుఁడవు నీవు కుంభజ - ప్రముఖసైన్య
పతులు ప్రౌఢులు పెక్కులు - బవరములకుఁ
జొచ్చి యెఱుఁగనినీచేతఁ - జచ్చువారు
గారు బహువిధసమరక - ర్కశులు వారు. 11

చ. అనవుడు నల్ల నవ్వి యతఁ - డాతని కిట్లను దేవయుక్తుఁ డై
యనికి బలారి వచ్చినఁ బు - రారి గణంబులుఁ దానుఁ బన్నినం
గినిసి కడంగి క్రీడియును - గృష్ణుఁడుఁ దాఁకిన నే జయింతు మా
ర్కొని యను చండుదుర్ సరకు - గొందునె ద్రోణునిఁ దోడియోధులన్. 12

వ. అని పలికి వానియాలాపంబు నాలంబుసేసి యభిమన్యుండు పెలుచం దఱిమిన
వాఁడనుమానించుచు మనసైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరు నడపుటయు వారి

సేనయుం దోడన కడంగుటయుం గనుంగొని భారద్వాజప్రముఖయోధు లొం
డొరులకుం దలమిగిలి యేచి యెదుర్కొని పెలుచ నిలిచిన సంకులసమరం బయ్యె
నట్టియెడ. 13

## అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని చొచ్చుట.

ఆ. మెఱుఁగు మెఱచినట్లు - మెఱయంగ నరదంబు, కర్ణికారకేతు - కాంతి వెలుఁగ
నంపగముల గురుని - నలయించి కడచి యిం, ద్రజునికొడుకు మొగ్గ - రంబు సొచ్చె.

వ. ఇ ట్లనన్యభేద్యం బగునాపద్మవ్యూహంబు భేదించి సొచ్చి సౌభద్రుండు రౌద్ర
రసోల్లసితమూర్తి యై యందు మహార్ణవంబునం దిరుగుమందరనగంబుచందంబునం
గాననంబునం జరియించుతీవ్రానలంబుతెఱంగునం గాలపక్వజన సమాజసంహరణ
క్రీడనంబు సలుపుశూలిపోలికం గేళీగతుల మెలంగి యమ్మెయి నమ్మోహరంబు
ద్రిప్పికొలిపియుం బొడిసేసియు రూపుమాపియు రణవిహారం బొనరింప నవ్వీర
వరు నారాచాదినానావిధవిశిఖవ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుఁ
గరుల నుచ్చిపోవుచుఁ దేరుల విఱుచుచు హయంబుల ధట్టంబుల నుఱుము
సేయుచుఁ గాల్బలంబులఁ జదుపుచుఁ గేతువులం ద్రుంచుచు నాతపత్త్రంబుల
నుఱుమాడుచు రథ్యంబులం గూల్చుచు సూతుల గీ టడంగించుచు ధనువులు దును
ముచు మైమఱువులు వ్రచ్చుచు భూషణంబుల డుల్చుచుఁ గరవాలంబులఁ ద్రో
యుచు మేనులు సించుచుఁ దూపులు దూలించుచుఁ జేతులు నఱకుచు సబళం
బులు జడియుచుఁ దలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు నెత్తురు లురిలిం
చుచు గండలు సెక్కుచు నెమ్ములు నలఁచుచుఁ బరఁగిన నమ్మొన చిక్కువడియును
సుడివడియును గలంగియుఁ దొలంగియు వెఱచఱచియు విచ్చిపఱచియు దీన
దశకు వచ్చినం గనుంగొని. 15

క. వీఁక మెయిఁ గ్రీడికొడుకుం, దాఁకఁగ నీకొడుకు తలఁచి - తఱిమి కవిసెఁ జే
రాఁకలితో నున్నవారిం, దేఁకువ సెడి చేరకరిగ - తిం గురుముఖ్యా. 16

వ. ఇట్లు సౌభద్రుఁ జెనయం జూచుసుయోధనుం జూచి శరాసనగురుండు సైనికవరు
లకుం జేయి వీచి యెలుం గెత్తి. 17

క. నరసుతున కగ్గ మయ్యెం, గురుధరణీవల్లభుం డ - కుంఠితగతి మీ
రరుగుం డేయుం డడ్డము, చొరుఁడు వెరవు లావు నెఱయ - శూరత మెఱయన్.

వ. అనుచుఁ దనయరదం బద్దెస మొగంబు సేసి పురికొల్పిన. 19

ఆ. కృపుఁడు గురుసుతుండు - గృతవర్మ గర్ణుండు, సోమదత్తి శలుఁడు - సౌబలుండు
పౌరవుండు మద్ర - పతి వృషసేనుండు, గౌరవేశ్వరుండుఁ - గడఁగి రపుడు. 20

వ. అట్లు గడంగి. 21

చ. ప్రకటబలాఢ్యు లొక్కొటఁ ది - రిం బయి పల్వురు నీక భూమిపా
లకునకు నడ్డ మైనఁ దవు - లం బడి హుమ్మని నోరికండ నాఁ
చికొనిన మ్రోఁగుదెబ్బలివి - శేషము దోఁపఁగఁ బార్థుపట్టి సా
యకముల నొంచినం దెరలి - రందఱు లేళులపిందునాకృతిన్. 22

వ. ఇవ్విధంబున నయ్యోఘవరులు విచ్చిన విప్పచ్చుకొడుకు నేర్చి యార్చిన నాచా
ర్యుండు వీరిచేత నిలువం డని తా నరగి యన్నరనందను నెదుర్కొనిన వారును
గూడుకొని పొదివిన. 23

క. అతఁ డందఱమార్గణములు, నతిరయమునఁ ద్రుంచుచుం ద - డంగముల శర
ప్రతతులు నించుచుఁ బోరఁగఁ, బతి సేనకుఁ జేయి వీచె - బరవస మలరన్. 24

క. మనసేన పెలుచఁ గడఁగిన, వననిధి వొంగెడువిధంబు - వాసవిసుతుఁ డే
చినఁ జెలియలికట్ట తెఱం, గును గానఁగ నయ్యె నపుడు - కురువంశనిధీ. 25

వ. ఆసమయంబున. 26

సీ. రారాజుఁ గృపుఁడును - భూరిశ్రవుండు మూఁ, డేసియమ్ములు పది - యేడుగురుఁడు
వినుము వివింశతి - వింశతివిశిఖంబు, లాచార్యసుతుఁడు బృ - హద్బలుండు
నైదు నెన్మిదియును - నాఱు శల్యుఁడు సప్త, శరములు గృతవర్మ - సౌబలుండు
రెండుబాణములు పంద్రెంటఁ దొమ్మిదియును, దుశ్శాసనుండును - దుస్సహుండు
నేసె రర్జునసుతుమీఁద - నెల్లవారి, తనువులందును సాయక - త్రయము లతఁడు
గ్రుచ్చె నశ్మకుఁ డదరినఁ - గూల నేసెఁ, దురగసూతకేతనముల - తోడఁ గూడ. 27

## దుర్యోధనప్రభృతిమహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యుపైఁ గవియుట.

వ. ఇవ్విధంబున నశ్మకుండు వడినఁ దెరలుబలంబుల మరల నీక పురికొల్పుకొని
యప్పటియాచార్యప్రభృతియోధులును నీకొడుకులలోనఁ గొందఱును గ్రందు
గం దటిమి యనేకాస్త్రశస్త్రపరంపరలం బొదివిన నొదవినకినుకం గిరీటినందనుం
డందఱమేనులు నానానిశితవిశిఖవేగంబున నెత్తుట జొత్తిల్లం జేసి కర్ణుపయిం గవిసె.

తే. కంకటము దూఱి యంగంబు -గాఁడి పోవఁ, గ్రూరనారాచ మేసిన గ్రుక్కి నతఁడు
లీల నట్టిన పఱపి భూ - పాల నీదు, సుతులవెనుకకుఁ బఱపె ను - ద్ధతి దలిర్ప. 29

చ. అదరి నరేంద్రకోటి నుఱు - మాడఁగ నత్తఱి శల్యుఁ డంతయుఁ
బడిఁ దనుఁ దాఁకినన్ మెఱుఁగు - వాలికతూపుల మూర్ఛ వుచ్చి క
వ్వడికొడు కేచి యుద్భటర - వంబున నార్చినఁ జెల్లగిల్లి న
ల్గడలకుఁ బాఱె నిల్వక బ - లంబులు ద్రోణుఁ డెలుంగు సూపఁగాన్. 30

వ. అప్పుడు. 31

క. సురలును సిద్ధులు విద్యా, ధరులుఁ బొగడునులివుఁ జూచు - ధరణీశులబం
ధురనుతినాదంబులు నం, బరధరణీమధ్యభాగ - భరితము లయ్యెన్. 32

చ. అన విని యాంబికేయుఁడు మ - హాద్భుతవిక్రమశాలిఁ బార్థునం
దను మఱి యెవ్వ రట్టియెడఁ - దాఁకిరొ నావుడు సూతపుత్త్రుఁ డి
ట్లను నటు లైన శల్యుఁ గని - యాతనితమ్ముఁడు మేను వెంచి మా
ర్కొని పదితీవ్రబాణములు - గ్రుచ్చెఁ బదంగములం జెలంగుచున్. 33

వ. అట్లు బెట్టేసిన వాసవికొడుకు కోపించి. 34

సీ. హయములఁ జంపి సూతుఁ దగ - టార్చి పతాక ధరిత్రిఁ గూల్చి చా
పయుతము గాఁగ వానిఘన - బాహులు రెండును ద్రుంచి యెంతయుం
గయమునఁ దేరు చక్కడిచి - రాజులు రాజతనూజులుం గడుం
భయమునఁ దూలిపోవఁ బటు - భల్లహతిం దల డొల్ల నేసినన్. 35

వ. ద్రోణకృపద్రౌణికృతవర్మబృహద్బలకర్ణప్రముఖయోధవరు లొండొరులఁ బేరు నేరం బిలిచి బలంబులం బురికొలిపిన రథనేమిగజఘంటాతురంగకింకిణీస్వనసింహనాదమేదురరోదోఽంతరరౌద్రంబు గా సౌభద్రుం జుట్టు ముట్టిన నతం డట్టహాసంబు సేసి లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబులు మెఱయఁ గృష్ణార్జునులు గావించునేర్పు మెఱయం బోరునవసరంబున మండలీకృతకోదండుండును బటుసంధానస్ఫురితశరనికరుండును నై పరివేషవలయంబులోనం గిరణస్ఫురణదుర్నిరీక్ష్యుండగుతపను ననుకరించుచు గుణఘోషభీషణంబుగా బెడిదంపునారసంబులు వరఁగించి యార్చి యూర్జితగర్జితం బగుచుఁ బలుపిడుగులు దొరఁగించువిలయకాలవలాహకంబు విడంబించుచు విజృంభించి భల్లాంజలికక్షురప్రకూర్మనఖరప్రభృతిబాణవేణికావితానంబుల వెగడుపఱచిన విచ్చినవాహినుల నిలువరింప నేరక నివ్వెఱపడి యాచార్యుండు సూచు చుండె. అపుడు ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 36

క. మనమున ఖేదము మోదముఁ, బెనఁగొనియెడు మద్బలంబుఁ - బీడించెడు నా
మనుమఁ డని కినికి నాతని, యనిపని యటమీఁద నెట్టు - లయ్యెం జెపుమా. 37

క. అనుటయు సంజయుఁ డి ట్లను, వినుము జనాధీశ యిట్లు - విఱిగినసేనం
గనుఁగొని పోవఁగ నీ క, ర్జునతనయుఁడు దనరథంబు - చుట్టం బఱవన్. 38

వ. కౌఱవి ద్రిప్పినతెఱంగు దోఁపఁ బొదివి పో నీక పీనుంగుపెంటలు సేసిన నప్పు
డక్కుమారు నాలోకించి వికాసభాసితవదనుం డగుచు గురుఁడు గురుపతినెఱను
దాఁకఁ బలుకవలయు ననుతలంపున నతండు విను చుండం గృపాచార్యుతో
ని ట్లనియె. 39

ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ - దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁ - దాఁకెడు నే విజయాత్మజుండు ఘో
టమ్ములుఁ గుంజరమ్ములు బ - డ ల్పడఁ దేరులు నుగ్గు గాఁగ నా
నమ్మినయోధవీరులు వి - నాశము భంగము నొంద నొక్కఁడున్. 40

ఆ. అనిన వెలుకఁ బాఱి - యతిదీన మగునాన, నమున నవ్వ గాని - నవ్వ నెఱయ
సౌమదత్తికర్ణ - శల్యాదు లగుయోధ, జనులతోడ నిట్టు - లనియె విభుఁడు. 41

చ. పలుకులు వింటిరే ఘనువు - పట్టెడివారికి నెల్ల నొజ్జ దో
ర్బలవిదితుండు కుంభజుఁడు - బాలుని నొక్కరుఁ జంచలాత్ము వెం
గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బొ - గడ్తకుఁ జొచ్చె నితండు నొంపఁగాఁ
దలఁపఁడు వీనిఁ బార్థునకుఁ - దాఁ గడుఁ గూర్చుట నెంత త్రుళ్లినన్. 42

చ. గురునియు పేక్షఁజేసి తన - కుఱ్ఱ సమరోద్ధతి నెల్లె దాని నీ
వెరవిఁడి గాన లేఁడు దన - వీరము కాఁ గొని విఱ్ఱవీఁగెడుం
బోరిగొనుఁ డందఱుం గడఁగి - పోవఁగ నీక దృఢాస్త్రశస్త్రని
ష్ఠురపరిపాతనోగ్రముగఁ - జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్ 43

వ. అనిన విని వార లందఱు నవ్యాసపౌత్రుం బొదువం బోవ నవ్వీరుల వారించి
దుశ్శాసనుం డి ట్లనియె. 44

చ. ఇనుఁ గబళించురాహుక్రియ - నే నొకరుండన పోయి పార్థపు
త్రునిఁ బరిమార్తు నీతఁడు మృ - తుం డగు టేర్పడ విన్నఁ గేశవా
ర్జునులును బిట్టు సత్తు రతి - శోకభరంబునఁ జేసి యంతతో
మనపగ దీఱుఁ దీవ్ర మగు - మద్భుజదర్పముసొంపు సూడుఁడీ. 45

## దుశ్శాసనుఁ డభిమన్యుతోడం బోరి పాఱి పోవుట.

వ అని పలికి యార్చి యమ్ములు నిగిడించుచు ధనంజయతనయుం దాఁకిన నతండు షడ్వింశతిసాయకంబులు దనువునం జొనిపినం గనలి దుశ్శాసనుండు శరాసారఘోరంబుగాఁ గవిసినం గిరీటికొడుకునుం బేర్చి పెనంగ నయ్యిరువురకరలాఘవ శరలాఘవప్రకారంబులు రథచిత్రప్రచారంబులుఁ జూప అగ్గించిరి. అప్పు డగ్గలిక సొంపున సుభద్రాసూనుండు నీసుతువిల్లు ద్రుంచి భల్లంబుల మేను నెక్కి ప్రుక్కించి యతనితో ని ట్లనియె. 46

చ. అనఘుని ధర్మనందనుని - నాసభ నమ్మోయి నీవు నొవ్వఁ బ
ల్కినఫల మందఁ జేసెదఁ జ - లింపక యించుక సేపు నిల్వుమీ
నిను లఘుచిత్తుఁ గ్రూరు నవి - నీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చినగురుపంపు దంద్రులకుఁ - జిత్తే మెలర్ప ఋణంబు దీర్చెదన్. 47

క. అని యతనిజత్రుదేశం, బున నొకవాలమ్ము ఐక్షు - మునఁ బెక్కును గ్రు
చ్చినఁ ద్రెళ్లి యెన్నఁడోచ, చ్చినయట్లు రథంబుమీఁదఁ - జేష్టడి యుండెన్.

వ. ఇట్లు మూర్ఛిల్లిన దుశ్శాసనుతేరు సారథి దొలంగఁ దోలుకొని పోయె. అంతకు మున్న కౌంతేయులు సౌభద్రుండు సొచ్చినపథంబున నాపద్మవ్యూహంబు సేనా సంక్షోహాసహితు లై చొచ్చి యెడనెడ నడ్డపడుసైన్యంబులతో సంగరంబు సేయుచు నక్కుమారుం దల లెత్తి చూచుచు నతం డరిబలంబులం గలంచుటకు సంప్రీతు లగుచుఁ గోఁతెంచువారు ముందట దుశ్శాసనుండు భంగపడుట గనుంగొని పొంగి యార్పులు నింగి ముట్ట నయ్యభిమన్యు ననేకభంగులం బ్రశంసించుచుం దఱిమి రట్టియెడ. 49

సీ. రాధేయుఁ జూచి రా - రాజు దుశ్శాసనుఁ, డభిమన్యుచే నొచ్చె - నకట కంటె
యనవుడు నతఁడు సే - నాన్వితంబుగ నక్కు, మారుపై నడర న - వ్వీరుఁ డేచి
ముందటిమూఁకల - మ్రందించి కదిసి డె, బ్బదిమూఁడుదూపులఁ - బటురయమున
నొంచిన రక్తాన - నుం డయి దివ్యాస్త్ర, జాలంబు పఱపునా - జామదగ్న్య
శిష్యుభుజవీర్యశౌర్యవి - శేషభంగి, సరకుగొనక యబ్బాలుండు - సమదలీలఁ
బెనఁగ నయ్యంగరాజు పె - ల్సిన నెఱింగి, యతనితమ్ముఁ డయ్యర్జున - సుతునిఁ దాఁకి.

చ. హయములమీఁద నూతుపయి - నాతనియంగములందు నస్త్రసం
చయ మడరించినం గమల - చారుముఖంబున నెత్తునవ్వు చె
న్నయి విలసిల్ల భల్లమున - నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష
ద్భయదవిలాస బాహుసము - దగ్రత వానిశిరంబు గ్రక్కునన్. 51

ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుము - నేపు గనుంగొని యోహటించి శీ
ఘ్రమ్మునఁ బెంపఱం దొలఁగెఁ - గర్ణుఁడు పెక్కుబలంబు లప్పు డొ
క్కమ్మడిఁ ద్రోచి యుద్ధతమ - హాదధిఁ బోలఁగ మందరమ్ముచం
దమ్మున నొప్పె నుద్భటవి - ధస్ఫురణంబు దగుపార్థపుత్త్రుఁడున్. 52

వ. ఇట్లు మూఁకలం గలంచి. 53

క. వెస రాధేయునితోలఁగిన, దెసకుం జనుటయు నతండు - ధృతిసెడి విఱిగెం
బస పాడ పడఁగఁగఁ బెఱయో, ధసమూహము వాఱె ధరణి - తల మగ్రుపంగాన్.

వ. ఇవ్విధంబున సైన్యంబులుం దారును బఱచుదొరలం జూచి యాచార్యుండు. 55

చ. నిలు నిలు కర్ణ యోకృపుఁడ - నీ విటు లేల కడంక దక్క సౌ
బల ధృతి దూల నేమిటికి - బాహ్లిక యిత్తఱిఁ గౌరవేంద్ర నీ
బలముఁ జలంబుఁ జూపి నిలు - పం దగు సేనల నంచుఁ బెక్కుభం
గులఁ బరికొల్ప నెవ్వరును - గోల్తల సేయర యేమి సెప్పదున్. 56

వ. ఇట్లు ప్రళయసమయధారాధరస్ఫీతనిర్ఘాతచ్ఛటాభీలం బగునవ్వాలునిబెడిదంపు టంపఱ సైరింపం జాలక నీబలంబులు వాఱిన నక్కుమారకంఠీరవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించి గుఱ్ఱంబు సారించి యనికిం దనివి సనక వెనుకం దవిలి పట్టియుడవి ముట్టి యేర్చుకార్చిచ్చు చందంబునం జతురంగబలంబులం బారి సమరినం దేరులు నలియం ద్రెళ్లినశుండాలంబులును గాలుబలంబుల పీనుంగు పెంటలమీఁద నూఁదుకొనం గూలినఘోటకంబులును గుఱ్ఱపుటట్టల రాసులు మూసికొని యఱవఱ లైనయరదంబులును గిరిటికళేబరంబులు వోదివినం గాలు గాలం బెనఁచుకొని పడి యున్నసుభటసమూహంబులును గంకణాంగదకాంతంబు లైనకరకాండంబులగములును ముసుంగువడ డొల్లినసకుండలమస్తకంబులును వీర కటకంబులు మెఱయఁ జిక్కువడి యున్న చరణంబులును గ్రిందుపడం దొరఁగిన గాత్రఖండంబులును దునియ లైనధనురాదిహేతివ్రాతంబులపైఁ బొడవు సెడక బాహువులతోడం బొలుచు కృపాణప్రముఖప్రహరణంబులును గొడుగులకుప్ప లును జామరంబులప్రోవులును సిడంబులతిట్టలును నయి సంగరాంగణంబు ఘోర భంగి యయ్యె. అప్పుడు గగనమధ్యభాగంబున భాసమానుం డయిన మార్తాండు రెండవమూర్తియుంబోలె నయ్యేకవీరుండు వెలింగె ననవుడు నాంబికేయుండు సంజయున కి ట్లనియె. 57

ఆ. బాలుఁ డొంటి యిట్లు - పలువురతోడఁ బో, రంగఁ జూచుపాండు - రాజతనయు
లందుఁ దోడుపడుట - కై యొకరుండును, గడఁగ కునికి కేమి - కారణంబు. 58

వ. అనవుడు సంజయుండు. 59

## పద్మవ్యూహంబు చొచ్చుపాండవులకు సైంధవుం డడ్డపడుట.

చ. వినుము నరేంద్ర పాండవులు - విక్రమదుర్దము లైనపార్థనం
దనునకుఁ దోడ్పడం గడఁగి - దంతితురంగరథోత్కరంబులం
దునుముచు సత్వరస్ఫురణఁ - ద్రోచిన నీపెనుమూఁక పాయ వి
చ్చి నిలిచి చూచు చుండె నవి - చేష్టితు లైరి బలాధినాథులున్. 60

వ. పాంచాల యాదవ పాండ్య కేకయ మాత్స్యప్రముఖమహనీయసైన్యంబులతో న ట్లురవడించిన నయ్యుధిష్ఠిరుం డనుమహావాయువునకు జయద్రథుం డద్రియపోలె నడ్డపడియె నని చెప్పుటయు విస్మితుం డగుచు వైచిత్రవీర్యుం డతని కి ట్లనియె.

చ. తనయునిమీఁదికూరిమి ను - దగ్రత సేనలతోడఁ బాండునం
దనులు రయంబుమై నడరఁ - దా నొకరుండ భుజాబలంబు నే
పునఁ గుదియించె నే యతఁడ - పో కురుసేనకు మేటి సింధురా
జున కది యేమహాతపము - సొంపున నత్తటి సంభవించెనో. 62

వ. అనిన విని సూతసూనుఁ డమ్మానవపతి కి ట్లను. పాండవు లరణ్యంబున నున్ననాఁ డతండు ద్రౌపదికతంబున భీమసేనుచేత భంగపడి సంతప్తచిత్తుం డై చిత్తజారాతి నారాధించిన తనిగరిష్ఠనిష్ఠాతిశయంబునకు భక్తవత్సలుం డగునప్పరమేశ్వరుండు ప్రీతుం డై పొడసూపిన జయద్రథుండును గౌంతేయుల నివారించునట్లుగా వరం బొసంగవలయు నని విన్నవించిన నద్దేవుండు పాండవులు నీచేత నివారితు లగుట యొక్కదివసంబునం గలుగుఁ గాక యని పలికి యంతర్హితుం డయ్యె. అది కారణంబుగా నట్టిగౌరవం బారథికవరునకు దొరకొనియె. తత్పరాక్రమంబు తెఱం గెఱిం గించెద నాకర్ణింపుము. 63

సీ. సింధుదేశోద్భవ - స్థిరవాహనంబులఁ, బూనినయరదంబు - పొలుపు మిగుల
రత్నమయోగ్రవ - రాహధ్వజంబు న, భస్థలిఁ జంచల - ప్రభల మెఱయ
సాంద్రచంద్రాతప - సదృశ మై యుజ్జ్వల, చ్ఛత్త్రచామరముల - చాయ నిగుడ
వజ్రముక్తాఫల - వ్రజకిరణావళి, కలితభూషణములు - వెలుఁగుచుండఁ
జిత్తమున వరగర్వంబు - చిగురు లొత్తఁ, బాండుపుత్త్రులదుర్దాంతి - బాహుబలము
మొనలపెల్లును సరకుగాఁ - గొనక యేచి, యార్చి వారికి నీయల్లుఁ - డడ్డపడియె.

వ. ఇవ్విధంబున నడ్డపడి సాత్యకిని సాయకత్రయంబునను భీమసేనుని బాణాష్టకంబునను ధృష్టద్యుమ్నుని నిరువదియమ్ములను విరాటుని శిఖండిని బదిపదితూపులను బాంచాలపతి నేడింటను ద్రౌపదేయులం బదియేనింటను గేకయుల నిరువదేనిం

టను ధర్మసూను సప్తతిశరంబులను నేసి యాసేన నానాస్త్రంబులం గప్పె. అప్పు డప్పాండవాగ్రజుం డతనికోదండంబు దుండంబులు సేసిన నాసైంధవుం డొండు వింట మంటలుం బోనిమార్గణమ్ము లమ్మనుజపతిమీఁదను దదనుచరులయంగంబు లందును బరఁగించినం బవనతనయుండు దలకడచి రభసంబున. 65

క. భల్లములు మూఁట గొడుగును, విల్లును బడగయును ద్రుంప - వేఱొకవిలు నీ యల్లుఁడు గొని భీముగొడుగు, విల్లును బడగయును ద్రుంచి విరథుం జేసెన్. 66

వ. ఇట్లు వికలసాధనుం డై. 67

సీ. అనిలసుతుండు సా - త్యకితేరిమీఁదికి, నరిగిన నీసేన - యార్చుటయును
సైంధవుపై వారి - సైనికోత్తము లనే, కాస్త్రముల్ వఱపిన - నతఁడు వాని
మరలింప ము న్నభి - మన్యుచేఁ గూలిన, రథదంతిహయభట - రాజికతన
నతివిషమం బైన - యానేల నవిహత, గతి వరదంబులు - గ్రందు వఱపి
వారు సేసి రాహ - నము దాని కోర్చి యం, దఱును దమక తమక - తనిసి వెనుక
కొదుఁగునట్లుగాఁగ - నుజ్జ్వలశరనికా, యములు గురిసె నాజ - యద్రథుండు. 68

వ. ఇత్తెఱంగున సింధురాజు పాండవులవేఁడిమి యుడిపిన నుభయపార్శ్వంబులకు మున్ను దొలంగి యున్ననీబలంబులు గోల్తల సేసి యక్కౌంతేయసైన్యసంతానం బుతోఁ దలపడినం బోరు ఘోరం బయ్యె నక్కడఁ గుంభసంభవప్రయత్నవిశేషం బునంజేసి వాహిని మగుడ నడరి యభిమన్యుం బొదివిన నక్కుమారుండు నుక్కు నం గడంగి. 69

క. అభిముఖసంవృత్తము లగు, నిభతురగస్యందనంబు - లిలఁ గూలఁగ న త్యుభిసుం డగువృషసేనుఁడు, రభసంబున నతనిఁ బటుశ - రంబుల నొంచెన్. 70

## వృషసేనుం డభిమన్యుం దాఁకి మూర్ఛితుం డగుట.

ఉ. నొంచినఁ గెంపుసొంపునఁ గ - నుంగవ యొప్పఁగ సూతుఁ ద్రుంచి విల్
ద్రుంచి తురంగవక్త్రములఁ - దూపులు నించి యలంచి మేను నొ
ప్పించినఁ దేరితోడ నఱ - పీనుఁగు నీడిచి కొంచుఁ బాఱె సే
నాంచలభూమికిం బెలుచ - నత్తురగంబులు విహ్వలంబు లై. 71

వ. ఇట్లు వృషసేనునరదంబు వఱచిన తెఱపిన యభిమన్యుండు నిజస్యందనంబు వఱపిం చినం బటుసంరంభంబున నెదుర్కొని. 72

ఆ. శౌర్యధుర్యుఁ డగువ - సాతిభూపతి షష్టి, శితశరంబు లేయ - నతఁడు దొడ్డ
నారసమున వాని - నలిఁ దూల నేసినఁ, గూలి పెలుచఁ దన్ని - కొనుచుఁ జచ్చె.

క. చచ్చినవసాతిఁ గనుఁగొని, యచ్చటిభూపతులు వెలుచ - నడరుటయును వి
వ్వచ్చుకొడుకు కోపించినఁ, జిచ్చుమిడుతపిండు నేర్చు - చెలువము దోఁచెన్. 74

వ. ఆసమయంబునం జేడ్పడి నీసేనలు దీనదశకు వచ్చిన నానాదేశాధీశులు పరస్పరా హ్వాననాదంబులు సింహనాదంబులు శింజినీస్వనంబులుం జెలంగ ధనంజయతన యుపై నొక్కుమ్మడి నురవడించిన నయ్యతిరథవర్యుండు లేళ్లగమిం గనినబెబ్బు లియుబ్బు దోఁప నలిరేఁగి యందఱ నుఱుమాడిన నంగకంబులవివిధఖండంబుల కెంపునను గరితురగనరశవంబులవికృతాకారంబుల నాయుధంబులమెఱుంగుల నాభరణంబులతెఱచునం దత్ప్రదేశంబు దారుణప్రియదర్శనం బయ్యె. అప్పుడు దెర లినమూఁకలు దన్నుఁ దేటి చూడనుం జాలక యంతంత విచ్చవడిన నాగుంపులకుం గవిసి నిలింపపతిమనుమండు సత్యశ్రవః ప్రభృతిభూపాలలోకంబు జములోకం బున కనిచినం జుట్ల నుండి చూచుమానధను లగుమానవపతులు నేన నేన యని కడంగి యక్కుమారునిమీఁద నుఱికి పెనుఁజోఱమొగంబునం బడిన చిఱుచేప తండంబుల చందంబున దావానలంబు దఱియం జొచ్చినమృగకులంబు చాడ్పున సముద్రంబు సొచ్చినయేఱులచందంబున నతనియందడంగిన. 75

ఉ. అన్నట సైన్య మంతయు భ - యాకులతన్ నలుదిక్కులన్ వెసన్
విచ్చిన శల్యనందనుఁడు - వీనికి నోడఁగ నేల మీకు నే
నచ్చితిఁ బట్టి తెచ్చెద న - వారణ బెట్టు పెనంగ నేనియుం
జచ్చు మదీయభూరిభుజ - శక్తి గనుంగొనుఁ డంచు నుద్ధతిన్ 76

వ. రుక్మరథుం డనువాఁడు పాండుపౌత్రుం దలపడి తొమ్మిదియమ్ము లఱమ్మున భుజ మ్ముల రెండును నాటించి వెండియు నేయం గడంగునెడ నాసుభద్రాసూనుండు

ఆ. శరముతోడ నొక్క-కరము చాపముతోడ, నొకటి బొమలు గదిసి-యున్నయుగ్ర
రేఖతోడఁ దల ధ-రిత్రిపైఁ బడ నేసె, రయము మెఱయఁ బటుశ-రత్రయమున.

వ. ఇట్లర్జునపుత్రుండు చిత్రకౌశలంబు సూపిన. 79

ఆ. రుక్మరథుఁడు వడిన - రోషాత్తచిత్తులై, యతనిచెలులు పలువు - రవనిపతులు
గవిసి రపుడు తేరు - గములతో వడి భవ, త్పౌత్రుమీఁద నీదు-పుత్రు లలర. 80

క. అమ్మనుజవిభులబహులశ, రమ్ములచే నూతకేతు - రథరథ్యసమే
తమ్ముగఁ బొదువం బడుతన, తమ్మునిసుతుఁ జూచి పతి ము - దమ్మునఁ దేలెన్. 81

వ. ఇట్లభిమన్యుండు మడసెనకాఁ దలంచి దుర్యోధనుండు సంతోషింప నాసౌభ ద్రుండు భద్రగజంబు బరిగోలలపోట్లం గనలుకైవడిం గినిసి గాంధర్వ మైనమాయ

గావించె. అది దొల్లి ధనంజయుతపంబునకుం బ్రియం బంది తుంబురు ప్రభృతు లాసంగినట్టిది. దానం జేసి యమ్మానవనాథులయాలోకనంబులకుం బెక్కురథమ్ముల వారు దమ్ముఁ బొదివికొని యనేకాస్త్రశస్త్రంబులు ప్రయోగించినచందంబు దోఁచిన వారు వెగడుపడి చూచుచుండ నతండు మండలప్రచారంబులం దేరు మెఱయ మెఱుంగువాలమ్ములం గూలనేసియు వెడందతూపులం ద్రుంచి పడవైచియు బడలు వఱచిన నన్నరపతులు నఱుకుడు వడిన యొలమావిజొంపంబులచందం బగుటయు నుబ్బు దక్కి వెక్కసంబును వెల్లఁబాటునుం గదిరి యక్కురువిభుండు దనకొడుకు కడిమి సైరింపం జాలక యతనిపై నడరి కొండొకసేపు గన్నులపండువుగా భండనంబు సేసి సంరంభవిజృంభితుం డగునవ్వీరవరువిశిఖవేగంబునకుం గాక విముఖుం డయ్యె. అనిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె. 82

ఉ. ఇమ్మెయి బాలుఁ డొక్కరుఁడ - యిందఱఁ దోలి వధించె నన్న నే
నమ్మఁగ నేర నయ్యెడ వి - నం గడు నక్కజ మట్టు లేల చి
త్తమ్మున సంశయింప విను - ధర్మ మధర్మము నోర్వ కున్నె క
య్యమ్ము తెఱంగు సెప్పు మెటు - లయ్యెఁ బదంపడి సూతనందనా 83

వ. అనిన నమ్మనుజవల్లభునకు సంజయుం డిట్లను. అట్లు పెక్కండ్రు రాజులు సచ్చుటయును సుయోధనుండు దెరలుటయును గని భవత్కుమారవర్గంబును దోడి యోధవరులును మేనులు సెమర్ప మొగంబులు వెలవెలంబాఱ నొళ్లింపం గాళ్లు వడంక నలుదిక్కులుం జూచుచు ధృతి దఱిగి పోయిన వెఱచఱచి విఱిగిరి. అప్పుడు మగుడం గోల్తల సేసి కురువిభుండు గురుపుత్రకృపకర్ణకృతవర్మబృహద్బలసౌబల సమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునుబ్బునం గొండొక పెద్ద యనక పిడుగుచందంబునఁ గర్జిలి యుఱికిన నయ్యరదంబులతండంబులు లేట మొగంబు పడియె నట్టియెడ. 84

## దుర్యోధనపుత్త్రుం డగులక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట.

చ. అదలిచి లక్ష్మణుండు విజ - యాత్మజుఁ దాఁకినఁ జూచి యుమ్మలం
బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చన - నోపక క్రమ్మఱురాజుఁ గాంచి యం
బుదములు గొండపై నడరు - పోలిక నన్నరుపట్టి నందఱుం
బొదువ నతండు ఘోరశర - భూరిసమీరమునం దెరల్చుచున్. 85

క. కదిసినలక్ష్మణునిం బులి, కొదమను సింగంపుఁగొదమ - గొదగొనులీలం
బొదువుగతిఁ గిట్టి మోదము, మదము సెలర్పంగ నింద్రు - మనుమఁడు గడిమిన్.

చ. ఉఱక యురంబు బాహువులు - నొక్కొకయమ్మున నొవ్వ నేసి నీ
వెఱఁగి యొఱంగి నన్ దొడరి - తెక్కడఁ బోవఁగ వచ్చు నంచు నే
త్తెఱఁ దలఁ గుండలస్ఫురిత - దీప్తులతో నిల డొల్ల నేసె నం
దఱుఁ బతియుం గనుంగొనఁగ - దైన్యరవంబు సెలంగి సేనలన్. 87

తే. మిడుక మిడుక నిత్తెఱఁగున - గొడుకుఁ దునిమి
యక్కుమారుండు మెఱయుట - నడలుఁ గనలుఁ
గడలుకొనుమదితోడ నీ - కొడుకు వీని
నొంపుఁ డందఱుఁ బైపడి - చంపుఁ డనుడు. 88

క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు,నతనిసుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును భా
సితశరములు గురియుచు న, చ్యుతునల్లునిఁ బొదివి రొక్క-యుమ్మడిఁ బెలుచన్.

క. అతఁ డందఱవిశిఖంబులు, వితథమ్ములు సేసి వారి - వెగడుపఱిచి యు
ద్ధతి సైంధవుపోరెడునెడ, కతిరయమునఁ దేరు నడపు - నాసమయమునన్ 90

వ. నిషాదులుఁ గళింగులు గజబృందంబులతో నడ్డపడిన నయ్యతిరథసింహుండు దరు
వాయి గొని తునుమాడె నెప్పటియోధవీరు లెవ్వది పెక్కుఁబోతు లొక్కపు
లిం జుట్టు ముట్టినచందంబునం బొదివి పెనంగి నాజయద్రథుండును బాండవబలం
బులం ద్రోచి రా నీక రథసాతిశయఘోరంబుగాఁ బోరు చుండె. అక్కుమారుండు
గురుం బంచాశద్బాణంబులను గృతవర్మ నశీతిసాయకంబులను గురుతనయు నశవిశి
ఖంబులను గర్ణు నొక్కబలునారసంబునను స్రుక్కించి కృపుని విరథుం జేసి
బృహద్బలుమేన ముప్పదినారసంబులు నాటించి వారలకు బాసట యయి కది
సినసైనికులం బెక్కుతెఱంగులతూపులఁ జిక్కువఱిచి యుక్కునం గ్రోధలిప్తబ్బం
దారకు లనురాజులను రూపడంచె. అప్పుడు శారద్వతుండు దేరాయితంబు సేసి
కొని కడంగి తోడియేవురం గూడుకొని గ్రూక్రీడికొడుకుమీఁద మార్గణపరంప
రలు ఎరఁగింపం బెరిఁగినదర్పంబునం గని మసంగి యతండు నొప్పింపం బెఱవారు
బీఱువోవ బృహద్బలుండు బిట్టు గవిసి నిశితశరంబులు నిగిడించిన నన్నరనంద
నుండు. 91

ఉ. చాపముఁ గేతువుం దునిమి - సారథి నశ్వములన్ వధించుడుం
గోప మెలర్ప ఖేటకముఁ - గ్రూరకృపాణముఁ గొంచుఁ దేరు సా
టోపత డిగ్గి వే కవియు - డుం బటుభల్లహతిం గృతాంతసే
వాపరుఁ జేసె హృత్పుటము - వ్రచ్చి బృహద్బలు భూరిదోర్బలున్. 92

వ. ఇట్లింద్రపౌత్త్రుండు గోసలేంద్రునిం దెగఁ జూచినఁ జూచి యేచి తదీయబంధు భూపతు లొక్క మొగి నురవడించిన నతండు వారలయేపు మాపి కర్ణుండు డాసినం గర్ణోపాంతంబు గర్ణికానారాచంబుల నొప్పించె. అయ్యిరువురు నొండొరులమే నులు నెత్తురుల జొత్తిల్లం జేసిన సంధ్యాసమయసూర్యబింబప్రతిబింబంబులుం బోలెఁ బొలిచిరి. ఆసమయంబున సూతనందనునాయంకు లార్వురు గర్వంబునఁ దన్నుం గదిసినం గవ్వడికొడుకు చిత్రపథవిహారంబు సలుపునప్పుడు కుంభసంభవ ప్రభృతిరథికవరులశరంబులు మగిడించుచు వారిపైఁ దూపులు నిగిడించు చునికి యద్భుతం బయ్యె నట్టియెడ. 93

తే. మగధపతిసూనుఁ డైనయ - శ్వంతకుండు
బాలుఁ డయ్యును బ్రౌఢదో - ర్బలము మెఱయఁ
దాఁకుటయు సూతుతలయు ర - థ్యములతలలు
నతనితలతోన యభిమన్యుఁ - డవనిఁ గూల్చె 94

వ. ఇట్లు పూర్వవైరంబు దలంచి తలపడినమాగధకుమారు నవలీల నేలం గలిపి సింహ నాదంబు సేసినం దత్సంరంభంబు సైరింపం జాలక దుశ్శాసనసూనుండు సరభసం బుగాఁ గవిసి ఘోటకంబుల నంబకచతుష్టయంబునను సారథి నొక్కనారసం బుననుం దదీయతనువు పదిబాణంబులను బెలుచ నొప్పించినం జంచదరుణకమల చారువిలోచనుం డగుచు సౌభద్రుం డతనిఁ బ్రదీప్తసప్తనారాచనిపాతపీడితుంజేసి డగ్గఱి. 95

ఉ. ఇంతకు మున్న నీజనకుఁ - డెంతియు నోటటి పాఱె నీవు నా
పొంతకు వచ్చి తింక నెట - వ్రా నగు నం తొకదొడ్డనాసం
బెంతయు బెట్టిదంపుపడి - నేయుడు ద్రోణసుతుండు దాని నిం
తింతలు సెక్కలై యిలప - యిం గొరఁగఁ వెస నేసె నేసినన్. 96

తే. అతనిదిక్కును జూడక - యతఁడు రయము
మెఱసి నీపౌత్త్రుచాపంబు - నఱికి సూతుఁ
గూల్చి యాఱమ్ము లురమునఁ - గ్రుచ్చుటయును
నొండుదేరిపై కబ్బాలుఁ - డుఱికె నధిప. 97

వ. అంత నపరాహ్ణం బయ్యె. ఆసమయంబున శత్రుంజయుండును జంద్రకేతుండును సువర్చసుండును సూర్యభానుండును మేఘవేగుండును మొత్తం బైతాఁకిన ధనం జయతనయుండు మేటిమగ లగునమ్మహీశులమేనులు నానాస్త్రంబుల ననేకఖండం

బులు గావించి గాంధారపతి సేరినం గ్రూరనారాచజాలంబుల జర్జరితశరీరుం
జేసి దుర్యోధను దెసకు నడరుటయు నంగపతి యాచార్యున కి ట్లనియె. 98

క. చండగతి వీఁగరథికులఁ, జెండుచు నేతెంచి రాజుఁ - జేరెడు సౌభ
ద్రుం డిట్టులు నీకూరక, యుండ నగునె ప్రతివిధాన - మొనరింపు తగన్. 99

క. అని పలికి పతికి నడ్డము, సనుటయు గురుఁ డచటియోధ - చయముం గలయం
గనుఁగొని యభిమన్యుఁడు న, ర్జునుఁడును నని నొక్కరూప - చుండీ తలఁపన్.

వ. చూడం జిన్నవాఁడు గాని యలంఘులం బోయెడువాఁడు గాఁడు మన మందఱ
ముం గూడికొని యొక్కపెట్ట యక్కుమారుపై నురవడింప వలయు నని పురికొ
లిపి బరపసంబుసేసె నప్పు డప్పాండుపౌత్రుబాణంబులం బీడితుం డై సూతపుత్రుం
డు కుంభసంభవు నాలోకించి నాదెస సూడుము వీఁడు నొప్పించె నిలువం దగు
నెల వగుట నసము డింపకి యాలగఱచుకొని యున్నవాఁడ గాండీవిఁ గలనం గ
దిసి యెఱుంగుదుమ కాదె యతనిచే యింత బెట్టిదంబు గా దని చెప్పిన విని యల్లన
నగి యతం డతని కి ట్లనియె. 101

సీ. కవచధారణ మను - సునవిద్య గవ్వడి, కే నెఱింగించితి - నితఁడు దాని
నేర్చుట నీతని - నెట్టన నొప్పింప, శక్యంబు గాదు వం - చన గుణంబు
నఱకంగఁ జాపంబు - విఱుగ నేయఁగ ఘోట, కములఁ జంపఁగ సూతు - సమయఁ జేయ
నగుఁ జాలు దేని నీ - వట్లు సేయుము చేసి, ధను వుండ నవ్వీరుఁ - డెనయ వశమె
దేవతలకు నైనఁ - గావున నొక్కమై, విల్లు ద్రుంచి తఱిమి - విరథుఁ జేసి
చూచికొంద మలవు - కొప్పునఁ దెగునె యీ, రథికవారునిపటుప - రాక్రమంబు.

## కర్ణుఁడు మొద లగుయోధులు వంచనచే నభిమన్యుని విరథుఁ జేయుట.

న. అన విని సూతసూనుఁడు భ - యం బెసఁ గూరినవాఁడపోలె నై
వెనుక కొందింగి యారథిక - వీరుపిఱిందికిఁ జుట్టి వచ్చి వం
చనకు సహాయు లై యచటి - సైనికు లన్నరపుత్రు బిట్టు మా
ర్కొని పెనఁగంగ జేరి యల - ఘు ప్రదర బున విల్లు ద్రుంచినన్. 103

వ. ఆలోన. 104

క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను, సరభసముగఁ గృపుఁడు సంపె - సారథి నమ్మై
నరసుతుఁ డనాయుధుండును, విరథుండును నగుట నూచి - వెఱ పేది వడిన్. 105

క. శకుని కృతవర్మ శల బా, హ్లీక గురుసుతు లాదిగా న - నేకు లడరి య
స్త్రకలాపంబుల శస్త్ర, ప్రకరంబుల నొంచి చిక్కు - పఱచి యలఁచినన్. 106

క. వాలును బలకయుఁ గొని య, బ్బాలుఁడు రయ మార గగన - భాగంబున కు
న్మీలితధృతిసారుం డై, లీల నెగసి పోయె మండ - లీభూతగతిన్. 107

క. తనవిద్యకలిమి వినతా, తనయునిభంగిం జరింపఁ - దనుతమపైఁ దెం
పున నుఱుకు ననుతలంపున, మనయోధులు భయము గొనిరి - మనుజాధీశా. 108

చ. ఎడ గని వాలు బల్లెమున - నేసె వెసం దునియంగ ద్రోణుఁ డ
వ్వడు శకలంబు లై పలక - భూమిపయిం దొరఁగంగఁ జేసె నె
క్కుడుపడిఁ గర్ణుఁ డాశుగ వ - సుంధగతిం దనతేరిమీఁద నొ
ప్పెడుఘనచక్రముం గొని యు - పేంద్రుఁడు లీల నటించుచాడ్పునన్. 109

వ. సంరంభవిజృంభితుం డై. 110

సీ. నెత్తుట జొత్తిల్లి - నెఱసినయలుక ను, గ్రం బైనవదనంబు - కాంతి పరఁగఁ
గౌరవ సైనికో - త్కరమున కతిభయ, దం బగుసింహనా - దంబు సెలఁగ
నింగికి నిగుడుర - థాంగరోచులు మణి, కంకణద్యుతులతోఁ - గలసి వెలుఁగ
సిల్లు సూపినగంధ - సింధురం బను రేఖ, దలఁపించుపటుగతి - చెలువు మెఱయఁ
గుంభసంభవుఁ డున్న ది - క్కునకుఁ గవిసి యడ్డపడుసేనఁ జించి చెం-డాడునక్కు
మారవరు మేనియొప్పును - మగతనంబుఁ, జలము బలముఁ గీర్తించె ని ర్జరగణంబు.

వ. అట్టియెడ 112

తే. శకునికృతవర్మకృపకర్ణ - శల్యముఖ్యు, లైనయోధులు పెక్కండ్రు - రఖిలదిశలఁ
బొదివి యతనికి రంబునఁ-బొలుచు చక్ర, మలఁతితునియలు గా నేసి-రాగ్రహమున.

వ. ఏసిన నతండు రయంబున. 114

క. గదగొని యశ్వత్థామం, గదియుడు దంభోళికొదమ - కైవడి మెఱుఁగుల్
వొదలించుదానిఁ గని కడు, బెదరి యతఁడు రథము డిగ్గి - పిఱిఁదికిఁ జనియెన్.

వ. సుభద్రాతనయుం డతనిరథ్యంబులను సారథినిం జదియ మోఁది మనజోదుల యమ్ములు నేదు పెఱిగినచందంబున సౌబలునిదెసకు నడచి యాతనికి నడ్డపడిన గాంధారుల సప్తవింశతిరథికులం బొరిగొనుటయుం బురికొని తన్ను మార్కొనిన వసాతీయులం బదుండ్రనేనుంగులతోడన పీనుంగులఁ గావించి యందంద తఱిమిన కేకయసప్తకంబు రథసహితంబుగా నగ్గలిక నుగ్గు సేసి డస్సి తూఁగాడుచుఁ దొలం

గినయోధుల నుల్లసం బాడుచు నతిమిసవారి నుఱుమాడుచు వీరవ్రతంబు ధీరత్వ
నిష్ఠం జలుపుచుండె. 116

ఉ. ఆసమయంబునం గడంగి - యాయిత మైనరథంబుతోడ దా
శ్శాసని రా నతం డదరి - సారథిఁ జంపి హయంబులం బడన్
ద్రేసిన నాతఁ డల్గి గద - వేకొని యుద్ధతిఁ దేరు డిగ్గ ను
ద్భాసితమూర్తులం బొలిచె - భ్రాతృకుమారయుగం బుదాత్తమై. 117

## అభిమన్యుదుశ్శాసనసుతు లిరువురుఁ జచ్చుట.

తే. ఇవ్విధంబునఁ గదిసి న - రేంద్రముఖ్య, నీదుమనుమలు సూపఱ - నెమ్మనముల
కద్భుతంబును శోకంబు నావహిల్ల, లావు పెరవును మెఱయఁ జ - లంబు నెఱయ.

ఉ. ఒండొరు మీఁదికోపమున - నుగ్రతఁ బోరి రుదగ్రులై గదల్
మండఁగ నెత్తురుల్ సెదర - మాంసము పిండిగ నెంపసుగ్గు లొం
డొండ ధరిత్రిపైఁ దొరఁగ - నొప్పెడుమేనులు వ్రాల వానిలో
నుండక ప్రాణముల్ వెడలె - నుబ్బునఁ గ్రాలఁగ దేవకామినుల్ 119

వ. ఇత్తెఱంగున. 120

చ. వనగజ మంబుజాకర మ - వారణఁ జొచ్చి కలంచి యాడఁగా
మనమునఁ గొంకు లేక కృప - మాలినబోయలు ముట్టి చంపుచా
డ్పున భవదీయసేన పొరి - పుచ్చఁగఁ జుట్టును ముట్టి పార్థనం
దను నలయించి నిర్దయవి - ధంబునఁ జంపి రనేకసైనికుల్. 121

వ. అట్టియెడ. 122

సీ. జగము లన్నియును దే - జంబున వెలిఁగించి, యపరాద్రి సేరిన - తపనుమాడ్కిఁ
దఱ చైనకానలు - దరికొని నివుఱుగాఁ, జేసి యాఱినదవ - శిఖివిధమున
గగనంబుతో రాయు - కరడులు గలజలం, బివురఁ బాఱినమహా - ర్ణవము కరణి
నున్నతగతి సెడి - యుర్విపైఁ గడు విన్న, నై పడి యున్నసు - ధాంశుభంగి
భీరమునఁ దమవారికిఁ - బెం పొనర్చి
యరుల సమయించి వస మఱి - యనువు దప్పి
తెగియుఁ జూడ్కికిఁ జాల వ్రేఁ - గగుచుఁ బొలిచె
మహితమూర్తిశోభితుఁ డభి - మన్యుఁ డధిప. 123

ఉ. నెత్తుటఁ దోఁగి నేల యొఱ - నింగి తెఱంగున నుండె నక్కుమా
రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ - నొప్పె సితాయుధఖండభూషణో

దాత్తమణి ప్రతానములు - తారలచందము నొంది యంద మై
యత్తటి నుల్లసిల్లె వసు - ధాధిప చూపఱపిండుచూడ్కికిన్. 124

సీ. కరికళేబరములు - ధరణీధరములు దు, రంగగాత్రమ్ములు - గ్రాహసమితి
నరశరీరములు మీ - నములు గౌక్షేయక, క్షురికాదిశస్త్రంబు - లురగకులము
రుధిరార్ద్రశరములు - రుచిరప్రవాళముల్, ప్రేవులప్రోవులు - ఫేనతతులు
నెత్తురువెల్లువ - నీరులు భూషణ, స్తోమాస్థిచయముల - తుమురు లిసుక
గాఁగ నంబురాశి - కరణి సంగ్రామభూ, భాగ మొప్ప మిగుల - భవ్యయోగ
నిద్ర నున్నవిష్ణు - నికిఁ బాటి యగుచు శో, భిల్లె నమ్మురారి - యల్లుఁ డందు. 125

వ. అబ్బాలుండు. 126

తే. మహితలావణ్యమున సుకు - మారమైన, యంగమును బూర్ణచంద్రుని - భాననంబుఁ
గ్రొత్తపెంపుగ నెంతయుఁ-గొమరుమిగిలి, చెన్నుదలకట్టునై పడి-యున్నఁ జూచి.

క. నీసైనికు లెంతయు సం, తోసిల్లుచు నార్చి రపుడు - దుఃఖితు లై కుం
తీసుతులవారు దీనద, శాసంగతు లైరి బాష్ప - జలములు దొరఁగన్ 128

క. నెఱి దప్పంబడి పెల్లుగ, నొఱలెడినరవాజికరుల - యులి వభిమన్యుం
డఱిముఱిఁ బడుటకు వగ మదిఁ, బఱిగొన నిల పెలుచ నఱచు - భంగిఁ జెలంగెన్.

వ. ఆసమయంబున. 130

క. పెక్కండ్రు గూడి యిమ్మెయి, నొక్కనిఁ జంపుట యధర్మ - మో హో యని న
ల్దిక్కులను బెద్దయెలుఁగున, నక్కజముగ భూతసంచ యంబులు పలికెన్. 131

వ. ఇట్లు శౌర్యసారసంపాదితరౌద్రుం డైనసౌభద్రుండు పడుటయు వారిబలంబులు విచ్చిపడి భండనంబు దక్కి తలరిన ధర్మపుత్త్రుండు ప్రబలయోధవీరలోకంబు నాలోకించి యి ట్లనియె. 132

సీ. మార్బలంబులుసొచ్చి - మాతంగములఁగూల్చి, రథరాజిఁగలఁచి తు - రంగములఁ
ద్రుంచి పదాతులఁ - దునుమాడి పెక్కండ్రు, సైనికప్రవరుల - సమయఁ జూచి
మూఁకల విఱియించి - వీఁక నాచార్యాది, యోధుల నెల్లను - నొక్కదెసకు
వెలిచి వియచ్చరుల్ - వినుతింప నాకంబు, చూఱ గొన్నట్టియ - ర్జునతనూజుఁ
జూచి మనకు నేల - శోకింప వైరుల, గం డడంచి గెలుపు - గంద ముచిత
భంగిఁ బ్రొద్దుకొలఁది - పరికించి మనసైన్య, ముల మరల్త మెలమి - దలకొనంగ.

వ. అని పలికి బరవసంబు సేసి సేనలం బురికొల్పికొని యవష్టంభవిజృంభితుం డయి నిలిచె. పడంపడి యరుణకిరణుం డపరమహీధరంబుమాళికి సరసీరుహశేఖరం బై చెలువారం దదనంతరంబ రిత్తకోట్లును నెత్తుటకాల్వలొత్తిల్లుచున్నట్లుండె. పిండుగట్టి పిశాచనిశాచరులు నలిరేఁగి రక్తపానంబును మాంసఖాదనంబునుం జేయుచు మోదంబునం బొందుచు నాడుచుం బాడు చుండుకలకలంబునను గుణప భక్షణవ్యగ్రవిహంగసముదయతుములంబునను బలలఖాదనసంరంభశివానివహ కోలాహలంబునను బరమాభీలం బైనసంధ్యాకాలంబు నిరూపించి నిజశిబిరంబులకు నుభయబలంబులుం బోయె అప్పుడు నీకొడుకు లుబ్బునం గొమరు మిగిలి యరిగిరి. కౌంతేయులు చిన్నఁబోవు నాననంబులతో శోకసంతప్తచిత్తు లయి చనిరి. ఇవ్విధంబున ధర్మతనయుండు దననికేతనంబున కరిగి యచట నిఖిలపరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారు లై యున్నసమయంబునఁ దమ్ముని దెసకూరిమి యారం గూరినవగ పెంపున ధైర్యంబుసొం పఱి వివర్ణవదనుం డగుచు ని ట్లనియె.

## అభిమన్యునిమరణమునకు ధర్మరాజు దుఃఖించుట.

మ గురుశారద్వతముఖ్యయోధవరసం - గుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మాసైన్యము దానిఁ జొచ్చి ననుఁ బ్రీ - తుం జేయఁగాఁ బూని యొ
క్కరుఁడుకా గోవులలోను జొచ్చుబలుసిం - గంబోల్కొ నా నట్లు సొ
చ్చి రయుం బార నసేకవీరశిరముల్ - సెండాడె నుద్దండుఁ డై. 135

క. ఈసును రోసముఁ గలదు, శ్వాసను నొప్పించి పఱపి - చతురంగములకా
గాసిఁ జేయుచు న ట్లు, ల్లాసముతో మెఱఁగఁగాఁ ద - లంబె యొరులకున్. 136

తే. కొడుకుఁ బొడగాన కర్జునుఁ-డడిగె నేని, వానితో నింక నే మను-వాఁడ హరికి
నతని గారాబుచెలియలి - కధికదుఃఖ, మేన చేసితి వగపంగ - నేమి గలదు. 137

క. బాలుఁడు సుకుమారుఁడు పె, క్కాలములం జొచ్చి యెఱుఁగఁ-డనక మొన సొరం
జాలుదు చొరు మని పనిచితి, నేలా న న్నాస దోస - మెఱుఁగఁగ నిచ్చున్.

క. కుడువను గట్టను బూయను, దొడుగను బోఁ బనిచి కాక - తొలుత మొన సొరం
గొడుకుం బనుచుట కిన్వఁడుఁ, గడఁగునె నాయట్టిపాప -కర్ముఁడు దక్కన్. 139

తే. వానితోడిద లోక మై - యేను బోవ, నైతిఁ బోఁ గన్నఁ బుత్త్రశో - కాతురత్వ
మున నితాంతవివర్ణతఁ - బొందుచుండఁ, జూడ కుండెడివాఁడ న-ర్జును మొగంబు.

ఉ. వాసవునంతవానికిని - యిచ్చినయాపద దీర్చుఁ గాలకే
యాసురులట్టిబల్పగఱ - నైనను ద్రెళ్లిడిఁ ద్రుంచు నాజి న

వ్యాసవి యాత్మజుండు పగ - వారలచే హతుఁ డైనదుర్దశం
జేసి యలంతఁ జెడ్పడఁగఁ - జేసె విధాతృని నేమి సెప్పుదున్. 141

చ. కొడుకు వధించి రన్నఁ గురు - కోటిని సెట్టిన యల్గి రూపు మా
పెదున కడంగి పార్థుఁ డెదఁ - బేర్చినశోకము నార్పఁ జాలునే
పుడమిధనంబు నాకమువి - భూతియుఁ జేరినయేని నల్ల న
వ్వెడునభిమన్యుసెమ్మొగము - వే యగుపాలును బోల నేర్చునే. 142

వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలవించె... అని సంజయుండు సెప్పుటయు.

తే. అతనితో ధృతరాష్ట్రుఁ డి - ట్లనియెఁ గ్రీడి
సంగరమున సంశప్తక - సమితి నేమి
సేసె సుతువార్త యెవ్వరు - సెప్పి రాతఁ
డట్లు దెగుట యెఱింగి యె - ట్లయ్యెఁ జెపుమ. 144

క. అనిన విని సూతసుతుఁ డి, ట్లనుఁ బేరడవులు దహించు - ననలముచందం
బున సంశప్తకసేనల, ననిమిషపతిసుతుఁడు దీవ్రుఁ - డై పొరి వుచ్చెన్. 145

## అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట.

వ. అట్లు మర్దించి మగుడునప్పుడు మాధవు నాలోకించి. 146

చ. కలయఁగ దుర్నిమిత్తములు - గానఁగ నయ్యె మదీయచిత్తముం
గలఁగెడు మేను బ్రామనుపడెఁ - గాఁ దొడఁగెఁ గురుఁ డారయంగఁ గే
వలుఁడె నృపాలుఁ డేదెసకు - వచ్చెనొ యన్న నతండు రాజుఁ ద
మ్ములు సుఖు లొండుమై నశుభ - ముం గలదిప్పు డెఱుంగ నయ్యెడున్. 147

వ. అని పలికె. తదనంతరంబ యద్దామోదరధనంజయులు సంధ్యాసమయసముచిత కరణీయంబు లాచరించి యరుగుదెంచి నిజశిబిరంబు సొత్తెంచిరి. అది చిట్లిన చిత్రరూపంబులు గలకుడ్యంబునుం బోలె వివర్ణాకారు లైనజనులవదనం బాడఱియున్నం దత్ప్రకారం బనుసంధించి యన్నరుండు నారాయణున కి ట్లనియె. 148

క. సైనికులుఁ నన్నుఁ గనుఁగొని, యాననములు వాంచి తొలఁగి - యరిగెద రది యే
మో నేఁడు వేణువీణా, గానస్వనములును వీటఁ - గలుగవు కృష్ణా. 149

క. ఈమేలు ప్రజ కొనర్చిన, యామహిమకు నెలవు గొంతి - యగ్రతనయుఁ డో
భీముఁడొకో తమ్ముఁగుఱ్ఱలొ, కో మఱియెవ్వరొకో తలఁపు - గొలఁదికి మీఱెన్.

ఆ. అలరు మొగముతోడ - నభిమన్యుఁ డేలొకో, యెదురు రాఁడు నాకు - నెట్టివార్త
చెవులు సోఁకునొక్కొ - చే వెట్టికలఁచిన, భంగిఁ ద్రిప్పికొనఁ దొ-డంగె మనము.

క. పలుమాటల కిటు మఱుమా, టలు వలుకనికృష్ణుతో న - డలు మది మొలవం
బలుకుచు ధర్మసుతునివిడి, దల కరిగెను మోము వెల్లఁ - దనమునఁ గదురన్. 152

వ. ఇవ్విధంబున నరిగి యన్నరపతి బంధుమిత్త్రులును మాన్యరాజన్యులుం దానును
నొక్కయెడ నున్నం దత్ప్రదేశంబునకుం గేశవుండును దోడన చనం జని వారు
మ్మలించి యునికియు వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి సవ్య
సాచి యడుగులు దొట్రుపడ నక్కొలువులోనికిం బోయి కలయం గనుంగొని
యెలుంగు రాల్పడ నిట్లనియె. 153

క. ఆననములు వెలవెల్లం, గా నడ లొందఁవినది మీకు - గానఁ దడప మీ
లో నభిమన్యుఁడు లేఁడే, మో నాకుం జెప్పఁ డే-యూరక యుండన్. 154

క. ధనురాచార్యుఁడు దగఁ బ, న్నినపద్మవ్యూహ మొరులు - నేరరు చొరు మం
చనుమానింప కతనిఁ జొరు, మనరు గదా మీయుపాయ - మాఱడిఁబోవన్. 155

ఉ. అమ్మెయిన సొచ్చుచొప్పు దెలి - యన్ వినె నంతియ కాని యిమ్ములం
గ్రమ్మఱుభంగి వాఁడు వినఁ - గానఁడు దీని నెఱుంగ కున్కిఁ బా
పమ్మునఁ బోయి మీరు సొరఁ - బంచిన నుక్కునఁ జొచ్చి యోధబృం
దమ్ములచేత మ్రగ్గఁడు గ - దా కురువీరులుసుట్టు ముట్టినన్. 156

మ. హరిమేనల్లుఁడు గొంతికూర్చుమనుమం - డస్మత్తనూజుండు సం
గరకేళీనిపుణుండు దివ్యశరశి - క్షాశాలి యవ్వీరు నె
వ్వరొక్కో నేలకుఁ దెచ్చి రొక్కరునిచే - వాఁ డేల చిక్కుం బొరిం
బొరిఁ బెక్కండ్రురు విచ్చుచుం బొదువుచుం - బోరాట గల్గెం జుమీ 157

క. గురులకు భక్తుఁ డుదారుఁడు, గరుణ గలఁడు శౌర్యధైర్య - గాంభీర్యధురం
ధరుఁడు మొగ మోడు నాసుర, వరపౌత్త్రుఁడు లేమి కోర్వ-వచ్చునె చెపుఁడా

క. అన్నగుమోమును నత్తెలి, గన్నులు నవ్వెడఁదయురముఁ - గన్నారంగాఁ
గన్నను బ్రదుకుదుఁ గానక, యున్నను బ్రాణంబు లెట్టు - లుండఁగ నేర్చున్.

సీ. హంసతూలికపాన్పు - నందుఁ బొందెడుమేను, కఠినంపునేలతోఁ - గదిసె నేఁడు
గొడుగులనీడ పై - నడరఁ జెన్నగుమోము, పొరిఁ బర్వ పెందూళి - బ్రుంగె నేఁడు
లలనలు లీలమైఁ - గొలువ నుండెడుభోగి, వఱలులలో నున్న - వాఁడు నేఁడు
నానాజనములకు - నాథుఁ డై శోభిల్లు, దొర యనాథత్వంబుఁ - బొరసె నేఁడు

వినయరతుఁడు హృదయ - విదుఁడు సుభద్రగా, రాబుపట్టి మగల - రాజు మాన
ధనుఁడు దివిజరాజు - మనుమఁడు నాచెలి, కాఁడు ముద్దులాఁడు - లేఁడు నేఁడు.

ఉ. అక్కట మందభాగ్యునకు - నట్టితనూభవరత్న మెవ్విధిన్
దక్కు విధాత నిర్దయుఁ డొ - డంబడునే కడుమేలివస్తువుల్
పెక్కుదినంబు లున్కి యరి - బృందము పిల్చినఁ బోటుబంట నై
యక్కడ కేల పోయితి మ - హాగుణభూషణుఁ గోలుపోయితిన్. 161

వ. అనుచుఁ జదికిలంబడి ఫల్గునుండు. 162

ఉ. హా యను ధర్మరాజతన - యా యను న న్నెడఁబాయ నీకుఁ జ
న్నే యనుఁ దల్లి నేఁపఁ జను - నే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి వోకఁ దగ - వే యను నేగతిఁ బోవువాఁడ నే
నోయభిమన్యుఁడా యనుఁ బ్రి - యోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్. 163

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించి యుధిష్ఠిరునాననం బాలోకించి.

ఉ. పావని సేరి యుండఁడొకొ - పార్షతుఁ డచ్చట లేఁడె యొండుమైఁ
బోవఁగఁ బంచితే ద్రుపదుఁ - బోరికి సాత్యకి రాక తక్కెనే
భూవర మత్స్యనాథుఁ డెట - వోయెనొ డెప్పర మైన నీకునుం
గావఁగ రాక తక్కెనొ తె - గం గత మేమి సుభద్రపట్టికిన్. 165

అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు చచ్చినవిధంబు నడుగుట.

క. పడుఁగాక యేమి పగఱం, గడిమి మెఱసి చంపనొంపఁ - గనియెనె నృప నీ
కొడు కిట యటనూడక యె, క్కుడుమగఁటిమి నుఱికి పేరు-గొనియెనె పోరన్.

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి చింతించి 167

చ. పలువురు సుట్టు ముట్టికొని - బాణకృపాణముఖాస్త్రశస్త్రపం
క్తులఁ గడు నొంపఁగాఁ దనకుఁ - దోడ్పడువారలు లేక నన్ మదిం
దలఁపఁడ యత్తఱిన్ రిపుప - థంబున కెద్దియుము తండ్రి యేను గొం
దలమునఁ బొంద కుండ నని - తోఁ బలుమాఱును జీర కుండునే 168

క. అక్కట తప్పఁ దలంచితి, నక్కొలఁదులవాఁడె కృష్ణు నల్లుఁడు పోరన్
స్రుక్కునె బాహాగర్వము, దక్కునె నాకొడుకు మిన్ను - దలపైఁ బడినన్. 169

ఆ. పిన్నవగవుతోడఁ - జె న్నెస లారుసొ, భద్రుమొగము సూడఁ - బడయ కున్న
వాఁడ నామనంబు - వ్రయ్య లై పో దిది, రాతిఁ జేసినది యొ-కో తలంప. 170

క. పలువురు క్రూరత బాలునిఁ, జలముకొని వధించునపుడు - శౌరిని నన్నుం
దలఁపరొకో మనముల వా, రలు దానికి నేమి నీఁగ - రా దయ్యెడినో. 171

క. కటకట పేరినపెన్నె, త్తుట జొత్తిలి యున్నమేని - తోఁ గొడుకు కేచ
క్కటిఁ బడి యున్నాఁడో య, చ్చోటు సూపెడువారు లేరె-చూచెద వానిన్.

సీ. పడి యుండి వాఁ డిల - బొడిచినచందురు, క్రియ దత్తలము వెలిఁ - గింప కున్నె
యే మని నాతోడఁ బ్రేముడించునొకో సు,భద్ర పుత్త్రునిఁ జూడఁ-బడయ కున్కిఁ
బగతురనిర్జించి- మొగముపోటుల నొచ్చి, పాదసూపరాఁ డయ్యెఁ-గొడుకు నాకు
నడలునఁ దల్లడ - పడియెడు ద్రౌపది, వంత మాన్పింప నె - వ్వరికి వశమె
యని యలంతమైఁ బలుమాట-లాడుచుండి, తలఁచి మఱియును ఘర్మనం-దనునియాన
నంబు వీక్షించి నిర్జర - నాథతనయుఁ, డెలుఁగు గుత్తుకఁ దగులంగ - నిట్టు లనియె.

వ సంశప్తకసమితితోడం దమకించి పోరి పోరి కౌరవసైనికుల సింహనాదంబులు వింటి
నప్పు డెలుం గెత్తి యుయుత్సుం డాడినమాటల నాకర్ణించితి. 174

సీ పెనఁగంగఁ జాలరు - బీభత్సుతో మీరు, బాలుని నొక్కరుఁ - బలువు రిట్లు
సంపితి రిది మీకు - సంతోషకాలమే, యేద్దురు గా కార్వ - నేల చెపుఁడ
హరికి నర్జునునకు - నప్రియం బొనరించి, బ్రదుకంగ వచ్చునే - భవున కైన
నది యట్టు లుండె నీ - యధికపాపముఫలం, బెట్లును జెఱుపక - యేల తక్కు
ననియె నివ్విధమున - నరిసేనయోధుల, నత డు వలుక వీను - లార వినియుఁ
గలియ నైతి వాసు - దేవుండు వినియెన, యని తలంచి దాని - నంత గొనక. 175

క మనుజాధిప తగుసమయం, బున నీ వెఱిఁగింపఁ గన్నఁ - బొరివుచ్చనె వే
చనుదెంచి నీసుతుం గొది, వినయెషఁ దశ్త్రారయోధ - వీరుల నెల్లన్. 176

క అని పలికి మఱియుఁ గొడుకుం, బనవుచు శోకమున మునుఁగు - ఫల్గునునిఁ దగం
దనకరములఁ బొదువుచు ని, ట్లను హరి చిత్తంబులోన - నడ లూఁదంగాన్. 177

చ ఇటు దగునయ్య శూరులకు - నెల్లను బోకపె యిట్లు కాదె యే
మిటికి నలందురక్ మొనలు - మేకొని యాయుధజీవనంబు నూఁ
గుటయు నెఱుంగవే రిపులఁ - ద్రుంచి యశం బిల నించి పుత్త్రుఁ డె
క్కటి దివిచూఱకోల్ ప్రియమ - కా కిది యప్రియమే తలంపఁగాన్. 178

ఆ. ఎఱుఁగ వలయూ దాని - నెఱిఁగి కోవిదుఁ డగు, నట్టినీకు వగవ - నగునె పార్థ
నీదువంత నూచి - నీవార లందఱు, దీను లైరి వీరిఁ - దేర్పవలదె. 179

వ. వీరలం జూచి తగుమాట లాడు మనిన నత్యంతశోకాక్రాంతస్వాంతుం డగుచు
సుభద్రాకాంతుండు గద్గదకంఠంబుతోడం దోడంబుట్టువుల కి ట్లనియె. 180

చ. మనసిజమూర్తి యైనయభి - మన్యునిమాటలు వీనులార నే
విన వలతుం దదీయమృతి - వేడ్క నొనర్చినవారు గ్రక్కనం
జని తగ వానిఁ గాంచి సుఖ - సంగతిమైఁ జరియించునట్లుగా
ననిచెద నేఁటిపోరు దెలి - యం గలభంగియు మీరు చెప్పఁడా. 181

వ. అని మఱియును. 182

చ. అలవుఁ జలంబు శౌర్యమును - నస్త్రమహత్త్వముఁ గల్గునిండఱుం
గలుగఁగ నెట్లు సచ్చు బల - ఘుస్మరుచే నయినం బ్రచండదో
ర్బలవిభవాభిరాముఁడు సు - భద్రసుతుం డిది యెన్నిభంగులం
దలఁచినఁ బోల దేమిటిక - తంబున నామన మిట్టు లయ్యెనో. 183

క. మిమ్మును బాంచాలురఁ గడు, నమ్మి చెడితి వానిరక్ష - ణమ్మునఁ బ్రౌఢ
త్వమ్మిట్లు లేమి యెఱిఁగిన, నెమ్మెయిఁ గాచికొన నేర నే యబ్బాలున్. 184

క. రథవితతి వఱపి మీ రవి, తథముగఁ గవియంగ మిమ్ముఁ - దాఁకి కలఁచి యే
రథికులు సమయించిరి యరి, మథనభుజావిభవు నక్కు - మారోత్తమునిన్. 185

వ. అని యంత కంత కగ్గలించునుమ్మలికంబునం గలంగి యంత నిలువక. 186

క. ఉక్కను నస్త్రబలము మీ, కెక్కుడియది సాల రైతి - రిందఱు నని న
య్యొక్కరుఁ గావఁగ మీరీ, తక్కువ కోర్చితిరి మిమ్ముఁ - దక్కన నేలా. 187

క. బలహీనులు సంగరభీ, తులు నగుమి మ్మెఱిఁగి యెఱిఁగి - తొలఁగి తనూజుం
దఱుఁపక యొంటి మెలఁగువెం, గలి నగునను దూఱుకొందుఁ - గా కేమందున్. 188

తే. మానుసులువోలె నున్నార - లేను లేని, తఱి మహాగుణశాలి నా - తనయుఁ గాచి
కొనఁ గడంగర సింగార-మునకుఁ గాక, మఱువులును గైదువులు మీకు-మానమునకె.

వ. అని భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగు వారం గ్రోధశోకంబులు
మనంబునఁ బెనంగొనం గన్నీ రొలుక నూర కున్న నెల్లవారు నతనికి మాఱు పలు
కను దేఱి చూడను వెఱచి యుండిరి. అప్పు డచ్యుతుం డొక్కరుండు ననునయా
లాపంబులం దేర్చుచుండం బాండవాగ్రజుండు గుపితాఖండలనిభుం డగునాసవ్య
సాచితో సాంత్వనస్వరంబున ని ట్లనియె. 190

## ధర్మరా జర్జునుని కభిమన్యుండు చచ్చినవిధంబు చెప్పుట.

సీ. అనఘ సంశప్తక - హననంబునకు నీవు, సనిన నొడ్డన మేర్చి - కొని కడంగి
నడచి ద్రోణునిఁ దల - పడితి మవ్వీరుమో, హరమేము సొరఁజాల - మైతి మనఁగ
నేల తద్బాణార్చు - లేర్చిన నక్కడఁ, దేఱి చూడను లేక - త్రిప్పికొంటి
మమ్మొన భేదింప - నభిమన్యుఁ డోపుఁ బో, మ్మనియెడుతలఁపు నా - కపుడు పుట్టి
వానిఁ బిలిచి నీవు - వాకిలిఁ బుచ్చు మం, దఱిము మొగ్గరంబు - దఱియఁ జొచ్చె
దము వడిని భవత్ప - థంబున ననుడు నం, భోధి సొచ్చుకరటి - పోల్కిఁ జొచ్చి. 191

క. నీయుపదేశముఁ దనచే, దోయిబలువుఁ దోఁడుగాఁగ - ద్రోణుఁ గడచి వే
పోయి మొనఁ జొచ్చి సైన్యము, పాయవడఁగఁ గలఁగఁ జెదఱఁ - బఱవఁగఁ జేసెన్.

క. కని కుంభజముఖ్యులు వా, నిన పొదువఁగఁ నేముఁ జొచ్చి - నిరతిశయరయం
బున వానికిఁ దోడ్పడుటకుఁ, జనఁ జన మాకడ్డపడియె - సైంధవుఁడు వడిన్. 193

వ. అతండు రుద్రవరానుభావంబునంజేసి యక్షుద్రబలుం డగుట నే మతని మిగులం
జాలక చిక్కితిమి. ఆసౌభద్రుం జుట్టు ముట్టి గురుకర్ణకృతవర్మకృపగురుపుత్త్రాది
యోధవీరులు పెక్కండ్రు సిక్కువఱుపం జేవ సెడక వాఁడు బలంబు మెఱయఁ
జలంబు నెఱయ నారాధేయప్రముఖులం బఱపియు బృహద్బలలక్ష్మణప్రభృతు
లగురాజుల రాజకుమారులఁ బలువురం జంపియు సొంపారె. పదంపడి పదాతి
యు గదాపాణియు నై రథాంగపాణియల్లుండు దూఁగాడుచుం బోరాడుసెడ
దుశ్శాసనతనయుండు దాఁకి వానిచే విరథుం డై తానును గద గొని పెలుచం దల
పడియె. అ త్తెఱంగున నైనగదారణంబున వా రిరువురుం బరస్పరనిహతు లై పడిరి.
ఇవ్విధంబున నక్కుమారుండు దనతండ్రులకును మామలకును రూఢి యగురణ
క్రీడం గీర్తిపరిస్ఫూర్తియు నాకలోకసుఖంబునుం జేకొనియె. అని చెప్పుటయు.

క. తెల్లముగ నుతుపడుట విని, జల్లని డెందంబు సెదర - సంధులు ప్రిదులం
దల్లడ మగ్గల మై మూ, ర్ఛిల్లె నరుఁడు బంధు లెల్లఁ - జేష్టలు దక్కన్. 195

వ. ఇట్లు పరవశుం డైనఁ గృష్ణయుధిష్ఠిరులు గరతలంబుల సెత్తి నొక్కింతసేపునకు సేద
దేఱి సైంధవుం దలంచి యతండు. 196

## అర్జునుని ప్రతిజ్ఞ.

ఆ. అవుడు గఱచి యొత్తు - నగునాననంబుతో, బొమలు ముడిచి చెమట - వొడమ మేను
కంప మొందఁ గవలు - గదిరిన కటికిన, వ్యాసక మెసఁగ నన్న - కిట్టు లనియె. 197

మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలో - ర్వీనాథులున్ సింధురా
జు నవశ్యంబును నెల్లి సంపుదు భయ - స్థుం డై నినుం జొచ్చినన్
వనజాక్షున్ శరణంబు వేఁడినను గ - ర్వం బేది నన్నుం దగం
గనినం బోరు దొలంగి పోయిన నెఱుం - గం గాని సత్యవ్రతా. 198

క. బాలధ్వంసకు నాదు, శ్శీలుం గాచుటకు నన్నుఁ - జెనకిన నస్త్ర
జ్వాలలఁ గౌరవయోధులఁ, దూలించుచు వానిఁ గవియు - దుం జటులగతిన్. 199

ఆ. ఇట్లు సేయ నైతి - నేని గురుద్రోహి, గతికి బ్రహ్మఘాతి - గతికి మద్య
పానరతునిగతికి - మాన్యార్యజనపరి, వాదిగతికిఁ బోవు - వాఁడ నధిప 200

వ. మఱియు నొక్కప్రతిన యవధరింపుము. 201

చ. అనిమిషదైత్యకింపురుషు - లాదిగ నెవ్వరు వచ్చి కాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ - దోయజమిత్త్రుఁడు గ్రుంక కుండుము
న్న నరవరేణ్య యిత్తెఱఁగు - నా కొనరింపఁగ రాక యున్న నే
ననలము సొచ్చువాఁడ నృప - లందఱుఁ జూడఁగ గాండివంబుతోన్. 202

వ. అని పెలుచం బలికి యప్పరమకోదండంబు దెప్పించి సజ్యంబు గావించి గుణధ్వని నిగుడం జేయుటయుఁ బద్మనాభుండు పాంచజన్యంబు పూరించె. అద్దేవేంద్రపుత్త్రుండు దేవదత్తం బొత్తె. అన్నాదంబులును దత్సైనికసింహనాదంబులును దూర్యనినదంబులును నింగి వొంగం జెలంగె. అగ్గాండీవంబును నృత్తంబు సేసిన చందంబు నొందె. అస్త్రంబులు గపదొనలు వెలువడి వెలింగె. అయ్యవసరంబునం గొండొక దెలివొంది పవననందనుం డప్పురందరనందనువదనంబు వీక్షించి 203

క. అతితీవ్ర మైన నీ దగు, ప్రతిన కుపోద్బలముగాఁగఁ - బరఁగినధీరో
ద్ధతపాంచజన్యరవమున, ధృతి దూలకయున్నె కురుప - తికి నింద్రసుతా. 204

వ. అని యగ్గించె. ఆసమయంబునం గోపంబు పెంపునను బూనికి పైభరంబునను భీమసేనునిసల్లాపసౌహార్దంబునను దనడెందంబుశోకంబు డిందుపడం గలయం గనుంగొనినవిజయుని వందిమాగధసందోహంబులు సంస్తుతించె. అట్టియెడ నిక్కడ. 205

క. జననాథ పాంచజన్య, ధ్వనిఁ గూడి చెలంగుదేవ - దత్తరవంబున్
విని భీతిసంభ్రమంబుల, మనసైన్యము లెల్ల ఘూర్ణ - మానము లయ్యెన్. 206

క. అప్పుడు వేగపుఁజారులు, సెప్పిన నంతయును నెఱింగి - సింధువిభుఁడు దన్
గప్పేడునెవ్వగ పెల్లున, నిప్పులఁ బడినట్లు గాలు - నిలువఁగ లేమిన్. 207

## అర్జునునిప్రతిజ్ఞ విని సైంధవుఁడు భయపడి దుర్యోధనునితోఁ జెప్పికొనుట.

క. చని యాప్తులైనబలవ, న్మనుజేంద్రులు గొలువ నున్న - మానవనాథుం
గని యిట్లను సిగ్గు గడచి, తనయుల్లముఁ గలఁచి వెఱపు - దల్లడపెట్టన్. 208

ఉ. ఏ నొకరుండ నే తనకు - నె గ్గొనరించితి నేల నాపయిం
బూనినవాఁడు ఫల్గునుఁడు - పోర వధింపఁగ నట్టె పాడి మీ
కే నెఱిసంతసంబు పగ - పేటికి నా కెట యేని పోయెదన్
వానిప్రతిజ్ఞ కడ్డపడు - వార సురాసురసిద్ధసాధ్యులున్. 209

వ. అనుచుం గొలువు గలయం గనుంగొని. 210

ఆ. ద్రోణకర్ణశల్య - దుర్యోధనులుఁ గృప, బాహ్లికులును జముఁడు - పట్టికొన్న
వాని నైనఁ గావ - వలతురు వలచిన, నొల్ల కున్న నెట్టు - లొకొ యెఱుంగ. 211

వ. అని వెండియు. 212

క పెదవులు దడుపుచుఁ గాళ్లున్, గుదిపడ వడఁకుచు మనంబు - గొందలపడఁగా
నిది యేటిమాట లాడెదఁ, దుదిఁ బార్థుఁడు గాన కుండఁ - ద్రోలఁగన వలయున్.

వ. మీ యందఱచేత ననుజ్ఞాతుండనైన కదా పోయి వచ్చెద ననవుడు నిజకార్యధురంధరుం డగునక్కురుధరణీవరుం డతని కిట్లనియె. 214

మ. మును నీ వెన్నితి విక్రమాఢ్యు లని మ - మ్ముం గొందఱన్ ద్రౌణి పెం
పును హార్దిక్యుబలంబు సౌబలునియే - పుం జేవయున్ సోమద
త్తుని ధైర్యంబును శౌర్యమున్ శలుమహో - దోర్దర్పముం గూడ నె
న్నిన నీ కె ట్లగుఁ జూడు మిట్టిమగలు - న్వే యేల ని న్నిత్తురే. 215

క. నమ్ముము వెఱవకు మేనును, దమ్ములునుం గోట నీకుఁ - దాత్పర్యము మై
నిమ్మేటిమగలు సూరెల, నెమ్మి నిలువ నింద్రుఁ డైన - నీ కెదు రగునే. 216

వ. అని చుట్లనున్నరాజులం జూపిన నూఱడిల్లి యంత నిలువక నీకొడుకుం దోడ్కొని ద్రోణునికడకుం జని జయద్రథుండు దనకు నర్జునునకు ధనుర్విద్యావిభవంబునందలివాసి యెట్టి దని యడిగిన నతండు నీకు నతనికి నాచార్యకంబు సమప్రకారంబ యవ్వీరుండు వివిధశ్రమంబులయలజడి కోర్చి యలఘుప్రయోగంబులు పెక్కులు సాధించుటం జేసి నీకంటె నధికుం డైయుండు. అది యట్లుండె. నేను గలుగ నీ వాసవ్యసాచికి వెఱవ వలదు. మద్బాణంబులమఱువున

సున్న నిన్ను దేవతలకుం దేఱి చూడ వచ్చునే. విష్వచ్చునకుం బ్రవేశింప రాని బంధురవ్యూహంబు వన్నించెద. కులధర్మంబు శిథిలంబుగా కుండ సమరంబుసేయు మని చెప్పి వెండియు. 217

క. శ్రుతు లభ్యసించి తెతుల, క్రతువులు సేసితి కులంబు - రక్షించితి నీ వితరులక్రియ మృత్యుభయా, న్వితుఁడవు గాఁ దగునె మేది - నీవర యింకన్. 218

క. యాదవకౌరవపాండవు, లాదిగఁ గలయఖిలనృపులు - నవ్యయవృత్తిన్ మేదిని నిలుతురె క్రమమునఁ, బోదురు గా కెల్లజనులుఁ - బోవుతెరువునన్. 219

క. తపములు దానంబులుఁ జే, సి పడయులోకంబులెల్లఁ - జేయలఁతులు భూమిపులకు సంగరవిద్యా, నిపుణతఁ దలఁ కుడిగి పోర - నేనియుఁ జాలన్. 220

క. అనియూఱడిల్లఁ బలికిన, విని యతఁడు గలంకు దేఱి - విభుఁడుం దానుం జని సంగ్రామోత్సాహం, బునఁ బొదలెను దూర్యఘోష - ములు దివి ముట్టన్.

వ. సర్వసైన్యంబులును దైన్యంబు వాసి కయ్యంబుకడంక నుల్లసిల్లె. సైనికోత్తముల సింహనాదంబులు సెలంగె. ఇత్తెఱంగున భవత్తనయుశిబిరంబు సముద్యమసుముఖం బయ్యె. అంత నక్కడఁ బాండవాగ్రజుండు పాంచాలమాత్స్యపాండ్యయాదవ కేకయాదిరాజలోకంబుశోకంబు దగుమాటల మలుగం జేసి విడిదలకుం జన నియమించి యనుజుల నచ్యుతునిం బెట్టికొని యున్నయెడ నగ్గోవిందుండు గాండీవి కిట్లనియె. 222

క. నాతోఁ దలపోయక రో, షాతురతం బ్రతిన వట్టి - లవనీనాథ వ్రాతంబు వినఁగ నిట్టులు, సేతేఁకున డెప్పరంబు - సేసితి కంటే. 223

క. అస్తమయమునకు మును రిపు, మస్తకముం దునుమ వలయు - మన కిది సాలన్ దుస్తరమును నగు నస్త, వ్యస్తం బగు నేని నాకు - నగవు గదిరెడున్. 224

వ. మనవేగులవారు వచ్చిరి. వారు సెప్పినతెఱంగు వినుము నీవు ప్రతిజ్ఞ సేసిన మ్రోసినచందంబులపెల్లునన్ బెదరి యప్పాటివారు గవ్వడి కొడుకుచావునకుం గోపించి యిప్పుడ యెత్తివచ్చునని రథకరితురంగంబుల నాయితంబు సేయుచుండ సైంధవుండు దనచారులచేత నీయాడినమాటలు విని వెఱచఱచి కురురాజు గొలువున్నచోటికిం జని సిగ్గటి నిన్ను నగ్గించి నీప్రతిన యెఱింగించి యతం డలిగిన మీరు గావ లేరని పలికి తా నెండేనియుం బోయెద ననిన నమ్మనుజపతి గురు కృతవర్మకృపకర్ణశల్యాశ్వత్థామప్రభృతు లగుమేటిమగలం జేర్కొని వీరును నా తమ్ములును గలుగ నరునకు నిన్ను జట్టనవ్రేలనుం జూప వచ్చునే యని భయంబు

వా పె. భారద్వాజుండును మహోత్సాహుండై దురవగాహవ్యూహవిధానంబున జయద్రథుం జేర కుండ నిన్ను నిలువరించువాఁ డయ్యె. అది యట్టిద. వారొక్కొక్కరుండు గెలువ రానియట్టిజెట్టిజోదు లందఱు నొక్కపనికిం దలకొని నిలిచిన గెలుచుట యశక్యంబు గాదె. ఇక్కార్యం బార్యులగునాప్తజనంబులం గూర్చికొని విచారింపవలయును. అనవుడు విప్పచ్చుండు నవ్వుచు ని ట్లనియె. 225

## అర్జునుఁడు కృష్ణునితోఁ దనప్రతిజ్ఞావిషయంబు లైన వాక్యంబులఁ జెప్పుట.

క. వారి నెఱుంగుదు నేనును, వారలు న న్నెఱుఁగుదురు భ - వత్సాహాయ్య
స్ఫారబలోద్ధతి గలుగఁగ, వారే తప్పింపఁ జాలు - వా రీపూన్కిన్ 226

వ. ఏను జయద్రథుం జంపుటకుం దమకించి తఱుమునప్పుడు నాకు నెవ్వ రడ్డంబు సొచ్చి రేనియును. 227

మ. పటునారాచపరంపరాప్రసరద - ర్పం బేర్పడం బేర్చి త
ద్భటసంఘంబును ఘోటకవ్రజము శుం - భత్స్యందనౌఘంబు ను
ద్భటకుంభిప్రకరంబునుం బొదివి వి - ధ్వంసంబు గావించి నె
త్తుట జొత్తిల్లెడునట్లు సేయుదు సమి - ద్భూభాగ మత్యుగ్రతన్. 228

క. కౌరవసైన్యంబులఁ గల, వీరులయస్త్రములు నాదు - వివిధాస్త్రగతి
క్రూరప్రవాహముల కెదు, రే రాజీవాక్ష యోద - రింపను వారిన్. 229

క. వెఱఁగుపడి కుంభభవుఁడుం, బెఱరథికులుఁ జూచుచుండ - బీరము లావుల్
మెఱయఁ జలము నెఱయఁగఁ దల, దఱిఁగెద సైంధవుని నేల - తలఁ కెదు కృష్ణా.

క. కురుపతిబలముల యేలా, చరాచరము లైనభూత - జాలము లెల్లం
దరతరమ యడ్డపడినం, దెరలిచి పడ వైతు సింధు - దేశాధీశున్. 231

ఆ. గురునియలవుఁ జలము - వెరవును గలఁచి నీ, యాన గాండివంబు - నాన దివ్య
శరములాన యెల్లి - సైంధవుతల యెల్ల, భంగిఁ దునిమి వైతుఁ - బగఱు దలఁక.

చ. కనియెదు సైంధవుం గడచి - క్రందుగ నాకు నెదుర్చురాజులం
దునుమఁగ భూపణోత్కరము - తోఁ బదహస్తశిరంబు లుర్విపైఁ
బెనఁగొని చారుభంగియును - భీషణరేఖయుఁ దాల్ప నెత్తురుల్
గొనడును గ్రోలి భూతములు - నిక్కుచు నీల్గుచుఁ జొక్కు చుండఁగాన్. 233

క. అవ్వాలిసైనికు లడలఁగ, నవ్వుచు మనవార లార్వ - నారాయణ న
న్నెవ్వరు మార్కొన లేమికి, నొవ్వం గురురాజు నేఁ దు - నుముదును గ్రోహిన్.

తే. సాధనము గాండివం బటె - సమరకర్త, యర్జునుం డటె సారథి - యబ్జనాభుఁ
డటె మరల్పఁగ వచ్చునే - యారథంబు, హరున కైనను నెఱుఁగక - యంటి గాక.

క. పూనఁగ రాదే నా కె, ద్దానిం బూనినను నీవు - దలకొని తీర్పం
గా నునికి గలుగ నే నీ, చే నుండఁగ నిట్టు లేల - చెప్పెదు చెపుమా. 236

క. ఈప్రతిన యెట్టితెఱగున, నప్రతిహతవృత్తి నెగడు - నట్టితెఱఁగు లో
కప్రభువ నీవ చేయ న, తిప్రకటపరాక్రమప్ర - దీప్తుఁడ నగుదున్. 237

క. మమ్ము నరయఁభరమున నీ, విమ్మెయిఁ దలపోసి తింక - నిచ్చట నేలా
నెమ్మది నిద్రింపంగాఁ, బొమ్ము ప్రభాతమున రథముఁ - బూన్పఁగ వలయున్. 238

వ. అని యివ్విధంబున సల్లాపంబులు సేయుచు నరనారాయణు లత్యంతకుపితాంతఃకరణు లగుచుఁ బాములు రోఁజుపోల్కి నిట్టూర్పులు నిగిడించు చున్నం బురందరాదిబృందారకులు భయంబు గొని దీన నేమి పుట్టునో యని చింతాక్రాంతులైరి. వారిధులు సంక్షోభించె. సరిత్ప్రవాహంబులు ప్రతిగమనవ్యాకులంబు లయ్యె. కాననశైలసహితంబుగా మహి సంచలించె. మఱియు మాతంగతురంగనరనికరంబులనాశంబులు దెలుపునుత్పాతంబు లనేకంబులు దోఁచె. విశేషించి కౌరవస్కంధావారంబున దారుణవాయువులు విషమగతులం జరించుటయు శుష్కనిర్ఘాతంబులు నలుగడలం బడుటయుఁ గరిహరినికరంబులు బహుళంబు లగుబాష్పంబులు విడుచుటయు మొదలుగాఁ బెక్కుదుర్నిమిత్తంబులు పుట్టినం బోటుమగ లగుభూపతులు లోనుగా నెల్లజనంబులుం బుల్లపడి యుండిరి. అనవుడు సంజయునకు ధృతరాష్ట్రుం డి ట్లనియె. 239

తే. అట్లు దమలోనఁ దగుమాట - లాడి యాడి, కోపరసవేగమునఁ గుంది-కుంది వగలఁ
బొంది పొంది పురందర - నందనుండు, నచ్యుతుండు నారాత్రి యె-ట్లైరి చెపుమ.

## శ్రీకృష్ణుండు పుత్రశోకాతుర యైనసుభద్ర నూఱడించుట.

వ. అని యడిగిన నాసూతసూనుం డంబికాసూనున కి ట్లను. అమ్మురారిచిత్తం బారాధించి యర్జునుం డట మున్న యొక్కనాఁడు శిబిరంబునకు సుభద్రయుం బాంచాలియు నుత్తరయును వచ్చి యచ్చటన యునికిం జేసి యచ్చెలువలశోకానలంబు లుడుగునట్టిమాట లాడ నతనిం బ్రార్థించి పంచిన. 241

తే. అమ్మకుందుండు గ్రొత్త యై - యడలుతనదు
డెంద మలఁపంగఁ జెలియలి - మందిరమున
కరిగి పురపురఁ బొక్కెడు - నాసుభద్రఁ
గాంచి యి ట్లను నెంతయు - గారవమున. 242

క. రాచూలికి నుచితం బగు, నాచారము గాదె రణము - నం దరులఁ దెగం
జూచుచుఁ దిరుగని నడపున, నేచి యమరలోకమునకు - నేగుట తరుణీ. 243

క. నీకొడుకు తుచ్ఛ మగునీ, లోకంబు దొఱంగి పుణ్య - లోకమ్మునకుం
బోకకు ని ట్లధికం బగు, శోకముఁ బొందంగ నగునె - సుదతీ నీకున్. 244

ఆ. బ్రహ్మచర్యమునఁ ద - పంబున నుత్తమ, దానములను బడయఁ - దలఁచునట్టి
గతులకంటె సౌఖ్య - కారిణి యగుగతిఁ, బొందె నీసుతుండు - గుంద నేల. 245

ఉ. క్షత్రియకాంత పుత్రకునిఁ - గాంచుట వాఁ డతిలోకవీరుఁ డై
ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కుటకుఁ - దా నది గాకయు వీరపత్ని నా
నీత్రయి నెందునుం బ్రణుతి - కెక్కినదీవు తనూజుబీరముల్
శత్రువధోత్సవంబు విని - సంతస మందక కుందఁ బాడియే. 246

వ. అట్లుంగాక. 247

క. కాలం బైనం బోవక, యీలోకమునందు నిలువ - నెవ్వరివశ మి
ట్లేల యవివేకజనముల, పోలిక శోకానలమునఁ - బొగులుచు నుండన్. 248

క. తగుమాట లాడి కోడలి, వగ పుడుపుము నీవు ధైర్య - వతి వి ట్లడలం
దగునె నినుఁ జూచి కాదే, మగుడుం జిత్తములవగలు - మా కందఱకున్. 249

ఉ నీమగఁ డెల్లి సైంధవు న - నిం దెగటార్చి శిరంబు దెచ్చినం
గోమలి నీదుపాదముల - కుం దగుపీఠము సేయు మాతఁ డు
ద్దామభుజాబలాఢ్యుఁ డది - దప్పదు వానిప్రతిజ్ఞ దప్పినన్
భూమి వడంకదే తరణి - పొల్పు దొలంకదె వార్ధి యింకదే. 250

క. నాపలుకు నమ్ము మర్జునుఁ, డాపాపాత్మకుని నెల్లి - యనిఁ జంపి ముదం
బాపాదించుం గులమున, కీపెంపున కెలమి వొందుఁ - డీవును నతఁడున్. 251

వ. అనిరొ నప్పు డగ్గోవిందుం గనుంగొనుట నుత్కటం బయినశోకంబున సుభద్ర
యాకులతం బొంది. 252

ఉ. అక్కట పుత్ర నిన్నుఁ గని - నంతియపుణ్యమ కాని నాకు నీ
వెక్కుడుభక్తి సేసి నను - నెప్పుడు నారయ నీకుమారకు
న్మక్కువ నాకడం దిరుగ - లాలన సేయుచు నుండునట్టియా
మిక్కిలినోము లేద యిట - మీఁదికి నెవ్వరు దిక్కు నెప్పుమా. 253

ఉ. బాలుఁడ వైన నీ వరిది - బంటుతనంబునఁ బ్రౌఢవీరభూ
పాలురఁ గుంభజప్రభృతి - బాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం
గోలకుఁ దెచ్చి యి ట్లగుట - కుఱ్ఱ వెఱఁ గందుచు వంతఁ బొందుచుఱ్ఱ
లోలతఁ జూడ కున్నె జన - లోకము నీ దగురూపు రేఖయున్. 254

తే. మేనుమృదుశయ్యసగమునా - మేనిమీఁద, సగముగాఁజేర్చికొనిముద్దు - మిగులనిద్ర
సేయునట్టినీ విప్పుడు - చెనఁటినేలఁ, దనువు వొందుట కోర్చితే - తండ్రిచెపుమ.

క. వందిజనంబులు మాగధ, బృందంబులు సంస్తుతింపఁ - బెం పొందుదు ప్రో
లం దిరిగెడుక్రవ్యాదుల, క్రందున నీవీను లిపుడు - గటకటఁబడవే. 256

చ. అనిలతనూజు లావు గలఁ - డందురు సాత్యకి శౌర్యశాలి నాఁ
జను ద్రుపదుండు సంగరవి - శారదభావము వూని యుండు మా
త్స్యనిఁ బటువిక్రమాఢ్యుఁ డని - చూతురు పాండవు లింద ఱుండి యొ
క్కనికిఁ గడంగ లేర నినుఁ - గావఁగ నే మన నేర్తుఁ బుత్రకా. 257

సీ. ఈలోక మెల్లఁ బా - డిల్లునుబోలె నై, యున్నది నీవు లే - కునికిఁ జేసి
నీవు వేగమ గండు - నెఱసి బంధులఁ బ్రీతిఁ, బొందఁ జేయుట గల - వోలె నయ్యో
జిష్ణునికొడుకవు - కృష్ణునల్లుండ వీ, వరులచేఁ బడుట చో - ద్యంబు గాదె
చెలువంపుమేనును - జెన్నుమొగంబు నై, యెప్పుడు పొడసూపె - దింకఁ గుఱ్ఱ
యకట యుత్తర యొప్పెడు - నది మనంబు, దీని కెంతయు మెత్తన - యేను నిన్ను
వేఁడికొనియెద వచ్చి యి - వ్వేలఁదివంత, దీపి దళుకొత్తుపలుకులఁ - దేర్ప వన్న. 258

చ అలఘుతపంబులం బ్రకట - యాగములఱ్ఱ మునిచోదితవ్రతం
బుల మహనీయదానములఁ - బుణ్యచరిత్రములఱ్ఱ మహాత్ము లెం
తలు రమణీయవిశ్రుతప - దంబుల కేగుదు రంతకంటె ను
జ్జ్వల మగుసద్గతిం బడయు - వాసవపౌత్ర పవిత్రవర్తనా. 259

వ. అని బహుప్రకారంబులం బలవించు చున్నసమయంబునం బాంచాలి యేతెంచి
యిరుగేల నుత్తరాసుభద్రలం బొదివి తానును వారును నడ లూని పుడమిం బడి
వివశతం బొంది వికలాక్రందనంబు సేయు చున్న నన్నారాయణుండును శోక

సంతాపితాంతఃకరణుం డగుచు నుచితవచనంబుల నయ్యవిదల నెట్టకేలకు నూ రార్చి మగిడి పాండవులపాలికిం జనుదెంచె. అప్పుడు ధర్మతనయుం డమ్మాధవ ధనంజయులను భీమసేనునిం గవలను నితరపరిజనంబులను నిజనివాసంబులకుం బోవం బనిచి తాను నభ్యంతరమందిరంబునకు నరిగె కృష్ణుండును జిష్ణుతోన తదీయసదనంబునకుం జని విమలజలంబులం గృతాచమనుం డయి యొక్క వివిక్తప్రదేశంబున దర్భశయ్య గావించి దాని నక్షతగంధపుష్పంబుల నలంకరించి యాయుధంబు లర్చించి చుట్టు నిడి కవ్వడి నం దుండు మని నియోగించి నీవు నిశాసమయంబునం జేయు దేవపూజ యింతకు మున్న చేయ నని తలంపించిన నతండును బాదప్రక్షాళనంబు నుపస్పర్శనంబును నాచరించి తాను నిత్యంబును నడపుత్ర్యంబకపూజనంబు తెఱంగున మాల్యానులేపనధూపదీపనైవేద్యంబు లా జనార్దనునకు సమర్పించిన నమ్మహాత్ముండు సంభావించి యాప్తు లగుదౌవారికజనంబుల శస్త్రహస్తులై కొలిచి యుండునట్లు గా సంఘటించి యాసవ్యసాచిం జూచి నీవు సుఖనిద్ర సేయు మేను నీకు శుభంబు గోరి యుండెదఁ బోయి వచ్చెద నని పలికి దారుకుండు దోడ నరుగుదేర నాత్మగేహంబునకుం బోయి. 260

ఆ. సెజ్జయందు మేను - సేర్చి యర్జునకార్య, చింతఁ బలుక కుండి - కొంతవడికిఁ
బవ్వళించెఁ గురునృ - పాలక జలశాయి, దారుకుండు గొలిచి - యూర కుండ

# 23. ఘటోత్కచునివధ.

(ద్రోణపర్వము. ఆ. V.)

క. కనిపారి గర్ణునితోడం, బెనఁగుఘటోత్కచునిఁ బిలిచి - భీముఁడు వల ది
ద్దనుజుని మర్దింపుము నీ, వన నాతం డతని విడిచి - యతనికిఁ గవిసెన్. 1

క. నకులాదులు నాదైత్య, ప్రకరంబుఁ దెరల్చి రేఁచి - రాధేయుఁడు నే
లకుఁ గోలకుఁ దెచ్చెను సో, మకుల శిఖండ్యాదిరథిక - మర్దనుఁ డగుచున్. 2

వ. ఆవిక్రమంబు వీక్షించి సన్నద్ధుం డయి సమీరనందనుం డాసూతనందనుం దల పడినం దోడ్పడి నకులాదులు నానాస్త్రంబులు గురిసిరి. కిరీటి పాంచాలురం గూర్చి కొని కుంభసంభవసైన్యంబుఁ బొదివి సమయించు చుండె. అలాయుధుండు ఘటోత్కచునిం బరిఘుపాతనంబున సోలం జేసిన నాలోనన తెలిసి యతండు. 3

క. గద ద్రిప్పి బెట్టు వైచిన నది రథ్యంబులను నూతు - నరదము సిడముం
జిదురుపలు సేయ నతఁ డం, బుద మై గర్జిల్లె నభము - బూరటిలంగాన్. 4

వ. ఇట్లు మాయ గైకొని నెత్తురుసోనతోఁ బిడుగులు వడం జేయ వాయుతనయతన యుండును దివి కెగసి తనమాయ నమ్మాయ మాయించినఁ గ్రమ్మఱ బకభ్రాత భూచారి యయినఁ దోడన హైడింబుండును డిగ్గిన నయ్యిరువురకుం దరువులఁ బాషాణంబుల భీషణం బగురణంబు వాలిసుగ్రీవసమరసమం బై చెల్లె మగుడ వివి ధాయుధంబుల నాయోధు లాయోధనంబుసేసిరి. అట్టియెడఁ గరవాలంబు గొని మదం బునఁ గవిసినచో ఘటోత్కచుం డలాయుధుం దలవట్టి బలువిడి నిలం బడఁ దిగిచి మెడ దెగ వ్రేసి యార్చినం బేర్చినపాండవబలంబులఁ దూర్యనినదంబులు సింహనా దంబులుం జెలంగె నప్పుడు. 5

క. పటుగతిఁ జని కురుపతిముం, దట వైచెం జేత నున్న - తల రౌద్రం బు
ద్భటముగ ఘటోత్కచుండు, త్కటశోకము వొంది రతఁడుఁ - దత్సైనికులున్. 6

క. మును బకుననుజునివలనం, దనతమ్ములు దాను బ్రదుకఁ - దలఁచి యతఁడు స
చ్చిన విభుఁడు భీమసేనుప్ర, తిన పారంబెద్దయు నని మ - దిం దలఁచె నృపా. 7

వ. అట్టియెడఁ గర్ణుండు కౌంతేయసైన్యసంతానంబు నానాస్త్రఘట్టనంబుల విఘటి తంబు సేయుచున్న నవ్వాయునందననందనుండు నిజస్యందనం బెక్కి యుక్క

మెఱయం దలపడిరి. అయ్యిద్దఱుం బెద్దసేపు శరపరంపరల సరి యై సంగరంబు సేసిరి. పదంపడి రాధేయుండు రథ్యంబులం జంపిన రథసమేతంబుగా నాఘటో త్కచుం డదృశ్యుం డైన నీసైనికులు దల్లడిల్లి యెక్కడ వచ్చి యెవ్వరి నేమిసేయు నో యనుచు మేనులు వడంక నలుగడలుం గనుంగొను చుండిరి. హైడింబుండును మహాంబుదంబుచందంబునఁ జదలం దోఁచి మెఱుముచు నుఱుముచు బాణకృపాణ ముసలముద్గరకుంతక్షురికాదిహేతివ్రాతంబులు వర్షోపలపటలంబులుం దొరఁగింపం దొడిదానవులు మొగి ళ్లయి యెక్కమొగి నట్ల చేయ నాసూతసుతునకుం బ్రతి విధానం బాచరింప నలవిగామిఁ గౌరవబలంబున రథంబులు గజంబులుఁ దురం గంబులుఁ ద్రెళ్లను గూలను డొల్లను దొడంగె ఒంటుగడకుం గడంగు తలంపులు దక్కి తలలు గుట్టికొని యుండి యోధులు భగ్నాపరభాగు లై పడం జొచ్చిరి. అప్పు డిద్దెసవా రెల్ల నాఖండలప్రముఖబృందారకులు పాండునందనులకుం దో డ్పడి యిట్లు సేసెద రనువగ వెగ డంది కలంగింబడిరి అయ్యవసరంబున. 8

శా. ధీరత్వం బొకండుఁ జ సహాయముగ రా - ధేయుండు దివ్యాస్త్రసం
చారోల్లాసము సూపెఁ జూపుటయు ర - క్షస్సంచయానేకమా
యారూపావలి భాస్క రాంశుల నదృ - శ్యాకార మై పోవునీ
హారంబుం దలఁపించుచుఁ జ విరిసె నే - నాశ్చర్యముం బొందితిన్. 9

చ. మగుడఁగ దానవప్రవరు - మాయ సమంచితదివ్యబాణశ
క్తి గుదియఁ జేసి తొంటితన - తీవ్రత గైకొని నీదుసైన్యముల్
బెగడు వడఁ జ మదించి యతి - భీమసముద్ధతి నింక నెమ్మెయిం
దెగఁ డనుభీతి యోధులమ - దిఁ జ జనియింపఁగ నాక్రమించినన్. 10

వ. వార లందఱు సూతనందనుం జూచి యాతండు గలంగమికి నచ్చెరు వందుచు నగ్గించి యతని నుద్దేశించి యిన్ని శాచరుం డిందఱ సమయింప కుండం గాచికొ నుము నీవును బ్రదుకు మాఖండలుండు గవచకుండలంబులు గొనునప్పుడు నీకు నొసంగినమహాశక్తి యింక నెన్నఁటికి భీమార్జునులు నిన్నేమి సేసెద రిప్పుడు బ్రదికిన మఱి చూచికొంద మప్పరమసాధనంబు వీనిమీఁదం బ్రయోగింపు మను నెడ నారక్కసుం డామేటిమగని గీటడంచువాఁ డై యాటోపంబునం గదిసి తదీయ రథ్యంబులఁ బటుగదాపాతంబునం బొలియించె. అ ట్లవ్వీరుండు విరథుం డగుటయుఁ దఱిమి యద్దనుజుండు గదాపాతాభితాడితుం జేసిన నొసరిలియతం డాసైనికులయాలాపంబులు నాలించి తనకుఁ జావు దప్పించుకొన నది దప్ప నొండుపాయంబు లేమిం జేసి. 11

ఉ. వైరివినాశనక్రియకు - వాసవుఁ డిచ్చిన నుంచి యున్నయా
ఘోరపుశక్తి నాలుకలు - గ్రోయ మెఱుంగులు ప్రజ్వరిల్ల ఘుం
టారవ మభ్రవీథి నిగు - డం దగఁ గేల నమర్చి పేర్చి య
వ్వైరికిఁ బూఁచినం దలఁకి - వాఁడు మహోన్నతఘూర్ణితాకృతిన్. 12

తే. తెరలిపాఱఁగఁదలఁచుచో-దృష్టితోడఁ, గూడికొనుముష్టి మృత్యువు-తోడఁబుట్టు
వనఁగఁజాలునద్దివ్యసా - ధనము వైచె, గగనతలమునభూతసం ఘములుమ్రోయ.

వ. ఇవ్విధంబున రాధేయుండు మహోగ్రంబుగా వైచిన. 14

క. మును మాయ మ్రింగి దనుజేం, ద్రునియురము వగిల్చికొనుచు - దుర్భరగతి వీఁ
పున వెడలి శక్తి యొగసెను, వినువీధికి నుడుగణంబు - వెలుకం బాఱన్. 15

వ. అప్పుడు. 16

క. సోలుచు బోరగిలం బడి, నాలుక వెడలంగఁ బెట్టి - నడుము గఱచుచున్
లాలలు గ్రమ్మఁగ రక్తుగ్గి, పాలుడు వికృతాస్యుఁ డగుచుఁ-బ్రాణము విడిచెన్. 17

# 24. ద్రోణవధ.

(ద్రోణపర్వము. ఆ. V)

వ. అంత మధ్యాహ్నం బగుచు వచ్చె ఆసమయంబున నకులసహదేవసమీరనందను లర్జును నుద్దేశించి యెలుంగెత్తి. 1

తే. కోలుమసఁగి గురుండు పాం - చాలసేన, నేలకును గోలకును దెచ్చె - నీవు గడఁగి కౌరవులఁ బాయవఱపు మే-కతమ యైన, నతనిఁ బరిమార్పఁ జేకొని-యబ్బలంబు

వ. అనుచు నయ్యాచార్యుపైఁ గవిసిరి యట్లు పెక్కుబలంబులు గ్రమ్మిన బటుప్రదర జాలంబులు వఱపి పొడి సేయునమ్మహాత్ము నాలోకించి ధర్మతనయభీమసేనమాద్రీ తనయులు గూడికొని తమలోన. 3

మ. కరులం గూల్చుచుఁ దేరులన్ నఱుకుచున్ - గర్జిల్లి ఘోటమ్ములన్
నరులన్ నెత్తుటఁ దేల్చుచున్ దొరల నా - నా రూపఖండంబు లై
తొరఁగం జేయుచుఁ గుంభజుండు విలస - ద్దోర్దండచండాకృతిం
దెరలం బైఁ జను దెంచు నేపు మనలం - దీర్పంగ నోపుం దుదిన్. 4

వ. ఎవ్వరికేని నిలువరింప నలవిగాదు నరుండును ధర్మపరుండై యూర కున్న వాఁడు దెగువకుఁ జొరం డనుచుఁ దలంకిరి వారితెఱంగు గనుంగొని కమలనాభుండు దమతేరు వారలకడకుం గొని పోయి కిరీటితో ని ట్లనియె. 5

చ. అనిమొన దేవదానవుల - కైనను గెల్వ నశక్య మిమ్మహా
త్ముని నొకమందు సెప్పెద సు - తున్ హతుఁ డయ్యె ననంగ విన్నయం
తన యితఁ డాయుధంబు దిగఁ - ద్రావి యచేష్టతఁ బొందు నవ్వు డీ
తనిఁ బరిమార్ప వచ్చు నిది - దప్ప నుపాయము గల్గ దెమ్మెయిన్. 6

వ. కావున నశ్వత్థామ సచ్చె నని యొక్కరుం డతనికిఁ జెప్పుట గర్జం బనిన విని యచ్చటియందఱు నిదియ మే లనిరి. అర్జునుండు దాని కొడంబడక యుండె. పాండ వాగ్రజుండు విషాదంబుతో విచారించె. తదనంతరంబ. 7

క. భీమునిచే నని నశ్వ, త్థామ యనం బరఁగుభద్ర - దంతి పడిన ను
ద్దామగతి నన్నెపమ్ముగ, నామారుతపుత్రుఁ డేగి - యగ్గురుతోడన్. 8

వ. అశ్వత్థామ సచ్చె నని చెప్పుటయుఁ జిత్తంబు జ ల్లని చెదర బెదరియు నతండు దనకొడుకునస్త్రవీర్యాదిగుణంబులు గణుతించి యప్పలుకులు పెడచెవులం బెట్టి కలంక లేక ధృష్టద్యుమ్నుపైఁ గవిసి పె ల్లేసి యతని కడ్డపడినపాంచాలరథికుల నిరువదివేవుర వధియించి మాత్స్యబలంబున కుతికి యేనూఱురథంబులఁ బదివేలుమాతంగంబుల నన్నియ తురంగంబులం బొరిగొని తేజరిల్లి రాజులగములకు నాదిగొనునప్పుడు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజ గౌతమ కశ్యపవసిష్ఠాత్రిప్రభృతిమునివరప్రకరం బాతనిపాలి కేతెంచి భారద్వాజా నీవు బ్రాహ్మణుండవు వేదవేదాంగవిదుండవు నీకు సంగ్రామంబు సేయ ధర్మం బగునే యింతకు మున్ను చేసితేనియుఁ జేసితి గాని కాలంబు పూర్ణం బయ్యెఁ గాన నింక నుడుగుట మేలు మామాటలు పట్టి యాయుధంబులు వెట్టి శాంతిఁ బొందు మని చెప్పి యంతర్ధానంబు సేసిన నవ్విప్రవరుండు వారలపలుకు లూహించి భీమసేనువచనంబులం దలంచి యగ్రభాగంబునకు వచ్చి యున్న ధృష్టద్యుమ్నుం గనుంగొని వికలచిత్తుండును శోకాయత్తుండును నగుచు నిజపుత్త్రుండు సచ్చుట బ్రదుకుట యజాతశత్రువలన నున్నరూపు దెలియువాఁ డై యతని నడిగె. అయ్యవసరంబున వాసుదేవుం డవ్వసుమతీపతి కి ట్లనియె. 9

తే. అదరి యీదివసమున ప - రాహ్ణమునను, ద్రోణుఁ డని సేసినట్లైనఁ - ద్రుంగిపోక
యుండ నేర్తురె యిక్కడి-యోధు లెవ్వ, రైన విను నుతి గాదు స-త్యమ్ము సుమ్ము.

క. మము నీతని కొప్పింపక, సముచితముగఁ గాచికొను మ - సత్యవచనదో
షము లేదు ప్రాణరక్షణ, సమయంబున నతనికొడుకు - సచ్చెన యనుమీ 11

వ. అని పనిచె. అట్టియెడ నయ్యుధిష్ఠిరుతో భీమసేనుం డే నప్పుడు కృష్ణుండు సెప్ప నయ్యోధవరు వధియించునుపాయంబు విని యదియ మనంబున నుండ మాళవేంద్రుం డగునింద్రవర్మవారణం బశ్వత్థామ యనుపేరిటిది నాచేతఁ జచ్చె. అది నెపంబుగ నతనికి నశ్వత్థామ సచ్చె నని చెప్పితి చెప్పిన నొక్కింత విచారించి యమ్మాటదెస ననాదరంబు సేసె. నీకు విజయంబు గోరి హితం బుపదేశించునీ గోవిందునివాక్యం బుల్లంఘింపక నీవు నట్ల చెప్పుము. నీవచనమ్ము నమ్ము. నమ్మి యతండు గయ్యంబు సేయఁ జే యాడక చెడు. అని యొత్తి చెప్పుటయు 12

## ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామ చచ్చెనని యేనుఁగు నెపంబునఁ జెప్పుట.

క. మది నయ్యురువురమాటలుఁ, బదిలంబుగఁ బట్టికొనుటఁ - బట్టియు నెట్లుం
దుది నది యట్టుల కాఁగల, యది యై యుండుటను దాని-కతఁ డొడఁబడియెన్

వ. ఇట్లు సమ్మతించి. 14

క. అనృతభయము నాజిజయముఁ, గొనియెడుతమకంబు పెంపు - గుదియింపఁగఁ బాం
డునరేంద్రునగ్రతనయుం, డనుమానము వాయఁ బెట్టి - యస్త్రగురునితోన్. 15

తే. వలయుకొలఁది నెలుం గెత్తి - వర్ణసమితి, యచ్చుపడఁగ నశ్వత్థామ - సచ్చె ననియె
నని పదంపడి యల్లన - యతని చెవికి, వినఁగ రానుండఁ గుంజర - మనియె నధిప.

వ. ఇవ్విధంబునం బలుకుటయు. 17

క. నేలకు నల్లెఁడుపాడువునఁ, గ్రాలుచు మును మెఱయుగురుని - రథచక్రము ల
క్కాలంబున సమరజయ, శ్రీలోపము దెలియ నంట - సిలఁ బడియె నృపా. 18

వ. అప్పుడు. 19

క. తినుఁ బాండుతనయులకు ద్రో, హునిఁగా నక్కుంభజన్ముఁ - డూహించుచు న
మ్మును లట్టుసెప్పి రటు గా, వునఁగా కేఘు యిది దగ వ - వుం బొమ్మనుచున్. 20

శా. ధృష్టద్యుమ్నునిఁ జూచుచుర్ రణసము - ద్రేకఁబు బాహాబలా
వష్టంభంబును శౌర్యనిర్వహణగ - ర్వస్ఫూర్తియుం దొంటియ
త్కృష్టత్వంబును దక్కి ప్రుక్కి పగ బు - ద్ధిం బీఁకువీఁ కాడఁగాఁ
జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సం - క్షిప్తాంగుఁ డై యున్నెడన్. 21

వ. అతనివగంబునకై పాంచాలవిభుని వేలిమిం బుట్టినవాఁ డెగుట నప్పార్షతుండు ద త్సమయజనితోత్సాహరోషవిశేషాయత్తచిత్తుం డగుచు నమ్మహీసురవరుమీఁదం గవిసి యేసిన ననికి నొల్లని యుల్లంబునం బరునియుల్లాసంబు సహింప లేని తేజంబునం బురికొని యతండు వోరం దొడంగిన దివ్యాస్త్రంబులు ప్రతిభాసింపక యుండె. అట్లయినను మనసుబలిమికలిమిం బ్రకృతిబాణంబుల నాతనిబాణ బాణాసనరథరథ్యసూతకేతనంబులు వోడి సేసె ఆధృష్టద్యుమ్నుండు గద గొనినం దునియలు గావించె. పలకయు వాలునుం గొని వచ్చి యవ్వీరుండు సారథి తురంగంబులయంగంబుల వ్రయ్య నేయఁ దత్కరవాలఖేటపాటనంబు సేసి తనువునం జండకాండంబులు నించె. అట్లు నించి నొంచినం గని శినివరుండు గృపకర్ణకృతవర్మలతోడం బెనంగు చుండియుఁ గ్రూరనారాచదశకం బయ్యాచార్యుమీఁద నిగిడించె. అంత నత్యంతరయంబునం జనుదెంచి యనిలనందనుండు ద్రుపదనందనుఁ గుంభసంభవుబారికిం దప్పించుకొని పోయినం బో పొమ్మని పలికి డెందం బెప్పటి చందం బగుటయు నిశ్చలభావం బొందె. ఇవ్విధంబున నాలుగుదివసంబులు నొక్క రాత్రియు నే నగుదివసంబులో నిరువదిగడియలు నిరువదివే లట్ట లాడ భండ

నంబు సేసి పాండవబలంబుల నుఱుమాడి పేరడవి గొని కాల్చి పొనుంగుపడిన కార్చిచ్చుకైవడిం గుదిసి యమ్మహాత్ముండు. 22

సీ. సంగరంబునఁ దన్వి - సని శాంతిఁ బొందిన, చిత్తంబుతోఁ దమ - సేనదిక్కు
గనుఁగొని పెలుచ నో-కర్ణ యోకృప యోసు, యోధన పోరన-న్నార్తియెపుడుఁ
జెప్పుదు రేను నా - చే నయినంతయుఁ, జేసితి నింక ని - శ్చింతవృత్తి
సుగతికిఁ జనఁ గోరి - తగ నుజ్జగించెద, బాణాసనంబును - బాణములును
దెలివి గలిగి మనుం డని - పలికి శరశ, రాసనము లూడ్చి తేరిపై - నసఘుమూర్తి
యొప్పఁగూర్చుండిసంభృత-యోగనిష్ఠ, నొందితేజోమయాత్ముఁ-డై-యుండెనధప.

వ. అట్టియెడ ధృష్టద్యుమ్నుండు కృపాణపాణియుఁ బాదచారియు నై భారద్వాజు దెసకుం గవియుటయు నుభయసైన్యంబుల హాహాకారంబు లెసఁగె. అంతం దనువు విడిచి యప్పుణ్యపురుషుండు ప్రకటజ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబునకుం జనియె తత్తేజోమూర్తి యేను గంటి. కృష్ణార్జునధర్మనందనకృపాచార్యులునుం గనిరి. తక్కటిమానవులు గానరు. సురలు సూచి సంతసంబునం బొదలిరి. అట్లడరిన యాద్రుపదనందనుండు. 24

## ధృష్టద్యుమ్నుఁడు మృతుం డైనద్రోణునికంఠంబు దునుముట.

చ. అరదముపైకి దాఁటి కుపి - తాత్మత ద్రోణుశవంబు కేశముల్
గరమున బె ట్టమర్చికొని - ఖడ్గహతిన్ మెడ ద్రుంచి వైచె స
త్వరముగ మాను మాను మను - వాక్యముతో నరుఁ డేగఁ దప్ప సు
మ్మర యని ధర్మజుండు దివి - ముట్టునెలుంగున బి ట్టదల్పఁగన్. 25

వ. ఇత్తెఱంగునం గునిమి యతం డమ్ముట్టయుం దలయును ధరణీతలగతంబు సేసె. అట్లు శతవృద్ధుం డగునయ్యస్త్రగురుండు నీదుర్మంత్రంబునఁ ద్రుంగి పోయినం బొంగి పాండవానీకంబు పైకొని తఱిమిన మనమొనలు వెఱచఱచి కనుకనిం బఱచె. పఱచిన మనంబు గలంగి యప్పుడు నీకొడుకు లేటమొగంబులు వడు దొరలతోడం గూడఁ దిరిగె. అట్టియెడ దుర్యోధనదుశ్శాసనకృపకర్ణకృతవర్మమద్రేశ్వరులు మాతంగంబులం దురంగంబుల ముందఱఁ బెట్టికొని కటకటా యనుచు నింత పుట్టునే యనుచు నింక నేమి గల దనుచు నెట్లు సేయం గలవార మనుచు నేది దుదియనుచు మరలి మరలి చూచుచుం జనుచుండఁ దక్కినయలంతిమానును లెల్లను దలచీర వాటించుతలంపు లేక యొండొరుల నిలు నిలు మని పలుకుచుం గాలు నిలువక పలుదిక్కులకుం బాఱిరి. అత్తఱి నశ్వత్థామ మున్నొక్క కెలనం

గయ్యంబు సేయుచుండి నీసేన యట్లగుటఁ గనుంగొని యక్కురుపతికడకుం జని యతని కిట్లనియె. 26

తే. బలములిది యేమి నలఁగడఁ - బాఱఁ జొచ్చెఁ, గర్ణకృపముఖ్యు లేటికిఁ-గలఁగిరేట మొగము వడి రేల నీవును - మున్ను వోలె, నిలువరింపంగఁదగియెదు - నిలుపులేవ.

వ. అని యడిగిన నతం డతని మొగంబు సూచి యాచార్యతెగుట సెప్పం బోయి డగ్గుత్తికపడి యూర కుండె. శారద్వతుండు వెల వెలం బాఱుచు నెట్టకేలకు నెలుంగు దెచ్చికొని. 28

సీ. పాంచాలపాండవ - ప్రముఖసైన్యంబుల, ద్రోణుండు బలువిడిఁ ద్రుంచుటయును నుక్కఱి పాండవు - లొక్కచోటికి వచ్చి, నిలువరింపఁగ లేక - తలఁకుటయును వాయుతనూజుఁ డ - శ్వత్థామ సచ్చెఁ జు, మ్మని కుంభజునితోడ - నాడుటయును నమ్మాట గొనక ధ - ర్మాత్మజు నవ్వార్త, యాచార్యుఁ డేర్పడ - నడుగుటయును భీముచేత నశ్వత్థామ - నామగజము, మున్ను చచ్చుటకతమున - నన్నరాధి పతియునదినెపముగనట్ల-పలుకఁజాల,నడలియతఁడాయుధంబులు విడుచుటయును.

వ. అప్పుడు. 30

క. గురుఁ డమలయోగనిష్ఠం, దిర మై యుండంగ వచ్చి - ధృష్టద్యుమ్నుం డరదముమీఁది కరిగి త, చ్ఛిరోజములు పట్టికొని య - సిం దునుముటయున్. 31

వ. చెప్పి యప్పుడు ధర్మనందనధనంజయులు వారింప నతం డుడుగక యట్లు సేసె ననియు నెఱింగించి యిట్లు భారద్వాజుండు వడిన బలంబులు వితిగ నేమును నిరుత్సాహుల మయితి మేనుంగు పేరినెపంబుగా నట్టిమాట పుట్టుట కృష్ణకృతం బయినకపటోపాయంబు గా నోపు నని యంతయు నేర్పడం బలికె. అనుటయు ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై. 32

మ. వరదివ్యాస్త్రనిధుండు బాహుఘనుఁ డ - శ్వత్థామ శ్రీరాముతో సరి సేయం దగువాఁడు దండ్రితల పాం - చాలాత్మజుం డట్లు ని ష్ఠురుఁ డై పట్టె ననంగఁ ద్రుంచె నన విం - చు[illegible] వారితోఁ గూడ నా తురుఁ డై పోయెనొ పోక నిల్చి యలుకన్ - దోర్దర్పముం జూపెనో. 33

క తను నాధృష్టద్యుమ్నుం, దునుముటకై కోరి కనియె - ద్రోణుఁడు పరమా స్త్రనిరూఢిఁ బరశురాముఁ డ, తని కిచ్చినయంతవట్టు - దన కతఁ డిచ్చెన్. 34

వ. అట్టిజనకు నాద్రుపదనందనుం డట్లు సేసిన నక్కొడుకు నెట్లు సేసెనో విన వలతుం జెప్పు మనవుడు నమ్మహీపతి కతం డి ట్లనియె. 35

తే. కృపునిపలుకులు విని దట్టు - కెంపు గదురు, కన్నుఁగవ నశ్రుజలములుఁ-గ్రమ్ము దేరఁ
బాణితలమున నొత్తి యా - ద్రోణతనయుఁ, డిట్టు లనుఁ దగఁ గౌరవా-ధీశుతోడ.

ఉ. చావులు లేవె యెందు ననిఁ - జచ్చుట యొప్పదె యిట్లు లోక సం
భావితు నమ్మహాత్ముఁ దల - వట్టె నొకం డనువాఁడిమాట య
మ్మై వడిఁ దాఁకి చిత్తమున - కార్తి యొనర్ప సహింప రాదు గా
కేవిన నున్కి వాఁ డెఱుఁగ - డే నను నిమ్మెయి భంగపెట్టునే. 37

క. నాదివ్యాస్త్రంబులు బా, హాదర్పము నింకఁ గాల్ప - నా గురుఁ డాజిం
దా దిక్కుమాలి పగతుని, చే దైన్యముఁ బొందె నటె యి - నీ యే మందున్ 38

క. దీనికి మూలము ధర్మజుఁ, డా నిక్కము గల్గురాజు - నని దండితుఁగా
నే నెట్లు సేసి పుత్తునొ, కో నాచిత్తముకలంక - యును నెవ్వగయున్. 39

ఆ. పుత్త్రుఁ గనుట యెల్ల - శత్రునిచేఁ దల, వట్టి తాను దునుమఁ - బడుట కయ్యె
నస్త్రగురున కింక - నన నేమి గలదు నా, యుచ్చ్వాస కౌరవేంద్ర వినుము. 40

మ. హరియుం బాండవులున్ మదీయపటుబా - హాశక్తిదివ్యాస్త్రని
ర్భరసంతాపపరీతు లై యెదుఁగ ఘో - రస్ఫారసంక్రీడఁ ద
త్తురగస్యందనవారణప్రకరముల్ - ద్రుంగన్ విజృంభించెద
న్సురసంఘంబులు వచ్చి యడ్డపడిన - న్దుర్వారదర్పోద్ధతిన్. 41

క తనుఁ దాన చెప్పికొను టొ, ప్పనిపని యగు నైనఁ దండ్రి - పరిభవమునకుం
గనలు గదిరి యి ట్లంటిని, విను మే నే మనిన నేమి - వృథ వో దధిపా. 42

వ. అని పలికి మఱియు నిట్లను. మాతండ్రి నారాయణు నారాధించి యొక్క మహా
స్త్రంబు వడసె. అది నాకు నిచ్చె నద్దివ్యసాధనంబు వధ్యు లవధ్యు లనువిభాగంబు
లేక విరోధివిధ్వంసనంబు సేయు. తత్ప్రయోగంబున జయంబు సేకొనియెదం
జూడు మనుటయు నమ్మహీపతియు ననుజులు సేనాపతులును శంఖంబులు పూ
రించి సింహనాదంబులు సేసి మరలిన భేరీమృదంగాదితూర్యధ్వనులు నింగి ముట్టఁ
దురంగరింఖారథనేమిగజపదఘట్టనంబుల నిల గ్రక్కదల మనసైన్యంబులు మరలి
యురవడించె. 43

# 25. కర్ణశల్యుల పరస్పర వివాదము.

(కర్ణపర్వము. ఆ. II.)

వ. అతండు భీష్మద్రోణులదోర్వీర్యంబులు పాండుతనయులచేతం గోలుపోయె నని మనంబున వారల మెచ్చక ముంగలి యై మెఱసి నడచు చుండి పార్థ పరాక్రమ స్మరణంబునం గ్రోధంబు జనియించి యూర్పులు సందడింప మానదర్పోన్మాదంబున మద్రపతి కి ట్లనియె. 1

మ. అరదం బెక్కి శరాసనంబు గొని తెం - పారంగ నే నేచి సం
గరసంక్రీడకుఁ జొచ్చినం దృణసముం - గాఁ గొందు నద్దేవతా
వరు నైనన్ గురు నాపగాతనయుఁ జా - వం జూచుటన్ వైరు లే
తురు చెండాడెద నుగ్రతం దలలు నా - దోర్దర్పముం జూడుమీ 2

వ. అని పలికి యనంతరంబ గాంగేయకుంభసంభవు లంతటిమానుసులు నిట్లు రిత్త సావు సత్తురే యని యగ్గడించి మఱియు ని ట్లనియె. 3

ఉ. వారల లోకవీరుల న - వధ్యుల గీటడఁగించి పల్వురన్
వారలయట్ల యొందు నని - వార్య లనం జను మేదినీశులం
బోర వధించి రౌద్రమునఁ - బొంగి క్రమాగతమృత్యువొక్కొ నాఁ
గా రణకేళికిం గడఁగు - గాండివి నేన యెదిర్చి యార్చెదన్. 4

ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ - బావనియుం గవలుం జలంబుమై
నొండొరు మూదలించుకొని - యొక్కటఁ దాఁకినఁ దీవ్రవిస్ఫుర
త్కాండవిదారితాంగకులఁ - గా నొనరించి యలంచి లీలమై
గం డడఁగింతుఁ బోక పెనఁ - గం గలచంద మెఱింగి చెండుదున్. 5

వ. అని వెండియు ని ట్లను. భీష్ముఁడు దెగినను ద్రోణుదోర్విలాసంబునాస గలిగి యుండె. 6

సీ. ద్రోణుండు బహుదివ్య-బాణదీప్తుఁడు భుజా, బలశాలి శౌర్యసం-పన్నహృదయుఁ
డక్షీణవిక్రముఁ - డతిరథశ్రేష్ఠుఁ డ, వ్వీరుండు పార్థుచేఁ - బోరఁ బడిన
ధార్తరాష్ట్రులయేపు - దఱిఁగెఁ దదాప్తసై, నికులు గం డడఁగిరి - నీ వెఱుంగ
నైనను రాముకృ - పాతిశయంబునఁ, గనినయీరథమును - గార్ముకాది
దారుణాస్త్రశస్త్ర - తతులును గలిమి నే, నతనిఁ దొడరి దివిజు - లడ్డపడినఁ
గూల్తు నెల్లభంగిఁ - గురురాజుమన్నన, యప్పు దీర్తుఁ బ్రాణ - మాసపడక 7

## శల్యుఁ డర్జునపరాక్రమం బుగ్గడించి కర్ణునిఁ దూలం బలుకుట.

వ. అనిన విని శల్యుండు గర్ణున కి ట్లనియె. 8

చ. వినినజనంబు లీతఁ డవి - వేకి యనన్ వల దింతరజ్జు ల
ర్జునబలశౌర్యసంపదలు - సూచి రోయుంగమె మున్న నిన్న నా
ఁడనిఁ గలనన్ జగం బెఱుఁగ - దా యతఁ డద్భుతవిక్రమోజ్జ్వలుం
డెనయుఁడె నీవు పౌరుషవి - హీనుఁడ వద్దివిజేంద్రనందనున్. 9

సీ. రాత్రిమైఁ దాఁకి క్రూ - రతఁ బోరి మగఁటిమి, వాసినయంగార - పర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ - గురురాజుఁ జెఱవట్టి, మాన మేదినచిత్ర - సేనుకంటె
ఖాండవోద్యానంబుఁ - గావ నేరక సిగ్గు, వడి చన్ననిర్జర - ప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁ డై - క్రోడంబునకుఁ గాఁగఁ, బెనఁగి చిక్కినత్రిలో - చనునికంటె
నెక్కుడైనవీరుఁ - డే నర్జునునితోడఁ, బోడుతు నోడుతు ననినఁ - బోలుఁ గాక
వినుము సూతతనయ - మనబోఁటు లాతనిఁ, జెఱుతు మనుట నోరి - చేటు గాదె 10

చ. నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు - నీవు గురుండును దత్సుతుండు ను
గ్రపుబల మేచి తో నడవఁ - గా బెనుదాడిగఁ బోయి మత్స్యనా
థుపసులఁ బట్టి యుద్ధోరల - తోఁ జెడి పాఱితి కర్ణ యప్డు క
య్యవుబలు పాడె దిప్డు మన యర్జునునమ్ములు దుప్పు వట్టెనే. 11

ఉ. ముందరియట్లు గాదు జన - ముల్ దెగడన్ వెఱఁ బాఱి నేఁడు సం
క్రందనసూతి మార్కొని తి - రం బయి పోరెద దాఁపఁ బ్రాణముల్
నిందకుఁ జాల నింక నను - నిక్కువుఁబల్కులు పల్కు టొప్పు దా
నం దుదిఁ జచ్చినం జను మె - నన్ నరుఁ దాఁకుట రిత్త వోవునే. 12

వ. అనవుడు నలుక వొడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కి ట్లనియె. 13

చ. నరునకుఁ బూని పల్కితి వి - న న్జవి మాలినదొడ్డపల్కు లే
నరగలి లేక చె ట్టడరి - నప్పుడు సూడుము నన్ను నాతనిం
దిర మయి బాహుశక్తియును - ధీరతయున్ వెరవుం జలంబు నె
వ్వరిదసఁ గాంచి తెక్కుడుగ - వారి నుతింపుము మాను మంతకున్. 14

వ. అనుటయును నట్ల చేసెద నని పలికి శల్యుం డూరకుండె. తేరు వో ని మ్మని
రాధేయుండు దఱిమి పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా నడపె

ఇవ్విధంబునం జని మనవారైన సాచ్చి సైనికులు సంతసిల్ల వారలం గలయం గనుం
గొని కర్ణుం డి ట్లనియె. 15

సీ. పలుమ శోభిల్లు నె - వ్వాఁడైన వీఁడె యర్జునుఁ డని నా కిప్డు - చూపెనేని
పసదనం బే నిచ్చు - భంగి యందఱకును, వివరించి చెప్పెఁ - వినుఁడు మీరు
పొగడంగఁ దగురథ్య - ములతోడి సౌవర్ణ, రథములు వలసిన రయము లావుఁ
బొలుపును గలుగుకాం - భోజహయంబుల, వలసినఁ బేర్చుస - త్త్వంబునందుఁ
బరిణతము లగుసుందర-కరివరముల, వలసినను జారులావణ్య - కుల వలసి
నను మహాగ్రామములు వల-సినను గోర్కి, కెక్కుడై మ్మేటిమగఁ కే-నిచ్చువాఁడ.
క మఱి యొక్కటి సెప్పెద ని, ద్దఱు కృష్ణులఁ జంపి వారి - ధనవ ము నా కి
త్తఱిఁ దద్రథ మిదియే యని, యొఱఁగించినయతని కిత్తు - నేను ందమునన్. 17

వ. అనిపలికి శంఖం బొత్తిన దుర్యోధనుం డనుజసహితంబుగాఁ బ్రమోదంబు నొందె.
అప్పుడు నిస్సాణాదితూర్యనిస్వనంబులు దిక్కులం బిక్కటిల్లె. మనసేనాధవరులును
వరూథినియు నుబ్బునఁ బేర్చి యార్చిననినదంబులు నింగి ముట్టె. అయ్యెడఁ బ్రహా
సభాసురముఖుం డై మద్రవిభుండు రాధేయున కి ట్లనియె. 18

ఉ. ఎవ్వరు చూప నేల నరు - నిప్పుడ కాంచెదు రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు - గొం డని యీ వల దిట్టు లిచ్చినన్
నవ్వ జనంబు మిక్కిలి ధ - నంబులు గల్గినఁ జేయ రాదె నీ
కవ్విధి నైన సద్వ్యయము - లెందు నపాత్రపుటీవి యొప్పునే. 19

వ. అని యంత నిలువక. 0

క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతు ననియె దీవు - గంటిమె సింగఁ
బుల నెత్తటి నైనను నే, పాలమున నేనియును నక్క - పోరి గెలువఁగన్.

ఉ అగ్ని సారం దలంచునటు - లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ
కగ్గిది మాను మీపలుకు - లెవ్వరుఁ జెప్పఁగ లేరు రూపఱ
న్వ్రగ్గఁగఁ గాల మయ్యెనొకో - నావచనంబు లొకింత కర్ణము
ల్దగ్గఱ నిచ్చి యోధులు బ - లంబులుఁ దోడు గఁ బోరు టొప్పగున్. 22

ఆ. ఏను ధార్తరాష్ట్ర - హిత మాచరించుట, కై పెనంగి చెవుల - కప్రియంబు
లైన నిన్నిమాట - లాడితి నాబుద్ధి, విని దురాగ్రహంబు - విడువ వలయు. 23

చ. అనవుడు నల్గి సూతసుతుఁ - డాతని కి ట్లను మద్రులంబు న
మ్మిన నను నిత్తెఱంగునకు - మేకొన కుండఁగ మాన్ప వజ్రహ

స్తునకు వశంబు గా ద నినఁ - జొప్పడునే నినుబోఁటి కార్తిఁ జె
ప్పిన క్రియఁ జెప్పి ంవు వెఱ - పించిన నే వెఱ పెక్కువాఁడనే. 24

వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుట కై శల్యుండు మఱియు ని
ట్లనియె. 25

* * * * * *

సీ. విను పాపదేశ ం - జనితుండ వగునీకు, దుర్బుద్ధి గాక స - ద్బుద్ధి గలదె
క్షత్త్రియాధమ ంచ - కలదు లోకంబున, నాబాలగోపాల - మైనవాక్య
మతికుటిలుఁ ం సం - గతుఁడు గాఁ డేమిటఁ, జెలికిఁ గీ డొనరించుఁ - జెట్ట వలుకు
దుష్టాత్మకుఁ ంc గడుఁ - గష్టుఁడు మద్రకుం, డనునంతవట్టుఁ బ్ర - త్యక్ష మయ్యె
వావి లేక యొల్ల - వనితలుఁ బురుషులుఁ, గలయ మీకు నెగ్గు - గాక యుండు
మున్ను ల్లు పిదపఁ - జన్నుఁబా లై పెరుఁ, గుదురు సెప్ప నేల - గుణములింక.

క. పలుక సఁ బుట్టినిచ్చలుఁ, గలుద్రావుచుఁ బెరిఁగి యెట్లు - గఱతురు శీ ం
బుల మచితము లగుభాషణ, ములు నీ విమ్మాట లుడిగి - పాదపాద మనికన్ 27

చ. మ యొకఁ డేను జెప్పెద న - మానుషవిక్రమలీల నల్గడం
ఱ యయిఁ జంపియుఁ గ్ రిపున్ - పాలకసైన్యము రూ పడంచి మై
ఱఁగుట యొప్పదే తనువు - దూఁటులుఁ గాఁ బెఱవారి గెల్వకో
ఱ దొకొ నాదుపెం పుడుప - నోపుదు రే నినుబోఁటు లెమ్మెయిన్. 28

ం యించి గదం దల వగుల వ్రేటువడక యూరక తేరు వో నిమ్మనవుడు మద్ర
ంతి యతని నవలోకించి 29

హితము సెప్పఁ దగనె - యే నీకు నదియును, గాక నీరథంబు - గడపు చుండి
కౌరవాధినాథ - కార్యార్థి నగునాకు, నున్నరూపు సెప్ప - కుండ నగునె 30

ఉ. సారథి దక్షుఁడై రథిక సారము రథ్యబలంబు నాయుధో
దారత మానముం రణవి - ధంబు నిమిత్తశుభాశుభత్వని
ర్ధారణముం మదిం గని హి - తం బెఱిఁగించుట నీతి గాన నీ
వీరస మెత్తి నోఁ బలికి - తేనియు జెప్పుదు సూతనందనా. 31

వ. ఏ నేమితప్పు సేసిన గదం దల వగుల వ్రేసెదవు నీ వి ట్లంటివి గదా యని హితోప
దేశంబు మాన నేర్తునే యిది యొకదృష్టాంతంబు వివరించెద వినుము విని నీవు
నాచెప్పినట్ల చేసి తేనియు మేలు సేయ కుండినం గడుమే లనియె......
అనిన విని కర్ణుండు గమలనాభునిపెంపును బార్థుబలిమియు నెఱుంగక యే నేల

వారిఁ దొడరెద నెట్లు సెప్పినను దొడరుదుఁ దొడరి వా రొండె నే నొండె నగుదు నింతియు నీవు వెడమాట లాడక యుండుము మని పలికి యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కి ట్లనియె. 32

* * * * * *

వ. జామదగ్న్యబ్రాహ్మణులశాపంబులకు వెఱతు సత్యంబ పలికితి నీయున్న రాజులును నాతోడిసుఖదుఃఖంబులకుం గలవా రగుటం జేసి కృష్ణార్జునులకు నే వెఱన నింద్ర యమవరుణకుబేరులు వజ్రదండపాశగదాహస్తు లై బెట్టు ముట్టినను బెదర నని యుండుదుఁ దక్కినవారిం జెప్ప నేల యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం దోఁచుచున్నది యన్న రునియున్నెడకు మనరథంబు నడపుము పుడమిజనంబులు మదీయకోదండ పాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు వందు చుండునట్లు సేసెద నమ్మేటి మగని మృత్యునివాసంబు నొందించెద. 33

సీ. కాండమహోరగం - గముల వైరుల ముంచు, విజయాంబురాశికి - వేల నగుదు
బాణరశ్ములఁ బరి - పంథులఁ బొదివెడు, నర్జునాదిత్యున - కభ్ర మగుదు
విశిఖోగ్రశిఖల వి - ద్విషుల నేర్చుకిరీటి, ఘోరదావాగ్ని కా - సార మగుదుఁ
బ్రదరవేగమున న - రాతులఁ గూల్చుపా, ర్థాతివాయువునకు - నచల మగుదు
విల్లు పట్టెడువారికి - నెల్ల నెక్కు, డనఁగ నెగడినగాండీవి - నాహవమునఁ
దొడరఁ బ్రాణంబులకు నాస-పడులఘుప్ర, కారులకు వచ్చు నే నాకుఁ-గాక శల్య.

* * * * * *

వ నీకు వెఱపింప నయ్యెడుఁ గొలందివారిని వెఱపింపుము కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని భయంబు గొనుటకుం గాదు కురుపతిసన్నిధి నీవు సారథ్యంబునకుం బూను చుండి పలికికొన్న బాసకతంబున బ్రదికి పోయి తనిన విని శల్యుం డీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి వినుము కర్ణ కర్ణుఁడు నేవురైనం గిరీటిని గెలువం జాలువారే యనుటయు నతండు గనుక నెట్టి నైనకన్నుంగవతోడినవ్వు నవ్వుచు ని ట్లను ధృతరాష్ట్ర సన్నిధి నుత్తమద్విజులగోష్ఠి నఖిలదేశాచారవిదుం డైనవృద్ధబ్రాహ్మణుండు సెప్ప వింటి బాహ్లీక దేశంబునవారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి నగ్ను లై యసంగతదురాలాపంబులతోఁ దిరుగుదు రని తొడంగి యనేక ప్రకారంబుల బాహ్లీక దేశనిందోపన్యాసంబు సేసి నట్టిబాహ్లీకుల కొడయండవు తత్కృతంబు లగు పుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం జేరు నట్లుం గాక వారియనాచారంబులు వారింపమింజేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు బాహ్లీకులకంటె మద్ర

దేశజాతు లవినీతు లని యార్యులు సెప్పుదురు నిన్నేమి సెప్పం గల దింతపట్టు
సెఱింగి నాలుక యడంచి యుండు మనవుడు నమ్మద్రేశ్వరుండు. 35

క. లావులు రథ్యతిరథసం, ఖ్యావేళం దెలియఁజెప్పఁ - గాదే భీష్ముం
డావచనమ్ములు మనమున, భావింపుము క్రోధమేల - బలియుండ నీకున్. 36

తే. విడుతు రాప్తుల బంధుల - వెలలు గన్న, నమ్ముదురు కులకాంతల - నంగదేశ
జనితు లగువారు విభుఁడ వ - జ్జనుల కిట్టు, లేలొకో నొడ్ల చరితంబు - లెన్న నీకు

క. పరదోషము సెప్పఁగ నే, ర్తురు గా కాత్మీయ మైన - దోషంబు మదిం
బరికింపఁగ నధములు నే, ర్తురె తెలుపక యుంటి పలుక - తో నుండకుమీ. 38

వ. అని యుల్లసం బాడి మఱియును 39

ఆ. సకలదేశములను - సన్మార్గవర్తులుఁ, గలరు దుష్టతతియుఁ - గలిగి యుండు
మది నెఱుంగ నేర్చు - మధ్యస్థు లదియును, నదియు నుగ్గడింతు - రెదురు మెచ్చ.

వ. ఒకదేశంబు దాఁ గీడ యగుట కలుగునే యట్లుం గాక సదాచారదురాచారంబులు దైవం బెఱుంగడు నీ వనాత్మజ్ఞుండ వూర కుండు మనియె. అట్లయ్యిరువురు వివాదంబు సేయుట యాలించి చేర కౌరవపతి సఖిభావం బుపన్యసించి రాధేయు రాజత్వగౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నాసూతనందనుండు నగుచు శల్యు నుద్దేశించి పొద పొద రథమ్ము పో నిమ్ము పో ని మ్మని పలికె. 41

# 26. యుధిష్ఠిరార్జున పరస్పర క్రోధవచనంబులు—అర్జునానునయము.

(కర్ణపర్వము. ఆ. III.)

వ ఇప్పురుసున భార్గవాస్త్ర బాధితంబై యప్పాండవబలంబు వెఱచఱచి మరలి పఱచిన మనమూఁకలు వెన్నడిం దఱుమ నానూతనందనుం డక్లేచి యార్చి యంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ లేనిమంటపగిదిం బ్రదీప్తుండయినఁ దదుత్సాహంబున కోటువడి యాసైన్యంబుజనంబులు హాహాకారంబు లెసంగ దీనదశం బొంది ముకుందపురందరనందనులం జేర్కొని యాక్రందించి రట్టియెడ. 1

ఉ. గాండివి శౌరి కిట్టు లనుఁ - గర్ణునిఁ జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి పటు - దర్పము సూపుచుఁ దేఱి చూడ రా
కుండెడునట్లుగా నఱక - నుగ్రత మండెడు నిప్డు నేర్పుమై
నుండక నీనునం దొడరి - యోటమి దెచ్చికొనంగ నేటికిన్. 2

క చచ్చిన మఱి గెల్వ గొనక, వచ్చునె తనయొడలు గలుగ - వైరుల గెలువన్
నచ్చుం దఱి వచ్చిన నది, మెచ్చు జయార్థులకు మరుద - మిత్రధ్వంసీ. 3

తే పట్టపగలింటిసూర్యుని - పగిదిఁ గర్ణుఁ, డుగ్రమూర్తి యై వెలుఁగుచు - నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ - మరల నిమ్ము, బ్రదికియుండిన శుభములు - వడయవచ్చు.

వ. అనిన విని వాసుదేవుండు పడమటిదిక్కు విలోకించునెడ నతండు కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిద్రౌపదేయాదిరథికు లారథికునిం దలపడఁ దానును గౌరవులపయిం గడంగె అట్లమ్మేటిమగనియాటోపం బప్పటికి వైరినివారణంబునకుఁ జాలియునికి యనుసంధించి రాధేయుం డొరులతోఁ డయ్యం బోరుటయుఁ బార్థుండు డప్పి దీర్చికొనుటయు మేల కాక యని యూహించి యమ్మురారి దే రక్కురుసేనాధిపతి సంగ్రామంబు సేయుచక్కటి కెడ గలుగం గొని చని యన్నరునితో మన మశ్వత్థామతోడి పెనంకువం జిక్కినసమయంబున ధర్మనందనుండు సూతనందనున కగ్గమై యుండె నాతం డతనియమ్ముల నొచ్చెనో యని తలంచెద నయ్యవనీశునవస్థ యెఱింగి మఱి నీ వయ్యంగరాజు సమయింపం గలవాఁడవను టయు......అచ్యుతు నాలోకించి యామహీపాలుం గనునంతకు నామనంబు

గలంగెడు రథంబు రయంబునం బోవ నిమ్మని పలుకుటయు నతండు భీముం జూచి యేము మీయన్న సేమం బరయుట వలయుపని గావునం జనియెదము నీవు కురు సైన్యంబుల జయించుట యరుదె గెలువుగొను మని యగ్గించుతెఱంగున దీవన లిచ్చి తురంగమంబులం ద్వరితగతినడపె ఇవ్విధంబున మాధవధనంజయులు సమ రంబునకు సమీరనందనుం జాలించి శిబిరంబున కరిగి ధర్మనందనుమందిరంబు ప్రవే శించి యేకతంబ శయ్యాతలంబున నున్నయన్నరపతిం గని యాతండు గుశలి యయి యునికికి ముదంబు నొందుచుం దదీయచరణంబులకుఁ బ్రణతు లయిరి అధరణీనాథుండు వారలు రాధేయు వధించి వచ్చిరకాఁ దలంచి డెందం బలర మందస్మితంబుతో నభినందించి వారలవదనంబులు వీక్షించి యి ట్లనియె 5

మ. సురలైనం జల మెత్తి కర్ణుని రణ - క్షోణిన్ జయింపంగ నే
ర్తురె యవ్వీరుఁడు జామదగ్న్యకలితా - స్త్రం బిద్ధతేజంబునన్
దొర సప్తార్చికి లావునం బవనుతోఁ - దుల్యుం డగణ్యుండు సం
గరసంక్రీడలయందుఁ బేర్కొనఁ దగున్ - గాంభీర్యధైర్యంబులన్ 6

తే. అట్టిబల్లిదు ననిఁ దెగ - టార్చి మీర, లేమియును గాక వచ్చితి - రింతసంత
సంబు దొరకొను నే నామ - నంబుచింత, యంత యొల్లను జెడ నర - వర్యులార. 7

చ. అతనికి నాకునుం గలిగె - నాహవ మింతకు ముంద రందుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు - శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు - సూతహయధ్వజపాతనంబు సే
సి తనువు దీవ్రకాండములఁ - జెండఁగ నే వెగ డందితిం గడున్ 8

వ. అప్పుడు దుర్యోధనప్రభృతిధార్తరాష్ట్రులకు భీమసేనుప్రభావంబున బ్రదుకరాని యంత వుట్టిన నన్ను విడిచి యాతం డట వోవ నేనిట వచ్చితి నని చెప్పి...... భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరం బయి యుండు నేనునుం దడ యుంట గర్జంబు గాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు గుశలియై యుండుట యెఱింగి యతనిబాణంబుల నొచ్చినవాఁ డగుట నలుక గదిరి యక్కి రీటితో ని ట్లనియె. 9

## ధర్మరాజు గర్ణుండు బ్రదికియున్నవాఁ డని విని యర్జునుం గినిసి పలుకుట.

క. అనిలోఁ దెరలుట దొలఁగుట, యనునివి సనుఁ గాక నొచ్చి - యైనను గల సె
ల్లను వెడలఁ జనునె యే న, ట్లును గా కిట వచ్చుటం జూ - లుక నైతిఁ గడున్

క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీవు నోడి - తనిలజమాద్రీ
తనయులు మున్నే యోడిరి, మనతోఁ గూడంగఁ గంస - మర్దనుఁ డోడెన్. 11

క. కావున మన మిఁక ననికిం, బోవం బని లేదు విపిన - భూమికిఁ జని య
చ్చో వెఱపు దక్కి తపసుల, మై విచ్చలవిడిఁ జరింత - మందఱముఁ దగన్. 12

క కాదేని బిరుదు లాడక. సాదుల మై వినయ మొప్పఁ - జని కురునాథుం
డేది పనిచినను జేసి ద, యాదృష్టి నతండు నూచు - న ట్లుండఁ దగున్. 13

వ అని కెంజాయ రంజిల్లుకన్నుల నన్నరు నాలోకించి 14

ఉ. నీ తెఱఁ గిట్టిదేని రణ - నిష్ఠకుఁ బూనక కార్యవాది వై
ద్వైతవనంబునంద సము - దగ్రభుజాబలదుర్జయుండు రా
ధాతనయుండు వాని ననిఁ - దాఁక నశక్యము నాకు నన్న నే
నీ తెరు వేల నత్తు మహి - యేల నశక్తుఁడు గాంతు సేయు నే. 15

తే అని పధించెదఁ గర్ణు నే - నని ప్రతిజ్ఞ, సేసి యిటు దెచ్చి న న్నిట్లు - సేసి తింత
కెట్లు నేర్చితి పొడవుగా - నెత్తి నేల, వైవ నోర్చితి ననుఁ బగ - వారినడుమ 16

మ. పంకజనాభుఁడున్ వినఁగఁ - బల్కినయప్పలు కెమ్మెయిం దుదిన్
బొం కగు టోర్చి తిట్టిననుఁ - బుట్టినయప్డు నుతించెఁ బోరికిన్
శంక గొనందు గెల్చుఁ గురు - సంఘము నీతఁడు పుణ్యుఁ డన్నయా
బొంకరి దివ్యవాణియుఁ ద - పోధనులున్ మము ని ట్లలంతురే 17

క. విను మప్పలుకులు పాటిగఁ, గొని దుర్యోధనునితోడఁ - గొంటిని బగ ము
న్ను నిజంబుగ నెఱుఁగను వీఁ, డని రాధేయునకు వెఱచు - నని యే నిన్నున్.

సీ. దేవత లిచ్చిన - తేరు నశ్వంబులుఁ, గపికేతనంబును - గలవు దైవి
కంబుచే నున్నది - గాండీవ మనఁ దాటి, యంతవి ల్లది గాక - హరిరథంబు
గడపెడు నటె పరి - కర మిట్టి దై యుండ, నెట్లు కర్ణున కోడి - యిట్టు వలియఁ
బాఱుతెంచితి నీవు - భండనంబునఁ గర్ణుఁ, గని పాఱు దని సుయో - ధనుఁడు సెప్పె
నది నిజంబుగఁ గొనక బే - లైతి నాదు, బేలతనమునఁ గాదె పాం - చాలమాత్స్య
పాండ్యు లాదిగఁ గలిగిన - బంధుమిత్ర, జనులు దెగటాఱిర ప్రయో - జనము గాఁగ

వ. అని పలికి కృష్ణునాననం బాలోకించి కర్ణు నిగ్రహించుట యశక్యం బయ్యె సుయోధనాదికౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతో నునికిం గడచినకష్టంబునుం గలదే యది య ట్లుండె నేను జావు దప్పి వచ్చుట

వడముడికతంబునం గలిగె నతం డొక్కరుండును బ్రాణంబులు డాఁపక పరబలం
బులు బడలువడం బోరు చున్నవాఁడు. 20

క. అని పార్థుఁ జూచి యతఁ డి, ట్లను నేఁ డభిమన్యుఁ డొండె - హైడింబుం డొం
డెను గలిగిన ని ట్లగునే, విను మును చేసినది యనుభ - వింపఁగ వలదే. 21

ఆ. నిన్నుఁ దృణముఁ జేసి - న న్నాదురాత్ముండు, బంధుహీనుఁబోలెఁ - బఱుప నెదురు
దోఁచి నవ్వ డొదవి - తొలఁగించువానిఁ గా, కన్య నేల బంధుఁ - డండ్రు జనులు

చ. హరి గలుగంగ నేటికి భ - యంబున వచ్చితి నీదుగాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగ - లెక్కి హరికిఁ రథిఁ జేయఁ గన్న ని
ష్ఠురభుజవిక్రమోగ్రుఁ డగు - నూతతనూభవుఁ దత్సహాయులం
బొరిగొనఁడే సుయోధనుని - పోడిమి దూలఁగ నొక్కయాత్రలోన్. 23

తే. గొంతికడుపునందుఁ - గొడుకుఁ బూ లై నీవు, దోఁప కుండ వైతి - తోఁచినట్టి
పిండ మెడలి యైనఁ - బిదప దిగంబడ, దయ్యె నింత వృట్ట - దట్టులైన 24

అర్జునుఁడు దన్ను ధర్మజుఁ డాడినపలుకులకుఁ గోపించి
యతనితల నఱుక వాలు వెఱికికొనుట.

సీ. అనినఁ గృపాణంబు - గొని సవ్యసాచి య, వ్విభు ద్రెయఁ దలఁచిన - విష్ణుఁ డెఱిఁగి
వాలు గేల నమర్చ - వలసినకత మేమి, కౌరవు లిచ్చోట - లేరు మనము
ధరణీశ్వరునిసేమ - మరయంగ వచ్చితి, మీతనికుశల మి - ట్లేర్పడంగఁ
గంటిమి సంతోష - కాలంబు గా కిది, క్రోధకాలమె వధ్య - కోటి యిచట
నేది గాఁగ నలిగి - తీ వని పలికిన, రూక్షభంగి యగుక - టాక్షదృష్టి
యానరేంద్రుమీఁద - నడరంగ నర్జునుఁ, డమ్మురారి కిట్లు - లనియె నధిప. 25

క. విను మెరులకు గాండీవ మి, మ్మని న న్నెవ్వండు పలికె - నతనిశిరము గ్ర
క్కునఁ బగుల ద్రెయుటకుఁ జే, సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదు - చిత్తములోనన్ 26

తే. ఇట్టికష్టపుఁగేలి కై యిట్లు సేయఁ, బ్రతిన వట్టుట దగదె యి - ప్పలుకు నీవు
వినఁగ నితఁ డాడ నిమ్మహీ-విభుఁడు ధర్మ, వంతుఁ డగుఁ గాక చంపన-వలయుఁ గృష్ణ.

వ. చంపి పాలితప్రతిజ్ఞుండ నైననాకు నసత్యంబు రా కుండఁ బరిహరించెద దీనికి
నీ వేమి సెప్పెదవు సెప్పుము జగత్కృత్యసాకల్యవేదివి నీ చెప్పినట్ల చేయం గల
వాఁడ ననుటయు నచ్యుతుండు పో పో మ్మెక్కడివాఁడ వని యదల్చి వెండియు
ని ట్లనియె. 28

ఆ. నీకు వృద్ధసేవ - లే కున్కి యెఱుఁగంగ, నయ్యె రిత్త యిట్టు - లడిచిపడుటఁ
బట్టి ధర్మవిధివి - భాగజ్ఞు లైనవా, రేల చేయఁ జొత్తు - రిట్టిదాని. 29

క. చేయంగ వలయువానిం, జేయుట యిట్టివియె కొన్ని - చేయ కునికి ధ
ర్మాయత్తచిత్తుఁ డైనా, నారోగ్యస్థలము లెఱిఁగి - నడవఁగ వలదే. 30

క. సత్యంబు నహింసయు నను, నత్యుత్తమధర్మయుగళ - మందు నహింసక్
సత్యము గాచుట ధర్మ మ, సత్యమున నహింసఁ గావఁ - జను నండ్రు బుధుల్.

ఆ. కర్మసూక్ష్మభంగి - గానక యిమ్మెయి, సత్యరక్షణంబు - సలుపుపొంటె
భ్రాత ధర్మపరుఁడు - రా జిమ్మహాత్ముఁ జం, పఁగఁ దలఁచుట ధర్మ - పథముగాదు.

క వినుఁ పిన్న నాఁడు నీ వీ, యనుచిత మగువ్రతము వట్టి - తది గాకయు బె
ట్టన్నృతము సూన్నృతమును నీ, కనియెడు చందంబు బుధులు - గయికొనరెందున్

వ. అది యె ట్లం టేని. 34

ఆ ప్రాణహాని వచ్చు - పట్టున సర్వధ, నాపహారవేళ - యందు నడపు
సత్య మనృత మం డ్రు - సత్యంబు సూనృత, మని పరిగ్రహింతు - రార్యజనులు.

వ వినుఁ పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుం డనునొక్కవిప్రుం డొక్కవిశిష్ట గ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమపుణ్యక్షేత్రంబున వసియించి సత్యంబ పలుకువాఁడ నని వ్రతంబు పట్టి సత్యవాది యనం బ్రసిద్ధుం డయి తపంబు సేయు చుండ నొక్కనాఁడు ముచ్చులం గని వెఱచఱచి పఱతెంచినజనులు గొంద ఱయ్యాశ్రమంబుచేరువఁ బొదలఁ దూఱి రంత వెనుతగిలి వచ్చుముచ్చు లత్తపోధనునికడ కేతెంచి యిప్పు డిట వచ్చినవార లెట వోయి రని యడిగిన నతండు సత్యవిభాగవిధిజ్ఞుండు గామింజేసి తన కసత్యంబు వాటిల్లు ననుశంక నీగుల్మలతాగహనంబు సొచ్చి రని చూపి చెప్పిన నత్తెక్కలికాఱు వారలం జంపి ధనమ్ము గొని రమ్ముని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యె నను నితి హాసంబు విందుము హింసాకరం బగుసత్యంబు ధర్మంబు గాదు తొలుత వినిన దానిన పట్టి మూఢుండు పెద్దల నడగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు నింతపట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం గాఁ డని నిశ్చయింపు మనుటయు నర్జునుం డి ట్లనియె. 36

తే. తల్లిదండ్రులమాడ్కి హి - తంబుసెప్పి, నన్ను ననుచితకృత్యంబు - నకుఁ దొలంగఁ
ద్రోచితివి లోకమున నీకు - గోచరంబు, గానిధర్మనిబోధంబు - గలదె కృష్ణ. 37

క. జనములు వృథాప్రతిజ్ఞుం, డని నను నిందింప కుండ - నగ్రజుఁడు సుఖం
బునికియుఁ గలిగెడునట్లుగ, ననుగ్రహముఁ జేసి చేయు - నది పనువు దగన్. 38

వ. అనిన నతం డతని కి ట్లనియె. 39

## కృష్ణుఁ డర్జునుఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ ధర్మజు దూఱు మని చెప్పుట.

చ. అతిశితకర్ణబాణహతి - నంగము నొచ్చినదాన నల్గి యి
ప్పతి నిను నొవ్వఁ బల్కె - టిది - ప్రాభవ మింతియ కాక నీయెడన్
మతిఁ బటుకోపముం గలదె - మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతనివ - శంబునఁ గాదె చరింతు రెప్పుడున్. 40

క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడినది యెల్ల - నెగ్గ గొనక నా
చే వినుము నీదుప్రతినకు, నేవిధి సేయ నగు దాని - నేర్పడ ననఘా. 41

క. నీ విట్టివాఁడ వని ధర, నీవిభునిం బలుకు మదియ - నీచంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ, వై వినయము సేయు చిత్త - మలర నతనికిన్. 42

వ. అ ట్లయిన నసత్యదోషంబునకును గురువధపాతకంబునకుం దొలంగి సమాహి
తుండ వగుదు తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు నిమ్మనుజపతియను
మతి వడయుద మనుటయు నప్పలుకుల కభినందించి పురందరనందనుండు ధర్మ
నందను నుద్దేశించి. 43

మ. కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భటగదా - ఘాతంబులం గాలఁ గే
లను విద్విట్చతురంగసంఘములు గూ - లం గేలి సల్పంగఁ జా
లినయాభీముఁడు పల్కఁ గాక నను దో - ర్లీలాసమగ్రుండ వై
యనిలో నిల్వఁగ లేనినీ విటుల కీ - డాడంగ నర్హుండవే. 44

క. న న్నెఱిఁగి యెఱిఁగి యి ట్లనఁ, జన్నె నీజిహ్వ పెక్కు - శకలము లై పోఁ
కున్నది యే లొకొ రణమున, నెన్నఁడు నీ వేమి సేసి - తింత యనుటకున్. 45

క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున న - రాతిబలము నే
లకుఁ గోలకు దెత్తురు నో, రికి వచ్చినయట్టు లాడి - రే యిబ్భంగిన్. 46

సీ. నీవు జూదం బాడఁ - గా వైరబంధంబు, గౌరవజాతితోఁ - గలిగె మనకు
రాజ్యనాశంబు న - రణ్యవాసంబును, దాస్యదైన్యంబు న - త్యంతదుఃఖ

ములుఁ దెచ్చికొంటి సి - గ్గొలయదు నీమనం, బున నించుకేనియు - ననికిఁ జాల
కున్న వానికిఁ దాల్మి - యొ ప్పగుఁ గాక ప్ర, ల్లదములు పలికిన - లాఘవంబు
సెందు ము న్నేమి సేసినఁ - జేసి తింక, నైన దుర్బుద్ధితనములు - మాని తగిన
పౌరుషము లేమి సేయఁగ-నూర కుండు, మిడుమ పడువారు నైతురే-యింతపట్టు

వ. అని యగ్రజు నప్రియంబులు పలికి యంతరంగంబు సంతాపంబు నొంద నిట్టూర్పు నిగిడించి యంతకము న్నొఱఁబెట్టినవాలు వెఱికినం గనుంగొని పద్మనాభుండు గ్రమ్మఱ నిది యేమి యని యడిగిన నతం డే నిన్నరనాథు నో నాడిన పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దలఁచుకొనుటయు కా నిశ్చయించితి ననుటయు నమ్మహాత్ముఁ డాత్మప్రశంస సేయుట మది మరణం బని పెద్దలు సెప్పుదు రను టయు నీచెప్పి నట్ల చేయ కునికికిం గడచినయధర్మంబును గలదె యట్లు సేయుఁవాఁ డన కాక యని యాధనంజయుండు ధనుర్ధరుం డై ధర్మనందనున కి ట్లనియె. 48

ఆ. హరుఁడు దక్కఁ జాప-ధరుఁ డొరుఁ డెన నాకుఁ, ద్రిభువనముల లేఁడు-దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి - నిచ్చితిఁ బెనుపారు, ధనము రాజసూయ - దక్షిణలకు. 49

వ. దీప్తప్రతాపం బగుసంశప్తకసంచయంబు నడఁగించి కించిదవశిష్టంబుగా నష్టంబు సేసితి గురుసేన నాచేతం గూలి యె ట్లున్నదియో యటు నూడు మని పలికి మొగంబు బిగు వుడిపికొని సవినయంబుగా దండప్రణామంబు సేసి నిలిచి చేతులు మొగిడ్చి యజాతశత్రున కప్పురుహూతపుత్రుం డి ట్లనియె. 50

క. నను సుప్రసాదదృష్టిం, గనుఁగొను మే నిపుడు గొన్ని - కాఱు లఱచితిఁ
మనుజేంద్ర వానిఁ బెడచెవు, లను బెట్టుము వేఁడుగాఁ ద - లంపక దయతోన్. 51

తే. వినుము సత్యంబ పలికెదఁ-దనువుఁ బ్రాణ, ములును నీసొమ్ముగా మదిఁ-దలఁతు నేను
నాదువృత్తంబు భవదధీ - నం బనంగ, నేల పనుపుము నను భీము - పాలి కధిప.

క ఓపి యతనిరణభారము, వాపెదఁ గౌరవ్యసేన - బడలువఱిచి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద, మాపెదఁ గురురాజుదురభి - మానము బలమున్. 53

వ. ఎల్లభంగుల నేఁడు రాధం బుత్రరహితం జేసెదఁ గాదేని గొంతి రైయిన నట్టిద యగుం గాక. 54

చ. అన విని యమ్మహీరమణుఁ - డాతని కి ట్లను మీకు నాకతం
బున బహుదుఃఖముల్ గలిగె - భూరికులంబున కప్రియం బొన
ర్చినయవినీతుఁ బాపపరు - శ్రేయఁ దగుం దల ద్రెవ్వ నీమనం
బునఁ గృప పుట్టి కాచినను - బోయెద నిప్పుడ యేను గానకున్. 55

క. ననుఁ దొఱఁగి నీవు సౌఖ్యం, బున నుండుము సమరభీతు - భుజబలహీనుఁ
జనపతిఁ గాఁ జేయుట యొ, ప్పనె కట్టుము పట్ట మనిల - పుత్త్రునిఁ బ్రీతిన్. 56

వ. అని పలికి సెజ్జ డిగ్గి వనవాసగమనోన్ముఖుం డయినం గనుంగొని కమలనాభుం డాభూపతిచరణంబులకుం బ్రణతుం డై యి ట్లనియె. 57

సీ. నరునిప్రతిజ్ఞ భూ - వర మున్నెఱుంగని, యింతియ కా దేను - నితఁడు నిష్ఠు
డాడినమాటలు - నంతరంగంబునఁ, బట్టవు పేర్చుకో - పమున నీకుఁ
దను నెవ్వఁ డుఱక య - న్యునకు గాండీవ మి, మ్మని ధిక్కరించె నా - తని వధింప
బ్రతిన వట్టినవాఁడు - భావ్యంబు గానియ, ప్పలు కీవు వలికితి - పరమధర్మ
మైనసత్యనిష్ఠ - హానిఁ బొందుట కోర్వ, కునికిఁ జూచి యేన - యుల్లమునఁ ద
లంచి యట్లు వలుకఁ - బంచితి గురునిఁ గీ, టాడుటయ వధించు - టగుటఁ జేసి. 58

క. శరణము వేఁడెదను భవ, చ్చరణంబులు వట్టికొని ని - సర్గదయాని
ర్భరబుద్ధిని గావుము మ, మ్మిరువుర నీతప్పు సైఁపు - మెల్లవిధములన్. 59

క. సూతసుతుని మెడ సెత్తురు, భూతలమున నివురు నేఁడు - భూనాయక నీ
వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని యేన - చుమ్ము పలికెదన్. 60

క. విను సత్యం బాడెదఁ బా, ర్థునిచే నేఁ డెల్లభంగిఁ - దునుమం బడుక
ర్ణునిదెసఁ జింతయు వంతయు, మనుజేశ్వర విడువు పంపు - మమ్ముఁ దెలివితోన్.

## ధర్మరాజు కృష్ణునివాక్యంబులం గలంక దేఱి ప్రసన్నుఁ డగుట.

వ. అనుటయు ధర్మసూనుండు ససంభ్రమంబుగాఁ గృష్ణు నెత్తి యతండు ప్రాంజలి యై యుండ నతని కి ట్లనియె 62

క. ఇది యట్టిద మోసంబునఁ, బదిలుఁడఁ గా కేను మున్ను - వదిరినకతనన్
హృదయము గలఁగిన నా కె, య్యదియును దోఁపదు వికారి - నైతి మహాత్మా. 63

ఆ. ఇట్టి నన్ను ననున - యించి బోధించితి, కరుణఁ బేర్మిఁ జేసి - గారవమున
నజ్ఞు లైనమమ్ము - నాపత్పయోనిధి, మునుఁగ కుండఁ గాచి - తనఘమూర్తి. 64

వ. అనియె నప్పుడు వివర్ణం బగువదనంబు వాంచి యున్నవాసవిం జూచి వాసుదేవుండు నీ వి ట్లు విషణ్ణుండ వగుట గర్జంబు గా దిమ్మేదినీపతిముఖప్రసాదం బభినందించి యనుమతి వడసి చని రాధేయవధవిహారంబున నితనికిం బ్రియం బాపాదింతు గాక యింకఁ దడయ నేల యని పల్కి వెండియు. 65

ఉ. ఈతని నొవ్వఁ బల్కుటన - యీదురవస్థకు వచ్చి తక్కటా
శాతమహాసి నీనృపతిఁ - జంపిన నెట్లగుదో విపత్తికిం
బాతకఘోరవృత్తికిని - బాసితి దైవ మనుగ్రహించుటన్
నీతెలి వాప్తబంధుజన - నిర్మితపుణ్యవిపాక మర్జునా. 66

వ. అనిన నతండు గన్నీ రొలుక నన్నపాదంబులపైఁ బడిన నప్పాండవాగ్రజుండును బాష్పప్లావితముఖుం డగుచు నతనిమీఁద నొఱగ ని ట్లియ్యిరువురు నొం డొరులం బట్టికొని యేడ్చి రచ్యుతుం డుడుప నుడిగి తత్కాలోపగతసముచిత పరిజనానీతజలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి తదనంతరంబ ధర్మనందనుండు దమ్మునిం గౌఁగిలించికొని మూర్ధాఘ్రాణంబు సేసి చిఱునవ్వుతో మనల నింత వఱచునే కర్ణుం డని పలికి మఱియును. 67

ఆ. ఎల్లఁ జూడ సిడము - విల్లు నశ్వంబుల, సూతుఁ దునిమి నన్ను - నాతఁ డలవు
తెఱయ గెలిచె నతని - నీ విప్డు సంపక, యున్న నాకు బ్రదికి - యుండఁ దగునె.

చ. అనవుడు నమ్మహీపతికి నర్జునుఁ డి ట్లను నేఁడు కర్ణు నే
ననిఁ బడ వైతు నీయడుగు లాన తదీయసుహృద్గణంబుతో
విను మటు సేయ కే మగిడి - వెల్వెలఁ బాఱెడు మోముతోడ వ
త్తునె యిట కృష్ణసారథియుఁ - దూలునె మానవిహీనవృత్తి రై. 69

— — — —

# 27. నాగాస్త్రభయంబున నర్జునురథము శ్రీకృష్ణుఁడు భూమియందుఁ జొనుపుట.



(కర్ణపర్వము. ఆ. III.)

చ. మఱియు నరుండు సూతసుతు - మర్మవిభేదన మాచరించిన
న్నెఱుఁగులు గ్రమ్మనమ్ముల వి - నిశ్చలధైర్యముపేర్మి నాతఁడు
క్కఱక పెనంగె దానఁ గన - లగ్గల మై వెస నమ్మహాభుజుం
డఱిముఱిఁ జీఁకటుల్ గవియ - నట్లుగ రోదసి నించెఁ దూపులన్ 1

తే. వెగడుపడిచక్రరక్షకుల్ - వెనుకదిక్కు, గాచురథికులుఁబార్శ్వసం - గతులుఁదమ్ము
విడువఁ జాలక లజ్జ వో - విడిచి రపుడు, గర్ణువారలు వాఱుట - గని విభుండు 2

క. ఆదిక్కువారు భీముం, డాదిగ నని సేయ కుండు - నన్ని యతిఱేడం
దాదైన్య మొంది తప్పం, గా దని యూహింప నీని - కలఁకకతమునన్. 3

వ. ఇరుగెలంకులమూఁకలం గలయం గనుంగొని యెలుఁం గెత్తి. 4

క. తొడరుఁడు పొదువుం డేయుఁడు, పొడువుఁడు బీభత్సుఁ బ్రిదిలి - పో నీక వెసం
బడ వైవుం డొక్కుమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ - గౌరవనాథా. 5

క. విను మతఁ డిమ్మెయిఁ బురికొలి, పిన రథకరితురగసుభట - బృందములు రయం
బున నురవణించె నయ్య, ర్జునుపైఁ దగువారు నిలిచి - చూచుచు నుండన్. 6

వ. ఎదిరిసైన్యంబు సమరంబు దొఱంగి యుండుట యెఱింగి కడంగుట పాడిగా దని దొరలు దురంబునకుం జొర కుండిరి గాండీవి కోదండగుణరణనభరిత భూనభోఽంతరుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబుల వేఁడిమి సూపిన సే పఱి వెఱచి యమ్మూఁకలు వఱచిన నక్కురునాథుం డద్దొరల నుద్దేశించి. 7

క. వీరమును లావుఁ గల్గిన, మీ రందఱుఁ గర్ణు నొకని - మీఁదన యిమ్మైఁ
బో రెల్లఁ ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోప - జీవులతెఱఁగే. 8

వ. అనిన విని యుల్లంబుల లేనియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నుర వడించిన. 9

మ. భరితక్రోధమహోగ్రవృత్తి సిడముల్ - భంజించుచుఁ నూతుల
న్ధరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు - న్రథ్యంబులం జంపుచుఁ
నరుఁ డాఖీలపరాక్రముం డగుడు దై - న్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రంపఱు దివ్యసంఘము నుతిం - చెం జూచి యవ్వీరునిన్. 10

చ. కురుపతి వెండియుం దఱుమఁ - గోల్తల సేయర క్రమ్మఱంగ నె
వ్వరు నతిభీతి నిట్లు మన - వా రెడ గాఁ జని చూచు చుండి ర
ప్పురుసున నాసముద్ధరణి - భాగము శూన్యతఁ బొందఁ గర్ణుఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిర - ణంబు మహాద్భుత మయ్యె భూవరా. 11

చ. క్రమమున సోలు చుండియుఁ బ - రాక్రమసంపదసొంపు మీఱ దు
ర్దమవివిధాస్త్రజాలతిమి - రంబుల నొండొరుఁ గప్పి కప్పి శౌ
ర్యములును బాహువీర్యములు - రాజుల నచ్చెరు వందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమర - రాజతనూజుఁడు సూతసూనుఁడున్. 12

వ. అట్టియెడఁ దక్షకునపత్యం బై తల్లోదరుం డగునైరావతుండు పెనిచి యుప లాలింప నుల్లసిల్లినయశ్వసేనాభిధానుం డగునాగకుమారుండు సర్పముఖశరా కారంబు గైకొని తనయొద్ద నుండఁ దాను బసిండిపొఱం బెట్టి యనుదినంబును గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జునుమీఁదం బ్రయోగించు వాఁడై యున్నయట్టియమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చి కొని తలదగ వ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణజ్వాలాజాలంబు లంబరంబు నం బర్వఁ జూపఱ హాహాకారంబులు సేయం గార్ముకగుణంబున సంధించి తెగ వాపినం గని యారథికుచూపు కంఠంబుచక్కటికిం గాక తప్పి యుపాంగ ప్రదేశంబుకొలంది యగుటం జేసి యది నెపంబుగా శల్యుం డతనికిఁ జిత్తవైకల్యం బాపాదింపం దలంచి యీసంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు నిపుణంబుగా నిరూపించి యొండుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గనలునఁ గనుఁగవఁ గెంపు గడలుకొన నమ్మద్రపతిం జుఱచుఱం జూచి. 13

క. నను బోఁటిబోటు దునుమం గా, దని పలుకఁగ నేర్పు నీకు - నంత గలదె య
ట్లును గాక వినుము కర్ణుం, డనుమా నొకశరము దొడుగు - నే పరులు నగన్.

వ. అని పలికి కలుషం బగుచిత్తంబుతో నెలుం గెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తంచు నేసిన. 15

క. పలుదెస మంటలు ప్రబ్బఁగ, నలఘుస్ఫురణమున నిగుడు - నయ్యస్త్రంబున్
జలజాక్షుఁడు గని పంచాం, గుళమాత్రము రథము ధరణిఁ - గ్రుంగ నదుముడున్.

క. సురగరుడఖచరవిద్యా, ధర ఖేచరు లంబరం బు - దాత్తధ్వనిసం
భరితముగఁ బొగడి రమ్మర, హరు దివ్యప్రసవవిరచి - తార్చనలొడన్. 17

మ. కురువంశోత్తమ వారిదిక్కుప్రజ సం - క్షోభింప నప్పాఁపతూ
పు రయం బుగ్రము గాఁగ బి ట్టడరి దం - భోళిప్రభగ్నక్షమా
ధరశృంగాకృతి గా హరించె బహుర - త్నస్ఫీతరశ్మిచ్ఛటా
స్ఫురితం బైనకిరీటమున్ విజయునా - ప్పం దేజముం గుందఁగన్ 18

# 28. కర్ణచక్రము భూమియందుఁ గ్రుంగుట–కర్ణవధ.

(కర్ణపర్వము. ఆ. III.)

ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు - నర్జునుఁ డుజ్జ్వలవత్సదంష్ట్రకాం
డమ్ములు పెక్కు సత్వరదృ - ఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనము - నాతని తేరును గూడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము - గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్ 1

వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నప్పుడు. 2

ఉ. నెత్తుటఁ దోఁగి మేను కమ - నీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ - భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరు - ణోజ్జ్వలమండలకాంతిపూరము
నొత్తిపుదీప్తులుం దగ ని - నుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్. 3

వ. ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ బోలివోనిబంటుతనంబున జంటమెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబులు రేణువులు గాఁ జేయుచుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె అయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున. 4

భూసురశాపంబున నిదె, యీసూతజురథముచక్ర - మిలఁ గ్రుంగెడు వీ
తాసుఁ డగు నీతఁ డని నే, నాసముదయయుగ్మకము వి - నం బలికె నృపా 5

వ. పరశురాముదత్తం బయినభార్గవాస్త్రం బనుపేరిటిమహనీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింప కుండె దాపటికల్లు గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె అట్లు జామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబునకు వైకల్యం బాపాదించి చిక్కువఱచుటయును సర్పముఖశరం బాభంగి నిష్ఫలప్రయత్నం బగుటయును దనమనంబున నొవ్వడెరి యక్కర్ణుండు గరంబులు విదుర్చుచు. 6

తే. ధర్మవాదులు ధర్మత - త్త్వప్రధాన, చిత్తు లగువారిఁ బూని ర - క్షించు ధర్మ
మందు రది బొంకు గావించె - నతులధర్మ, శీలుఁ డగునన్ను ధర్మువు - సెలవు లేద.

క. అని ధర్మంబును దూఱంగఁ, దను నర్జునుబాణవితతి - దద్దయువడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదం, బున వెండియుఁ బెద్ద దూఱు - భూవరముఖ్యా. 8

క. కన లధిక మైన లావె, క్కినయయ్యంగపతి నొంచెఁ - గృష్ణార్జునులన్
సునిశితశరములు మఱియుం, జొనిపెను దనధైర్యమహిమ - సురల గ్గింపన్. 9

వ అలిగి యర్జునుం డాశీవిషంబులుం బోనివిశిఖంబు లాఱు కర్ణుమే నుచ్చి చన నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నవ్వా ర్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన. 10

క అమితబలం బగుబ్రహ్మా, స్త్రము చే నయ్యస్త్ర మపహ్ను - తం బగుటయుఁ జి
త్తమున విషాదము దనుకఁగఁ, గమలాక్షుఁడు గారవమున - గాండివితోడన్ 11

వ. నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచేత విధ్వస్తం బయ్యె నిట్లు గా నేల యనవుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయసాధనంబు బాధితంబు సేసి రాధే యాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటిమగండు గాండీవంబు మౌర్వికోటిఁ బాసి పో నేసిన నాసవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగి డించిన రయంబున నానూతపుత్రుచూడ్కి కమ్మౌర్వి యూడుట దోఁప కుండె నవ్వీరుండు వివ్వచ్చువిశిఖంబులు వారించి యతని నొంచిన వెండియుఁ బుండరీ కాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి 12

క. నిను నొంచువాఁడె కర్ణుం, డనితరసులభప్రకార - మగుభుజవీర్యం
బున నసమానోజ్జ్వలతే, లనమునఁ దెగటార్చు శరవి - లాసనిరూఢా 13

వ. అనునప్పుడు విషవిస్ఫురద్భుజంగభంగికం బైనబాణంబు రౌద్రమంత్రసహితంబు నేసి కర్ణుండు పార్థప్రాణంబులు గొన నప్పళించి సంధింప మున్న కొండొక క్రుంగినచక్రంబు కుండ మునుంగం దిగఁబడిన నొడ్డగెడ వై యరదం బేటునకు నను వీక తక్కిన నుక్కఱి యక్కర్ణుం డప్రతీకారంబు లగురోషవిషాదంబులఁ గన్నీ రొలుక రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుంగొనుచు ని ట్లనియె. 14

సీ అరదంబుచక్రంబు - ధరఁ జాలఁ గ్రుంగిన, నెత్తెద నంతకు - నేయ కుండు
మేను భూమిస్థుఁడ - నీవు రథస్థుండ, వియ్యెడఁ దగ వగు - నేయ కునికి
విరిదలవానిని - విరథుని నాయుధం, బిడినవానిని శూరు - లేయ రెందు
మహిని శూరుఁడ వను - మాత్రగా దుత్తమ, కులుఁడవు రణధర్మ - కోవిదుండ
విట్టి నీవు దగిన - యట్టిభంగిన యని, నేయ వలయు నిట్లు - సెప్ప వెల్లఁ
బాడి యేర్పడంగఁ - బలుకుట గాని గో, విందునకును నీకు - వెఱచి కాదు. 15

వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె. 16

క. ఏమీ తగవును ధర్మము, నీమనమున నేఁడ పుట్టె - నే గర్వము ను
ద్దామదురభిమానము నే, లా మఱచితి కర్ణ యాచ - లం బెట వోయెన్ 17

ఆ. పరమధర్మపరులు - పాండుభూవల్లభ, సుతులు వారి నతుల - శుభము లొందు
ధర్మహీను లైన - ధార్తరాష్ట్రులకుఁ బా, టిల్లు నివ్విధమున - నెల్లచేటు 18

వ. దీనికి నీవు కటకటంబడినం బోవునే యని పలికి వెండియు 19

సీ. గొంతియు నందఱు - గొడుకులు సుప్తులై, యుండంగ లక్కయిల్ - మండఁ జేసి
కపటంపుజూదంబు - ఘటియించి ధర్మాత్ముఁ, డగుధర్మసుతుసిరి - యపహరించి
యంతఁ బోవక ద్రుప - దాత్మజఁ దెచ్చి స, భాస్థలి నమ్మయి - భంగపఱిచి
యమ్మహాత్ములఁ జంప - నడవికి ఘోషయా, త్రావిధినెపమున - దాడి వెట్టి
బాలు నభిమన్యు నొక్కని - బహురథికులఁ
బనిచి చంపించె మీసుయో - ధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాది - కర్త వీవ
యిన్నియెడలను నీపాడి - యెందుఁ బోయె. 20

వ. అని యిట్లు కృష్ణుండు గర్ణుతో నాడుమాటలఁ దోడ్తోడం బెరిఁగినయద్ధనంజయు మనంబురోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలారూపంబుల వెడలుట యతివిస్మయప్రదం బై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్రపరాక్రమంబునం గురియుపటుబాణాసారంబు వారించి యవ్వీరునంగంబున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతం బయ్యె నత్తెఱంగున నీడంబోక పెనంగునతం డతిరయంబున నన్నరునిం బదిదొడ్డనారసంబుల నొప్పించిన నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుం బోలె మండి శత్రుసంత్రాసనంబును మిత్త్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతిపాత్రంబును హస్తికక్ష్యాత్మకంబును నగునతనికేతనంబు గనకపుంఖప్రభాభాసితం బైనభల్లంబునఁ బడ నేసినం గౌరవులు నిజయశోబలదర్పప్రియంబుల మొత్తంబులు వడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయుని దెస నిరాశు లైరి అట్లు ప్రస్ఫీతకేతుపాతనం బాచరించిన దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు కృష్ణార్జునులమీఁదం గురిసి వెగడుపఱిచి యరదంబుపిఱిందికొమ్ముక్రిందికి మూఁపు సొనిపి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి కులపర్వతకాననసముద్రసహితం బాఱంగుళంబు లెగసె. అట్లు కర్ణుండు రథంబు నిలిపి మీఁదికిం జని యొప్పటిబాణంబు సంధింప వెండియుఁ జక్రంబు

క్రుంగినఁ గ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్తె నమరి. అయ్యవసరంబునఁ గృష్ణుఁడనువునం
గ్రీడి దోడన. 21

మ. కులిశప్రస్ఫురణాపహాసనవిభా - గుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమై వచ్చుకృతాంతవక్త్ర మన ను - గ్రం బై మురారాతిరు
ద్రులచక్రంబును శూలముం దెగడుచుం - గ్రూరంపు టొప్పారు నం
జలికం బై నమహాస్త్రముం దొడిచి క - ర్ణం బుబ్బునం జేయుచున్ 22

క. ఏను దపశ్చరణంబున దానంబున గురుజనాభి - తర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు - నీశర మనియెన్. 23

క అని తెగ నిండఁ దిగిచి యే, సిన నయ్యస్త్రంబు రోద - సీకుహరంబుం
దన మెఱుఁగుల నించుచు నిరు, మొనలజనుల గాఢమూర్ఛ - ముంచుచు నిగిడెన్.

చ. నినదసముద్భటస్ఫురణ - నింగి వగుల్పఁగ సర్వభూతకం
పన మగు చమ్మెయిన్ నిగిడి - పార్థివసత్తమ యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ - దోఁగుచుఁ గర్ణునియట్ల వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధ - రాధరముం దలఁపింపఁ బట్టు గన్. 25

క. చరమగిరినుండి పడియెడు, తరణికరణి సూతపుత్త్రు - తల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం, దరమును నగుకాయ మట్లు - ధరణిం బడియెన్ 26

తే. అధిప యంతన గను విచ్చి - యఖిలజనులు, గనుఁగొనంగ నయ్యుజ్జ్వల - తనువు విడిచి
చని సముద్దీప్త మైన తే - జంబు వారి, జాప్తబింబంబు సొచ్చె న - త్యద్భుతముగ 27

వ. అట్టియెడ 28

క. వినుము మహీసురుశాపము, మనుజేంద్రా సూతపుత్త్రు - మరణాంతం బై
యునికినొ రథచక్రము మే. దినిఁ గ్రుంగుట లేక తొంటి - తెఱఁగున నుండెన్

తే. వారుణాస్త్రజాలాంశుల - వైరిసైన్య, తాప మొనరించి యానూత - తనయతరణి
పార్థదుస్తరకాలవై - భవము గడవ, ననువు లేమి నవ్విధమున - నస్తమించె 30

# 29. దుర్యోధనుఁడు ద్వైపాయనం బనుమడుఁగున డాఁగియుండుట.

(శల్యపర్వము. ఆ. I, II.)

క. పలపలనిమూఁకలోఁ గాల్, నిలువక గుఱ్ఱంబు డిగ్గి - నీకొడుకు గదా
కలితభుజుం డై యొక్కఁడుఁ, దొలఁగి చనియె నేమి సెప్ప - దుం గురునాథా 1

సీ. ఏకాదశాక్షౌహి - ణీశుఁ డై పెంపునఁ, బొంపిరివోవున - ప్పుడమితేఁడు
వెనుక నొక్కరుఁడును - జన లేక యేకాకి, యై పోయె నచటికి - వనతిదూర
మై యుత్తరము ముట్టి - నట్టితూర్పున నొక్క, మడు వున్నగానిలో - నడఁగియుండు
వాఁడుగా నట్టు ల - వ్వలనికిఁ జని చని, విదురునిమాటలు - మదిఁ దలంచి
యధిక మతిన్నృపాలు - ననుజుఁడు సెప్పె న, ట్లకట దానిఁ గొనన - యనుచు శోక
తప్తచిత్తుఁ డయ్యె - దైవ మెవ్వరి నెట్లు, సేయఁ జాల దేమి - సెప్పఁ గలదు 2

వ. అట్టియెడ సుడిసి చిక్కిన మూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషంబుగా సమయించి కృష్ణసారథికంబును ధవళహయంబును గపికేతనంబును నగునుజ్జ్వల స్యందనంబున నప్పురందరనందనుండు బంధుమిత్రాభినందితుం డై యొప్పె. అప్పుడు పాలికలన నీబలం బఖిలంబును బెనుగాలిం బడినపేరడవిపగిదిం గానంబడుచుండె. అందుఁ గృపాశ్వత్థామకృతవర్మలు మువ్వురు బ్రదికి పోయిరి. ఆసమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుంగొని నగుచు సాత్యకి నుద్దేశించి. 3

తే. వీని నేటికిఁ బట్టితి - వీఁడు బ్రదికి, యిచట వర్తించి మనకు నె - గ్గేమి సేయు
నప్రయోజన మిది విడు-మనిన నేల, విడుతు నీద్రోహితల దెగ-నడుతు ననుచు.

వ. ఆశైనేయుండు వాలు వెటికి త్రేయం జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధి చేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు ముందల విడువుమని యానతిచ్చిన నతండును వినతుం డై యట్ల కాక యని పలికి నన్ను విడిచె. కృష్ణద్వైపాయనుండు మదీయాననం బాలోకించి బ్రదికి పోయి తెక్కడకైనం బొమ్మనుటయు నమ్మునీంద్రు వీడ్కొంటి. అంత నతఁ డంతర్ధానంబు సేసె. నేను దత్ప్రదేశంబు వాసి నీసుతుండు సనినచక్కటికిఁ గ్రోశమాత్రంబు వోయి ద్వైపాయనం బనం బ్రసిద్ధం బైనయమ్మడువుసమీపంబున. 5

తే. అతనిఁ గాంచితి నతఁ డశ్రు-లడర నడలు, చూడ్కి నామోము చక్కఁగాఁ-జూడ కోర
వోవఁ జూచుచు దీనతఁ-బొంది యునికి, గని మనంబున శోకంబు-గదుర నేను. 6

వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూరకుండి యెట్టకేల కెలుంగు దెచ్చుకొని పారాశర్యప్రసాదంబున బ్రదికినతెఱంగు సెప్పిన నమ్మహీకాంతుండును గొంతప్రొద్దు నిశ్చేష్టితుం డై యుండి పదంపడి నాదెసఁ జూచి మనదెస బ్రదికినవారు గలరే యనినఁ గృపాచార్యాదిరథిక త్రయంబును బేరుకొని వారలు బ్రతికిపోయిరి తక్కొరుండును బ్రదుకుట లే దని యెఱింగించిన నిట్టూర్పు నిగిడించుచు నామూఁపుపైఁ జే యిడి యన్నరనాథుండు నన్ను నీకడ కనుపం దలంచి నాతోని ట్లనియె. 7

తే. మాఱుమానిసి లేకుండ-మడిసి రెల్ల, వారు నీదెసఁ బాండుభూ-వరతనూజు
లాప్తులుం దామునున్న వా-రాహవమునఁ, బడక తొలఁగితిఁ బోటులఁ-బడియు నేను.

వ. అని. 9

క. కౌంతేయులబారిం బడ, నింతియ సిరి చాలు రాజ్య-మెల్లను దా రై
పొంత ననుఁ బెట్టుకొని యొక, కొంత యొసఁగరేని నట్టి-కూ డేమిటికిన్. 10

క. అనుజులఁ దనుజుల మత్సరి, జనులను సమయించి వారు-సమరోల్లాసం
బున మెఱయఁ జూడ నేర్తునె, జననాథున కింతవట్టు-సంజయ చెపుమా. 11

క. ఇమ్మడువులోన డాఁగెద, నిమ్ముల నెచ్చటికి నైన-నేగదఁ దగువృ
త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి, యెమ్మెయి నేనియును దీర్తు-నేఁ బగ యనుమీ

వ. అని చెప్పి యమ్మడుఁవు సొచ్చి మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁకకుండ సంస్తంభనంబు సేసికొని యుండె. అంత రథ్యంబులు పరిశ్రాంతి నొంది తూఁగాడ నస్త్రశస్త్రాదిక్షతంబు లగునవయవంబులతోడ రాజదర్శనవిషణ్ణు లగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ లచ్చట మెలఁగి డబ్బాటుగా నన్నుం గని సంజయా బ్రదికితే యని పలికి కురుపతి ప్రాణంబులం గలఁడే యని యడిగిన నజ్జననాథుఁ డొక్కండును బాఱుతెంచి నీరిలో డాఁగి యున్న తెఱం గెఱింగించి యా హ్రదంబు సూపి యే మిరువురము నొండొరులతో నాడిన మాటలు దేటపడం జెప్పిన వారలత్యంతవిషాదంబు నొంది. 13

చ. నరవరుఁ డేము సంగరము-నం బడ కున్కి యెఱుంగఁ డక్కటా
బరవస మేది వచ్చెఁ బిద-పన్ వినియున్ మముఁ గూర్చికోలు దు
స్తర మనుబుద్ధి నిప్పటికి-శత్రులక న్మోఱఁగం దలంచి యీ
వెరవున డాఁగె సర్వపృథి-వీపతి గుర్దశ నిట్లు పొందునే. 14

వ. అవ్విభుండు పెనుఁబ్రాఁపై నిలిచిన నేము పగతురతోడం బెనంగం జాలుదుమను సమయంబున విజయవిజృంభితు లగుపాండవులు సబలంబుగా నచ్చేరువ నడతెంచిన నారథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి ననుఁ గృపాచార్యరథంబుమీఁద నిడికొని మనశిబిరంబున కరిగి రందు. 15

చ. కలఁగొనఁ బాఱుచుఁ సతులు - గన్నుల నశ్రుజలంబు లొల్క వీఁ
పులపయి పెన్నెఱుల్ విరియఁ - బొడ్మఁగ లాలలఁ రోదనధ్వనుల్
సెలఁగఁగ మోములుం దలలుఁ - జేతులుఁ గెంపుగ మోఁదికొంచు భ
ర్తల సహజన్ములఁ సుతులఁ - దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్. 16

వ. హతశేషు లైనపతాకాతపత్రచామరభృదాదిజనంబులవలన సకలజనసంక్షయంబు వినుచు నేలం బడి పొరలుచు లేచు చునికి యత్యంతకరుణం బై యుండె. అప్పుడు మాన్యవనితాజనంబులకావలివారునుం గడంగి వారలం దగినవాహనంబులపై నిడికొని యిక్కడకు వచ్చిరి తక్కినభీతజనంబులు పలుదెసలం బాఱిరి. అట్టియెడ నీకొడుకు యుయుత్సుండు శోకసంతప్తచిత్తుం డై. 17

శా. గంగానందనుఁ డాది గాఁగఁ గురుసం - ఘం బెల్ల సంగ్రామధా
త్రిం గూలెం బతి యొక్కరుండు పటుకాం - తేయప్రతాపంబు పే
ర్తిం గీడ్పాటున కోర్చి పాఱె విధి నా - మేఁ బ్రాణముల్ నిల్పె నా
కుం గాంతాజనులం దగంగఁ బురికిం - గొం చేగు టర్హం బగున్ 18

వ. ఏకాదశాక్షౌహిణీభర్త మన్నించుమానవతులు గాసి యగుదురే యని మనంబునం దలపోసి రథంబు డిగి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు నెఱింగించిన నప్పాండవాగ్రజుండు పరమకృపాపరుండు గావునఁ బ్రీతుం డై శౌరి యాననం బాలోకించి యది మేల కాదె యని పలికి యతం డనుమతి సేయ నవ్వైశ్యాపుత్త్రుఁ బరిరంభణంబు సేసి లెస్సతలంపు తలంచి తని సంభావించి వీడుకొలిపిన నతండు రథారూఢుం డై రథ్యంబులఁ ద్వరితగతి నడపి భూపతి ప్రేయసీజనంబుల కధ్యక్షు లగువృద్ధకంచుకులం గలసి వారును దానును వారల నుచితప్రకారంబులఁ దేర్చి పురంబు ప్రవేశించె . . . . . . . . . అంతఁ గౌరవశిబిరంబునకుఁ గొంతేయులు సైన్యంబును దారును సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగుదెంచుకలకలంబు వీతెంచిన. 19

క. కృతవర్మయుఁ గృపుఁడును గురు, సుతుఁడును గనుఁగొనుచు నొండు-చోటికిఁ జని ర
ట్లతిరభసంబునఁ గుంతీ, సుతు లచటికి వచ్చి నీదు - సుతుఁ బలుగడలన్. 20

వ. అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చనిరి. చనునప్పు డజాతశత్రుండు నీపుత్త్రునగరిలోనిజనంబులఁ గృపతోడం గనుంగొని వెలువకుండుం డని పలికి చనిరయ. అట్లు వారు నిజశిబిరంబునకుం జనుటయు మనయోధవరులు నేను మనంబున నడలు గదుర నమ్మడువుకడకుం బోయితిమి. కృపాదు లగుమువ్వురు దమ రాక యెఱింగించి యమ్మనుజపతి కి ట్లనిరి. 21

## కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం గని సంభాషించుట.

క. లెమ్ము కురునాథ కడఁగుము, మమ్ముం గొని పాండుపుత్త్ర - మథనమునకు సై
న్య మ్మదియును నీచేతఁ గృ, శ మ్మయ్యెడుఁ జుమ్ము పలదు - శంకింపంగన్ 22

వ. అట్లు కాక గెలిచి భూమి యేలుట యొండెఁ జచ్చి నాకలోకసుఖం బనుభవించుట యొండెం గాని నీయట్టివాని కిట్టితెఱంగు కర్తవ్యంబు గా దని పలికిన విని యవ్విభుండు వారల కి ట్లనియె. 23

చ. తనువు ఘనాస్త్రశస్త్రముల - తాఁకున నొప్పిని డప్పి వుట్టె నా
మనము వశంబు గా కడలె - మాటలచందము సూడ మీరు డె
స్సినయటు లున్నవార లను - జీవులు లేరు తొలంగి నేఁటిమా
త్ర నిలువుఁ డెల్లి పైకొని య - రాతుల గెల్తము లావు వచ్చినన్. 24

వ. అనవుడు నగ్గురునందనుండు. 25

ఉ. ఏ లనుమాన మేను సమ - యించెద వైరము నేఁటితోడఁ బాం
చాలుర నెల్లఁ దీవ్రశర - జాలములం బొలియించి కాని భూ
పాలక పుచ్చఁ గత్తళము - పాటిగఁ బట్టుము నాదుమాట లి
య్యాలితనంబు వాపెదఁ బ్రి - యం బొనరించెద నీకుఁ దండ్రికిన్. 26

వ. అనియె నప్పు డనిలసుతునివేఁటకాఁడులు మాంసభారంబులతోడఁ బరిశ్రాంతులై జలపానార్థం బమ్మడువునకు వచ్చిరి. అంతకమున్న ధర్మనందనుం డొక్కఁబోయం బొడగని దుర్యోధనుండు దొలఁగెం జెట్టుచేమల నడంగి యుండునో మీరు మెలంగునెడల నరయ వలయు ననిన వాఁడును వృకోదరునిమృగయులలోనివాఁ డగుటఁ దమవారికి నెదురు వోయి యమ్మాటతెఱం గెఱిఁగించుటంజేసి యప్పని మనంబులం దున్నట్టియాబోయ లట్లు కొలన నేమరి సల్లాపంబులు సేయుచు చున్న యన్నరనాథునియారథికవరులవచనంబులు విని పూర్వాభ్యాసంబువలన నయ్యె

క్తిప్రత్యుక్తులపరిపాటి దేటపడిన నన్నిటిలో నీకొడుకు డాఁగియుంట నిశ్చయించి తమలో మెల్లన యి ట్లనిరి. 27

క. ఈరథికులు తను నిమ్మెయిఁ, బోరికిఁ దఱుమంగఁ దాను - బురికొన కిచటం
గౌరవపతి డాఁగినగతి, బోరనఁ జని చెప్పవలయు - భూనాథునకున్. 28

తే. అతఁడుపసదన మొసఁగుమా-రుతతనయుని, మున్నుగని మెచ్చుపడయుద మన్నరేంద్రు
నతఁడ కాన్పించుమనల రే-యమునఁ బోవ, వలయు మాంసభారంబులు-వలదు లెండు.

వ. అని మోపులు డిగవిడిచి వేసం బాఱిరి అయ్యవసరంబునఁ బాండునందనులు నీనందను వెదక ననేకచారులం బొలికలనికెలంకులకుం బుచ్చి యాతండు తమ కగపడమికిఁ జింతాక్రాంతు లై యుండ నాబోయలు భీమునిపణిహారులఁ ద్రోచికొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాచి యమ్మదువున నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి. 30

క. తమవిన్నమాట లన్నియుఁ, గ్రమమునఁ జెప్పిన నతండు - గడుఁబ్రియమున న
ర్థములొసఁగె వారికి ననే, కములు వహింపంగఁ గొలఁది - గా కుండంగన్. 31

వ. ఒసంగి యాలుబ్ధకుల నగ్రజుఁ గానిపించి దేవా దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబున నొక్కక్షుద్రవిద్యం జేసి జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లుగాఁ జేసికొని డాఁగియున్నవాఁడు వీ రెఱింగి వచ్చి రని యతనికి విన్నవించి యాసుయోధనగురునందనాదులసల్లాపంబు లెఱిఁగించిన నతండు పరమహర్షంబున నాబోయలకు బహువిధంబు లగు పసదనంబు లిచ్చి తక్కినతమ్ములకును గృష్ణునకును జెప్పికొని వారును సకలబంధుమిత్రపరిజనంబులును దోడన చనుదేర నుద్దామగమనంబున. 32

తే. తురగఖురపుటరథనేమి - కరిపదాతి, ఘట్టనంబుల నేల గ్ర-క్కదల శంఖ
పణవనిస్సాణకాహల - రణన మెల్ల, దెసలఁ బరఁగంగ వచ్చె న - ద్దెసకు నధిప. 33

వ. అట్లు ధర్మనందనుం డేతెంచుకలకలం బాలకించి యంతకు మున్న రణోత్సాహంబునకై రాజు నిర్బంధించు చున్నయగ్గురుపుత్రకృపకృతవర్ము లతనితో ని ట్లనిరి. 34

మ. ధరణీనాయక పాండుపుత్రులు సము - ద్దామోద్ధతిన్ వీర వ
చ్చిరి వీరిన్ వడిఁ గిట్టి తాఁకుదము నీ - చిత్తంబు పోరాటకుం
జొరదే నిప్పటికిం దొలంగి చని రేయి - చ్చొచ్చైన నే ముండి చె
చ్చెర రూపించినవేళఁ జెప్పి నెడకుం - జేరంగ నేతెంతు మా. 35

ఆ. అనుడు నానృపాలుఁ - డరయ్యోధవరులతోఁ, నిప్పు డనికి నుత్స - హింప కిచటి
కేనిఁ దొలఁగిపోయి - యిచటికి మగుడంగ, రండు పగలు సనిన రాత్రి - యగుడు.

వ. వారు వారణపురంబున కనివారణఁ బోయెదరు వోదురుగాక యిచ్చేరువఁ బోయి
రేనియు నిమ్మడువున నాయునికి యెఱుంగలే రట్లు గాక యెఱింగిరేనియు నన్నుఁ
జేరరాదు మదీయవిద్యావిశేషసంస్తంభితాంభోదుర్గంబున నిర్భయుండనై యుండెదఁ
బొం డనినం బొగులుమనంబులతోడ నారథికజనంబులు వోవం బతి జలంబులు
శిలాసదృశంబులు గాఁ బరిస్తంభించె. నేనును బాండుసూనులచారు లెల్లకడల
మెలంగుటంజేసి రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గాదనియు నతనితో
యస్తంభనవైదగ్ధ్యం బెఱుంగుట నొలసినయూఱటను ముందటియట్ల వారలతోడం
జని చని చిత్తంబు గలంగినం జనం జాలక యరదంబు డిగ్గి యచ్చట నొక్కయెడ
నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడువునఱుత నొక్కపఱపు గలపొద
యూఱమిం దూఱి పొంచియుండితి. వారలు దూరంబు సని యొక్కవిపులవటంబు
పొంత విశ్రాంతి నొంది నీనందనువలనికిం జనినహృదయంబులతోఁ దదీయకార్య
చింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధసంభాషణంబులు సేయుచుండిరి. అక్కడ. 37

క. కలకల నవ్వుచుఁ బెలుచం, బలుకుచుఁ దమకెలఁకులందుఁ - బాంచాలకుమా
రులు సనుదేరఁగఁ బాండుసు, తులు వచ్చిరి సంతసంబు - తో మడువునకున్. 38

వ. ఇట్లు వచ్చి ధర్మతనయుండు భవత్తనయమాయాస్తంభితం బైనయాజలాశయంబు
నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన ని ట్లనియె. 39

క. వీర గాదు మనుజులకు నె, వ్వరికిని నిజ్జలము కౌర - వక్షితిపతిని
ర్భరమాయాసంరక్షా, భరితం బై కాన వీత - భయుఁ డాతండున్. 40

## ధర్మరాజు మడుఁగున డాఁగియున్న దుర్యోధనుని దూఱనాడుట.

క. అని వెండియు నాపతి గురు, జననాథుగుఱించి పలుకు - శక్రుఁడు దో డై
చనుదెంచెనేనిఁ బో వ, చ్చునె నాచేఁ దప్పి యిందుఁ - జొచ్చినఁ దనకున్. 41

వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున ని ట్లనియె. 42

ఉ. మాయలు గల్గుదుష్టులకు - మాయపుభంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడుప - రాక్రమలీలలు గొల్చు నెట్లు దై
తేయులు దొల్లి మాయల న - తిప్రబలాత్మకు లైనఁ దద్వధో
పాయములన్ జయింపరె నృ - పాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్. 43

వ. హిరణ్యకశిపుపుత్త్రవధప్రకారంబులు వినమె రావణుండు హేమాద్యమాయాక్రి
యావిఘాతంబునఁ గాదె రాముచేత నిర్జింపంబడె నరకాసురుఁ డేను బరిమార్చిన
తెఱం గెఱుంగవె వీఁ డగపడునట్టివిధంబు సూచికొమ్మనిన విని యప్పాండవాగ్ర
జుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యి ట్లనియె. 44

చ. ఇటు తగునే సుయోధన మ - హీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట వినఁ జూడఁ గల్గెనె య - సంఖ్యులు రాజులు నీకుఁ గాఁగఁ జ
చ్చుటయును బంధుమిత్త్రులు వి - శుద్ధచరిత్త్రులు పోర నట్లు త్రుం
గుటయును జూచి నేమిటికిఁ - గ్రుంకితి నీళ్లను జావు దప్పునే. 45

ఉ. శూరుఁడ వంద్రు నిన్ మనువు - సొచ్చుట శౌర్యముచొప్పె మాన మే
యూరికిఁ బోయె నాజి నృపు - లోడుదురే నృపుఁ డన్నమాత్త్రయే
కౌరవవంశజాతుఁడవు - గష్టపుఁ జచ్చుట దెచ్చుకొంటి నీ
పేరును బెంపు మాలి యరి - బృందము నవ్వఁగ నిట్లు సేయుదే. 46

తే. క్షత్త్రధర్మంబు విడిచినఁ - గలదె యిహముఁ, బరముఁ జేకోలగంబునఁ - బలుకుపలుకు
లెల్ల మఱచితె వినుమవి - పొల్లు లైనఁ, గష్టపాటు గాకుసు తేల - గావ వచ్చు.

చ. కొడుకులుఁ దమ్ములుం గలుగు - ఘోరపుఁజావులు సావఁ జూచి యె
ట్లోడఁబడె నీదుబుద్ధి యొకొ - లోముట కై నిను రాజరాజ యి
మ్మడువున కీడ్చి తెచ్చె విధి - మానము ప్రాణముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా వినవొ - కో కడునీచతఁ బొంది తక్కటా. 48

శా. అంభోగర్భము సొచ్చి పాండుసుతబా - హాగర్వదుర్వారసం
రంభం బోర్వక డాఁగి యుండెనట రా - రా జిస్సిరో వచ్చుచో
గాంభీర్యంబును ధైర్యమున్ విడిచి దో - ర్గర్వంబు బెం డయ్యెనే
శుంభస్నానము దూలెఁ గా కని జను - స్తోమంబు నిందింపదే. 49

తే. కర్ణశకునిదుశ్శాసనుల్ - ఘనులు గాఁగఁ, దలఁచివారలఁగొని మమ్ము - గెలుచువాఁడ
వై మనంబున శంకింప - కట్లు కీడు, చేసి తాపూఁపు దప్పిన - గాసి యైతి 50

వ. నీకొలంది గంటి మగపడితి వింక నెందుఁ బోవచ్చు నని మఱియు ని ట్లనియె. 51

మ. భయముం బాయఁగఁ ద్రోచి వీరగుణముం - బాటించి సంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషము మైఁ - జా వొండె గె ల్పొండెఁ గా
క యధీరత్వము నాకు నీడె యని వీఁ - కం బేర్చి వే తాఁకు మెం
తయుఁ బేరయ్యెడు రమ్ము లె మ్మిదిఁగినన్ - దైన్యమ్ము వచ్చుం జుమీ. 52

చ. అని మము నోర్చినం బృథివి - యంతయు నేలఁగ నిచ్చు లేక చ
చ్చిన సురసద్మసౌఖ్యములు - చేకుఱు రెంటఁ దెఱంగులందు నొ
ప్పనియది లేదు డాఁగ నగుఁ - బాటును బ్రాణముచేటుఁ దెచ్చుకో
వివు మము నీ వెఱవ్వ దగు - వేఱువిధంబులఁ జాటి చెప్పెదన్. 53

వ. తెంపు సేసి మామీఁద నుఱుకుట నీకు ధాత నిర్మించినపరమధర్మంబు పురుషుండ
వైతేని దీని ననుష్ఠింపు మనిన విని యవ్వసుమతీశునకు సుయోధనుం డిట్లనియె.

## దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట.

సీ. నరుఁడు ప్రాణభయంబుఁ-బొరయుట యరుదయ్యె, వినుము తెల్లంబుగా-మనుజనాథ
రథవాహసారథి - రహితుఁడ నగుటను, బాణాదిహేతిసం - పదలు లేమిఁ
బరివారశూన్యత - వాటిల్లుటను బంధు, మిత్రసహాయుల - మ్రోయి నడంగఁ
జచ్చుటఁ బోటుల - నొచ్చి మేనును డప్పి, గూరి చిత్తంబును - బోరి కెలయ
కునికిఁజేసియుఁ దొలఁగితి - నొదిఁగి సేద, దేర్చుకొని రణమునకు ను - దీర్ణవృత్తి
వచ్చువాఁడను నీవు మీ - వారు విశ్ర, మింపుఁ డంతకు మఱిరండు - సొంపు సూప.

వ. అని పలికినఁ బాండవాగ్రజుండు 56

క. ఇందాఁక విశ్రమించితి, మిందు నినుం దడవి కంటి - మిప్పు డిచట నీ
కుం దెఱ డప్పి కురుపతి, నందన ర మ్మింక రణము - నకు నాయిత మై 57

వ. అనుటయు. 58

తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు - నెల్లభోగ, ములునుగోరుదుఁరక్కమా - రులును నాదు
తమ్ములును లేరు తురగర - థద్విపప్ర, హీన యయ్యె నీక్షోణియు నేల పెనఁగ 59

చ. ద్రుపదతనూజులన్ గెలిచి - దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపజితదర్పహీను లగు - నట్లు గఁ జేసి సమస్తభూపతి
త్వపదము గంటి నేనియు వృ - థారభసం బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్ముఁ లేమిని గు - రుండు మృతుం డగుటన్ ధరాధిపా. 60

క. తనవారుఁ దానుఁ గూడఁగ, ననుభవసుఖ మందఁ డేని - నది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు, ననుజన్ములు బ్రదికి యేలు - మఖిలధరిత్రిన్. 61

క. ఏ నింక సమర మొల్ల మ, హీనాయక నీక యుర్వి - నిచ్చితి శాంతిం
గానకుఁ జని వల్కలధరి, ధానుఁడ నై తప మొనర్చె - దను మునులకడన్. 62

ఆ. ఓడి వచ్చినాఁడ - నుద్ధతి నా కేల, యుద్ధము మాని నీవ - యుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁ - గులు లేనిబయలు నీ, తలకు కట్టికొనుము - ధర్మతనయ. 63

చ. అన విని యన్నరేశ్వరుఁడు - హాసముతో నతనింగుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృ - దాప్తసహాయులు సన్నఁ గాదె శ
ల్యనిఁ గొని మమ్ము గెల్చి సక - లోర్వియు నేఁకుట కుత్సహించి తీ
పనవుట లేల మాను మిది - పాటిగఁ బట్టుము లెమ్ము పోరికిన్. 64

సీ. నీయాగి నేను భూ - నాయకుఁ డగు టొల్ల, రాజకోటికిఁ బరి - గ్రహము సనునె
నిను ననిం దెగటార్చి - నేలఁ బాలించెద, నను నోర్చితేని బెం - పున సుఖింపు
మేమిటివాఁడ వై - యిచ్చితి పుడమి నీ, కనియెదుమాట యి - ట్లాడె దిపుడు
నీవు ధరిత్రి యీ - నేర్చినఁ గురుకులం, బునకు ని ట్లాఁబడి - పోవ నేల
శాంతి నొందుటకై ధర్మ - సంవిభాగ, కరణ మొనరింప వచ్చిన - కమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక - వాఁడిసూది, మోపినం తైన నుర్వి యీ - నోప నంటి.

క. ఏమివిధంబునఁ బోరలియు, భూమి కురునృపాల నీకుఁ - బుచ్చుకొనఁగ రా
కీమెయి దైన్యపడితి నా, కేమార్గము పట్టి యిచ్చె - దేర్పడఁ జెపుమా. 66

క. అరులకు సిరి యిచ్చెద నను, వెరవిఁడియుం గలఁడె దీని - విడువుము నాకుం
ధర యిచ్చి తేనియును నినుఁ, బోరిగొన కే విడువ నటేమి - పోరుట యొప్పున్. 67

క. నాచే నీప్రాణంబులు, నీచే నాజీవితంబు - నిజ మున్నవి యి
న్నీచత యవకార్యము రా, జోచితకర్తకృతనిశ్చ - యుఁడ వగుము నృపా. 68

వ. అని వెండియు ని ట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్నికపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే యింక నట్ల యిమ్మాయలం బ్రయోజనంబు లేదు. 69

క. శేలెమ్ము బిరుదవై ర, మ్మాలమునకు నీవు నెఱుఁగు - దవ్విధము కదుం
మే లొందు తెరువు లే దిం, కేల యొదిఁగి కష్టపడ న - రేశ్వర చెపుమా. 70

వ. అని యివ్విధంబున నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవారు నట్ల పలికి రనిన విని ధృతరాష్ట్రుండు. 71

తే. ఇట్లు జంకింపఁబడి మఱి-యేమి సేసె, నాతనూజుండు మున్ను నె-న్నఁడునుజంకఁ
బడినవాఁడుగాఁ డక్కట-పుడమినాల్గు, చెఱఁగులును వెఱఁ దనపంపు-సేయఁబ్రదికె

క. పరిజనహీనత దీనతఁ, బోరసినయెడ ముట్టుకొని రి - పుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల నమ్మెయిఁ, బరితాపము సేయ నేమి - భంగి నిలిచెనో. 73

వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కి ట్లనియె. అట్లు ధర్మతనయుండును దమ్ములుఁ గొడుకులును ద్రుపదపుత్త్రులును బొదివికొని పలుకుపలుకులకుఁ జిత్తం బుత్తలపడ

నాననంబు పల్లటిల్లఁ గరంబులు విదిర్చి దురం బొనర్చువాఁడై యప్పాండవాగ్రజున
కి ట్లనియె. 74

సీ. మీ రేవురును బరి - వారబాంధవమిత్ర, సహితుల రఖిలాస్త్ర - శస్త్రవంతు
లరు కరిస్యందన - తురగసమేతుల, రే నొకరుండ వి - హీనసహచ
రత్వంబు విగతాయు - ధత్వంబు వాహన, హీనత నొందితి - నేవిధమున
నని యొనర్పఁగ వచ్చు - నది గాక పోటుల, డస్సితిఁ గడు మీకు - డప్పి లేదు
వరుసఁదగ నొక్కఁడొక్కఁడ-వచ్చి పోరుఁ, డిపుడ వెడలి మిమ్మందఱ-నెల్లచెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ-జుట్టుముట్టి, పలువు రొక్కనితోఁ బోరఁ-బాడియగునె

వ. అట్లు మీరు సాలరేని. 76

ఉ. తమ్ముల నిన్నుఁ గేశవుని - తమ్ముని ద్రౌపదియన్న దమ్ములం
గ్రమ్మన గీటడంచెద నొ - కండన యే నిదె వచ్చి బాహుద
ర్పమ్ముల నిర్గవారమును - భానుఁడు దోఁచి సముజ్జ్వలాత్మ తే
జమ్మున రూపుమాపుక్రియఁ - సజ్జత నిల్వుము సుస్థిరుండవై. 77

తే. వినుము నీకుఁ గృష్ణునకును - వెఱచికాదు, ముంద రే నట్టు లాడుట-యొందుఁ జెల్లు
సమరధర్మంబు తెలుఁగు దె-ల్లముగ నెల్ల, వారలకుఁ దెల్పుటకుఁగాని - వసుమతీశ. 78

వ. నేఁడు మిమ్మందఱ సమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయద్రథశకునిశల్యాదు
లగుబంధుమిత్రసహాయులఋణంబు దీర్చెద నని పలికినం బాండవాగ్రజుం డి
ట్లనియె. 79

చ. సమరముపాడి నీ వెఱిఁగి - శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ యొక్కఁడును - బూని మహాద్భుతబాహుసంపదన్
మము వడిఁ దాఁకెదం బిలుకు - మార్చెద నంట యుదాత్తమైనధై
ర్యమహిమ గాదె యి ట్లనిన - యంతన యే నలు తేల చేసెదన్. 80

చ. వలసినయస్త్రశస్త్రములు - వాహనముం గొను మొక్కరుండ నిన్
గలన జయించువాఁ డతని - గర్వము నీ వడఁగించితేని యీ
యిల సకలంబు గైకొని వ - హింపుము రాజ్యవిభూతి వాఁడు నిన్
దలపడి పోరుఁ జుట్టలును - దక్కటివారలు నిల్చి చూడఁగన్. 81

వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కి ట్లనియె. 82

చ. అరదము లెక్కి ఘోరవివి - ధాస్త్రచయంబుల మున్ను పోరమే
నరవర క్రొత్తచందముర - ణంబు కరంబు ప్రియంబు సేయు ని

ష్ఫురగదలం బదాతు లయి - శూరతయుక్ మహనీయధీర తా
స్ఫురణమునం బొగడ్త వడc - బోరుట మే లని నిశ్చయించితిన్. 83

తే. వింతకూరలు గుడుపున-వేడ్క సేయు, భంగి సంగ్రామమున నూత్న-భంగు లెడcదc
గౌతుకము సేయుc గావున-గద ధరించి, నిను సహోదరులను యోధు-లను జయింతు.

చ. అనుటయుc బొంగి ధర్మసుతుc - డాతనితో గద నొక్కరుండ నే
గొనియెద నీదుప్రాణము ల - కుంఠితబాహువిలాసభాసి నై
యనవుడుc బుట్టలోపలిమ - హాభుజగేంద్రుcడు రోcజునట్లు రోc
జె నధిప యవ్విభుండు దన - చిత్తము నవ్వులుకుల్ గలంచినన్. 85

## దుర్యోధనుcడు గదామండితుం డై హ్రదంబు వెడలి వచ్చుట.

వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగc బటుకశాఘాతంబునం గెరలుతూకలా శ్వంబుచందంబునc గెరలి జలస్తంభం బుడిపికొని మడువు సంక్షోభింప నపహ సితశిలాసారోదారంబును గనకపట్టికామండితంబును నైనగదాదండంబు విపులాంస పీఠంబున నమర్చుకొని వెడలె. అట్లు సంరంభవిజృంభితుం డై. 86

తే గదయుc దాను రుచిరశృం-గమునc బొల్చు, పర్వతము శ్రేణి సేయునీ-పట్టిc జూచి
కాలదండంబు చేకొని - లీలc బొల్చు, జమునిc గా మదిc దలcచిరి - జనము లెల్ల. 87

వ అతనిc గనుంగొని పాంచాలురును బాండవులును. 88

తే. చిఱుతనగవుతో నొండొరు - చేతు లప్ప, ళించి నిర్భరసంతోష - లీల నొప్పి
రమ్మహీనాథుc డయ్యుప-హాస మెఱిcగి, బొమలుముడివడc గనుcగవc-బొడమc గెంపు.

వ కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల నెల్ల నాలోకించి 90

క. ఈ గేలి వెలార్చెద బా, హాగర్వము మెఱయ మిమ్ము - నందఱను మహీ
భాగమునc గూల్చి నెఱపెద, నాగదబలు పెట్టు లైన - నగుc డందాcకన్. 91

తే. అనుచుc బోటులc దొరుcగురె - క్తాంబుధార, లంగమెల్లను గప్పిన - నప్పు డొప్పెc
గావిసెలయేఱు లెల్లెడc-గలయc బర్వc, బొలుచుకులపర్వతంబుచా-డ్పున నతండు.

# 30. భీమదుర్యోధనులగదాయుద్ధము.

(శల్యపర్వము. ఆ. II.)

వ. ఇట్లు ప్రీతుం డై యాతండు ధర్మనందనుం జూచి శమంతపంచకంబు ప్రజాపతి యుత్తరవేది యనఁ బ్రసిద్ధం బైనపుణ్యస్థలం బయ్యెడం బ్రధనంబున నిధనంబు నొందినవారికి సద్గతి యగుట ధ్రువం బని యిందు మెప్పటిపొలికలనికిం బోవుద మనిన నతం డాద్వైపాయనహ్రదం బాసీమలోనిది గామి యెఱుంగుం గావున నమ్మాట కియ్యకొని తదభిముఖుం డై పోవ నాదుర్యోధనుండును గదాకలనంబున నంసపీఠంబు పొలుపార మత్తగజేంద్రయానంబున నమరప్రస్థాయమానుం డగుచుఁ జన శంఖభేరీప్రముఖతూర్యస్వనంబులు సెలంగె. ఇట్లు పాండవపరివృతుం డై యచటికి నీకొడుకు నడచి యమర్షసముజ్జ్వలుం డై. 1

క. నిలిచిన సకలజనులు నెడ, గలసి బలసి నిలిచి రవుడు - గదయుఁ బసిఁడిగ
త్తళము మెఱయ నతనియెదురఁ, జెలువొందె బకారి హేమ-శిఖరియుఁ బోలెన్. 2

చ. కనుఁగొని దర్పమంథరము - గా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజ
న్మునకు వడిం బెనంగఁగ న - నుం బవనాత్మజుఁ జూచు వేడ్క ని
జ్జనతతి యంత కంత కిటు - సందడి గాఁ దనయిచ్చఁ గ్రమ్మెదం
చునొ యుపవేశనిశ్చలతఁ - జూచిన మే లఖిలప్రియంబుగన్ 3

వ. అని భూపాలుర నెల్ల నాలోకించినం బాంచాలాదు లగునయ్యందఱును ధర్మనందనుండు గూర్చుండ నియోగించి బలదేవవాసుదేవసహితంబుగఁ దాను నాసీనుం డయ్యె నమ్మహీనాథమండలంబున సితప్రభుం డైనయన్నీలాంబరుండు తారకామధ్యవర్తి యై మెఱయుమృగాంకు ననుకరించె నట్టియెడ భీమసేనుండును దుర్యోధనుండును. 4

సీ. ఆభీలగర్జన - శోభిత దేహు లై, యుద్భటవృషముల - యొప్పుఁ దాల్చి
రోషమహావిష - భీషణవదను లై, చండోరగంబుల - చంద మొంగి
మదసముజ్జృంభిత - మండితాకారు లై, భద్రద్విపంబుల - పగిదిఁ బొల్చి
చారుగదాశృంగ - సందీప్తమూర్తు లై, మహితపర్వతముల - మాడ్కి మెఱసి
వాసుదేవయుగము - వరుణద్వయంబు వై, శ్రవణయుగ్మకంబు - రామయమము
వోలె దర్శనీయ - లీల వహించి యం, భోధియుగళ మనఁగఁ - బొంగు మిగిలి. 5

వ. ఒండొరులం జూఱచుఱం జూచుచుఁ బరస్పరహృదయవిదారణంబు లగు దారుణ
భాషణంబు లెసఁగ శుంభదనష్టంభంబునం బొలిచి నిలిచి రనిన విని యాంబికే
యుండు. 6

క. తనుఁ బదునొకఁ డక్షౌహిణు, లనూనవిభవమునఁ గొలువ - నఖిలనృపులుఁ బం
చినపని సేయ నెగడునా, తనయుం డేకాకియుం బ - దాతియు నయ్యెన్. 7

తే. సకలధరణికి నాథుఁ డై సంపదలకు, నెల్ల భాజన మగుకౌర - వేంద్రుఁ డనద
తనము దోఁపంగ గదఁ జేతఁ-గొని వినిశ్చ, యమునఁబోరికినమరె నే-యక్కటకట.

వ. ఏ మనం గలదు సంజయా దైవంబ నేర్చుం గాక యని పనవి యూరక కుండె
న ట్లున్న యమ్మానవపతికి సూతసూనుం డి ట్లనియె. 9

క. నీసుతుఁడు సమరవిషయో, ల్లాసంబున నంగకంబు - లం బొం గారం
గా సుస్వరమున నాకుం, తీనూనునిఁ బిలిచె నుద్ధ - తిఁ రణమునకున్. 10

వ. అయ్యవసరంబున. 11

క. ఉర్వీవలయము వడఁ కెను, బర్వము గాకి యును రాహు - భానునిఁ బట్టెం
బర్వతము లురలె నులుకలు, సర్వదిశల నెఱచె నభము - శర్కర గురిసెన్. 12

వ. మఱియు నిర్ఘాతపాతప్రభృతిమహోత్పాతంబులు గలిగె వాని నెల్ల ననాసం
ధించి గంధవహనందనుండు గాంధారీనందనుం జూపి ధర్మనందనున కి ట్లనియె. 13

సీ. అశ్రమంబున గెల్వ నగు నాకుఁ జూపలు, గొనియాడఁ బోరాడి-కూల్చితొడలు
పాడిసేసి యిన్నిచుఁ - బొలియింతు మద్గదా, దండసముద్దండ - తావిభూతి
యవధరింపుము వీని - యాయువు దెగటాయె, నిక్కాలపాంసను - నిట్టు లేను
గదిసియుఁ గ్రమ్మఱ - గిరిపురంబునకుఁ బో, నిత్తునే ధృతరాష్ట్రుఁ - డింక వగలఁ
బొగులువాఁడు గాక - పోఁడిమితో నుండు, వాఁడె వీఁడు మనల - వాలి పలుపఁ
దొల్లి పడినపాటు - లెల్ల వెలారింతు, నధిప నీమనమున - హర్ష మెసఁగ. 14

వ. అని పలికి దుర్యోధనాభిముఖుం డై. 15

క. నెఱి మాలి వీరి నీతఁడు, పఱిచినపాటులకుఁ దగిన - ఫల మగు నని యి
త్తెఱఁగునకు నియ్యకొని చూ, పలు వొగడఁగ నిన్ను నిపుడ-పడవైచుటకున్. 16

తే. అమరి యున్నాఁడ నాబారి-కగ్గ మైతి, పడుదుగా కింక నీకు నె-క్కడకుఁ బోవ
వచ్చు ననవుడు నిది యేల-పెచ్చుపెరిఁగి, యూల మెడసేసి యనిలజ-ప్రేలె దిట్లు.

వ. అని కురువిభుండు వెండియు ని ట్లనియె. 18

క. పలుకుల వెఱపించెద వా, కొలఁదియె దుర్యోధనుం డ-కుంఠితబాహా
బలుఁ డిదె యవలీల నినుం, బొలియించెడిఁ బలుకు లుడిగి-పోరాడు ధృతిన్. 19

శా. వ్యూహాభావము నూచి న న్నసదుగా-నూహించె దో భీమ మ
ద్బాహాచండిమసారదుర్దమగదా-దండంబు దృప్యద్భవ
ద్దేహోల్లాసము సెట్టు దీనదశకుం-దే నోపునో చూడుమీ
యాహా పుట్టెను లాఁతిమాపటికు హా-హా పుట్టు మీవారికిన్. 20

ఉ. నా కదు రై పినాకియుఁ బి-నాకము పట్టక యుద్ధతిన్ గదా
భీకరవృత్తి చూపుటకుఁ-బేర్చిన నెక్కుడు వేర్చి చీరికిం
గైకొన కే పడంచి భుజ-గర్వసమున్నతి నిర్వహింతు నీ
కేకడ డాఁగ వచ్చు గద-నే నని సేయుటకుం గడంగినన్. 21

వ. అని మఱియును. 22

క. గదఁ గయ్య మెన్నఁడొకో చే, యుదు భీమునితోడ ననుచు-నుల్లంబునఁ గో
రుదు నెప్పుడు నిప్పుడు నా, కది యొదవెన్ విధికృతిం గృ-తార్థుఁడ నైతిన్. 23

వ. నీ విట చక్క నయి రమ్ము 24

చ. అన విని యెల్లవారు భవ-దాత్మజు మెచ్చి నుతించి రయ్యశో
ధనుఁ డరివీరు లట్లు ప్రథి-తంబుగఁ దన్ బొగడం బ్రమోది యై
వినుచుఁ బ్రవర్ధితం బయిన-వీరగుణంబున నుల్లసిల్లె నా
తనిపయి భీముఁ డుద్యతగ-దాస్ఫురణన్ నడచెన్ నరేశ్వరా. 25

వ. అప్పుడు కుంజరబృంహితంబులును హయహేషలునుం జెలంగె నిట్లు తనమీఁద నడచువడముడిం జూచి నీకొడు కదల్చుచు గదాసముల్లాసంబు భాసమానంబుగ వీఁక నెదుర్కొని తాఁకిన. 26

సీ. చండగదాపర-స్పరఘట్టనంబుల, మింటఁ బెల్లడరెడు-మంటగములఁ
బరమ ఘోరము లగు-పదతాడనంబుల, నొలయు వసుంధరా-చలనములను
నుద్భటక్రోధస-ముద్రేకములఁ జూడ్కు, లం దుల్లసిల్లెడు-నరుణరుచుల
దారుణధ్వను లగు-తర్జనలీలలఁ, బరఁగు పర్వతగుహా-ప్రతిరవముల
ననిమిషులదృష్టి మిఱుమిట్లు-గొనఁగ భుజగ, పతియుఁ గూర్మంబు సంకట-పడఁగ ధరణి
కిరణములు వెల్కఁ బాఱ ది-క్కరులు బెదర, నొప్పె నత్తొలితాఁకు మ-హోగ్రమగుచు.

వ. ఇట్లు తలపడి మండలప్రచారవివిధప్రకారంబులం బుడమికిం జిత్రగదాసారణ బహుభంగుల నింగికిం గ్రొత్తయై ప్పొలయుం దమలావును వేగంబును నేర్పును

దర్పంబును జూపఱకు వెఱఁగుఁ బుట్టింప నంతకంతకు నెక్కుడగు మదంబులం
బొదలెడుబాహుదండంబుల బలనైపుణంబు లగ్గింపం బేర్చుచీరంబుల నొండొరుల
సంరంభంబుల సరకుగొనక యక్కురుపాండవపుంగవులు జంభవాసవులచందంబు
నం బెనంగినం బలుదెఱంగు లైనగదాప్రహతులం దునియలుఁ బఱియలుఁ దుమురులు
నై సీసకంబులుఁ గత్తళంబులు ధరాతలంబునం దొఱంగ నట్టియెడ. 28

మ. ఒకఁ డిక్కుద్ధతిఁ బూన్చి యొండుదెస వ్రే - యన్ మేను వంచించి వ్రేఁ
తకుఁ దప్పన్ వడి వ్రేయ నొడ్డనమునం - దప్పించి వేగంబు గుం
డకు నొప్పించుఁ జలం బెలర్పఁగ గదా - దండంబు దూలించుఁ బాం
డుకుమారుం డుఱ కట్లు కౌరవవిభుం - డుం గేలి సల్పం దగన్ 29

వ. మఱియును శిక్షావిశేషంబులు వెలయ నుల్లసిల్లి. 30

మ. గదతోడన్ గద మట్టె రాఁ దిగుచుచున్ - గం డొప్ప లంఘించి మా
ఱుదెసల్ గైకొనుచుం గడంగి పలుమా - ఱుం దాఁకుచుం బాయుచుం
బదబాహాకటిమధ్యవక్షముల సం - భావ్యత్వరాచిత్రితో
న్మదనానాగతిరేఖలన్ మెఱయ భీ - మత్వోత్సుతుల్ దీప్తు లై 31

ఉ. తప్పినయప్డు వ్రేటు దముఁ - దాఁకినయప్పు డనేక భంగు లై
యొప్పులు బల్పులన్ మెఱయ - నుల్లములన్ సకలాంగకంబులం
గప్పఁ దలిర్చుకోపములఁ - గ్రమ్మెడురక్తములన్ సురవ్రజం
బప్పటి కప్డు వింత యగు - నచ్చెరు వొందఁగఁ బోరి రేపునన్ 32

వ. ఆసమయంబున. 33

సీ. వితతవీరాగ్రహా - వేశాతిదర్పిత, చిత్తు లై యొండొరు - నొత్తరించు
నుగ్రమహోద్ధతి - నుద్భటాటోపతీ, వ్రము లగుసమరవి - భ్రమము లంగ
సంగతంబులు గాఁగ - జయవాంఛ నాత్మర, క్షణములవలనినై - పుణము లెడలు
టయు ననర్గళనిరూ - ఢప్రహారంబు లం, దంద బెట్టిరువుర - యందు సూడు
పడఁగఁ దాఁకిన శోణిత - ప్రసరణంబు, నిరతిశయ మైన వెడ సోలి - నిలిచి గదలు
నామకరముల నూఁదియు - వారు మగుడఁ, బోరికెలయుట నిర్భరా - ద్భుతము సేసె.

వ. ఇట్లు ధైర్యధుర్యోత్సాహంబులం బొదలి. 35

శా. రౌద్రోల్లాసము మూర్తిసంకలనఘో - రం బై పొరిం బేర్చె నా
నుద్రిక్తం బగునూత్నరక్తమున మ - గ్నోన్మగ్నతం బొల్చె త

ర్జద్రూహోగ్రగదాయుగంబు విసర - త్సంధ్యాంబుదద్వంద్వభా
స్వద్రేఖాలలితంబు చెన్నువడఁజేసెఁ - వా రిద్దఱుం బోరఁగన్. 36

క. సుర లచ్చెరువును మెచ్చును, బిరికొనుచిత్తములతోడఁ - బెద్దయుఁ బ్రొద్దు
య్యిరువుర గెలుపోటమి తెలి[యఁ], గరసి నిరూపింప నేర - రైరి నరేంద్రా. 37

తే. అప్పు డప్పుడ తలపడి - నట్టు లప్పు, డేచి విలసిల్లు మేనుల - యొఱ్ఱచెలువు
గలయఁ బూచినవడమ్రోదు-వులఁ దలంపఁ, బట్టుగానొప్పె నధిప నీ-పట్టిదోయి.

వ. ఇవ్విధంబున నొండొరులకు వెఱ్ఱపడక యమ్మేటిమగలు సాటోపసంరంభంబులం బెనంగిరి అందు గాంధారీనందనుండు వలపలించి మట్టుకొని రా నది సరకుసేయక బకవైరి దాపలించి తిరిగినం బెరిఁగినయిారసంబున నుల్లసితుం డై యాభూవల్లభుం డతనిబరియెముక లగల వ్రేసిన నవ్వీరుం డక్కురవపతికరంబులో నగ్గద బీఱువోవ వ్రేయం బాయక మగుడం బూన్చి సారించినం దోరంపుమెఱుంగు లెసంగం జెలం గుశబ్దంబులు నింగి ముట్ట బెట్టిదంబు గఁ దా వెరవునం దిరిగి యద్ధరణీశుండు శిర స్తాడనంబు సేసె. చేసినం గౌంతేయుండు గంపింపమి యక్కజం బై యుండె. అంత నగ్గలం బగునలుక నవ్వడముడి పుడమి ఱేని వెడఁదయురం బుపలక్షించి లాఘవఘోరంబు గ గదాదండంబు ద్రిప్పి వైవ నాతం డది మేనినుసులునం దప్పింప నది యిల చలింపం బడిన సన్నుసులు తెఱపిన యుటికి యద్భుతవేగుం డగున వ్వాయుపుత్త్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు తదీయవక్షః స్థలంబు దారుణప్రహారంబున నొప్పించిన నతండు పాండవపాంచాలురచిత్తంబులు దూల సోలియు నాలోనన తెలివొంది బలవిక్రమంబులు మెఱయ నమ్మేదినీపతి పార్శ్వభాగంబు బె ట్టడిచిన మోఁకటిలంబడియును వీఁక చెడక యెగసి యజ్జగతీ పతి తన్ను నగుచు నార్చుపగతురు సిగ్గువడ నగ్గలికసొంపు పొంపిరివోవఁ బవనతన యుఘాలకర్ణమధ్యప్రదేశంబు పటుప్రహతిం బగిల్చిన నొల్లంబోయి శీఘ్రుంబునం దేటి యమ్మహాబలనందనుండు గండతలంబునం దొరుఁగునెత్తు రనుమదంబున మత్తకరి ననుకరించుచుఁ దుండంబుచందంబునం జెలు వొందుగ దె యల్లార్చి పేర్చి వ్రేటు గొనిన మెడకెలను దాఁకి నీకొడుకు మహాపవనపతితం బగుసాలంబుపోలికం గూలి నం గని ధర్మపుత్త్రప్రముఖులు ప్రమోదంబు నొందిరి గ్రక్కున లేచి కాలాకారుం డై ధాత్రీనాథుండు చిత్రభ్రమణంబుల వెగడుపఱిచి పలువ్రేటుల నొప్పించినం గిమ్మీరవైరి వసుధం ద్రెళ్లుటయు నది సావుగాఁ గొని యక్కురుసింహుండు సింహ నాదంబు సేయ నవ్వాయుసుతుండు సావమి యెఱింగి యాభూపతి పెనంగుభంగి యుఁ గనుంగొని మెచ్చి సురప్రకరంబులు పుష్పవర్షంబులు గురియం బరులకు

భయం బొలసె. అంతఁ దెలిసి భీమసేనుం డుద్వృత్తలోచనుం డై వీరావష్టంభంబు
నం బొలిచె అప్పుడు సాత్యకి ధృష్టద్యుమ్ననకులసహదేవు లేమేమి యని సుయో
ధను సంగ్రామంబునకుం బిలిచిన విని యావృకోదరుండు వారల వల దని వారించి
విగతఖేదుం డగుచు నాకేశుండు నముచిం దాఁకినతెఱంగున రారాజుం దలపడి
బహుచిత్రగతులం జరింపం జూచి సవ్యసాచి జనార్దనున కి ట్లనియె. 39

## శ్రీకృష్ణుఁ డర్జునుతో భీమదుర్యోధనుల తారతమ్యంబు చెప్పుట.

క. భీముని సుయోధనునిసం,గ్రామంబుతెఱంగుఁ జూడఁ - గా నెవ్వరియం
దేమే నధికతఁ దోఁచెడి, నీమది నున్నట్లు చెప్పు - నీరజనాభా. 40

చ. అన విని శౌరి యి ట్లనియె - నర్జునుతోఁ గురూపదేశసం
జనితసమన్వయంబు సదృ - శంబ తలంపఁగ నిద్దఱందుఁ బా
వనిమెయి లావు పెద్ద కురు - వల్లభుఁ డారయఁ గౌశలంబు పెం
పున నధికుండు దత్పరతఁ బూని శ్రమం బధికంబు సేయుటన్. 41

ఆ. లావు గలిగి మొక్క - లమ్మునఁ గీచకా, రాతి సొచ్చి ధార్త - రాష్ట్రువైరవు
వలన నొచ్చుమన్న-వాఁడు గావున ధర్మ, సంగరమున నరిది-జయము గొనుట. 42

వ. అన్యాయంబునం జంపువాఁ డింతియ మాయలు గలపగఱ మాయాప్రకారంబులం
బరిమార్చుటయ తగు నింద్రునివృత్రవధవ్యాపారంబు వినమె జూదంబునప్పు డనిల
సుతుండు సుయోధనుతొడలు విఱుగ నడుచువాఁడ నని ప్రతిన వట్టినవాఁ డది
య ట్లుండె గదాయుద్ధంబున నాభికి దిగువ యైనశరీరభాగంబు నొప్పించుటధర్మం
బగా దది యొంటుమైఁ గండడంచి మఱి పరిభవరూపంబుగ నూరుభంగంబు సేసి
ప్రతిజ్ఞ నెఱపువాఁ డిది తలంపునం బెట్టక పెనంగ నేని ధర్మనందనునకు దైన్యంబు
దెచ్చు న ట్లగుటఁ బూనికిపేర నూరులు భంజించి వధియించుట తప్ప నొం డుపా
యంబు లేదు ధర్మనందనునివలన మనకు భయం బావహిల్లె నె ట్లనిన భీష్మద్రోణ
ప్రముఖబలవదరాతులం బొలియించుటం జేసి జయంబును యశంబునుం జేకుఱి
యున్నయెడ నవి సందిగ్ధంబు లైనయట్లుగా నొకని జయించి సామ్రాజ్యంబు
గొను మని దుర్యోధనుతోడం బలికి యతనితోడ గదాసమరంబునకు భీమసేనుం
జొనిపె నింతనిర్బుద్ధి యగునె హతబంధుమిత్రపరివారుం డై రాజ్యంబునం దాస
విడిచి మడువు సొచ్చినవాని వెదకి వెలార్చి యొక్కటికయ్యంబునకుఁ బిలుతురే
పదుమూఁడువత్సరంబులు మత్సరాధికుం డగునగ్గాంధారేయుండు భీము జయించుట

కయి గదా పరిశ్రమం బాచరించె నూర్ధ్వతిర్యగ్గతిసముల్లాసంబున మెఱయుచున్న వాఁ డీభీమునకుం బెద్దకాలంబేని శ్రమంబు లే దిమ్మహాభాగుండు ధర్మంబు దొఱంగి యైన నిక్కులపాంసనునిం బిలుకుమార్ప కున్న నింక నించుకసేపునకుఁ దాన తెగుఁ దెగిన మీకు నెల్ల నిప్పాపాత్ముండు రా జగుట కోర్వ వచ్చునే యనుటయు. 43

క. విని క్రీడి యపుడు మారుత, తనయుఁడు దనుఁ జూడ నూరు-తలము కరతలం బున నప్పళించె నతఁడును, గని కొనియెను సన్న యగుటఁ - గౌరవముఖ్యా. 44

వ. కనికొని యధర్మం బైన నూరుభంగంబు సేయు మని కృష్ణానుమతి జిష్ణుండు వనిచె. నాకు నొండుమెయి నెట్లునుం బగతునగపాటు లేక తక్కనే నవ్విధం బాచరిం తున కాక యని మనంబున నిశ్చయించి వివిధగతులఁ జరియింపం గురుపతియు బాహుచిత్రప్రచారంబుల నుల్లసిల్లఁ దత్సంగ్రామం బామిషార్థిగరుడద్వయసమ రంబుచందంబున దర్శనీయం బై యుండె నట్టియెడ. 45

ఆ. పాండురాజసుతుఁడు - పటుతరోల్లాసి యై, వైమటయును ధరణీ - వల్లభుండు తొలఁగ దాఁటె రయము-దలకొనిగదఁబుచ్చి, కొనియెనాబకాంత-కుండు నుఱికి.

దుర్యోధనుఁడు భీముగదాదండమునఁ దొడలు విఱిగి పడుట.

క. ఆలోనం గురుధరణీ, పాలుఁ డడరి వ్రేయుటయును - బవనసుతుని పై సోలె నది గానఁ డాపతి, కేలివిభ్రమము దోఁపఁ - గ్రేళ్ళుతికె నృపా. 47

చ. ఉఱికిన దేఱి పై కుఱికి - యుగ్రత భీముఁడు వ్రేయ నవ్విభుం డఱక మహాద్భుతస్ఫురణ - నూర్ధ్వపరిభ్రమణంబు సేసినం దెలిపి యతండు గాంచి సము - దీర్ణరయంబున వైచెఁ బెన్దొడల్ విఱిగి నగాగ్ర ముద్భటప - విప్రహతిం బడుచాడ్పునఁ బడన్. 48

వ. అప్పుడు మహోల్కాపాతంబులును బాంసుమాంసరక్తవర్షంబులును వికృతంబు లగుకరితురగబృంహితహేషాఘోషంబులును మఱియు ననేకోత్పాతంబులును గలి గిన నట్లు కౌరవపతిపడుటకు వుబ్బునం బొదలినపాంచాలురుం బాండవులు నుద్వి గ్నచిత్తు లైరి వియత్తలం బంతయు నొక్క మ్రోఁతగా నగ్గదాయుద్ధవిశేషంబు లగ్గించుచు సురగరుడఖచరాదులు నిజస్థానంబులకుం జనిరి. ఇట్లు తనగదతాఁకునఁ దొడలు విఱిగి సింగంబుచేతం గూలిన గంధశుండాలంబుచందంబునం బడి యున్న నీకొడుకుం జేరం జని భీమసేనుండు. 49

తే. ఏకవస్త్రఁ బాంచాలి న - ట్లీడ్చి తేరఁ, బనిచి సభలోనఁ బఱిచిన - పాపఫలము ననుభవింపుము దుష్టాత్మ-యనుచు వామ, చరణమున బెట్టిదము గాఁగ-శిరము దన్నె.

వ. తన్ని యులుక మలుగక యతనియాననం బాలోకించి. 51

క. పసు లని యార్చుచు మము న, ల్లస మాడినధర్మహీను - లను నృపధర్మం
బెసఁగఁగ నే మిద యిప్పుడు, పసు లని యార్చెదము మగుడ - బంధుద్రోహీ.

క. విను మేను కల్లసారెలు, గొని కపటపుసెత్తి మాడు - కుశలతఁ గా దొ
ప్పనివారు నే పడంచుట, ఘనబాహుస్వైరకేళిఁ - గాని దురాత్మా. 53

వ. అని పలికి పెలుచ నవ్వి ధర్మనందనగోవిందపాంచాలప్రకరపార్థసాత్యకినకులసహ
దేవుల నాలోకించి. 54

ఆ. శంక లేక కడఁగి - సభ కట్లు పాంచాలి, నంట రానిదాని - నొంటిచీర
తోన యున్నసాధ్వి - వేనలి పట్టి యీ, డ్చించినతనిఁ జూడుఁ - డంచుఁ బొదలి. 55

వ. పాంచాలి సేసినతపంబు పెంపున నీశోభనంబు సమకూరె ననిన విని వారు
ప్రమోదంబు నొంది ఘిక్కిలిసంతసంబునం దేలి యక్కురుఘస్మరుండు నర్తించు
చెన్ను దోఁపఁ జెలంగి. 56

చ. మును మము గొడ్డువోయి రని - ముష్కరతం జెడనాడినట్టిదు
ర్జనుల ననిం గడంగి ధృత - రాష్ట్రతనూజుల బంధువర్గమి
త్రనికర సైన్యకోటిసహి - తంబుగఁ గీటడఁగింపఁ గంటి మిం
క నమరలోక మైన నర - కం బయినన్ సరి మాకు నారయన్. 57

క. అని గదఁ జేకొని నృప నీ, తనయునిమెడ నట్టి యదిమి - తల గ్రమ్మఱఁ ద
న్నినఁ గని మును దిన్నట నె, మ్మన మెరియుతదగ్రజుం డ - మర్షముతోడన్. 58

వ. హర్షావేశలఘుచారిత్రుం డగునమ్మారుతపుత్రున కిట్లనియె. 59

చ. తల యది యేల తన్నెదవ - ధర్మము నొందుట కాత్మ రోయఁగా
వలవదె రాజరా జనుజ - వర్గముఁ దక్కినబంధుకోటియుం
గలపరివారముం దగిన - గౌరవ మేదక పోరి సంగర
స్థలమునఁ బడ్డ నీతులువ - చందముచేఁత జనంబు మెచ్చునే. 60

క. మును లోకము ధర్మపరుం, డనఁ బర గిననాఁడ విట్టు - లనుచితకృత్యం
బునకుఁ జనఁ దగునె దీనం, గనియెదుఫల మేమి దూష్య - గర్వం బేలా. 61

వ. అని దూఱి దుర్యోధనుం జూచి బాష్పాకులలోచనుం డై. 62

సీ. విధి ప్రతికూలుఁ డై - వైరంబు పుట్టించి, మాకు నీవును మేము - నీకు నలిగి
యిత రేతరద్రోహ - మతిఁ దెగి యింతలు, సేయుట గావించె - నీ యధర్మ

పరతయు లోభంబు - బాల్యంబు, మదమును నిన్ను నింతకుఁ దెచ్చె - నీకతమున
నాకు బాంధవకుల - నాశంబు వాటిల్లె, ధృతరాష్ట్రశోకేంద్రు - తీవ్రశోక
కారి యయిన వైధవ్యంబు-కారణముగ, నన్ను నిందింతు రనువచ-నములు మొదలు
గాఁగ బహువిలాపంబులఁ - గరుణ మాప, హిల్ల దురపిల్లె నుల్లంబు - దల్లడిల్ల. 63

వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 64

చ. అనిలసుతుం డధర్మమున - నమ్మెయిఁ గౌరవమేదినీశ్వరుం
డనయెదురక్ పథింపఁగ గ - దాసమరాఖిలధర్మవేది నాఁ
జనినహలాయుధుండు గని - సంజయ యేమని పల్కె నంత వాఁ
డనుజులకుక్ మఱందులకు - నట్టియెడ న్నొగమాడ నేర్చునే. 65

చ. అనవుడు నాతఁ డిట్టు లను - నమ్మనుజేంద్రున కిప్డు రోహిణీ
తనయుఁడు కోపవేగమునఁ - దామ్రముఖుం డయి లేచి బాహు లె
త్తి నృపతులార చూచితిరె - తెల్లముగా బకవైరివిక్రమం
బున తెఱఁ గిట్టివాని మన - భూములఁ గంటిమె యెన్నఁ డేనియున్. 66

వ. గదాయుద్ధంబున నాభికి దిగువ యగుశరీరభాగంబు నొప్పించుట ధర్మంబు గాదను
శాస్త్రోక్తి వినమే వీఁడు విచ్చలవిడిఁ దెంపు సేసె నని పలుకునమ్మహాత్ముని మనంబున
రోషానలంబు సముత్థితం బగుటయు నప్పుడు. 67

క. నిజరథముమీఁదిహలమును, భుజశిఖరమునం దమర్చి - భూమి యద్రువ వా
యుజుదెసకు నడచె నుద్భట, గజరిపుచంక్రమణరేఖ - గతియం దొలయన్ 68

## శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ గోపోపశమనంబు సేయుట.

వ. దానికిం బవమాననూనుండు సోదరభుజబలనిజబలంబు లేకముఖత్వంబున నెప్పు
డుం గలుగుమనోబలంబువలనం జలింప కుండె నట్టియెడ వేగంబ వినయానతుం
డగుచు నచ్యుతుం డడ్డంబు సొచ్చి దీర్ఘవృత్తపీనంబు లగుబాహువుల హలాయుధుఁ
బట్టి కైలాసశైలంబు గదిసినయంజనమహీధరంబుమాడ్కి నొప్పి యనూనస్వరంబున
నతని కిట్లనియె. 69

క. తనవృద్ధియు మిత్త్రునివృ, ద్ధనమును దత్సఖసమృద్ధి - ప్రబలుటయును శ
త్రునిదెస నిన్నియుఁ జెడుటయు, ననుషడ్విధములను దన్ను - నతిశుభ మొందున్.

వ. ఏతత్ప్రకారంబు విపరీతం బగుట యొప్ప దట్లు గావున మిత్త్రునకుం గీడు వాటిల్లి
నెడ నేర్పు గలుగు నేని మైత్త్రిపరుం డయినపౌరుషశాలి యది శమింపం జేయు

సత్యపరాక్రము లగుపాండవులు మనకుఁ బరమమిత్రులు విశేషించి మనమే నత్త
కొడుకు లనీతిపరులచేతం బరిభవింపంబడినవారు గావున వీరల కభ్యుదయంబు గలి
గించుట నీకుం గర్తవ్యంబు. 71

తే. ప్రతిన నెఱపుట నృపులకుఁ-బరమధర్మ, మగుట మనమునఁ జర్చించి-యనిలసుతుఁడు
గద సుయోధనుతొడలు భ-గ్నములు సేయుఁ, బాఁడుగా సభఁ బూనిన-వాఁడు గాఁడె.

వ. అట్లు గాక మైత్రేయమహామునిశాపంబున దుర్యోధనుతొడలు భీమసేనుగదా
ఘాతంబున భగ్నంబులు గాఁ గలయవి యై యుండె నిప్పు డట్లయ్యెం గావున
దీన దోషంబు దోఁపదు క్రోధం బుపసంహరింపుము కుంతీనందనులయభివృద్ధి
మనకు సమృద్ధిఁ జేయు ననిన నతనికి హలాయుధుం డి ట్లనియె. 73

తే. ఓపి ధర్మార్థకామంబు-లొకటి నొకటి, నాశ మొందింప కుండంగ-నడపవలయుఁ
గాక ధర్మంబు సెడ నర్థ-కామములను, గోరుపురుషుండు నిందకుఁ గుదురు గాఁడె.

క. మునిశాపంబును బ్రతినయు, నని చెప్పితి గలుగుఁ గాక-యవి విను ధర్మం
బనవానికి నెఱపక యి, ట్లనిలసుతుఁడు గలఁచెఁ గాదె యన్నీతి యెల్లన్. 75

చ. అన విని కృష్ణుఁ డిట్టు లను-నాతనికిన్ విను నిజ్జగంబు ధ
ర్మనిరతిమానసుండు మధు-రత్వనిరూఢుఁడు దోషదూరుఁ డం
చనిశము సంస్తుతించును మ-హాత్మ యడంపుము క్రోధ మీతఁడుం
దనదుప్రతిజ్ఞ కై రిపు గ-దాహతుఁ జేసె నధర్మ మే లగున్ 76

వ. అదియును నిలిచి మార్కొన్నయప్పుడును నడచునెడను గాదు పాఱి వెగసి పై
కుఱికినఁ దన్నుం గాచికొనుటయుం బ్రతిన నెఱపుటయును గారణముగా నొర
కొనిన నాభికి దిగువ గదా యని యుడిగి చావ వచ్చునే గద నూరుభంగంబు
సేయుదు ననుభీమసేనుపూనికి పదుమూఁడువత్సరంబులేని వేఁచినయది యిక్కుల
పాంసనుం డేల తలంప కుండె మఱచెనేనిం జెడుఁ గాక మన కేమి కలియుగంబు
చొరవ యాసన్నం బయ్యె నివ్విధంబులు ధర్మంబు లై చెల్లకుండునే యట్లుం గాక
పుట్టినంతనుండియుం గపటంబున నపకారంబులు సేయుచున్నవీనిఁ గపటప్రకా
రంబునం బడవైచుట ధర్మహాని యై తోఁపదు వీఁడు పాండవయాదవవంశవర్ధనుం
డగుసుభద్రానందనుం దెగటార్చినతెఱం గెఱుంగమే యనిన నాబలదేవుండు బలు
మొగంబుతో నిట్టిచెనఁటి గెలుపు గెలిచిన భీముండు వొగడు వడయుం గాక రణ
ధర్మంబు దప్పక పెనంగినట్టిధర్మాత్ముండైనదుర్యోధనున కుత్తమలోకం బయ్యెడు
మనుచు నతనికిం జెప్పి రథాధిరూఢుం డై పాండవేయపాంచాలయదుప్రవరులం

చిన్నంబోవ నిజపురంబున కరిగె. తదనంతరంబ వాసుదేవుండు ధర్మపుత్త్రు నాలోకించు నెడ నతండు దీనాననంబుతోడ మానసంబు విషాదంబు నొంద నూర కున్న నారాయణుం డతని కి ట్లనియె. 77

ఆ. బంధునాశకుండు - పాపాత్ముఁ డీసుయో, ధనుఁడు వీని సమర - ధరణిఁ గూల్చి
శిరము దన్నె భీముఁ-డరయంగ నిది యధ, ర్మంబె నీకు నేల-మఱుఁగఁ జెపుమ.

వ. తెలఁ దన్ను నాఁడ నను ప్రతిజ్ఞయుఁ గీచకారాతికిం గలదు గాదె యనిన విని కుంతీనందనుండు దేవకీనందనున కి ట్లనియె 79

క. కురుకులము పొలియుటకు మది, యెరియంగా నున్న నాకు - నిఁకఁ డీరాజున్
శిర ముఱక తన్ని యిమ్మెయిఁ, బరిభవ మొందింప వగపు - పాటిల కున్నె 80

తే. క్షతుఁడు వఱచినపాటులు హృదయకీలి, తంబు లై భీమసేనుండు - తగవు మాలె
నేను సేయంగవచ్చుఁ బో - నిమ్ము పుణ్య, పాపచింత యిం కేటికిఁ - బద్మనాభ. 81

వ. అనుటయు నట్లు కాక దీని నింత గొనియాడ నేల యని యతండు భీమసేనపక్షపాతంబున నతని చింతి గీటునం బుచ్చె విష్వచ్ఛ్వుండు నెఱయం బ్రియం బందని డెందంబుతోఁ గీడు మే లాడక యూర కుండె . . . . . . . . . కృష్ణుం డెల్ల రాజులం గలయం గనుంగొని యి ట్లనియె. 82

ఉ. చిక్కటి లేనియాలమునఁ - జంపె ననేక వల దీదురాత్మకుం
డక్కటికంబు లేక సతి - నంతలు నేసినమం గృపారతిం
దక్కక తండ్రిపా లడిగె - ధర్మజుఁ డన్నెతి సేయఁ డయ్యె వీఁ
డుక్కువుఁ డిట్టిచావునకు - యుక్తుఁ డగుం దలపోసి మాడఁగన్. 83

క. విదురాదులు సెప్పఁగ ను, న్మదుఁ డై యీఁడయ్యెఁ దగిన-మాత్రయు భూసం
పద వీఁడు పాండవుల కిది, యది యగునె బకారిప్రతిన - కర్గం బైనన్. 84

ఆ. నేలఁ గూలి మ్రాను - పోలె ని ట్లున్నయి, ప్పాపకర్ము గుఱిచి - పాడితెఱఁగు
తేటపడఁగ మాట - లాట దా నేల మీ, రక్కుఁ డరదముల మ - హీశులార. 85

వ. అని యిట్లు పుండరీకాక్షుండు దన్ను నాక్షేపించుట యాకర్ణించి కౌరవేశ్వరుండు గోపాయత్తచిత్తుం డై పిఱుందు మోవ లేచి చేతుల భూతలం బూఁదికొని బొమముడితోడిచూడ్కి యతనిపయిం బఱపె అప్పు డపరభాగంబు విఱుగ వ్రేటు వడి యలిగి తల యెత్తి చూచుమహానాగంబుచందంబు దోఁచె. అట్లు ప్రాణాంతకరణం బైనవేదనాభరంబు దలంపక కూర్చుండి మ న్నాకృష్ణుండు జిష్ణుతోడ సంభాషించుటయు నతం డూరుతలంబు గరవుటంబున నప్పళించుటయు వెడవెడ గను

టంజేసి భీమువాటునం దొడలు విఱిగి పడినప్పుడప్పటిబుడిబుడిమాటలు నాసన్న
యు దీనికిం గాకేమి యని యూహించి చేయునది లేక యప్పుడు గలచుమన్న
వాఁ డగుట నగ్గోపాలదేవుతో ని ట్లనియె. 87

## తొడలు విఱిగిపడినదుర్యోధనుఁడు కృష్ణు నాక్షేపించుట.

సీ. కంసదాసునిపుత్ర - కానవు నీకురా, చారంబుఁ గృపయు ల - జ్జయును లేక
ప్రేలెదు నీవు సె ప్పినఁ బార్థుచేసిన, సన్న గైకొని గదా - సంగరంబు
పాడి దొఱంగి యి - ప్పాపకర్ముఁడు వైచె, గాక చక్కటిపోడి - కయ్య మైన
లీల మిమ్మందఱ - నేలపాలుగఁ జేయు, నే శిఖండి గడంగి - యేసె ననఁగ
నర్జునుఁడు శాంతనవుఁ గూల్చె-నట్లు చేసి, తస్త్రగురుచావునకుఁ బాండ-వాగ్రజన్ము
బొంకు మని పంచి తరదంబు-పుడమిఁ గ్రుంగఁ గర్ణుఁ జంపించితే మనఁ-గలదు నిన్ను.

క. భూరిశ్రవుఁ డొక్కనితోఁ, బోరఁగ నేయించి తట్లు - పొడిచీఁకటి నం
హోరహితు సైంధవుని నరు. బారిపఱిచి తిట్టినీకుఁ - బల్కులు సనునే. 88

క. నను భీష్ము గురుని సూతసు, తుని భూరిశ్రవు జయద్ర - థుం జక్కటి ద
ప్పనియనిఁ గొల్పచ్చెఁగ ప, చ్చని నీకుం గపటశూర - సుచరితమూరా. 89

వ. అనిన విని యచ్యుతుం డతని నవలోకించి నీవు భీముని బాలునిఁ బాములం గఱ
పించియు విషం బెడియు నీటం ద్రోచియుం బలువిధాలుం జంపఁ దెగితివి గొంతి
యుఁ గొడుకు లేవురును నిద్రించుసమయంబున జతుగృహంబు దహించితివి ధర్మో
త్తరచరిత్రుం డగునజాతశత్రుసంపదలఁ గపటద్యూతంబున నపహరించి తంతిఁ బని
విం బోక యాజ్ఞసేని నేకవస్త్ర రజస్వలం గొలువులోపల భంగపెట్టి తాప్రొద్ద నిన్న
నిట్టిదురవస్థకుఁ దేరం దగి యుండ నట్లు పోయి సమయంబు నడపి నీచేసినసకల
దుష్కృతంబులు సహించిన యప్పాండవాగ్రజుండు ఏనుప నేను బుడమిపా
లడుగ నచ్చిన నీ నేరవైతి నీనేరమి ని ట్లై తిలభవదీయం బగులోభంబునం బాప
నిశ్చయంబున మదంబున శాంతచిత్తు లగుశాంతనవద్రోణులకుఁ బ్రాణహాని వాటిల్లె
వినుము ద్రుపదునితపోయజ్ఞప్రభావంబుల నదియ పనిగా జనియించినశిఖండిధృష్ట
ద్యుమ్నులాభీష్మగురులమరణంబులకుం గారణంబులు గాక తక్కు దురే పెక్కండ్ర
తోడం బోరి డస్సినసాత్యకిం జంపువాఁ డైనభూరిశ్రవుం జంప కుందుమే యనేక
ప్రౌఢయోధు లొక్కరుని బాలు సౌభద్రుం బొదివి చంపినం బూనినవూన్కి
నిఖిలోపాయంబుల నెఱపక పుణ్యాత్మ యైనపాంచాలి నరణ్యంబునం బరిభవించిన
పాపాత్ముని సైంధవుని బ్రదికి పో విడిచి యర్జునుం డగ్నిం బ్రవేశించునే యిన్నిటి

పరులచరిత్రంబులు నిర్మలంబులు ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు నీవా రెల్లం బాటిన నర్జునుండు నిన్ను విడిపించుట యెఱుంగవే గాంగేయకుంభజకర్ణాశ్వత్థామకృపు లుద్దామసమగ్రసైన్యంబులతోడ నడవ నీవు విరటునిగోవులం బట్టికొని పోవుచోట మీ రందఱుఁ దనసమ్మోహనాస్త్రంబున మూర్ఛితు లైన సమయంబున నర్జునుండు నిన్నుం గాచుట యెఱుంగ రాదె నీ వాపాదించినపాపంబుల కెల్ల మూలం బైనకర్ణునరదంబు ధరణిం గ్రుంగినఁ గవ్వడి వాని నేయ కేల కాచికొని యుండు నంతడె నేనియు భూసురశాపంబున నైనరథంబునకు నిష్కృతి గలుగునే కావున నన్నీచు సమయించుట సముచితంబు యుధిష్ఠిరుండు శల్యుం దెగటార్చినతెఱం గొప్పు నొప్ప దని యుగ్గడింపక మేలు సేసితి పాండునందనులు పుట్టినంతనుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు. కురుకులంబునకు గుద్దలి గొని దుర్ధ్యాతంబు నీవ తొడరితి దాన నింతలు వుట్టె. బవనతనయుండు పట్టినప్రతిన యెఱుంగవె గద నూరుభంగంబు సేయుదు నని పలికి పిడికిటం బొడుచు నే యవి యెల్లను వృథాజల్పంబు లూర కుండు మనుట యు నజ్జననాథుండు జనార్దనున కి ట్లనియె. 90

చ. చదివితి నెల్ల వేదములు - జన్నములు లొప్పఁగఁ జేసితిఁ రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నర - పాలకు లెల్లను గొల్వఁ గంటి దు
ర్మదరిపుగాఢగర్వపరి - మర్దనకేళి యొనర్చితిం దగం
దుది నరి మిత్రబాంధవుల - తోఁ ద్రిదివంబున కేగు టొప్పదే 91

వ. నీకుం జూడ నెట్టివాఁడ నైనను నా కేమి మీ రింకఁ బశ్చాత్తాపదుఃఖితు లగుచు నుండురు గాక యనియె. అప్పు డతనిపై బుష్పవర్షంబులు గురిసె. దేవదుందుభులు మొరసె దిశలు తెలివొందె మృదుసమీరణంబు సుగంధి యై వీతెంచె అంతయు ననుసంధించి యకౌంతేయులు దారు ధర్మంబు దొలంగి గాంగేయ ద్రోణకర్ణశల్య దుర్యోధనాదుల వధించుట యత్తెఱం గొత్త యై తోఁచినఁ జిత్తంబుల వగయు లజ్జయు ఘిగులం బొడమ మొగంబులఁ దోఁప విన్ననై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుం జని వారలతో ని ట్లనియె 92

సీ. గాంగేయగురుకర్ణ - కౌరవపతులఁ జ, క్క టియుఱిఁ బరిమూర్పఁ - గాన మైతి
మని మీరు పగవకుఁ - డద్దోర లుగ్రాస్త్ర, వేదులు ప్రస్ఫుట - విక్రమమున
నడరి వారల గెల్చు-టరిది గావున నేను, బహువిధోపాయముల్ -పన్ని యిట్లు
దీర్చితి గాక య - త్తీవ్రపరాక్రము, లలఁతులఁ బోదురే - యట్లుఁ గాక
వారి విధి యివ్విధమునఁ జా -వంగఁ జేసె, దైవఘటనలు దప్పింప- మీవశంబె
సురలు దనుజుల గెల్చిన - చొప్పు లిట్లు, సంశయపుసమయంబున - వంత లేల. 93

## పాండవులు కృష్ణసాత్యకులతోఁ గౌరవశిబిరంబునకుం బోవుట.

వ. కృతకృత్యుల మైతిమి ప్రొద్దునుం జాల వ్రాలె సేనయు సైనికులును విశ్రమింప వలయుఁ బోదము లెం డనినఁ బాండవులు దేలివొందఁ బాంచాలురును దక్షిణభూపాలురును బ్రమోదంబు నొందిరి అప్పుడు కృష్ణుండు పాంచజన్యంబు పూరించిన నర్జునుండు దేవదత్తంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును భీమసేనుండు పౌండ్రంబును నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బూరించిరి. సకలరథికోత్తములును దమతమశంఖంబు లొత్తిరి. భేరీపణవాదితూర్యంబులు మ్రోసె. ఆసముత్థితనినాదంబులు నింగి నిండె నిఖిలజనంబులుం బొండవేయులం బొగడు నులివు దిక్కుల దీటుకొనియె ఇట్లుబ్బునం జెలంగుచు వార లందఱు నచ్చోటు గదలిరి కౌంతేయులు గౌరవశిబిరంబునకుం జనిన సాత్యకి యనుగమనంబు సేసె. . . అనంతరంబ యమ్మహీకాంతునికడకుం బొగులుచుఁ బోయితి పోయిన నతండు ధూళి పొదివినవదనంబుపై నెఱసిన వెండ్రుకలు వాయం ద్రోచికొని నామొగంబుఁ జూచి ధర్మనందను నిందించుచు నవుడు గఱచి కన్నీరు గ్రమ్మ నిట్టూర్పు నిగిడించి.

తే. నేల నాలుగు నెఱఁగులు - నేలి భీష్మ, గురుకృపాదులపైఁ గార్య - భరము నిల్పి
యున్నవానికిఁ దుది నిట్టు - లుండవలసెఁ, గాలసంప్రాప్త మేరికిఁ - గడవ వచ్చు

క. ననుఁ బదునొకఁ డక్షౌహిణు, లనూనవిభవమునఁ గొల్వ - నఖిలనృపులు పం
చినపని సేసి మెలఁగి ర, ట్లునికి గనిననీవ యిట్టు - లునికియుఁ గంటే 96

ఆ. వాయునందనుఁడు గ - దాయుద్ధధర్మంబు, నుజ్జగించి నింద - కోర్చి యిట్లు
సేసె నిత్తెఱంగు - సెప్పుమీ సంజయ, మనకు నిపుడు గల్గు - జనుల కెల్ల. 97

చ. అనిమిషవాహినీతనయు - నస్త్రకళాగురు సోమదత్తిఁ గ
ర్ణుని రణధర్మహీనతకు - రోయక చంపినభంగులఁ గా మరు
త్తనయుఁడు నేఁడు సేసినవి - ధంబును లోకులు పాండురాజనం
దనతతిఁ బ్రువ్వఁ దిట్టరె వృ - థావిజయం బది యెంత యొప్పెడున్. 98

క. అనిలజుఁడువోలెఁ గపటపు, టనువునఁ బగవారి నోర్చి - హర్షంబునఁ దే
లునె తూలపోనిమగఁటిమి, దనకుఁ గలుగునట్టికీర్తి - తత్పరుఁ డెంచున్. 99

చ. మతిఁ దయ నొకండు వింటె పవ - మానతనూజునిచెయ్దుఁ బెద్దొడల్
విఱిగి ధరిత్రిఁ బడ్డయెడ - వేగమె వచ్చి శిరంబుఁ దన్నె నే
ర్తెఱఁ గలయప్డు శత్రు నవ - ధీరితుఁ జేయుట యొప్పుఁ గాక యే
పఱినఁ బరాభవించిన జ - నావళి నవ్వదె నొవ్వదే మదిన్. 100

క. మనరాజును దేవులు భం, దనముతగవు నేర్పరించు - టకు నేర్తురు భీ
మునిచేసినయది సంజయ, వినిపింపుము వారలకు స - విస్తారముగన్. 101

వ. మఱియును. 102

మ. చెలులం జుట్టలఁ బ్రోచి యర్థిజనులన్ - శ్రీమంతులం జేసి వి
ప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పే - రుం బెంపు శోభిల్ల ని
ట్టలపుందాగము దానముల్ నడపి ని - ష్ఠం బెక్కు సెల్లించి యు
జ్జ్వలతేజంబున నిద్ధభూతి భుజగ - ర్వస్ఫూర్తిఁ బొల్పారితిన్. 103

క. పగవారి నాశ్రయింపక, మగఁటిమియును బ్రాభవంబు - మానము నెందుం
బొగడొంద నుల్లసిల్లితిఁ, దెగునంతకు లక్ష్మితోఁ బ్ర - దీప్తుఁడ నైతిన్. 104

క. సమరము శమంతపంచక, సమీపమున ధర్మవృత్తిఁ - జలుపఁగ నత్యు
త్తమలోకము సమకూరెను, విమలాత్ముఁడ నైతి నొందు - వేరయును నేలా. 105

తే. ఎదిరి పెనఁగంగఁ జాలక - నిదురవోవ, నొంచు తెఱఁగున విషము వె - ట్టించు మపగిది
నింటఁ జిచ్చిడుచాడ్పున-నిట్లు సేసి, పడయుదురు గాక రాజ్య మ-పాండుసుతులు.

వ. అని యంత నిలువక. 107

ఆ. పాపకర్ము లయిన - పాండుతనూజులు, సమరధర్మ మెడలి - జయము గొనుట
గురుసుతునకుఁ గృపున - కుం గృతవర్మకుఁ, దేటపఱుపు నాదు - మాట గాఁగ. 108

క. దేవవ్రతగురుకర్ణుల, దేవసములఁ బాడి దొఱఁగి - దెగటార్చుటయున్
నీవు దలఁపించి వారల, తో వెండియు నిట్టు లనుము - దుర్జనదూరా. 109

ఆ. కపటధర్మకంచు - కంబున వెలసిరి, గాని సత్యపురుష - కారపరులు
గారు పాండుసుతులు - వారల నమ్మంగఁ, గాదు సేత గుండె - కాయ యుడిన. 110

వ. ఇది నామాట గాఁ జెప్పు మని పలికె అప్పు డచ్చేరుపపల్లెలవారు దన్నుం జూడ వచ్చిన నజ్జనంబులఁ గలయం గనుంగొని గాంగేయుండును కుంభసంభవుండును మొద లైనబంధుమిత్రులను లక్షణుండు లోనుగాఁ గలకుమారులను బేరుకొని వారు మున్ను సనుటం జెప్పి వారు సనినలోకంబ తనకుఁ బాటిల్లుట యుగ్గడించి తన దేవులును దుస్సలయు నాదిగాఁ గలయబలలు దాను లేనిపిమ్మటఁ బొందు దురవస్థలు వాక్రుచ్చి పనవిన విని వారలు కన్నీ రొలుక నుష్ణలికంబు గూరునుల్లంబులతోఁ జనిరి అందుఁ గొంద అశ్వత్థామప్రముఖరథికత్రయం బయ్యెడ మెలంగుట నెఱింగి వారలకు రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి కరుగుదెంచి యర దంబులు డిగ్గి. 111

## కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుం జేరి విలపించుట.

సీ. కడుబెట్టిదం బగు - గాలిచేఁ గూలిన, మహనీయసాలభూ - రుహముపోల్కిఁ
ప్రబలకిరాతమా - ర్గణములఁ ద్రెళ్లిన, రాజితవన్యవా - రణముమాడ్కిఁ
గల్పాంతవాయుస - ఖస్ఫురణంబున, నివిరి పోయినమహా - ర్ణవముకరణిఁ
గాలపర్యయమునఁ - దూలి మేదినిమీఁదఁ, బడినపూర్ణేందుబిం - బంబుపగిది
దుఃస్థుఁ డై యుండియును నొప్పు - దొరఁగకున్న
యన్న రేశ్వరుఁ గనుఁగొని - యడలు నెడల
తోడ మేనులు మూలఁగఁ - దొట్రుపడుచుఁ
జేరి యాతనిచుట్టు నా - సీను లైరి. 112

వ. ఆసీను లైనయెడ నశ్వత్థామ యిట్లనియె. 113

ఉ. అక్కట యెప్డుఁ బల్వుర ధ - రాధిపతుల్ గొలువంగ నుండునీ
వొక్కరుఁ డున్నవాఁడవు మ - హోన్నతపీఠ మలంకరించునీ
దెక్కలిఁ దాఁకి ధాత యిలఁ - ద్రెళ్లెడునట్లుగఁ జేసె నీబలం
బెక్కడఁ బోయె సైన్యపతు - లేలొకో యిక్కడ రారు భూవరా. 114

తే. కడలుకొనఁ జుట్టుఁ బట్టెడు గొడుగు లెవ్వి, యొసక మెసఁగంగ సీవురు-లేల పట్ట
రంగమున నాననంబున-నవనిధూళి, గదిరె జలక మే లాడవు - కౌరవేంద్ర. 115

చ. అనిమిషవాహినీతనయుఁ - డస్త్రగురుండును నీకు నెప్పుడుం
గను వెలుఁ గై చరింతురు వి - కర్ణుఁడుఁ గర్ణుఁడు దుస్ససేనుఁడున్
నిను నొకయప్డుఁ బాయ రవి - నీతు లొకో నృప వార లెల్ల నె
మ్మనమున శంక లేక యొక - మాటును నిక్కడఁ జేర రవ్వరున్. 116

క. నీయెడఁ జంచల యయ్యెను, శ్రీ యెవ్వరి నచలవృత్తిఁ - జెందదు విధి య
త్లై యున్నవారి నిట్టులు, సేయఁడె యే నింక నేమి - సేయుదు నధిపా. 117

తే. అని విలాపంబు సేసిన-విని విభుండు, గన్నుఁగవ నశ్రు లురులంగఁ - గరపుటములఁ
దుడిచికొనుచు డగ్గుత్తిక - దొడఁగు నెలుఁగు, నెట్టకేలకుమూల్కొల్పి - యిట్టులనియె.

క. మనుజులకు నిట్టిచందము, మును ధాత సృజించినది ప్ర - మోదము ఖేదం
బును వచ్చును బర్యాయం, బున దీని నెఱుంగవలదె - పురుషుం డనఘా. 119

వ. అని యారథికవరుల నాలోకించి. 120

సీ. పయిపయి నెంత లా-పదలు వచ్చిన నైన, నుత్సాహ మెడలక-యుద్ధ మరులు
సేద్పడునట్లుగాఁ - జేసెడిబంధులు, మిత్రులు సోదరుల్ - పుత్రు లట్లు

బలసమేతంబుగా - భండనంబునఁ ద్రుంగ, నొక్కఁడు నిల్చుట - యొప్పు నెట్లు
మద్బాహువీర్యంబు - మహితధైర్యంబును, దలముస్క- లైన స - ధర్మవృత్తి
సంగరము సేయఁ జాలక - శత్రు లిట్లు
నొంప సద్గతి వడయుట - సొంపు గాదె
యదియుఁ గాక విద్విషులచే - నాజిఁ బడక
యుండ మిముఁ గాంచునమ్మేలు - నొదవె నాకు. 121

చ. వినుఁడు మహానుభావుఁ డగు విష్ణు నెఱింగి యెఱింగి యే మిమున్
గొని వెఱ పేది కాదె పగ - కుం దలకొంటి జయంబు గోరి మీ
రును బలశౌర్యసంపదను - రూపముగాఁ బొగ డొందుభంగులం
బెనఁగితి రేమి సేయుదురు - బెట్టిదుఁ డై విధి తప్పఁ జూచినన్. 122

వ. అగవ కుండుం డని యేఁ బొదలోనం బొంచి యున్నది మొదలుగ గదాయుద్ధంబు
పాడి విడిచి పడముడి పుడమి తొనిం బడవైచి తలదన్నుట తుదిగా సైన్యవృత్తాంతం
బెల్ల నప్పు డారథికవరులకుఁ దేటపడం బలికిన విని పాండవులదెస నిసును
రోసంబు నెత్తి గురునందనుం డెరుణానసుం డగుచు నవుడు గఱచి కరినాక్షురకలి
తంబుగా నక్కారవేశ్వరున కిట్లనియె. 123

ఉ. పాండవు లట్లు మజ్జనకుఁ - బాపవిధిం దెగఁ జూచినప్పుడుం
జండతర ప్రకోపము న - సహ్యపుశోకము నిట్లు చిత్త మొం
డొండ గలంప వే నిపుడ - యొక్కఁడుఁ దక్క యుండ వార ను
ద్దండమదప్రవహ్నిఁ బరి - దగ్ధులఁ జేయక యెట్లు నుండుదున్. 124

తే. వినుము సత్యంబు పల్కెద-మనుజనాథ, యడరి యందఱఁ బాంచాలు-రాదిగాఁగఁ
గలుగుబాంధవమిత్రసం-ఘములతోడఁ, గూడ నేఁ డిదె కృష్ణుండు-సూడఁ ద్రుంతు.

వ. పనుపు మనిన హృష్టుం డై యజ్జనపతి కృపాచార్యుం గనుంగొని యొక్క కలశం
బున జలంబు నించికొని ర మ్మనుటయు నమ్మహీసురవరుండు దమ్ముం జూడ వచ్చి
యచ్చట నున్న సమీపాశ్రమమునికుమారులం బ్రార్థించి యొక్క కలశంబు దెప్పించి
దానిం దోయపూర్ణంబుఁ గావించి తెచ్చిన. 126

చ. అతనికి నెమ్మి ని ట్లనియె - నమ్మనుజేంద్రుఁడు నీవు వేగ మం
చితముగ ద్రోణపుత్రు నభి - షిక్తునిఁ జేయుము ప్రీతి మచ్చమూ
పతియుఁగ భూసురుండు నృపు - పంపునఁ గయ్యముసేఁత లోకవి
శ్రుత మగుధర్మ మ ట్లగుటఁ - జూవె యొనర్చెద నవ్విశేషమున్. 127

వ. అనవుడు నతండు సంప్రీతుం డై యగ్గురునందనునకు సేనాధిపత్యాభిషేకం బాచ
రించిన. 128

ఉ. ఆరథికోత్తముం డధిక - హర్షముఁ బొందుచు నమ్మహీశ్వరుఁ
గారవ మొప్పఁ గ్రుచ్చి యెతి - గౌఁగిటఁ జేర్చి యుదాత్తసింహనా
దారవ ముల్లసిల్లఁగఁ ద్రి - యంబు మెయిం గృపయాదవోత్తముల్
సేరి కెలంకులం జనఁగఁ - జెచ్చెర నేఁగె నుదగ్రమూర్తి యై 129

వ. ఇట్లశ్వత్థామకృపకృతవర్మలును మహోద్యోగంబున. 130

క. అరినిరవశేషనిరసన, పరమానందప్రచరితె - పాండవపుత్రో
త్కరబాంధవనికరపరి, స్ఫురణాఢ్యతదీయశిబిర - మున కభిముఖు లై. 131

వ. ఇట్లు చనిరి. 132

# 31. అశ్వత్థామ కౌంతేయుల నిద్రాసమయంబున చంపనుద్యోగించుట.

(సౌప్తికపర్వము. ఆ. I.)

వ. ఇవ్విధంబునఁ గురుపతి యశ్వత్థామ కభిషేకంబు సేయించిన నాకృపాచార్యుండును గృతవర్మయు గురుపుత్త్రునుత్సాహంబున కుపోద్బలకం బగునుద్యోగంబునం బొదలిరి అమ్మువ్వురు మహీపాలుండు పాండవులం బరిమార్చుటకుం బనిచిన నట్లు పూని దక్షిణంబు ముట్టి పడమట నున్న పాండవశిబిరంబున కభిముఖు లై చనిరి అత్తెఱంగున నవ్వీటికెలని కనతిదూరంబుగాఁ జని యారథికవరు లాలించి. 1

ఉ. అందలివార లెల్లను జ - యంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం
దంద చెలంగఁ గాఁ బలుక - నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం
బందినయట్టి మ్రోఁత విని - యక్కడ వోవఁగ నుల్కి రప్పు ద
మ్ముం దడవక్ వడిక్ వెడలు - మూఁకలు మ్రోయుటగాఁ దలంచుచున్. 2

వ. ఉలికి యట వోవు టుడిగి యొచ్చటికేనియుం దొలంగి నిలిచి మఱి కర్జంబుఁ జూచి కొనువారై యారథికవరులు మగిడి తూర్పుదెస కొంతద వ్వరిగి రనిన నమ్మాటలు వెడవెడ వినుచుం దనకుం బాటిల్లినదురవస్థ చింతించుచు నాంబికేయుం డి ట్లనియె

సీ. సంజయ కురురాజు-సమయునే యిట్లు భీ, మునిచేత బలశౌర్య-ముల నయ్యుఁ
డని నమ్మియుండితిఁ-దనయులు నూర్వురు, మడియుట వినియు నా-మనము పెక్కు
పఱియ లై పోవని - భంగిఁ జూడఁగ దాత, నొనరించినది గాఁగ - నోపు నింక
నడియరితనమున - నప్పాండవుల నాశ్ర, యింపఁగఁ జాల నే - నెక్కడేని
బోదుఁ గాక యట్టి - భూపాలుతండ్రి నై, ప్రాభవమునఁ బేర్చి - పరమదైన్య
వృత్తి కోర్వఁ దగునె - విన వశమే మాట, లామరుత్తనూజుఁ - డాడ నాకు. 4

వ. అని పలికి యశ్వత్థామప్రభృతు లేమి సేసి రనుటయు నజ్జనపతికి సంజయుం డి ట్లనియె. 5

క. ఇమ్మెయి నారథికవరులు, గ్రమ్మఱి చని యడవి సొచ్చి - కని రొకమఱు వం
దిమ్ముల నూతజనులుఁ ర, ధ్యమ్ముల నీళ్ళకును దిగువ - నప్పుడు దారున్. 6

వ. రథంబులు డిగ్గి యంబుపానంబు సేసి యాత్రోత్తరదెస నాలించుచుండిరి. 7

తే. అంతఁ బశ్చిమధరణీధ్ర - రాగ్రపశ్చి, మంబునకుఁ బోయె మార్తాండ మండలంబు
సాంధ్యసమయకృత్యంబులు - సలిపి రపుడు, రథికవర్యులు మువ్వురు - రాజముఖ్య. 8

వ. సలిపి వా రొక్కవటవిటపిసమీపంబున నాసీను లైరి ఆసమయంబున. 9

తే. వారిముఖమండలములతో - వారిజములు, మొగిడె శోకతమంబుతో - నిగిడెఁ దిమిర
పటలి బహువిచారములతోఁ - బరఁగఁ బొల్చె, భూతబేతాళగణములు - భూపవర్య.

క. కలుగు ఘురుఘురుధ్వని కెల్లుం, గలహం బని చూడ నమర - గణ మధిక కుతూ
హలమున వచ్చెనొ యనఁ జూ, క్కులు దోఁచెఁ గగనవీథిఁ - గౌరవనాథా. 11

వ. ఇట్లు రాత్రి యగుట దివాచరంబు లైనజంతువు లుపశాంతవర్తనంబు లయ్యె. రాత్రి
చరంబు లైనవి సంచరింపం దొడంగె అప్పు డమ్మువ్వురు నెవ్వగలఁ గూరినమనంబు
లతోఁ గురుబలంబు బకారణంబ పొలియుట యుగ్గడించి తత్సంబంధకలితంబు లైన
భాషణంబులు చెల్లుచుండ నుండి డప్పి గూరి కొండొక సేపునకు మహీతలంబున
మేనులు వైచి వందురుచుండిరి. అందు. కృపకృతవర్మలు నిద్రనొందిరి గురునంద
నుండు క్రోధాతిశయంబునం జేసి నిదురవోవక వటవిటపంబు గలయం గనుఁగొను
వాఁడు తదీయశాఖోపశాఖల నానాకాకంబులు నిలీనంబులై నిద్రించుచుండ
నాలోకించె. అయ్యవసరంబున. 12

సీ. మిడుఁగుఱుంగులు గ్రమ్మినయట్లు నిగుడెడు, రోచులు గలమిడి - గ్రుడ్లు దనర
మెఱుఁగారు కెంజాయ - మెఱసినయెఱకల, మోపున నెసఁగుపెం - పొరతతోడఁ
గాళులభీషణా - కారత వెల్లతో, లీలమై నెగసిన - శైల మనఁగఁ
గరము గ్రమగు మొగ - మిరుదెసమురియించి, యామిషంబులయిక్క - లరసికొనుచు
నచటిబయ లెల్లఁ దాన యై యక్క జంపుఁ, జందము ఘోర మైనని-స్వనముఁ జంపు
గతియు భూతవితానభీ-కరముగా ను, లూక మొక్కటి వచ్చె భూ-లోకనాథ 13

వ. వచ్చి యవ్వటవిటపంబు నూఁది యక్కాకంబుల నాలోకించి యంగంబుల
యుద్భటత్వం బుడిపికొని గమనంబు తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని నాక్ర
మించి. 14

ఉ. కొన్నిటికంఠముల్ నులుపుఁ - గొన్నిటికాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటిపక్షముల్ నఱకుఁ - గొన్నిటిపొట్టలు వ్రచ్చు లీలమైఁ
గొన్నిటి నప్పళించికొని - కోలెముకల్ నుఱుమాడు నిట్టు ల
య్యన్నిటి నయ్యులూకము ర - యం బెసఁగన్ వధియించె భూవరా. 15

వ. ఇవ్విధంబున నిద్రావివశంబు లైనయవ్వాయసంబుల వివిధంబు లగువధంబుల గీటడంగించి యాకౌశికంబు శత్రువులం బొదివి సమయించినమేటిమగని మాడ్కి మోదంబు నొందినం గని యగ్గురునందనుం డాచందం బొనర్చుటకు డెందంబున నుత్సాహంబు వొడమి పొంగి తనలోన. 16

తే. ఇవ్విహంగమ ముపదేశ - మిచ్చె నాకు, నిద్రవోవంగ శత్రుల - నిగ్రహింతు
నింతలె స్సగునే ముంద - రేమి తెలియగు. గాననైతిని నాపూను - కార్యమునకు. 17

వ. అని వెండియు 18

ఉ. పాండునరేంద్రనందనుల - బాంధవపుత్త్రయుతంబు గాఁగ ను
ద్దండత నే వధింతు నని - దర్ప మెలర్పఁగఁ గౌరవాధినా
థుండు వినంగఁ బల్కితిని - దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్
గండున బెట్టు పైఁ బడుట - కార్యము గాదు దలంచి చూడఁగన్. 19

క ఆరవాయి గొనక బెట్టుగఁ, బరిగొని యక్కడిఁదిమగల - పై నడరుట యు
ద్ధురగతి నగ్నిజ్వాలో, త్కరముపయిఁ మిడుత యురుకు - కరణియ కాదే. 20

వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయుక మఱి చేసిన రారాజు నిర్గతప్రాణుండైన నాకెలసం బెవ్వరి కక్కడు చక్కటితోడిబవరంబున నబ్బలఁమగల గెలువరాదని యి ట్లుగియాడునాచిత్తంబుచింతాపరంపర వాయ నీపక్షివిచేష్టితంబు లోచనగోచరం బయ్యె. పగతురఁ దెగటార్చునెడ నన్యాయం బనక యుపాయం బెయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్రసిద్ధంబ కాదే యి ట్లనిన 21

తే. ఎత్తినప్పుడు విడియుచో - నిఱకటంపుఁ, దెరువునందు నడపు నెడి - తిరుగఁబడిః
యట్టియెడ నిద్రవోయెడు-ననసరమున, శాత్రవుల బెట్టు పైఁబడి-చంపవలయు

వ. అనునీతివాక్యంబులు విందు. అంగీకృతక్షత్త్రధర్ముం డగువానికి నిట్టివి కర్తవ్యంబులు అట్లుఁగాక పాండవేయులు పితామహగురు లైనభీష్మద్రోణులఁ దెగటార్చునెడం జక్కటిగల తెఱంగున సంగరంబు చేసిరె. అంగరాజును రారాజును బరిమార్చినవిధంబులఁ దలంపం గూడునె కావునఁ గల్మషోపాయు లగుకౌంతేయుల నిద్రాసమయంబున గొబ్బున నిగ్రహించుట నీతియ కాని నింద్యంబుగా దని నిశ్చయించి 23

# 32. అశ్వత్థామ కృపకృతవర్మలం గలసి దుర్యోధనుం గనుంగొనుట.

(సౌప్తికపర్వము. ఆ. I.)

వ. అప్పుడు జగంబులు గొని కాలినకాలాగ్నియుంబోలెఁ బాండవశిబిరంబు నిరవశేషంబుగా సమయించి శమియించి చాపాచార్యనందనుండు మేనెత్తుట జొత్తిల్లి మోహాంధ్యంబుతోఁ గలసి యునికింజేసి సాంద్రతరరక్తసిక్తంబు లైనబాహుఖడ్గంబు లేక ద్రవ్యంబుచందంబు నొంద మరల తాను బ్రవేశించుతఱి నెట్టుండె నట్ల నిశ్శబ్దం బైనయవ్వీడిదల వెడలుచుండఁ దెలతెల వేగె. ఇట్లు ప్రతిన నెఱపి కృపకృతవర్మలపాలికిం జనుదెంచి వారలతో ని ట్లనియె 1

సీ. సకలపాంచాలురు - సమసిరి పాంచాలి, కొడుకు లందఱు జము - కడకుఁ జనిరి
చేదిమాత్స్యప్రభ - ద్రాదిబలంబులు, నిరవశేషంబుగా - నేలఁ గలిసె
మాటలు పెక్కేల - మానిసి గుఱ్ఱ మే, నుం గనుపేరెల్లఁ - ద్రుంగెఁ బాండు
భూవరనందను - లేవురుఁ గృష్ణుఁడు, సాత్యకియును నెందుఁ - జనిరొ కాని
తండ్రియును నేలినాతఁడు - దైన్యపడిన, దాని కరులపై వచ్చి యీ - శానువరము
గాంచిమీరలు పెనుఁబ్రాపు - గాఁగ వీను, దఱియుటకు నెంతెదగునంత పలుపఁగంటె.

వ. అని చెప్పిన వినుచు మున్ను రాక్షసావేశంబునంజేసి నీచపరాక్రమంబు లాచరించి తదనంతరంబ తెలిసి యారథికవరులు వగం బొగులుచున్నవారు గావున నగ్గురునందను నగ్గింపం దలంపక యూరకుండి తమమనోవికృతి యతం డెఱుంగక మున్న తలలు వంచికొని తగుతెఱంగున బొగడిన నతండు 3

తే. పాండుతనయులు నాచేతఁ - బట్టువడుట, తెగుట గలిగిన ననుఁ గొంత పొగడఁదగును
జలముపై రిత్తవాండ్రను - జంపుటరయ, మీరు గొనియాడునంతటి - పౌరుషంబె 4

వ. అనిన విని వారలు ధృష్టద్యుమ్నప్రముఖపాంచాలురను బ్రతివింధ్యాదిద్రౌపదేయులను బేరుకొని వారివారిబలంబులను మాత్స్యానీక ప్రభృతిసైన్యంబులను నొక్కరూపేనియుఁ ద్రిక్కకుండ నొక్కరుండప రెండుజాములలో నేలం గలిపితి కరం బచ్చెరువు గాదె యని యతనిం గౌఁగిలించుకొనిరి. . . అట్లు కృపకృతవర్మలచేత

సంభావితుం డై కుంభసంభవసంభవుండు వారలతో మన మిఁక మనుజపతికడకుఁ
దడయక పో వలయుఁ బుణ్యంబున మనము వోవునంతకుం బ్రాణంబులు గలిగి
యుండెనేని యిత్తెఱం గెఱింగింత మనుటయు వార లట్ల కాక యని యచ్చోటు
గదలి యమ్మువ్వురును భూవల్లభసల్లాపకుతూహలంబున రయంబునం జనుదెంచి. 5

తే. రక్తసంసిక్తమైనధ - రాతలమున, నార్తిఁ బొరలుచు నూర్పు లం - దంద సంద
డింప జీవంబు వెడల నుం-కింపఁ జేష్ట, లొయ్య నొయ్యనయడఁగంగ-నున్న యధిపు.

మహాస్రగ్ధర. కని శోకం బాత్మలం ద-గ్గలముగ రథముల్-గ్రక్కునన్ డిగ్గి భూమిన్
ధనువుల్ వో వైచి బాష్ప - ద్గమము వొదువువ - క్రంబులన్ విప్రలాపం
బును దైన్యం బావహిల్లం - బొరలుచుఁ బొరి నా - భూవిభున్ శాంతదృష్టిం
గనుఁగొంచుం జేరి కే లం - గముపయి నిడుచుం - గౌఁగిటం జేర్చికొంచున్. 7

చ. పురపురఁ బొక్కి యానృపతి - పుంగవుచుట్టును నుండి యక్కటా
ధరణి సమస్తమున్ భవదు - దారమహాజ్ఞకు లోను సేసి యి
ప్పరుసున నీవు దీనతకు భాజన మైతి విధాత కెందు గు
ప్పర మగుకార్యముం గలదె - కౌరవనాయక మ మ్మెఱుంగుదే 8

క. అన నప్పలుకులు వెడ వెడ, విని యావిభుఁ డల్లఁ గన్ను - విచ్చిన వదనం
బునఁ జూడ్కి నిలిపి కలశజ, తనయుం డి ట్లనియె గద్గ - దగళుం డగుచున్. 9

చ. అమితబలంబు దర్పమును - నద్భుతధీరతయున్ గదాపరి
శ్రమముఁ బొగడ్త కెక్కినను - జక్క నెదుర్చుట గాక పోర రం
ధ్రము గని యొక్కఁ డుద్ధతి గ - దం దెగటార్చుట గల్గె నట్టె యిం
క మగల కెట్టివారలకుఁ - గల్గ దపాయము దైవ మల్గినన్. 10

చ దురమునఁ బెంపుఁ జేవయును - దుర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచకవి - శిష్టతలంబునఁ బోరి సద్గతిన్
బొరసెదు నీకు నై పగపు - వుట్టదు బంధులు రాజు దేవులుం
దిరియుదు రింక వారి దగు - దీనత కొర్వక యుమ్మలించెదన్. 11

ఉ. సీరి యనారతంబుఁ దన - శిష్యులలోపల నెల్ల నిన్ను దు
ర్వారపరాక్రమాఢ్యుఁ డని - వర్ణన సేయుట గేలి చేసి యా
మారుతికిన్ జయం బొసఁగె - మాలవిధాతృఁడు వాని గెల్పుకో
తేరికి సమ్మతం బగునె - యిట్టిది దీనను బెంపు గల్గునే. 12

చ. కురువర నీమగంటిమియుఁ - గొల్లలయుంగ్ బలముం జలంబు దు
స్తరగతిఁ జేర్చి భీమునకుఁ - జావక పోవఁగ రానియట్టి దై
నరు బెదరించి కేశవుమ - నంబు గలంచి యధర్మవృత్తికిం
జొరఁ డని పంచె దీని దివి - జుల్ గని రిం కిట వేయు నేటికిన్. 13

ఉ. ధర్మము మాని యూరులు గ - దం బొడి చేసినయంతఁ బోక దు
ష్కర్ముఁడు వాయుజుం డెడమ - కాల శిరం బటు దన్నెఁ జూచి యా
ధర్మసుతుండు శాస్తిఁ దగ - దానికిఁ జేయఁడ యాతఁ డెప్డునం
తర్మదదుష్టుఁ డీగెలుపు - దైన్యము సేయదె కీర్తి మాయదే. 14

క. కౌరవనాయక నీదుగ, దారణగౌరవము సకల - ధరణీజనచే
తోరంజన మై నిర్మల, సారయశోధనము నీకు - సంపాదించెన్. 15

వ. అని పలికి తనమానుషంబు తెఱం గూహించి. 16

చ. కుడువఁగఁ గట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్ట జన్నము
ల్నడుప ననేకధర్మవిధు - లం బొగ డొందఁగఁ జాలునట్టియే
ర్పడుసిరి యిచ్చి పేర్మి నొక - కొంపెగ మన్నిననీవు సావఁగా
నొడ లిటు లోమిలిం గురుకు - లోత్తమ యే నొక సేవకుండనే. 17

వ. అని తన్నుఁ దాన నిందించుకొనుచు మఱియును. 18

ఉ. న్యాయము దప్పకుండఁగ ర - ణం బొనరించి దివంబు గైకొనం
బోయెద వందు రాఁ దగిన - పుణ్యము సేయుట లేదు గాని మా
చేయుఁ మనంబునుం దనియఁ - జెండెఁగఁ బద్ధవిరోధివర్గముం
నీయెడ కిం పొన ర్పఁగ గ - ణింపఁగ భాగ్యము గల్గె భూవరా. 19

ఆ. పుణ్యలోకమునకుఁ-బోయినయప్పుడు, ద్రోణుఁ గాంచి నీకు-ద్రోహి యైన
జనవినింద్యచరితుఁ - జంపె ధృష్టద్యుమ్ను, ననఘ నీతనూజుఁ - డనుములోలుత. 20

వ. అని నామాటలుగా నమస్కరించి కౌఁగిలించికొనుము. మఱియు వలయుసల్లాపంబులు సేయుము. బాహ్లీకసోమదత్తభూరిశ్రవస్సైంధవప్రముఖభవదీయబాంధవజనంబులతో నాచేసిన కుశలప్రశ్నంబుగా సంభాషింపుము. అది యట్లుండె. కేయింటి తెఱం గెఱింగించెద. 21

సీ. అమృతంబునింపు క - ర్ణములకు నొసఁగెడు, మాట లాకర్ణింపు మనుజనాథ
శాత్రవశిబిరంబు - సౌప్తికవేళఁ బ్ర, వేశించి నీచుఁ గి - ల్బిషమయాత్ముఁ

దొలుత ధృష్టద్యుమ్నుఁ - ద్రుంచితిఁ బశుమర, ణంబుగాఁ దదనంత - రంబ కవిసి
వానిబంధుల నెల్ల - వరుస గీటడఁగించి, ద్రౌపదీసుతుల నం - దఱను బొదివి
మిడుకమిడుకంగఁ జంపియ-ప్వడమియెల్లఁ, దునియ పెంటగఁ గరివాజి మనుజతతుల
నెల్లనతికితిఁ బాండవు-లేవురును ము, రారియును సాత్యకియును నా-బారిఁబడరు.

వ. అని చెప్పి. 23

ఉ. ఏ మటు పోక శౌరి మది - నేర్పడ ముక్ గని డాఁగురించెనో
యేమిటి కెందుఁ బోయిరొ న - రేంద్ర యెఱుంగను ధర్మదూష్యసం
గ్రామవిధంబులం జయము - గల్గియు వారికి దక్క దయ్యె వా
రే మయిరేమి మాకెలస - మెక్కె నెఱుంగుము మమ్ము మువ్వురన్. 24

వ. అని కలిపికొని పలికి కృపకృతవర్మలవలనుం జూపి. 25

క. వీరిపెనుఁబ్రాపు వడసినఁ, గౌరవకులనాథ యేన - కా దరయంగాఁ
జీరికిఁ బోవనివారును, వైరుల సమయంగఁ జేయ - వలఁతుల కారె. 26

వ. అనిన నమ్మాటలు మనఃప్రియంబు లై నాలుకకు లా విచ్చిన నాభూవరుం డమ్మహీసురవరున కిట్లనియె. 27

క. నీవును నీయోధవరులు, నావైరులఁ బఱిచినంత - యాచార్యుండుక్
దేవవ్రతుండుఁ బఱిచిరె, భావింపఁగ దుష్కరంపుఁ - బని యిది యనఘా. 28

ఆ. కర్ణు మనము పెద్ద - గాఁ గొనియాడుదు, మతనికంటె శల్యుఁ - డధికుఁ డెంగు
రతఁడు నతఁడు నిట్టి-యాక్రమంబున నాకుఁ, బ్రియముసేయఁ జాలి-రే మహాత్మ. 29

వ. అని యమ్మువ్వుర మొగంబులు గలయం గనుంగొని మీరు కృతకృత్యులరు సుఖుల రై యుండుఁడు పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడుఁ గాక వగలు మాని పొండని పల్కి ప్రాణంబులు విడిచిన వార లవ్వసుమతీపతిఁ గౌఁగిలించుకొని వలగొని వచ్చి మరలి మరలి చూచుచు నరదంబు లెక్కి యరిగిరి. 30

# 33. ధర్మరాజు దమ్ములతోడ ధృతరాష్ట్రునొద్దకుఁ బోవుట.

(స్త్రీపర్వము ఆ. I.)

వ. అజాతశత్రుండు గురునందను శిరోరత్నంబు దెచ్చియిచ్చి యట్లు పాంచాలి నూరార్చి యున్నంతి నటవోయిన జనంబులవలన వైచిత్రవీర్యుండు పొలికలనికి వచ్చుచున్నవాఁ డని విని తదభిగమనోన్ముఖుం డై. 1

తే. తనయు లందఱుఁ బొలియుట-విని నయపెలు, మానసంబు దహింప న-మ్మనుజవిభుఁడు
వొగులుచును వచ్చె ననుగల-పోఁతఁ జేసి, యుల్లమక్కటికమున జో-త్తిల్లుచుండ. 2

క. వదనమున విన్నఁదనముం, గదురఁగ హరిఁ జూచి రాజుఁ-గాన వలయు నా
కిది యెట్లు నుడుగ వచ్చునె, కదలుం డని పలికి చనియెఁ-గలనివలనికిన్. 3

ద్రుతవిలంబితవృత్తము. చనఁగ నాతఁడు - సాత్యకి వాయునం
దనుఁడు గాండివి - దమ్ములు నూరెలం
జనిగ ద్రౌపది - సంభృతశోక యై
చనియెఁ జుట్టపుఁ - జానలు సుట్టి రాన్. 4

వ. ఇట్లు మాత్స్యపాంచాలభామలు నరిగిరి. తొలునాఁడు దుర్యోధనుండు మన్నించు మానవతులం గరినగరంబునకుం గొని చని యారాత్రి యందు నిలిచి ధృతరాష్ట్రుం బొడగానక రేపకడ మగిడి వచ్చి యున్నయాయయుత్సుండును సమ్మానవపతితోన చనియె. అట్లు ధర్మసూనుండు సని సమరతలంబు దఱియునంతకు నయ్యెడకు నాంబికేయుండు సనుదెంచె. అతనిముందటివలనివనితాజనంబు లక్కౌంతేయాగ్రజుం గనుంగొని కరంబు లెత్తి యేడ్చుచు నెదుర్కొని. 5

సీ. ధర్మవేదిత్వ మీ-ధరణీశ్వరునకు నె, క్కడియది కృప యెందుఁ-గలదు తలఁపఁ
దండ్రుల మామలఁ-దాతలఁ గొడుకులఁ, దోడఁబుట్టువులను ద్రుంచివైచెఁ
గ్రూరత మెఱయంగ-గురుజనంబులఁ గూల్చెఁ, సఖులసంబంధులఁ-జంపె నదయుఁ
డని పల్కుదురు కొంద ఱప్పార్థుఁ జేరి గాం గేయునిఁ ద్రోణునిఁ-గడయఁ బొదువఁ
బనుప నెట్లు నేర్చె-నని పల్కుదురు గొంద, ఱకట సింధురాజు-ననుజమగనిఁ
దునిమి తేటిరాజ్య-మని పల్కుదురు గొంద, ఱతఁడు మోము వాంచి యరుగుచుండ.

వ. మఱియుం గొందఱు. 7

క. ఇందఱుఁ జంపితి నని యు, బ్బుం దీఱద ద్రుపదతనయ - పట్టుల నభిమ
న్యుం దెగటార్చితి మఱఁదుల, నందఱ ద్రుంగితి విభూతి - యన నీ కర్దీ. 8

వ. అని పలుకుదురు. ఇట్లు బహుప్రకారంబులం బలుకు చుండం బలుకు వెలువరింపక పుత్రశోకార్తుఁ డగునప్పాండురాజపుత్త్రుండు పుత్రశోకార్తిం బొగులువిచిత్రవీర్య పుత్త్రుకడకుం జని తత్పార్శ్వవర్తులచేత నావేదితుం డగుచు నాభూవల్లభు పాదం బులకుం బ్రణతుం డగుటయు. 9

శుద్ధవిరాటివృత్తము. ఉల్లం బప్రియ - మొందఁ గ్రొత్త సం
ధిల్లఁ జెప్పఁగ - దీనవక్త్రుఁ డై
యొల్లంబోవుచు - నుస్సు నవ్విభుం
డల్లం గౌఁగిట - నానృపాలకున్. 10

వ ఇవ్విధంబున నాలింగనంబు సేసి సాంత్వవచనంబుల నుపచరించె. తదనంతరంబ భీమార్జుననకులసహదేవులు సేరిన నతనియొద్దివారు వారిం బేరు వేర నెఱింగించిన.

తే. భీముఁ డనుమాట విని యతి-భీమ మైన, యలుక యనుపహ్ని యవ్విభుఁ డనువనంబు
దరికొనంగ నుంకింప న - ధర్మవిధికి, నాయితం బగునయ్యాంబి - కేయుఁ జూచి 12

క. మన సెఱిఁగి హృషీకేశుఁడు, దనమనమున నిద్దురాత్ము - తలఁ పొప్ప దిసీ
యనుచుం బవనజు నడ్డసఁ, జన కుండఁగఁ బట్టి వీత - సంభ్రమలీలన్. 13

వ. ధృతరాష్ట్రుం డిట్టివాఁడు గాఁ గలవాఁ డని తొల్లి యెఱింగి త్రికాలవేది యైన కృష్ణుం డయోమయంబుగా భీమప్రతిరూపంబు సేయించి సంగ్రహించి నిగూఢ ప్రకారంబునం దత్ప్రదేశంబునకుఁ దెప్పించినవాఁడు గావున గ్రక్కున నయ్యనుప రూపజ్జగతీశ్వరుం జేర నిలిపె. నిలిపిన నది భీమసేనుండ కాఁ దలంచి. 14

క. కోపం బుత్కటమై యా, రూపము నిరుగేలఁ బట్టి - రూఢఘోరా
టోపం బెసక మెసఁగ నా, భూపతి వెసఁ గౌఁగిలించి-పొలు పఱ విఱిచెన్. 15

లయవిభాతి. పెరుఁగఁగ నిజాంగములు - సరభసపరిస్ఫురణ
మరుదుగ జనావలులు - నిరుపమవిధం బి
న్నరపతిబలం బనఁగఁ - గరయుగము తోలవియ
నురము సదియం బెలుచఁ - దొరుఁగఁగఁ బొరిఁ జె

త్తురులు ముఖరంధ్రములఁ - బరవశత మానసము
బొరయుటకుఁ జొచ్చియును - సరి గొనఁగఁ గంటిన్
వరసుతున కిప్పు డను - పరమపదవిన్ మగుడఁ
గుమన్నృపతి యాప్రతిమఁ - బొరి నిటులు పుచ్చెన్. 16

వ. ఇత్తెఱంగున దశసహస్రసామజసమానబలుం డగునయ్యంధనృపతి గంధవహానందన ప్రతిరూపంబు భగ్నంబు సేసి పెంపున నెడఁద నిర్భరహర్షంబు నొందియు మెఱమెచ్చున కై భీమునిం బేర్కొని హాహాకారంబు లెసంగ రోదనంబు సేసినఁ జెలువవ్వనం దనవదనకమలం బొప్పం గమలనాభుం డతని కి ట్లనియె. 17

తే. అడల నేటికి నీచేతఁ-బడఁడు భీముఁ, డిపుడు భంజింపఁబడినది-యినుపరూపు
వినుము నీకోప మెఱిఁగియ వెనుక కతనిఁ, దిగిచి యేను నీముందట-దీని నిడితి. 18

క. బలమున నీతో దొరయఁగ, నిల నెవ్వఁడు గలఁడు నీవు - హితభుజశాఖన్
తలఁపగఁ బ్రళయాంతకుఁడం, ప్రలు నీనిం దగిలి వశమె - చా కుండంగన్. 19

వ. కావున. 20

ఉపేంద్రవజ్రావృత్తము మరుత్తనూజుం బొరి - మాల్పఁ జూచుం
బరిస్ఫురత్కోపని - బద్ధుఁ డై యి
ద్ధరావిభుం డం చిది - తల్ల నే సం
స్మరించి యీకోపు న - మర్చికొంటిన్. 21

తే తనయశోకాతురుండ వై - ధర్మ మెడలి, యనిలసుతుఁ దెగటార్చెద - నని తలంచి
తట్టిపని నీదుచే నేల - యగు విధాత్రి, లీలఁ బరికింప నేరక - బేల వైతి. 22

వ. అదియునుం గాక. 23

క. విను మొకని నేల భవదను, జానిపుత్త్రుల నెల్లఁ జంపఁ - జొప్పడినను నీ
తనయులు మగుడఁగ వత్తురె, యనయము పాపంబు సేసి - తాఱడిఁబోవన్. 24

స్రగ్విణీవృత్తము. ఏము నీపుత్త్రుచే - నెన్నియేన్ భంగులన్
వేమఱుం బాటు నీ - వెంట భావించుచున్
సామసంపాది వై - సైఁపు మాతప్పులన్
ధీమహత్త్వంబు సం - ధిల్లు నీ కిస్మెయిన్. 25

వ. అని చెప్పె. అప్పుడు ధృతరాష్ట్రపరిచారకు లతనియవయవంబులరుధిరంబు ప్రక్షాళనంబున నపనయింపం దలంచి జలంబులు దెచ్చి యొఱంగించిన నజ్జనపతి యప్పని యాచరించె. అప్పుండరీకాక్షుండు వెండియు నవ్విభున కి ట్లనియె. 26

సీ. జగతీశ వేదముల్ - సదివితి శాస్త్రముల్, వింటి వర్తిల్లితి - వృద్ధగోష్ఠి
నఖిలపురాణప - ర్యాలోచనము సేసి, తెల్లధర్మంబులు - నెఱుఁగు దిట్లు
నీతప్పు దలఁపక - నెన్నఁగఁ బొందెదు, కనలెద వేను శం - తనుసుతుండు
గురుఁడునువిదురుండుఁ-గూర్మి-నికూర్మి-ని, చెవులఁ బోయమె సవి-శేష కార్య
వచనములు సంజయుఁడు పెక్కు - వరుస లుభయ
బలవిధంబులు దెలియఁగఁ - బలుకఁ డెట్లు
నీకు నాబుద్ధు లన్నియుఁ - నెమ్మనమునఁ
జేర్పఁ బోలవ యిం కేమి - సేయ వచ్చు. 27

క. భీమార్జునులరఁసము, ద్దామత్వం బెఱిఁగి యెఱిఁగి - తగునే తొడరం
గా మనుజాల కవ్వీరుల, నే మనఁ గల దింక నేల - యీచందంబుల్. 28

క. తనమేలుఁ గీడుఁ దా మదిఁ, గనుచు హితులు సెప్పుబుద్ధిఁ - గైకొని శుభముం
గొనకొని నడపుపతికి వ, చ్చునె పశ్చాత్తాప మెట్టి - చోట నరేంద్రా. 29

ప్రణవవృత్తము నీయుల్లం బొక - నియతిం గార్యం
బాయత్తంబుగ - ననుసంధింపం
జేయం జాలవు - చెడుతెర్వుం బోఁ
బాయం ద్రోవవు - బలిమిం బుత్రున్. 30

తే. ద్యూతమునఁ గెల్పునెపమున-నుఱికి పుత్త్రు, కాంతఁ దల పట్టికొని సభా-భ్యంతరమున
కీడ్చి వలువ లొలుచుటయు-నెఱిఁగిసుతులఁ, జంపె నని భీముఁ జంపఁ ద-లంపనగునె

వ. నీయవినీతియుం గొడుకులదుశ్చరిత్రంబునుం దలంచి శోకరోషంబులు విడిచి శాం
తుండ వై యుండు మనిన నుపేంద్రునకు నన్నరేంద్రుం డి ట్లనియె. 32

జలధరవృత్తము. నీపలు కెల్ల నిక్కమ యి - నింద్యగుణా
యీపురుషార్థహాని సుతు - లీల్గుటకుం
దాపముఁ బొంది తాల్మి దిగఁ - ద్రావి మహా
కోపుఁడ నైనఁ బాటిలెఁ ద - గుం గినియన్. 33

క. తెలిసితి నీమాటలఁ బు, త్రులదెస నెవ్వగల నెల్లఁ - దొఱఁగి యనుజపు
త్త్రుల నాకుఁ బ్రియ మొనర్పం, గలవారుగ నడచువాఁడఁ - గంసారాతీ. 34

వ. అనుటయు నమ్మహాత్ముండు భీమార్జుననకులసహదేవులం గానిపించినఁ గ్రమంబున
నమ్మానవపతి వారలం గౌఁగిలించుకొని దీవించె. 35

---

# 34. గాంధారి దుర్యోధనుని కళేబరము చూచి విలపించుట.

(స్త్రీపర్వము. ఆ. II.)

క. ......దుర్యో, ధనునికళేబరము దృగ్గ - తం బగుటయు న
వ్వనిత యిలఁ ద్రెళ్లి నఱికిన, యనఁటిక్రియన్ మూర్ఛఁ జిత్త - మవశం బైనన్. 1

వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొకసేపునకుం దెలిసి గాంధారి పరిచారిక లూఁదికొనిపోవ నప్పుత్త్రశవంబుకడకుఁ బోయి. 2

తరల. విపులవక్షముమీఁద నస్రులు - వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతికుంజర కౌరవేశ్వర - నేల నిమ్మెయి నీయుదా
త్తపుశరీరముఁ బొందఁ బాడియె - తల్లి వచ్చిన భక్తితో
నుపచరింపక లాఁతి వై యిటు - లూర కుండుట యుక్తమే. 3

వ. అని మఱియు ననేకప్రకారంబులం బలవించుచు హాహాకారంబు లెసంగ రోదనంబు చేసి యాసుబలనందన తనసమీపంబునకుఁ జనుదెంచియున్నయుపేంద్రున కిట్లనియె. 4

మంగళమహాశ్రీవృత్తము.
ఈతఁడు రణంబునకు - నెత్తి చనుచుండియును - నెంతయును భక్తిఁ గని నాకుం
బ్రీతియొసఁగం బలికి - ప్రేమ మొలయం బొగడి - పెద్దయు వినీతినిరతుం డై
చేతులు మొగిడ్చి జయ - సిద్ధియొసఁగ దీవన వి - శిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల ననూన మగు - నిద్ధజయ మాలకు - నె ట్లయిన సిద్ధ మగు నంటిన్. 5

వ. ఇట్లన నేల యంటేని

మానినీవృత్తము. జూదము నప్పుడు సర్వజనంబులు - చూచి భయంపడి యిప్పని యి
మ్మేదిని సేనలకుం గురుకోటికి - మృత్యువు గాని నిజం బలఁతిం
బో దని యాడరె యమ్మెయి నాదగు - బుద్ధికిఁ దోఁచినసత్యము దా
మోదఁగఁ బాటిలదే కొడు కంచుఁ బ్రి - యోక్తులు పల్కినఁ బెంపు సెడున్. 7

వ. వినుము దీవనకుం జేరక మధ్యస్థపుమాట లాడుటయ కాదు మఱి నే నప్పుడతని తోడ. 8

తే ఆహవంబునయందు నీ-వోహటించి, పోవ సడి వచ్చు నడికంటెఁ-జావు మేలు
శస్త్రజీవికిఁ బరలోక - సౌఖ్య మనుభ, వింపు మమరత్వసంపద - వెలయ మంటి. 9

క. అని చెప్పి యుంటి నాచే, ప్పినయట్టులు సేసి యితఁడు - పేరును బెంపుం
గని యుండఁగ ని ట్లడలున, మనుఁగు టరయఁ గడుపుశోక - మున పెంపుసుమీ.

ఆ అరివిమర్ది యితని - కై వగ పేటికిఁ, బుణ్యలోకమునకుఁ - బోయె ననుచు
నుండ నోపెనేని - యుల్లంబు ధృతరాష్ట్ర, దిక్కులేమిఁ దలఁచి - పొక్కుకున్నె.

వ అని వెండియు. 12

సరసిజవృత్తము. శ్రీరమ్యత్వం బారఁగఁ బెం పూ-ర్జితముగ మణివిర-చితమకుటములం
దారం జూడన్ సారవిభూతిన్ - ధరణిపు లనిమిష - ధవనిభు లగుచున్
భూరిప్రీతిన్ సూరెలఁ గొల్వన్ - భువనవినుత మగు - పొలుపు వెలయ ము
న్నీరా జుండున్ దారుణదైవం - బిటు వఱచునె తుది - నితనిఁ గటకటా. 13

తే. కనకబహురత్నమయపీఠ - మున మృగాక్షు, లాలవట్టంబు లిడఁ జెలు - వమరునట్టి
కౌరవేంద్రుండు పెను నేలఁ-గంకపక్ష, పవనహతుఁ డయ్యెఁ జూచితె-పద్మనాభ

క ఈరాజు భీమసేనును, దారోగ్రపరాక్రమమున - ధరణి నొఱగి దు
ర్వారమదవారణము కం, ఠీరవముబిహారమునఁ బ - డినగతిఁ బొలిచెన్ 15

క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం, బదివేలవిధములఁ జెప్పఁ - బాటింపఁడు దు
ర్మదమునఁ దగియెడుబుద్ధులు, విధి మూఁడినమర్త్యుఁ డేల-విను నుచితోక్తుల్. 16

క పదునొకఁడక్షౌహిణు లే, పొదవఁగ నలిఁ గొలువ నొప్పు - నుర్వీశ్వరుఁడే
తుది నిప్పరివారుం డై, గదఁ జేకొని యొంటి పోరి - కలనం బడియెన్ 17

తే. ధరణిగజఘోటకములొప్ప-ధార్తరాష్ట్రు, లెల్లఁ బొలుపారఁగాఁగంటి-నిప్పు డవి వి
నాశ మొందినఁ బాడఱె-నలిననాభ. యది పరాధీనముగఁ జూచు నట్టి దయ్యె 18

వ. అని దుర్యోధనవల్లభ నిరీక్షించి మాధవు నుద్దేశించి యి ట్లనియె. 19

ఆ. కొడుకుచావుకంటెఁ - గోడలియడలునఁ, బెరిఁగి శోకవహ్ని - దరికొనంగ
నంతరంగ మిప్పు - డగ్గల మెరియంగఁ, దొడఁగె దీని కేది - తుది యుపేంద్ర. 20

సీ చూడు మిమ్ముద్దియ సుతుఁ జూచి వదన మ, ల్లార్చుచుఁ బ్రాణేశు-నాననంబు
పైఁ జూడ్కి యడరించి - పాణితలంబున, నందంద నెమ్మొగ - మడిచికొనుచు
మరలఁ బుత్త్రునిదెస - కరిగినమనసు పే, రడలున మునుఁగంగ - నతనిచెన్ను
మోమునఁ దనమోము - మోపిమూర్ఛిల్లుచుఁ, దెలిసి వల్లభునురః - స్థలము గ్రుమ్ము

నుడుకుఁగన్నీరుఁదడియంగ-నొఱఁగుచునువి, చేష్టలైయూరకుండుచుఁ-జెలులతోడఁ
దిరిగి పోఁగులంగ వేనలి - విరియ మేన, నవులఁ దిరుగుచు నున్నది-యక్కటకట. 21

వ. అని వెండియు. 22

సీ. ఈసుమధ్యమ యిమ్మ - హీశ్వరుబాహులత, లంబున లలితోప - లాలనంబు
నొంది రాగిల్లెడు - నుల్లంబుతో నుండు, నింకిట నిమ్ముగ్ధ - నెట్లు నూడ
వచ్చుఁ గనుంగొన - వశముగా దిది యిట్టి, కొడుకును మనుమండుఁ - బుడమినిట్లు
పడియుండఁ జూచెడు - పాపజాతికి నిప్పు, డవియక నిగ్గడి - యైనయినుప
గుండియకుఁ జేటు పా టెంకఁ-బుండరీక, నయన యెన్నఁడులేమి ని-ర్ణయముగాదె
యింత కోర్చెదునట్టివా-రెన్నఁ డేని. యుర్వి నెందేని గలుగుదు-రొక్కొ యొరులు.

క. జననియు భార్యయు నేమై, న నేమి వేదములు బొంకు - నకుఁ జోరమి నిజం
బని పుణ్యలోక మగు నని, తన కార్యము సూచె నిట్లు - తగునె యితనికిన్. 24

వ. అని యనేకభంగుల విలాపంబు సేసి తక్కటితనయుల దెస నాలోకించి విష్ణు దేవు
నితో ని ట్లనియె. 25

భాస్కరవిలసితవృత్తము. కౌరవనృపతితనూజశతంబుం - గంటె పవనసుతుపటుభుజలీలా
ఘోరతఁ దడఁబడ మేదినిమీఁదం - గూలె వికటముఖకరచరణత్వం
బేరి కయినఁ గనుఁగొన్న విషాదం - బెంతయు మది నొలయఁగఁ బ్రియకాంతల్
చేరి విలపనము దద్దయు నార్తిం - జేయఁగ నునికి పనట తిరిఁ బెట్టన్. 26

తే. చందనార్ద్రకుట్టిమములఁ - జరణతలము, లొందుటకు నేవగించున - య్యువిదలిపుడు
నెత్తురుల రేవమెక్కిన-నేలఁ బొరలు, చున్నవా రేమి సెప్పుదు - నుడుకుపేర్మి. 27

క. బాలలుఁ దరుణులుఁ బ్రౌఢలుఁ, దూలెడువికలాంగకముల - తో డెందములన్
వాలినవిరహానలముల, పా లై యందురెద రొక్క - భంగిన యకటా. 28

క. బలదర్పధైర్యశౌర్యో, జ్జ్వలు లగుధృతరాష్ట్రసుతుల - సతులకు ని ట్లా
కులతమయి పనట పెల్లునఁ, దలరపలసె దిక్కుమాలి - దైవము చెయిదిన్. 29

క. నిజభూషణాతపత్ర, ధ్వజకంకటఖండవేష్టి - తము లైనకురు
ప్రజగాత్రశకలములు వా, రిజనాభ కనుంగొనంగ - రిట్టించె పగిల్. 30

క. జననియుఁ దండ్రియుఁ దొలుబా, మునఁ జేసినపాపకర్మ - మునఁ గాక సుయో
ధనుఁడు మొద లయిననూర్వుర, ననఘుఁడు ధర్మజుఁడు నామ - మడఁపఁగఁ దగునే.

---

# 35. గాంధారి శ్రీకృష్ణునకు శాపంబిచ్చుట.



(స్త్రీపర్వము. ఆ. II.)

వ. అని పలికి పశ్చాత్తాపదుఃఖంబుపెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయి యైన పుత్త్రశోకం బడరి యలఁతి గానియలుకఁ బెట్ట నూర కుండి యక్కౌరవరాజపత్ని పద్మనాభుదెసఁ గనుంగొని కోపోద్దీపిత యై. 1

సీ. ధృతరాష్ట్రపాండుభూ - పతులకుమారులు తమలోన నీసున - సమరమునకుఁ
దొడఁగిన నీ వడ్డ - పడ వైతి తగు చాలు, మానుసుల్ గలిగియు - మాననీయ
వాక్యసంపద నయ్యును - శక్యసమస్తకా, ర్యుం డనఁ జేర్కొని - యుండు నుపేక్ష
చేసితి కురురాజుఁ - జెలుపున తిరిగితి, నిఖిలరాజులఁ దద - నీకములను
నామ మడఁచి తెల్ల - భూములుఁ బా డయ్యె, నంతియట్లు ఫలము - ననుభవింపు
మే పడంగ నిన్ను - శాపానలజ్వాల, దగ్ధమూర్తిఁ జేయు - దాన వినుము. 2

సీ. పూని పాతివ్రత్య - పుణ్యఫలంబున, సంపాదితం బైన - సారతపము
బలిమి సాధనముగాఁ - బలికెద నుత్తమ, జ్ఞాతులఁ దమలోన - సంగరమునఁ
బొలియఁ జేసితి గానఁ - బొలియుదు రన్యోన్య, ఘాతుకు లై భవ - జ్జ్ఞాతిజనులు
నీవును దప్పక - నేఁ డాదిగా ముప్ప, దాఱగు నేఁ డైన - యద్దినమున
నరయ దిక్కెవ్వరును లేని - యగ్గలంపుఁ, గుత్సితంపుఁ దెఱంగునఁ - గూలువాఁడ
విట్లు మావధూజనములు - నేడ్చువారు, పతుల సుతులను బంధులఁ - బనవి పనవి.

క. అని ఘోరంబుగఁ బలికిన, విని విపులమనస్కుఁ డైన - విష్ణుఁడు చిఱున
వ్వున నానన మొప్పఁగ న, వ్వనితకు ని ట్లనియె గౌర - వస్తుత్యముగన్. 4

తే. మున్న కాదె యాదవులకు - మునివరేణ్య, కలితదారుణశాపంబు - గలదు నీకు
నేల చర్వితచర్వణ - మిట్లు సేయ, దీన నీ వేమి త్రవ్వితి - దానిఁ జెపుమ. 5

క. యదువంశజాతులకుఁ ద, ప్పదు నాశము వారి సురలుఁ - బరిమార్పఁగ లే
రది కారణంబు గాఁగఁ దె, గుదు రొండొరుచేత రణము - ఘోరత్వమునన్. 6

తే. అనినపలుకులు విని పాండు - తనయులెదలు, వెఱపుఁ బెంపునఁ గంపింప-విహ్వలించి
యాత్మజీవితముల దెస - నాస లపుడు, వదల విడిచిరి కౌరవ - వంశవర్య. 7

వ. ఇట్లు పలికినయచ్యుతుం డద్దేవి నుద్దేశించి దేవమ్మా మృతు లైనసకలబంధుమిత్రులకు నగ్నికార్యంబులు సేయింప వలయు నని వెండియు. 8

సీ. వినుము గాంధారి నీ-తనయుండు చేయుదు, ర్ణయము లెఱుంగవె-నాకు నీకు
శాంతనవునకు నా-చార్యునకును బాహ్లి, కునకుఁ దండ్రికి మాన్పఁ-గోలఁది గాని
దుర్మానమున నట్లు - దొడరి యిట్లయ్యె మీ, యపరాధమున వచ్చి - నట్టికీడు
నకు నింతనొవ్వంగ - ననుఁబల్కఁ దగునె యీ, మ్మలికింబుధృతిఁబట్టి - మాన్పుమింకఁ
జేటునకుఁ జావునకు వగఁ - జెందుజనుల
కినుమడింపదె మానస - మున నలంత
రాచకూఁతుండ్రు సుతుల సం - గ్రామనిరత
హృదయు లగువారిఁ గాంచఁ గో - రుదుర కాదె. 9

వ. అని చెవి సూఁడినట్లు పలికిన విని నిరుత్తరయై గాంధారి యూరకుండె. 10

---

# 36. కుంతి ధర్మజునకుఁ గర్ణుండు దన కొడుకగుట దెలుపుట.

(స్త్రీపర్వము. ఆ. II.)

వ. అట్టియెడ ధృతరాష్ట్రుండు ధర్మనందనుతో నీవు మనమొనలం గలజనులకొలంది యెఱుంగుదు చచ్చినవారిలెక్క దలం తేని నా కెఱింగింపు మని పల్కిన విను మెఱుక పడ్డవా రుత్తమజనంబులు డెబ్బదియాఱుకోట్లు నిరువదివేలును మ్రుక్కడి మూఁక యిరువదినాలుగువేలు మున్నూటయిరువండ్రుఁ దెగి రని చెప్పిన నమ్మనుజపతి వీ రిందఱు నేగతికిఁ బోదు రనుటయు. 1

తే. ఎవ్వ రాత్మ దేహములు స - మిద్ధ మైన, యస్త్రవహ్ని వేల్చిరి వా - రమరలోక
మునకుఁ జనినిర్జరాంగనా - జనవిలసితుఁ, లైనయమరేంద్రునకుఁ బూజ్య - లగుదు రధిప.

క. తెఱచుగ శస్త్రాస్త్రంబులు, నెఱఁకులు దూఱినఁ జలించి - నిజధైర్యంబుల్
మఱచి తెరలి చచ్చిరి కొం, దఱు గుహ్యకగతికిఁ బోవఁ - దగుదురు వారల్. 3

క. సమరమున నెత్తెఱంగున, సమసినను గీడు తెరువు - చన రుత్తములో
కమునక పోదురు జనములు, ప్రముదితు లై యంద్రు బుధులు-పౌరవముఖ్యా. 4

క. అనిన విని నాథవంతులు, ననాథులును నైనవీరి - కందఱకుఁ గృపా
ధనలోల చేయఁగా వ, చ్చున కాదే యగ్ని కార్య - శోభనముఁ దగన్. 5

వ. అని పలుకుటయు ధర్మనందనుం డి ట్లను. **ఈయఖిలజనంబులు** నాహితాగ్నుల యట్ల యట్లుం గాక వీర లిందఱు కుదకదహనక్రియాకరణయోగ్యులును లేరు మన మేది కొలఁదిగా నిప్పని సేయుద మని పలికి తా రజ్ఞాతవాసంబు నిర్వహించి సముచిత ప్రకారంబున విరాటాదులచేతం బరిజ్ఞాతు లైనసమయంబున సంగతుం డై యది మొదలుగాఁ జెల్లెడుశాంతికపౌష్టికాదిశ్రౌతస్మార్త క్రియాకలాపంబులు నడపుచుం దమయొద్ద నున్నధౌమ్యు నాలోకించి విదురుని సంజయుని యుయుత్సునిఁ గనుంగొని మీరు భరతకులులకుం దక్క ననాథవంతు లైనవారలకు విధ్యుక్తంబుగా నగ్నిసంస్కారంబు సేయుం డని పనిచి యత్తెఱంగునకుం దోడుపడుటకై సూతజనంబులను దత్కాలసమాగతు లైనకరిపురజనంబులోనం దగువారి నిరూపించి మున్న తెప్పించినచందనాగురుఖండక్షౌమవసనకస్తూరికాకుంకుమఘృతతైలప్రభృతు లగువల

యుపస్తువు లాధౌమ్యముఖ్యుల కొప్పించి వా రయ్యవసరంబునం గూడికొనిన బహుబ్రాహ్మణసంఘంబులతోఁ జని దుర్యోధనదుశ్శాసనకర్ణశల్యాదులకు నభిమన్యుఘటోత్కచవిరాట ధృష్టకేతుప్రముఖులకును దక్కను బేరెఱుకపడు నానాదేశాధీశులకుం బ్రచురకాష్ఠసంచయంబులను భగ్నరథావయవధ్వజధనుశ్శరకుంతాగ్రులను సొదలు వేర్పించి పితృమేధక్రియలు నడపి చిచ్చుసం జొనిపి యనాథవంతు లైన భూకాంతుల ననేక సహస్రసంఖ్యులం బ్రోవులుగాఁ బెట్టించి సమగ్రదారుసముదయంబు లమర్చి యగ్నియిచ్చిరి. అప్పుడు ఋగ్యజుర్గపఠనరవంబులును సామగాననాదంబులును రమణీరోదనధ్వనులును రోదసీకుహరంబు నిండె. ధూమంబున దిక్కులు పిక్కటిల్లె. చేతనభూతంబుల కెల్ల విపులవిషాదం బావహిల్లె. ఇవ్విధంబునం దగవు నడపించి. 6

సీ. భూవర కురువంశ - పుంగవుం డగుధర్మ, తనయుండు ధృతరాష్ట్రు - వినయ మొప్ప
ము న్నిడుకొని యాఁడు - మొత్తంబుఁ దోడ్కొని, బంధుజనంబులు - బలసి రాఁగ
నరిగి గంగాస్నాన - మాచరించి తిలోద, కప్రదానము సర్వ - కౌరవులకు
సయ్యాంబికేయుఁడు - నక్కురుభార్యలు, ననుజులుఁ దాను - నధికనిష్ఠఁ
జేసి రతనికడకు - నాసమయంబున, నడలు నెమ్మనమున - నడరి క్రమ్మ
కన్నునీరు మొగము - గప్పంగఁ జని కుంతి, యెల్లవారు వినఁగ - నిట్టు లనియె. 7

తరల. వినుము కౌరవకోటికిం దన - విల్లు పెట్టనికోటగా
నని యొనర్చి భవద్బలంబుల - నన్నిటిన్. మిము నేవురం
దనిపి యంబరచారు లెల్లను - దన్ను మెచ్చి నుతింపఁ బా
ర్థునిమహాస్త్రము బల్విడిం దల - ద్రుంపఁ గూలినకర్ణునిన్ 8

క. జను లెల్లను రాధేయుం, డనుటను మీరలును వాని - నట్టులకా నె
మ్మనమునఁ దలంతు రటు గా, దనఘ మదీయాత్మజన్ముఁ - డాతం డరయన్. 9

ఆ. మీకు నగ్రజుండు - నాకు భాస్కరుదయ, లలితకవచకుండ - లములతోడఁ
బుట్టినాఁడు గానఁ - బోయంగవలయుఁ ది, లోదకంబు లమ్మ-హోన్నతునకు 10

వ. అని తదీయజన్మప్రకారంబును దివాకరప్రసాదభావంబును జెప్పుటయు దుస్సహంబు లగునమ్మాటలు చెవులు సూఁడిన ట్లయినఁ బాండవులు పరమదుఃఖావేశంబు నొందిరి. అందు భీమాదులు నివ్వెఱపడి యుండ ధర్మనందనుండు దల్లడిల్లుచుం దల్లితో ని ట్లనియె 11

సీ. అనిలజార్జునుల మా-ర్గాన నేర్చె నెవ్వని, యుత్సాహ మూఁది సు-యోధనుండు
నై దేహపాంద్రాది - వసుధేశు లెవ్వని, కడిమిసొంపున నరి - గాఁపులైరి

మనసైన్యకోటికి రయ-వ్వనిబాహువీర్యసం, పద కోడి యంతంత-నొదుఁగుచుండు
నద్భుతం బొనరించె - నమరుల కెవ్వని, యసమానవివిధది - వ్యాస్త్రమహిమ
మమ్ము నందఱ నెవ్వని - మహితశక్తి, యెక్కుడై సంగరంబునఁ - జిక్కుపఱిచె
నట్టికర్ణునిఁ గొంగున-నగ్ని డాఁచి, నట్టు లెమ్మెయి డాఁచి తో-యమ్మ చెపుమ. 12

క. అర్జునుఁ డొకరుఁడు దక్క - ను, పార్జితశౌర్యమున నమ్మ - హాబాహుని వి
స్ఫూర్జితరథమ్మున కెదు రై, గర్జిల్లఁగ రథికుఁ డెందుఁ - గలుగునె జననీ 13

తే. కర్ణుఁ దొలుచూలుగా నేల - కంటి తల్లి, నీదుమంత్రంబు పరమవి - షాదకారి
యయ్యె మాకెల్ల నట్టిమ - హాబలైక, గణ్యు ద్రుంగుడుపఱచుట - కారణమున 14

తరువోజ. భానుపుత్త్రునిచావు - బంధుల నెల్లఁ, బరమసంతాపంబు - పాల్పడఁ జేసె
మానితబలుఁ డభి-మన్యుండు పోర, మడిసినప్పుడు నిట్టి - మఱుకువ నాత్మ
నూనదు ద్రౌపదే - యులనాశమునకు, నుడుక దివ్విధమున - నుల్లంబు ద్రుపద
నూనులు ధృతరాష్ట్ర-సుతులును ద్రుంగు, చొప్పున కిమ్మెయి-జొర దడల్ చాల.

ఆ. అతఁడు మాకు నన్న-యని మున్న యెఱుఁగఁగ, గన్నఁ గురుకులంబు-గలఁగఁబడకి
మనుదు మట్టు లైన-మనుజలోకమునకుఁ, గలుగ దడలు మాకుఁ-గలుగ దడలు. 16

వ అని విలాపంబు సేసి విషాదశిథిలవర్ణంబులతో గోత్త్రనామంబు లుగ్గడించుచు
నమ్మార్తాండనందనునకుం దిలోదకప్రదానంబు సేసె 17

# 37. కృష్ణుఁడు ధర్మజునకు ధర్మములుపదేశింప భీష్ముని నియమించుట.

(శాంతిపర్వము. ఆ. II.)

వ. సమధిగతసామ్రాజ్యుం డై ధర్మనందనుండు దేజోవిశేషంబున మహోజ్జ్వలత్వంబు నొంది మహీసురుల నాశ్రితజనంబుల నర్థులం గృతార్థులం గావించి ధృతరాష్ట్ర గాంధారీవిదురులకు రాజ్యంబు సమర్పించి మీర లింతటికి నొడయుల నేను మీ పనిచినపని సేసి పెట్టినయట్లు గుడిచి యుండం గలవాఁడ నని పలికి నిత్యంబును వారలయనుమతి గొని భవ్యమార్గంబునం బ్రజలం బాలించుచు వారికిం బూర్వప్రకారంబునకంటె నతిశయిల్ల నెల్లవర్తనంబులు సంప్రీతిం జెల్లించుచు విపన్ను లైనసతుల నుమ్మలికంబు వోరయ కుండం గరుణ నరయుచుఁ గృప యుయుత్సు సంజయులకుం గౌరవామాత్యులకు మన్ననలు సలుపుచుఁ గుంతీదేవికి శుశ్రూష యాచరించుచుఁ బాంచాలికి సౌమనస్యం బాపాదించుచు ధౌమ్యునకు సగౌరవంబుగా సకలసంపదలు నొసంగి విస్మయంబుగ దేవపితృపూజనంబులు నతిథితర్పణంబులు వైదేశిక విప్రార్చనంబులు దీనానాథపోషణంబులుం బరమసంతోషంబుతో నడపుచుం గృష్ణు నారాధించుచు సమస్తపౌరజనపదలోకంబులమనంబులం బ్రమోదంబు పరిపూర్ణం బగునట్లుగా నిర్విఘ్నం బగు ప్రవర్తిల్లు చుండి యొక్కనాఁడు రేపకడ గృష్ణుని యున్నమందిరంబునకుం బోయి 1

సీ. మణిహేమపర్యంక - మహితోపవేశను, సురుచిరాభరణవి - స్ఫురితగాత్రుఁ
గౌస్తుభరత్నవి - కాసివక్షస్థలుఁ, బీతకౌశేయసం - వీతమూర్తి
మేరుతటీగత - మేఘసంకాశు న, క్షత్రగణావృత - గగనసదృశు
నూతనోదితరవి - ద్యోతితోదయగిరి, నిభు రుక్మబద్ధేంద్ర - నీలతుల్యు
నమ్మురారిఁ గని కృ - తాంజలి యై భక్తిఁ, జిత్తవృత్తిగరము - జొత్తిలంగ
నంత కంత కాన - నానన మలరంగ, నిట్టు లనియెఁ దియ్య - మెసఁగ మెసఁగ 2

తే. కడపితే రాత్రి సులభసౌ - ఖ్యంబుగా మ, నంబు గాఢప్రసన్న మే - యంబుజాక్ష
దైవ మగునీదుబుద్ధిక - తమునఁ గాదె, ధర్మగతిఁ బ్రాభవంబుఁ బొం - దంగఁ గంటి 3

వ. త్రిభువనవ్యాప్తవిక్రముండ వగునీకటాక్షంబునకలిమిం గాదె జగత్త్రయసంభావ
నీయుండ నై వెలింగితి ననుచుం జేరంబోయి. 4

క. తనయుచితాలాపములకు, మనుజేశ్వర మాధవుండు - మఱుమాట యొకం
డును బలుకక భవ్యధ్యా, ననిరూఢత నున్నయపుడు - నరపతి యతనిన్. 5

వ. నిరూపించి యి ట్లనియె. 6

సీ. పంచాత్మకం బైన - పవనంబు నిగృహీత, మైనది భవదింద్రి - యములు మనము
నం దాఁగఁబడ్డవి - యవియును నదియును, బుద్ధియం దొదిఁగించి - శుద్ధ మైన
నాలవ తెరువున - లోలతారహితముల్, గాఁగ నిన్నియును సం - కలితములుగ
నంచితక్షేత్రజ్ఞు - నందుఁ గూర్చినవాఁడ. వీపరమధ్యాన - మేమికతన
నోలసెనో కో లోకములకు నొం-డొక్క వింత, లేక నెమ్మది యున్నది-యే కరఁబు
విస్మయముఁ బొంద వామది - వినఁగ నర్హ, మేని వినిపింపవే నాకు-నిత్తెఱంగు. 7

వ అని యిట్లు ధర్మనందనుఁడు నివాతనిశ్చలదీపప్రకారంబున నున్నయప్పరమపురు
షుం బ్రార్థించి మఱియును. 8

తే. క్షరము నక్షరమును నీవ-కర్తయును వి, కర్తయును నీవ యాద్యంత-గతులు నీవ
యొక్కఁడ వై వెలిఁగెదుపురు - షోత్తమాభి, ధానవాచ్య వినమ్రవా - త్సల్యకల్య. 9

వ. ప్రసన్నుండ వగుము నాడెందంబుసందియంబు వాయం జేయవే యని విన్నవించినం
బాంచజన్యధరుండు బుద్ధియు మనంబు నింద్రియంబులును గోచరత్వసంప్రాప్తం
బులు గావించి కొంచెపువగవున నెమ్మొగం బొప్ప నప్పుడమిఱేని నాలోకించి
యి ట్లనియె. 10

సీ. గంగ యెవ్వనిఁ దశ - గర్భంబునం దతి, శ్లాఘాసమేత యై - సంభరించె
భార్గవుం డెవ్వనిఁ - బరమశిష్యుఁడు గాఁగఁ, బడసె గురుత్వ మె - క్కుడుగ నెగడె
నారాముఁ డెవ్వని - తో రాసి యిరువది, మూఁడుదినములకు - వాఁడి దొఱఁగెఁ
గాశీశుకన్యలు - గారణంబుగఁ బోరి, యెవ్వని కోడి ర - నేకనృపులు
వేదములు నాలుగును ధను-ర్వేదమును మ, హాస్త్రములుఁ జెంది యెవ్వని-యందు వెలిఁగె
నట్టిభీష్ముండు నన్నిప్పు-డాత్మఁ దలఁచు, చునికిఁ దద్గత మయ్యె నా-మనము నధిప.

క. అనలము శమించుచాడ్పున, ననఘ యతం డుపరమోన్ము - ఖాత్ముం డై తా
ననుఁ దలఁచె నింద్రియంబులు, మనమునఁ దగ నిగ్రహించి - మహితసమాధిన్. 12

క. శరతల్ప గతుం డతఁ డే, శరణంబుగ నాశ్రయించి - సద్భావవ్యా
ప్తిరతుం డగుటను విను త, త్పరత నతనియందు నాదు - భావం బెలసెన్. 13

వ. ఇది మదీయధ్యానంబు తెఱంగు. అమ్మహాత్ముండు వసిష్ఠశిష్యుండు. భూతభవిష్య
ద్వర్తమానవేది. సర్వవిద్యాధారభూతుం డాత్మం డస్తమించిన ధాత్రి యస్తమిత

సుధాగభస్తి యగురాత్రియుంబోలె నగు. సకలజ్ఞానంబులు నవాశ్రయంబు లై పొనుంగుపడుం గావున నీ వతనిపాలికిం బోయి నీయడుగందలంచినయఖిలధర్మంబులు నడిగి చెప్పించుకొని నిశ్శేషనిరస్తసంశయుండవు గా వలయు నని యాన తిచ్చిన నమ్మానవపతి గద్గదకంఠుం డగుచు నావైకుంఠున కి ట్లనియె. 14

ఉ. శంతనుసూనుగౌరవము - సర్వము మున్నును వింటి విప్రుల
త్యంతము వేడ్కఁ జెప్ప నతఁ - డట్టి డ యాతని నీవు మున్నుగా
నెంతయు భక్తిఁ గాంచుటకు - నే మదిఁ గోరెద నమ్మహాత్ముఁ డుఁ డా
సంతస మందు నీ దయిన - సన్నిధిఁ గాంచిన భక్తవత్సలా. 15

వ. ఉత్తరాయణంబు వేచికొని యున్న యన్నరోత్తముండు బ్రహ్మమయసిధి యయిననీ సందర్శనంబు గోరు నామీఁదియనుగ్రహంబునను నతనియెడం గలుఁగుపరిగ్రహంబునను దేవా నీ విట్లు సేయవలయు ననుటయు నద్దేవకీనందనుండు సమీపగతుం డగు సాత్యకిం గనుంగొని రథంబు సమకట్టు మని దారుకునకుం జెప్పుము భీమార్జున నకుల సహదేవులను గృప యుయుత్సు సంజయులను రావింపు మనిన నతం డట్ల చేసె. దారుకుండునుం దే రాయితంబు గావించె. 16

క. అది రత్నరుచులపెల్లున, నుదితార్కు నిఁ బోలి వెలుఁగు - చుండెను జవసం
పదుదీర్ణసత్త్వసారా, శ్వదసుగ్రీవాదిసధ్య - సంశోభిత మై. 17

వ. ఆసమయంబున నక్కడం బారాశర్య నారద దేవల దేవస్థాను వాత్స్య దేవరాత ప్రభృతిపరమమునీంద్రపరివేష్టనంబు గలిగి గాంగేయుండు గ్రహగణపరివృతుం డైన చంద్రుండునుంబోలెఁ దల్పీభూతశాతశరశతంబులచేత శోభిల్లి సందర్శనీయ గభస్తివితానుం డగునస్తమయసమయభానుం గ్రేణిసేయుచుఁ గృష్ణుం జిత్తంబున నిరతిశయనిష్ఠ నిలిపికొని యుండి చేతులు మొగిడ్చి సుపుష్టస్వరంబున ని ట్లని స్తుతియించె. . . అంత నిక్కడ. 18

ఉ. ఆదివిజాపగాతనయు - నంచితభక్తికిఁ బ్రీతిఁ బొంది దా
మోదరుఁ డప్పు డ న్నర వ - రోత్తముచిత్తమునందు సర్వ లో
కాదృతదివ్యబోధమహి - మాతిశయం బుదయింపఁ జేయుచుం
దా దయతోడ సెజ్జ డిగి - ధర్మజుమోమునఁ జూడ్కి పర్వఁగన్. 19

వ. భీష్ముపాలికిం బోదము ర మ్మని పలికి కృతపరికరబద్ధుం డై వెడలి రథంబెక్కి సాత్యకిం దనపిఱిందివలనం బెట్టికొనియె ధర్మనందనధనంజయు లొక్కతేరును మారుతినకులసహదేవు లొక్కయరదంబును గృపయుయుయుత్సుసంజయు లొక్కస్యంద

నంబును నెక్కి తదీయంబు లగు నేమినినాదంబులు దిక్కులం బిక్కటిల్ల నుచిత పరివారపరివృతు లై నడచిరి... అని యిట్లు సల్లాపంబులు సేయుచు మాధవ ధర్మజు లరిగి యోఘవతీతీరంబున శరతల్పగతుం డై గాంగేయుండు దున్నెడి కనతి దూరంబున రథావతరణంబు సేసిన భీమసేనప్రముఖులుం గృపాదులు నరదంబులు డిగ్గిరి. ఇట్లందఱు నంతరంగంబులేకాగ్రంబులు సేసికొని చేరం జని సాత్యవతేయ ప్రభృతిమునీంద్రులకుం బ్రణమిల్లి మఱి భీష్ముం గాంచిరి. అట్లు సముచితప్రకారంబునం గని యతనిం బరివేష్టించి యాసీను లైరి అప్పు డచ్యుతుం డమ్మహాత్ము నాలోకించి యుమ్మలించుచు నతనితోడ. 20

సీ. నీకు మునుపోలె న - వ్యాకుల మై యున్న, యదియె చిత్తంబు ని - ద్రాంగపీడ
మనము మనక్లిష్టపీడ - కంటె నంగురు లుగ, బోరి ముల్కి యొడలిలో - నున్న నలంత
సేయు నెమ్మెయి బహు - సాయకకీలిత, మైనయంగంబునో - ర్పెడు గ నేల
యిట్టు లుండియు నించు - కేనియు దుఃఖంబు నొం, బోకయును పితృని - సర్గద్రిం గాడ
దేవతలకు నైన - నీ వుపదేశింతు, కలియుగములకు వి - కార మొందు
కుండ బోధస్ఫూర్తు - లారులు నీ దేర్పంగ, వలవ కునికి నిజ ము - వార్ధకేజ. 21

క. భూతం బులసంసరణము, భూతభవద్భావికార్య - ములుం గిర్తనము
ద్యోతితనభంగి యును నీయఱు, చేతివి గావె కురువంశ - శేఖరజన్మా 22

వ. అని వెండియు. 23

ఉ. రాజవె రాగహీనుఁ డవె - రాజితసుందరమూర్తి యట్టివి
భ్రాజితసంపదున్నతివి - భాసితవర్తనుఁ డట్టె కామునీ
రాజిమనోజ్ఞభంగిచతు - రత్వఘనుం డవె బ్రహ్మచర్యదీ
క్షాజితమన్మథుండు నవె - జన్మము లిట్టివి యెందుఁ గల్గునే 24

క సురలును నసురులు యక్షులు, నురగులు గంధర్వులును మ - హోద్ధతిఁ బైపై
నురవడి వచ్చిన నొకఁడవ, పరాజితులఁ జేయు దుగ్ర - బాహాస్ఫురణన్ 25

చ. దమమును సత్యముం దపము - దానము వేదములందుఁ జూపవే
దమునను గల్గునైపుణియు - ధర్మవిధిజ్ఞతయుం విరోధభూ
రమణవిమర్దనక్రమవి - రాజితశౌర్యము నీకుఁబోలె నై
జము లగువాఁడు వే ఱొకఁడు - శంతనునందన పుట్టఁ డెన్నఁడున్ 26

క. వే యేల సంభవించునె, సాయకతల్పముననుండి - చావఁగ నొల్లక్
నాయిచ్చఁ గాక యనునరుఁ, డేయుగమునఁ జూడ వినఁగ - నెచ్చట నైనన్. 27

తే. వసువులందును బెద్దవు - వాసవాది, సురుల మిగులఁగు గుణముల - ధరణిసురులు
చెప్ప వింగు నీమహిమ నా - చిత్తమునను, గంగు ననుపమతేజ గం - గాతనూజ. 28

వ. అని పలికి పాండవాగ్రజుం జూపి 29

సీ. నీవు తపోవిశేషమహ - నీయతఁ జేసి జగంబు లన్నియుఁ
భావమునం గనుంగొన న - పాలమహోత్తర చాలు దీర్ఘ
త్యావిలచిత్తుఁ డయ్యె సుహృ - దాప్తమృతిఁ గురటిల్లి నెవ్వగం
గోవడఁగ ద్రోవు నీ దయిన - పుణ్యతమస్ఫుటవాక్యపద్ధతిన్ 30

వ. నాలుగువర్ణంబులకును నాలు గాశ్రమంబులకు నిర్దేశింపఁబడిన యర్థంబు లని నాలుగు
వేదంబులం జెప్పినధర్మంబులు నీవు విదితంబులు ప్రవృత్తినివృత్తులును సాంఖ్య
యోగంబులును బురాణేతిహాసంబులు ధర్మశాస్త్రంబులు నవగతంబులు సర్వసంశయ
చ్ఛేదనదక్షుండ వీ వీక్షితిపతి నాదరింపుము. శోకమోహగ్రస్తం బగుజనంబు నిస్తరిం
పం జేయుటగదా మిముబోఁటుల బుద్ధివిస్తారంబునకు ఫలంబు. అనిన విని మొగం
బించుక యెత్తి కృతాంజలి యై గాంగేయుండు గోవిందున కిట్లనియె 31

క. కర్తయును భర్తయును సం, హర్తయు జగములకు నీవ - యాశ్రితజనఘో
రార్తినిరాపనివు సం, కీర్తనయోగీశ్వరేశ - కృష్ణ హరే యన్ 32

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రశంసించి నాకు మే లెయ్యది దానిని నీదివ్య
చిత్తంబునం దలంపు మనవుడు నచ్యుతుం డిట్లనియె. 33

తే. అనలభక్తి నిత్యంబు నా - యందు నీకుఁ, గలిమిఁ జేసి నీయంతరం - గమున నాగు
దివ్యరూపంబు నాలయించి-తిం బ్రమోద, భాజనం బైతి భీష్మ త-పస్స్వరూప.

వ. మఱియు నేమి పలుకు నేల యని వెండియు 35

క. భక్తియు నార్జవమును సం, యుక్తము లై యున్న యట్టి - యుల్లంబున నా
సక్తి నిరతము నుండ దొరకఁడు వి, యుక్తం బైనను వసింప - నుర్వీనాథా. 36

తే. అనఘ యినుఁ డింక నేఁబది-యాఱుదివస, ములకుఁ దాక్షిణాయన-మునఁ జరింపఁ
దొడఁగు నీ వప్డు దేహంబు - విడిచి యేగు, దపునరావృత్తిపదమున - కభినుతముగ.

వ. వీర వసువులు విమానంబులతో నంతరిక్షంబున నంతర్హితు లై నీరాక ప్రతీక్షించి
యున్నవా రది య ట్లుండె నీవు సన్న నీలోకంబున నెఱుక పొసంగుపడుంగా
వున వీ రెల్ల సకలధర్మవివేకలబ్ధికి నయి యరుగుదెంచి పరివేష్టించి యున్నవా రని
తత్కాలసమాగతియోగ్యజనంబులం జూపి ధర్మపుత్త్రు నుపలక్షించి శోకోపహత

బహుశ్రుతుం డగునితండు దెలి వొందునట్లు గా ధర్మార్థసమాధియుక్తంబులగునుక్తి విశేషంబుల ననుగ్రహింప వలయు ననుటయు నద్దేవకీనందనునకు దేవవ్రతుం డిట్లనియె. 38

క. శివ నారాయణ యచ్యుత, భవదీయము లైనమధుర - భాషణములు నా
చెవు లానిన నమృతరస, ప్లవనంబునఁ బోలెఁ బ్రమద-భరితుఁడ నైతిన్. 39

తే వాగ్విభుఁడ వైననీవచో - వైభవంబు, లో సమస్తంబు నుండుట - లోకనాథ
నీదుసన్నిధిఁ బలుకంగ - నేర రాదు, పద్మభవునకు నే నెట్లు - పలుకువాఁడ. 40

వ విషానలసదృశంబు లగుశరంబులు సేయువేదనంజేసి యంగంబులు నంతరంగంబు నవశంబు లై యున్నయవి ప్రతిసంభాషణక్షమ లేదు దౌర్బల్యంబున నెలుంగును నాలుకయుం బ్రస్ఫుటవర్తనంబులు గా వే నెవ్విధంబున భాషింప నుత్సహింతుఁ బ్రతిభాషాశక్తి లేమి సహించి నాదెసం బ్రసన్నుండ వగుము ధర్మపుత్త్రున కెయ్యది హితం బది నీవచెప్పుము నీ వుండ నేను జెప్పుట గురుం డుండ శిష్యుండు సెప్పిన విధంబు గాదె యనిన విని భక్తార్తిహరుం డైనహరి యతనితో ని ట్లనియె. 41

క. కురువంశధురంధరుఁ డగు, పరమార్థజ్ఞునకు వినయ - ఫణితిం దగు ని
ర్భరశర వేదన సెప్పితి, వరములు మాఁ డిత్తుఁ గొనుము - వసుధాధీశా. 42

క. శరములవలనను మూర్ఛం, బొరయక యొక్కింతిడప్పిఁ - బొరయక నొప్పిం
బొరయక యవిద్ధగాత్రుని, కరణి సుఖాత్ముఁడవు గమ్ము - కౌరవనాథా. 43

ఆ. అనఘ నీరువట్టు - నాఁకలియును నెప్డుఁ, బొరయ కుండునట్టి - భూరిశక్తి
నీకుఁ గలుగ నేను - నెమ్మనంబునఁ దలం, చితిఁ దదీయపీడఁ - జెంద కుండు. 44

క వినుము సకలభూతములవ, ర్తనములు గనునపుడు బుద్ధి - దవులఁబడక యెం
దును బరఁగి దివ్యబోధం, బున నలవడునట్టి పెంపుఁ - బొందు మనింద్యా. 45

వ. మత్ప్రసాదంబున నీదృశప్రభావనిరూఢుండ వయి నెగడు మని పల్కుటయుం బారాశర్యాదిపరమార్యు లప్పద్మనాభుం బ్రశంసించిరి. దివంబున దేవదుందుభులు మొరసె. మురారి భీష్మ ధర్మజులమీఁదం గుసుమవర్షంబు గురిసె. అప్సరోగణగానంబు వీతెంచె. అచ్చటియందఱు నాశ్చర్యప్రమోదభరితహృదయు లైరి. తదనంతరంబ యంబుజాప్తుం డపరగిరిశిఖరం బలంకరించె. అప్పు డమ్మునులచ్యుతగాంగేయకౌంతేయాగ్రజుల నామంత్రితులం జేసి గమనోన్ముఖు లగుటయు నమ్మాధవయుధిష్ఠిరులును సాత్యకియును భీమార్జునయమలులును గృపయుయుత్సుసంజయులును వారలకుం బ్రణమిల్లిరి. వారలును రేపు వచ్చెద మని నిజస్థానంబులకుం జనిరి. కృష్ణాదులును

దేవవ్రతున కభిముఖు లగుచు నట్ల పలికి వలగొని యరిగి యరదంబు లెక్కిరి. వారి పిఱుంద మున్ను వచ్చినవారణరథతురగపదాతులు బలసి కొల్చి పోవం బురంబునకు వారు వోవుసమయంబున. 46

చ. దినమున నెల్ల నుష్ణకర - దీప్తులు పర్వి రసంబుఁ బీల్వ వం
దినసకలౌషధిప్రవిత - తిం దలి వొందఁగఁ జేయు నేర్పు గ
ల్గినతనరశ్మిజాలమున - లీలఁ జకోరములన్ మదింపఁ జే
య నుదయ మై వెలింగె నమృ - తాంశుఁడు సేనకుఁ దప్పు సేయుచున్. 47

వ. ఇట్లుదయించిన సుధామరీచి లోచనప్రీతి యాచరింపం బెంపు సుభగంబుగా శౌరిప్రముఖులు పురప్రవేశంబు సేసి నిజనివాసంబుల నుచితవర్తనంబుల నారాత్రి గడపిరి. ప్రభాతం బగుటయు. 48

తే. మంజుపాఠకరవమును - మధురమాగ, ధస్వనంబును వినుచు మా - ధవుఁడు మేలు
కాంచి తత్కాలసముచిత - కర్మజాత, మాచరించి భూసురులకు - నర్చ లిచ్చి. 49

వ. మంగళప్రకారంబున నలంకరించి నిజాకృతి యాదర్శంబునందు దర్శించి యప్పుడు సన్నిహితుం డైనసాత్యకివదనం బవలోకించి భీష్మపాలికిం బోవుటకుం బాండవాగ్రజుం డాయిత్తం బగుట యెఱింగి మనవెలువడుచునికి యెఱింగింపు మని పనిచె. అంతకు మున్న యక్కురుపుంగవుండుఁ బుణ్యసంకీర్తనాశీర్వాదంబులను భద్రగానవాదంబులను వీనులు వికసిల్ల మేలుకాంచి సమయకృత్యంబు లనుష్ఠించియుండ నాకృష్ణానుజుం డతనిం గని గాంగేయుకడ కరుగుటకై రథంబు సన్నద్ధంబు సేయించి నీరజనాభుఁడు నీరాక వార్చి యున్న వాఁ డని చెప్పుటయు నమ్మనుజపతి పార్శ్వగతుం డగుపార్థుం గనుంగొని మనయరదంబు సంఘటింపుము నేఁడు మొదలుగా నయ్యెడకు సైనికుల రా నీకు మంతర్గపరివారంబు వచ్చుటుడుపుము శాంతనవుండు సందడిం బడ నర్హుండు గాఁడు విశేషించి పరమగుహ్యార్థంబులగువాక్యంబులు మనకు ననుగ్రహింపం గలవాఁడు గావున నిస్సమ్మర్దంబుగా నుపాసింప వలయు నని పలికి యొక్కింత విచారించి తగురాజులం గొందఱం బేరుకొని ధృతరాష్ట్రవిభుండును వారును వచ్చువారు వారింబిలువం బంపు మనవుడుఁ బిలిపించి యతండు. 50

క. అరదము వన్నిన నాభూ, వరుఁ డతఁడును దాను నెక్కి - వడముడి వే ఱొ
క్కరథమునఁ బిన్నతమ్ముల, నిరువురఁ గలపికొని యెలమి - నేతేరంగన్. 51

క. వినుము మహాభూతము లే, నును సమధికరూపమున వి - నుతభంగిఁ దగం
జను తెఱఁగు దోఁప నెలమిం, జనియెను వసుదేవసుతుని - సదనంబునకున్. 52

వ. రథగమనరవంబునం గృపయుయుత్సుసంజయులుం గూడికొనిరి. అంత. 53

క. దారుకుఁడు వన్ని తెచ్చిన, తేరను వెలుఁవడియె వాసు - దేవుండును న
త్తేరులు నాలుగు నేమిక, లారవ మెసఁగంగ బెరసి - యరిగె నరేంద్రా. 54

క. జనమేజయనృప యంతకు, మును నారదముఖ్యు లైన - మునివర్యులు శాం
తనవునిపాలికి వచ్చిరి, వనజభవునికడకు సురలు - వచ్చువిధమునన్. 55

వ. అట్లు సంయమివరపరిషత్పరీతుం డై యున్న యద్దేవవ్రతునికిం జేర నరిగి శౌరి ప్రముఖులు రథంబులు డిగ్గి. 56

ఆ. తత్సమీపమునకు - ధర్మనందనపుర, స్సరత నరిగి తొలుత - సకలమునులఁ
బ్రణతిఁ దెలిచి కదిసి - బలసి యుపాసించి, రన్నదీతనూజు - నధికభక్తి 57

వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 58

మ. శరతల్పంబునఁ బొల్చుభీష్ముకడకుం - సంప్రీతి నక్కౌరవే
శ్వరుఁడుం దమ్ములుఁ గృష్ణుఁడుం జని ముని - వ్రాతంబుతోఁ గూడ న
ప్పరమోదాత్తుని మట్టు నున్నయెడ నె - బ్భంగిం బ్రవర్తించె వి
స్తరమాధుర్యమనోజ్ఞ సత్కథలు వి - స్పష్టంబుగాఁ జెప్పవే. 59

వ. అని యడిగిన నమ్మహీవిభునకు వైశంపాయనుం డిట్లనియె మున్ను ధర్మపుత్త్రుండు రావించిన ధృతరాష్ట్రుండును రాజులు నతనిపజ్జ నరిగి వారును గాంగేయు నుచిత ప్రకారంబునం గాంచి కొల్చి యుండి రట్టియెడ నారదుండు ధర్మపుత్త్రాదుల నమ్మేదినీపతులం గలయం గనుంగొని. 60

క. శంతనునందనుఁ డపరది, గంతప్రాప్తరవియట్టి - డయ్యె నితఁడు లో
కాంతరగతుఁ డగుటకు ము, న్నంతర్గతకిరణముల సంశ - యము వాయంగన్. 61

వ. సకలధర్మప్రకారంబులు నడిగి తెలిసికొం డనినఁ బ్రశ్నపాటవంబులేమి నందఱు నొండొరువుల మొగంబులు సూచు చుండఁ బాండవాగ్రజుండు పుండరీకాక్షున కిట్లనియె. 62

తే. నీవు దక్కంగ మందాకి - నీతనూజు, తోడిసల్లాపములకు యో - గ్యులు ముకుంద
కలరె యెందును ధర్మవే - దులకు నెల్ల, గురుఁడ వీవ సంభాషణ - పరుఁడ వగుము.

వ. అనుటయు నచ్యుతుండు భీష్మున కభ్యాసమ్ముం డై శారీరమానసకుశలప్రశ్నంబుఁ జేసిన నతండు. 64

ఉ. దేవ భవత్ప్రసాదమునఁ - దీఱె శరీరమునొప్పిడప్పి మ
ద్భావము నింద్రియంబులును - బాటవసంపద నొందె వేదవి
ద్యావిభవంబు నాకుఁ బర - తత్త్వపరిస్ఫుటబోధయుక్త మై
భావిత మయ్యె నాత్మఁ బరి - పక్వదయాకరచిత్త మాధవా. 65

వ. దేవర దివ్యచిత్తంబున నన్నుం దలంచినదానం జేసి బృంహితుండ నయ్యెను గొం
డొక ప్రాయంబువాఁడునుం బోలె నయితిఁ జెప్పవలయువాని నెల్లం జెప్పెదఁ
బాండవశుభకరం బైనదాని నీ వేల చెప్పవు నీతలం పేమి సెప్పవే యనినఁ గృష్ణుండు
గాంగేయున కి ట్లనియె. 66

తే. అనఘ శ్రేయస్సునకు యశం-బునకు నేను, మూలకందంబ విను చంద్ర-ముండు శీత
కరణుఁడనుమాటవిస్మయ-కరమె చెపుమ, యశముపార్జింపఁ గ్రొత్త పెం-పగు నెనాకు.

క. పరమ మగుయశము నీకును, ధరణిం గలిగింపఁ బూని - తాత్పర్యమునం
బురుషవర నాదుబుద్ధి, స్ఫురణము నీమనమునందుఁ - జొనిపితి నెనయన్. 68

తే ధరణి యెందాఁక నుండు సు-స్థిరత నీదు, కీర్తి యందాఁక నక్షయ స్ఫూర్తిఁ దాల్చి
నడవఁగలయది నీవు సె-ప్పెడిసువాక్య, ములును వేదతుల్యంబులై-వెలయుచుండు.

క. ధర్మజునకు నీచెప్పెడు, ధర్మస్థితివాక్యసమితి - తాత్పర్యముతో
నిర్మలు లై కొనియాడెదు, ధార్మికులకు నుభయజగదు - దాత్తత గలుగున్ 70

వ. కావున నిట్లు సేసితి భవదీయధర్మవేదిత్వంబును సవిశేషప్రకారంబుగా నీమనుమలు
ధర్మజభీమార్జునకులసహదేవులు భద్రభాజనంబులు గా నీయున్న మహీపతులుఁ విని
కృతార్థజన్ములు గా నఖిలధర్మప్రకారబోధకంబు లగువాక్యంబులు సెప్పు మను
టయు శాంతనవుం డట్ల చేసెద నని పలికి యాదరభరితుం డయి యి ట్లనియె. 71

సీ. ఎవ్వఁడు పుట్టిన - నెల్లమునీంద్రులు, నత్యంతసంప్రమో - దాత్ము లైరి
పరమధార్మికు లైన - భరతులయందును, నెవ్వరు నెవ్వని - నెనయ లేరు
సత్యంబు దాంతియు - శౌచంబు శాంతియు, నలవడి యెవ్వని - యందు వెలయుఁ
బాత్రదానాధ్వర - బంధురక్షాదిధ, ర్మంబు లెవ్వనికిఁ బ్రి - యంబు లెపుడుఁ
గామమున నైన విపులార్థ - కారణమున, నైన భయమున నైనను - నపథవర్త
నంబునకుఁ జొరఁ డెవ్వాఁడు-నన్ను నేమి, యడుగఁదలఁచె నాధర్మజుం-డడుగుఁ గాక.

వ. అనుటయు నతనితో నచ్యుతుండు. 73

చ. గురులను బంధుమిత్త్రులను - క్రూరశరంబులఁ గూల్చె నుగ్రతం
నరుల ననేకకోటుల ర - ణంబునఁ దాఁ దెగటార్చెఁ గాన ని

కురుపతి నీసమత్వమున - కుం గదియం బయిలోడెడుం గృపా
విరహితకార్యకర్తృఁడు - నీఁ డని యాడుదొ యక్కాలంబునన్. 74

వ. అనిన విని వాసుదేవునకు దేవవ్రతుం డి ట్లనియె. 75

సీ. విప్రుల కధ్యయ - నప్రదానాధ్వరా, ధ్యయము లగుకర్మము - లట్ల రాజు
లకు సంగరము తండ్రు-లను బుత్రపౌత్రుల, గురుల నైనను బాప-పరులఁ బోరఁ
జంపుట ధర్మంబు - సమయంబు విడిచి లో, భంబున నన్యాయ - పథమునందు
వర్తించువారి నె - వ్వరి నాహవంబునఁ, బొరివుచ్చఁ గలిగినఁ - బుణ్యకృతియ
యట్లుగాక క్షోణి - తాంబుపూరముఁ గేశ, శైవలంబుఁ గాఁగ - సమరభూమి
నక్కజపునదీచ - యం బొనర్చినరాజు, ధర్మవిదుఁ డనంగఁ - దగు ముకుంద. 76

చ. అన విని ధర్మసూనుఁడు కృ - తాంజలి యై తగ భీష్ము డాయ న
ల్లన చని కేలఁ బాదకమ - లంబు లమర్చి శిరంబు సోఁక వం
దన మొనరించినం బిలిచి - తా నభినందితుఁ జేసి మస్తకం
బుఁ గడునర్మిలిం దనదు - మోమిడి మూర్కొని సాదరంబుగన్. 77

వ. భీష్ముం డాభీమాగ్రజుం గూర్చుండం బనిచి శంకింపక నన్నేమి యైన నడుగు
మనిన నమ్మహీపతి మాధవునకుం బ్రణమిల్లి పారాశర్యప్రభృతిమునివర్యులకు నభి
వాదనం బాచరించి సర్వకౌరవులయనుమతి వడసి యప్పితామహున కభిముఖుం
డై నమస్కరించి యి ట్లనియె 78

చ. అరయఁగ రాజధర్మము స - మాశ్రయ మై నడపుం ద్రివర్గముల్
గురుతరమోక్షధర్మమున - కుం దలఁపం దనప్రాప యూఁతభూ
వర వినుఘోటకంబునకు - వాగెయు దంతికి నంకుశంబు నే
కరణి నివారకంబులు జ - గంబుల కట్టుల తాను నెమ్మెయిన్. 79

క. వ్యాకులతఁ బొందిరూపఱు, లోకస్థితి తొంటిరాజ - లోకముచే నం
గీకృత మగుధర్మ మనం, గీకృత మగు నేని నీత - కిల్బిషచరితా. 80

క. తరణి వొడిచి తమము నెఱుచు, కరణిని లోకమునఁ గలుగు - కల్మష మెల్లన్
ధరణిపతి ధర్మ మాత్మ, స్ఫురణంబునఁ జెఱుచు విమల - బోధనచరితా. 81

ఆ. అనఘ నీదుబుద్ధి - యతిలోక మగుటయుఁ, దెలిసి కొనఁగ నాకు - వలయునట్టి
ధర్మకోటి నీవ - తగఁ జెప్ప వినవల, యుంటయుఁ జెప్ప నంబు - జోదరుండు. 82

ఆ. ధర్మవిదులు రాజ - ధర్మస్వరూపుఁ గాఁ, జెప్ప విందుఁ దద్వి - శేషవృత్తి
భరముగాఁ దలంతు - నరవర చెప్పవే, మున్ను రాజధర్మ - ములఁ దెలంగ. 83

చ. అనుటయు నాపగేయుఁడు మ - హాత్త్వసమంచిత మైనధర్మము
న్ననుతవిధాతృభావమహ - నీయుఁడు గృష్ణుని వేదమూర్తి నాఁ
జనుధరణీసురావళిఁ బ్ర - సక్తిఁ దలంచి నమస్కరించి య
జ్జనపతివక్త్రమాదరర - సప్లుతదృష్టిని జూచి యిట్లనున్. 84

క. నృపధర్మము లన్నియు నీ, కుపదేశించెద విశంక - యోక్తుల మఱియున్
విపులఫలవంత మగుధ, ర్మపథంబును నడిగితేనిఁ గ - రము వివరింతున్. 85

---

# 38. యుధిష్ఠిరాదులును గాంధారీ ధృతరాష్ట్రులును నొండొరులయెడల నడచికొనిన ప్రవర్తనము.

(ఆశ్రమవాసపర్వము. ఆ. I.)

వ. అట్లు పితృపితామహక్రమప్రాప్తం బయినసామ్రాజ్యంబు జగత్పూజ్యప్రకారం బునం గైకొని మహాధ్వరప్రముఖధర్మకార్యధుర్యులును సముపాసితార్యులును దయావిధేయులు నగు పాండవేయులు ధృతరాష్ట్రువలన నెవ్విధంబువారై నడచిరి హతపుత్త్రమిత్త్రామాత్యుండును గతైశ్వర్యుండు నగునారాజును యశోమహిత యగు గాంధారియు నెట్టిభంగి వర్తించి రత్తెఱంగు నా కెఱింగింపుము. 1

సీ. అనవుడు నమ్ముని - యమ్మహీపతికి ని, ట్లను బాండునందను - లాంబికేయు
నెడ భక్తివినయంబు - లెసఁగంగ వర్తింతు, రతనియోగక్షేమ - మరసి యెపుడుఁ
దత్సమీపంబునఁ - దగ నిల్చి తమకు నె, య్యది యైన నెఱిఁగించు - నట్లు గాఁగ
నుందురు విదురుఁడు-యుయుత్సుసంజయులు దా, రును నిత్యమును వచ్చి-వినతిఁ జేసి
కొలిచి కూర్చుండి యానృపు-నలఘుకార్య, విధము లేర్పడ నడిగి య-వ్విభునిచెప్పి
నట్ల చేయుదు రతఁడును - నాదరంబు, గాఢవత్సలత్వంబును - గలిగి యుండు. 2

ఉ. కౌరవనాథ కుంతియును - గౌరవ మొప్పఁగ వచ్చి కొల్చు గాం
ధారి నతిప్రయత్నమున - ద్రౌపది తాను సుభద్రయున్ ముదం
బారఁగ నిత్యముం గొలుచు - నక్కురువంశమహత్తరల్ మహా
దారము లైనవస్తువు లు - దాత్తత నిత్తురు వార లందఱున్. 3

క. చిత్రాంగదయు నులూపియు, ధాత్రీశ్వర వత్తు రెపుడు - ద్రౌపదితోడన్
గాత్రములు భూరి వినయా, మత్రములుగ సుబలసుతఁ బ్ర-మదమునఁ గొలువన్. 4

ఆ. ఆతల్లికిఁ దండ్రికి సం, ప్రీతి యలరఁ గుడువఁ గట్టఁ - బెట్ట నుదాత్త
స్ఫీతంబు లైనవస్తు, వ్రాతంబుల నిచ్చు ధర్మ - రా జనుదినమున్. 5

తే. గుళ్లఁ జెఱువులుఁ గట్టించుఁ-గోరి యూళ్లు, నగ్రహారముల్ గావించు-నాంబికేయుఁ
డధిప ధర్మతనూజుఁ డ - త్యంతహర్ష, చిత్తవృత్తి యై యనుమతి - సేయుచుండ. 6

క. జనవర ధర్మజుఁ గొలువం, జనుదెంచినయట్టివివిధ - జనపతు లెల్లన్
మును ధృతరాష్ట్రునిఁ గొలుతురు, విను మా కొడుకుమది పల్ల - వించును దానన్.

క. సూనులు లేమిం గలిగెడు, దీనత్వము దోఁప కుండఁ - దేజస్సౌఖ్యా
నూనులుగఁ జేయు ధర్మజుఁ, డానరపతి నతనిదేవి - నతులితభక్తిన్. 8

సీ. వంశవృద్ధులు పుత్త్ర - వర్గవియుక్తులై, యున్నవా రేమిట - నుమ్మలింతు
రో యనుపుయిలోట - నాయుధిష్ఠిరుఁడు ద, మ్ములకును దగునమా - త్యులకు నిష్ట
భృత్యులకును మీరు - ప్రీతియు భక్తియు, నాంబికేయునియెడ - నతిశయిల్ల
నారాజుపంచిన - యట్లు చేసి చరింపుఁ, డతని నారాధించు - టస్మదీయ
చిత్తమునకుఁ బ్రియము - సేయుట యతనికి, మనసు గానియట్టి - పని యొనర్చ
టగ్గలంపుదుగ్గఖ - మానహించుట యని, యనుదినంబుఁ జెప్పు - మనుజనాథ. 9

క. విను మెల్లవారు నతనివ, చనములు మది నూఁది యట్లు - చరియింప మరు
త్తనయుండును నమ్మెయివ, ర్తనము నడపు చుండు మనసు - దద్దయు నెరియన్.

క. ద్యూతంబున దుర్యోధను, చేతం దమపడినపాటు - చిత్తంబున క
త్యాతురతఁ జేయు చుండుట, నాతఁడు ధృతరాష్ట్రుఁజూచి - యలుగు మనమునన్.

తే. శ్రాద్ధదినసంబులందుఁ బు - త్త్రవ్రజమున, కాంబికేయుండు గోకన - కాదిదాన
కీర్త్యముగఁ బారలౌకిక - క్రియలు సేయు, నట్లుగా సంఘటించు ధ - ర్మాత్మజుండు.

సీ. అతులభోగంబును - నంచితత్యాగంబుఁ, దొల్లింటియట్టుల - చెల్లఁ జేయు
ధృతరాష్ట్రునకు ధర్మ - సుతుఁడు గాంధారికిఁ, బూర్వప్రకారసం - పూజ్యదాన
నిరతిఁ జెల్లించు న - క్కురువృద్ధుఁ డిమ్మెయిఁ, బాండుపుత్త్రులు దన్నుఁ - బరమభక్తి
శిష్యవర్తనమున - సేవింపఁ దానును, గురునట్ల వాత్సల్య - పరత నెపుడు
వారలకు శ్రీయు నాయువు - వైరిజయము, మానసమున నాశాసించు - మానవేంద్ర
యతనితోంటివర్తనముఁ ద-త్సుతునికీడు, నాత్మఁ దలఁపఁ డెన్నండు ధ-ర్మాత్మజుండు.

క. విను మతనితెఱఁగెఱిఁగి పరి, జనములతో నాంబికేయు - చరితము దుర్యో
ధనుకొలఁగామియు నెవ్వా, రును వాక్రువ్వంగ వెఱతు - రు కురుప్రవరా. 14

సీ. రాజ్యాధిపత్యసం - పూజ్యత్వమున ధృత, రాష్ట్రపాండుసుతాంత - రంబు గాన
రాకలులు జానప - దోత్కరమునఁ బౌర, వర్గంబునందును - వసుమతీశ
యమ్మెయి నడపెడు - నప్పాండవాగ్రజు, వలన నిజాత్మజు - వలనికంటె
నక్కురురాజు ప్రి - యం బందు న ట్లున్న, యక్కాలమునఁ బవ - నాత్మజుండు
సన్నిహితుఁ డైనయప్పు డ - జ్జనవిభుండు, దనతనూజులఁ దలఁచి సం - తాప మందు
నతనిఁ గనుఁగొని యబ్భముఁ-డతనిసుతులు, దమ్ముఁ బఱచినపాటులు-దలఁచియలుగు.

తే. హృదయముల నొండొరులఁ దెస-నిట్టివార, లయ్యు నతఁడు నతండు న-న్యోన్యభావ
నములయప్పుడు మృదులవి-న్యాస మొప్ప, నాడుదురు చుట్టములు మెచ్చ-నట్లుగాఁగ.

వ. ధృతరాష్ట్రుం డేకతంబ యున్నయెడ వృకోదరుం డతనికి నింత నంత నుండి గాంధారియు విను చుండ. 17

సీ. అంధునికొడుకుల - యం దొక్కరునిఁ దప్పఁ, బో నీక ద్రుంచితి - భూరిశక్తి
దర్పితం బైనమ - ద్బాహుపంజరము సా, చ్చిన రిపురాజన్య - సింహములకు
వెడలంగ వచ్చునే - వెంగలు లై వారు, గయ్యంబు సేసిరి - గాక నన్ను
నెఱిఁగి గిన దొడరుదు - రెట్టులు దుర్యోధ, నాదుల నని దెగ - టార్చినట్టి
నాదు వోర్గండమములఁ జంద-నం బలంది, కుసుమదామముల్ సుట్టి మ్రొ-క్కుదు మహోష
కారు లరయంగ దైవముల్ - గావె యనుచుఁ, దదీయమర్మంబు లెల్ల భే-దిల్ల నధిప. 1౮

వ. దీని ధర్మనందనుండును ధనంజయుండునుం గుంతియు ద్రౌపదియు నెఱుంగరు. కవ లొక్కొక్క మాటిమ్మాటలు విని సంతసిల్లుదురు. ధర్మనందను తెఱం గెఱుంగుటం జేసి పుయిలోడి తా రేమియు నాడరు. ధృతరాష్ట్రగాంధారులుం గాల పర్యాయంబు గనికొని డెందంబులు గఁద నూర కుండుదురు అట్టివంగిఁ బంచదశవత్సరంబులు సనియె. అంత నొక్కనాఁ డయ్యంధనృపతి బంధుజనంబులం గూర్చి ధర్మనందను రావించి యతండు విను చుండ గద్గదకంఠుం డగుచు వారలతోడ. 19

## ధృతరాష్ట్రుఁడు ధర్మజునితోఁ దనమనోరథంబు దెలుపుట.

సీ. నాకతంబునఁ జేసి - యాకౌరవులకు నా, శంబు వాటిలుట ది - ల్లంబు మీకు
జడుఁ గ్రూరు నతిలోభి - జ్ఞాతిజనద్రోహ, కరు రాజుఁ జేసితి - గురుధరిత్రి
కచ్యుతు చెప్పిన - యమలవాక్యంబులు, విన నేర నైతి నా - తనయువలని
ఘనతరస్నేహంబు - నను మొగమోటను, దగియెడుమాటలఁ - దటిమి యొత్తి
యాడ కుండితి భీష్ముండు - నస్త్రగురుఁడు, విదురుఁడును సంజయుండును - వేవిధముల
నాకుఁ జెప్పిరి గాంధారి - నన్ను దూఱి, చెప్పె నమ్మాట లేఁ బెడ - చెవుల నిడితి. 20

వ. ఇత్తెఱం గంతరంగంబున శల్యం బై యున్నయది యని చెప్పి వెండియు. 21

క. సుతులు సమరమునఁ దిరుగక, మృతు లైసద్గతికిఁ జనిన - మేలిమి యస్మ
న్మతిఁ దలఁచి పరక్షత్త్రచ, రిత మని యప్పనికి వగవఁ - బ్రీతియ కలుగున్. 22

వ. అని పలికి పాండవాగ్రజుఁ జేరం బిలిచి యతనితోడ. 23

సీ. నీ వరయంగ సు - ఖావాప్తిఁ గొంటె లే, కుండితిఁ జనవును - నుజ్జ్వలంపుఁ
దేజంబుఁ గలిగి వ - ర్తించితి దానంబు, లంచితములుగఁ జే - క్కాచరింపఁ
గంటి శ్రాద్ధంబులు - గాంధారిసుతులకుఁ, జలుమాఱుఁ జేసితిఁ - బరమధర్మ
శీల పాంచాలికిఁ - జెట్ట సేసి రగణ్య, పుణ్యుండ వగునీదు - భూరిలక్ష్మి
నపహరించి రద్దురోద్ధ - నాదు లట్టి, కష్టచరితులఁ బాడిమైఁ - గయ్యమునన
నిహతులుఁగఁ జేసి తక్కురు-నికరమూర్ధ్వ, భువనగతిఁగాంచి సుఖమందె-భూపవర్య.

క. కావున నేమియుఁ జేయం, గా వలవదు వారికయి య - కారణకరుణా
శ్రీవిలసితుఁ డగునీతో, నావిధముం జెప్ప వలసె - నరవరముఖ్యా. 25

సీ. ఏకార్యమైనను - నెవ్వఁ డేనియుఁ జేయఁ, దొడఁగునప్పుడు విను - పుడమి యేని
చే ననుజ్ఞాతుఁ డై - కాని తొడంగఁ గా, దట్లు గావున వార్ధ-కాభిలీఢ
మైనమదీయకా - యమునకు సంస్కార, మాచరింపఁగఁ దప - మాచరించు
పనికి భూపాల నీ - యనుమతి వడయంగ, వలసి చెప్పెద రాజ - వంశజునకు
సమరమరణ మొండె - విమలతపమునకుఁ, జొచ్చి యందు నిలిచి - చచ్చుటొండె
వలయు నస్మదీయ - కులముఖ్యు లిట్టుల, నడపి రనుపు నన్ను - నడవి కనఘ. 26

క. రాజు గురుఁ డెల్లవారికి, రాజోత్తమ గురునియాజ్ఞ - రంజిల్లఁగఁ జే
రోజం జేసినకృత్యము, నూ జగములు రెంటియందు - శోభన మిచ్చున్. 27

తే. ఏను గాంధారియును దపో - మాననీయ, మునులచేరువ వల్కల - ములు ధరించి
కందమూలఫలముల నాఁ - కలి హరించి, నిన్ను దీవించు చుండెద మన్న నతఁడు.

క. ధరణీరాజ్యము నాకును, నరవర సౌఖ్యంబుఁ జేయు - నా నీ విమ్మై
దురపిల్లి దుష్కరం బగు, నరణ్యవాసమున కేఁగి - నట్టిద యైనన్. 29

తే. గూఢబుద్ధి వై నమ్మించి - కురువరేణ్య, యే నెఱుంగక యుండంగ - నిట్లు శోక
వనధిఁ దేలుచునుండితి-వ్వనట గంటి, నింక రాజ్యంబు నా కెట్టు-లించుఁ జెపుమ.

ఉ. తల్లియుఁ దండ్రియున్ గురుఁడు - దైవము నా కరయంగ నీవ భూ
వల్లభ నీవు కాననని - వాసము గోరి చనంగ నెట్టు లే
నుల్లము వట్టి హస్తిపురి - నుండఁగ నేర్తు యుయుత్సుఁ బెంపు శో
భిల్లఁగ రాజుఁ జేయు నినుఁ - బ్రీతి యెలర్పఁగఁ గొల్చి వచ్చెదన్. 31

క. అతఁ డొరకుండు నీ కీ, క్షితి కొడయఁడు దుర్యశంబు - చేఁ గుందుట భూ
పతివర కని కని యీ ఱి, ట్లతిమాత్రము సేయఁదగునె - యక్కట నాకున్. 32

సీ. నీవు రాజవు గాక - నీ కేను రాజనే, గురుని మహారాజుఁ - గురువరేణ్యు
నిటు సేయు మని పంప - నే నొడయుండనే, దుర్యోధనాదుల - దుష్కృతములు
నామదిలో నిల్ప - నేమును వారును, విధిమోహమున నైన - విరసభావ
మావహిల్లినఁ బుట్టె - నంతలుపనులు గాం, ధారియు గొంతియు - గారవమున
నాకు నొక్కరూప - మీకుఁ గాననవాస, మెల్లభంగిఁ గలుగు - నేని యేనుఁ
దగిలి తోన వత్తుఁ - దగుమాటగా నాట, గాదు నాదుహృదయ - గతియు నిట్ల. 33

క. పలికెద నే సత్యము నా, కిల ప్రీతిం జేయ దధిప - యీ వి ట్లయినం
గులముకలఁక దైవకృతం, బలఘుమతీ విడువు శోక - మరయుము నన్నున్. 34

తే. నీకు శుశ్రూష యొనరించి - నృపవరేణ్య, చిత్తతాపంబు మానంగఁ - జేసికొందు
ననితలంచుచునగా విడుపంగ-నగునెయువన, తుండనై నిన్ను వేఁడెదఁ దొలఁగువగలు.

క. అనుచు నతనిచరణంబులు, దనఫాలతలంబు సేర్చి - ధర్మతనయుఁ డా
తనిఁ గ్రుచ్చి యెత్తి కౌఁగిట, నెనయంగాఁ జేర్చి యాతఁ - డి ట్లను నధిపా. 36

తే. నీవు శుశ్రూష చిరకాల - నియతిఁ జేసి, తేను వృద్ధుండ నైతి నా - కింకఁ దపము
ఎలవ దయ్యె రాజును బొలి - వాఁడ యొవ్వ, రేమిసేసిన ఫలముల - నొంద నృపాల.

# 39. ధృతరాష్ట్రుండు గాంధారీసహితుండై వనంబునకుఁ బోవుట.

(ఆశ్రమవాసపర్వము. ఆ. I, II)

వ. తనకుం దపోవనగమనంబునకై పౌరులయనుజ్ఞ గొన వలయు నని ధృతరాష్ట్రుండు పాండవాగ్రజునకుం జెప్పం బనిచిన నతండు దగుపురజనుల నెల్లను బడి సేసి వెలార్చికొనుచు నఖిలబంధుమిత్త్రులునుం దానును వచ్చి ధృతరాష్ట్రమందిరద్వార పురోభాగంబున నిలిచె. అయ్యాంబికేయుండు గాంధారియుం దోడ రా వెడలి వారి సన్నిధికిం జని బ్రాహ్మణక్షత్త్రియవైశ్యశూద్రసంకులం బైన యన్నగరజనప్రకరంబు నుద్దేశించి. 1

సీ. కౌరవకోటియు - మీరుఁ బెద్దయుఁ గాల, మనఁగి పెనంగి య - న్యోన్యసంభృ
తాధికస్నేహుల - రై ప్రవర్తించితి, రనఘవర్తనులార - వినుఁడు నాదు
పలుకు వృద్ధునకుఁ ద - పశ్చరణంబున, కైవనంబున కేఁగు - టర్హకర్త
ముచితకృత్యంబుల - యోజ మీ రెఱిఁగిన, యదియకా మది ముద - మారమీర
లెల్ల నాకనుజ్ఞ - యిచ్చి కానకుఁ బుచ్చుఁ, డనుడు సర్వజనులు - నశ్రుపిహిత
దృష్టు లగుచు గద్గ - దిక నెలుంగెడలఁగ, నార్తి దోఁప నేడ్చి - రధిపముఖ్య. 2

వ. విని ధృతరాష్ట్రుండు వారి కి ట్లనియె. 3

సీ. ప్రజ ముద మొందఁగఁ - బాలించెఁ బుడమి శం, తనుఁ డనంతరమ శాం - తనవుచేత
రక్షితుఁ డగుచు మీ - రలు ప్రీతిఁ బొదల వి, చిత్రవీర్యుండు ని - ద్ధాత్రి యేలెఁ
బదపడి పాండునృ - పాలుండు మీరు హ, ర్షింపంగ భూమి ర - క్షించెఁ బిదప
ధర్మనందనునిచం - దము మీ రెఱింగిన, యది సత్యధర్మాత్ముఁ - డైనయితని
ననుసరింపకయన్యాయ - మాచరించి. దుర్ణయంబున నిలయేలి - త్రుంచెఁ గులము
నుర్విఁ గలభూపతులను దు - ర్యోధనుండు, వానిదుశ్చేష్టలకు మూల - మేన కాదె. 4

వ. అది మీమనంబులం బెట్టక. 5

క. మహి లెస్సగ రక్షించిన, మహితగుణులయన్న కొడుకు - మనుమం డని నా
కు హితంబు గోరి కరుణా, సహితుల రై యిం డనుజ్ఞ - సద్వ్రతమునకున్. 6

వ. అని యప్పు డజ్జనంబులమనంబుల లే కున్నను దనకీ ట్లుగ్గడించి యరణ్యగమనాను
జ్ఞాకరణంబునకుం బ్రార్థించి యవ్విభుండు వెండియు. 7

ఆ. వృద్ధ కృపణ పుత్ర - విరహిత గాంధారి, యీ నెలంతఁ జూచి - యైన మీర
లకట కాననమున - కరుగుట మే లని, మా కనుజ్ఞ యిండు - మాన్యులార. 8

వ. అని పలికి పాండవాగ్రజుం జూపి. 9

సీ. తమ్ములనడుమ నీ - తండు దిక్పాలక, మధ్యభాసితుఁ డైన - మఘవుఁ బోలి
మహనీయవిభవస - మగ్రత వెలిఁగెడు, నేమిట నేమఱ - కెపుడు మీర
లీతనిఁ బొదివి సం - ప్రీతిగ వర్తింపుఁ, డయ్య యిల్లడ యిమ్మ - హానుభావు
నిడితి మీకడ మిమ్ము - నెల్లభంగులఁ దన, పరిపాలనంబునఁ - బరమసుఖులఁ
గా నొనర్చువాఁడు - గా నప్పగించిన, వాఁడ నేను మీకు - వేఁడి దాఁకు
నట్లుగాఁ జరింప - నస్మత్కులీనుల, కధికదుఃఖకారి - నైతిఁ గాని. 10

క. ఆరయ నెన్నం డైనను, మీరలు నా కెగ్గు గాఁగ - మెలఁగుట లే దో
పౌరవరులార నన్నుఁ గ, గారవమున ననుప రయ్య - కాననమునకున్. 11

వ. అనినం బౌరజనంబు లేడ్పులు మ్రింగికొని యొండొరులం జూచుచు నూరకున్న
నమ్మహీశ్వరుండు మఱియును. 12

సీ. సాధుచరిత్రయు - శాంతయు నైనయి, గ్గాంధారియును నేను - గాఢవినయ
మార మీ తెలి విట్లు - గోరుచు నున్నార, మఖిలధర్మాభిజ్ఞుఁ - డగుపరాశ
రాత్మజుండును ధార్మ - కాగ్రణి పాండవా, గ్రజుఁడును నాకు న - రణ్యగమన
మునకు నిచ్చిరనుజ్ఞ - మోడ్పుఁ గేలొదలఁ, గదియించి మిమ్ము వేఁ - డెదఁ గృపాఢ్యు
లార యనుమతి సేయుఁడు - మీరు ననుడు, వార లుత్తరీయంబులు - వదనవినిహి
తములుగాఁ జేసికొని రోద - నము రవంబు, లెసఁగఁ జేసిరి విను ధర - ణీశవర్య.

వ. అ ట్లేడ్చి యుడిగి తమయంతవట్టునం గూడికొని కార్యవచనంబు లార్యచరితుం
డును జతురాలాపకల్యుండును నగుశంబు వనువిప్రోత్తమునకుం జెప్పి యిత్తెఱంగున
ధృతరాష్ట్రునితో నాడు మని నియోగించిన నాతం డారాజు నగ్రభాగంబునఁ జేరి
సవినయంబుగా ని ట్లనియె. 14

## ధృతరాష్ట్రునితో శంబు వనువిప్రుఁడు పౌరజనసమ్మతి సెప్పుట.

సీ. భరతవంశోత్తమ - పౌరజనంబులు, దమమాటలుగ భవ - త్సన్నిధాన
మున నన్నుపన్యాస - మొనరింపఁ బంచిన, యట్టిభాషణము లే - కాగ్రబుద్ధి

నవధరింపుము మీమ - హాన్వయంబున మహీ, విభులయందొప్పమి - వెదకినైనఁ
గానము మము మీరు - గన్నట్టిప్రజల నె, ట్లట్ల రక్షించితి - రాదరమున
వినుము దుర్యోధనుండు సే-సినయవజ్ఞ, యొక్కటియు లేదు నినుఁద్రిలో కోత్తరుండు
సత్యవతికొడు కేమని - సమ్మతించి, పంచె దానిన చేయుము - పరమనియతి. 15

క. అడజడిఁ బడఁగా మమ్మును, విడిచితి గురు వైనశోక - వేదన యే మిం
కుడిపికొనునప్పటికిఁ దో, డ్పడు నీ దగుసద్గుణములు - బంధులువోలెన్. 16

ఆ. ధాత్రి శంతనుఁడు వి - చిత్రవీర్యుఁడుఁ బాండు, రాజు నెట్టు లట్ల - రాజరాజు
ప్రజకు సంతసముగఁ - బాలించె నీయందు, నతనియందుఁ గలదె - యధిప యెగ్గు. 17

వ. భీష్మద్రోణకృపద్రౌణికర్ణకృతవర్మశల్యు లొక్కదిక్కును భీమార్జుననకుల సహదేవ
ద్రుపదవిరాటసాత్యకు లొక్కదెసయు నై విధిప్రేరణంబునం బోరిరి. వారివలన
నఖిలక్షత్రియసంక్షయం బావహిల్లె. అది యొక్కదుర్యోధనుచేతన యయ్యె నె. ఇట్లుం
గాక రణంబు రాజుల కుత్తమధర్మంబ కాదె. అందులమరణంబును సుగతికరణక
ల్యంబు. నీసుతుండు సహాయులుం దానునుం బుణ్యలోక సౌఖ్యంబునం బొంది
యున్నవాఁడు. ధర్మాచరణశాలి వగునీకును సుగతిప్రాప్తి సులభంబ యగు. ఇట మీఁ
దటికి మాభాగ్యంబునం జేసి పరమకృపాభరితు లైన పాండవులు మాకు రక్షకులు
గాఁ బడసితి మాకర్ణింపుము. 18

తే. స్వర్గ మైనమ బాలింపఁ - జాలు వారు, వీరలకు భూమిపాలన - విధి యనంగ
నెంతపని వీరిచేతికి - నిచ్చి తిపుడు, మమ్ము నెల్లవిధంబుల - మనిచి తధిప. 19

సీ. ధర్మపుత్త్రుఁడు దీర్ఘ - దర్శి మహోదాత్త, సచివుండు బంధుర - క్షణపరుండు
రిపు నెడ నైనను - గృప పెద్ద భావసం, శుద్ధియుఁ బ్రతిభయు - సువ్రతంబు
నితనికి వెన్నతో - నిడినవి యొరులను, దనయట్ల కాఁ జూచుఁ - దమ్ము లెల్ల
సన్నుతి కెక్కిన - సకలగుణముల ని, మ్మహితాత్ముచందాన - మమ్ముఁ బ్రోచు
మాత్రయే దేవవిషయస - మంచితాగ్ర, హారసజ్జనమాన్యంబు - లైనగ్రామ
ములు దగంగ రక్షింతురు - వెలయఁదారు, నిత్తు రూళ్లులు దేవమ - హీసురులకు.

క. మృదువులకుఁ జాలమృదువులు, విదితయశా వినుము పాండ - వేయులు గడుబె
ట్టిదులు బెడిదంపువారికి, మదలోభిత్వములు లేవు - మందున కైనన్. 21

క. శూరులు శాంతస్వాంతులు, పౌరజనప్రకరజాన - పదచయనిత్యా
పారప్రమదాపాదన, పారగు లతులగురుభక్తి - పరతంత్రాత్ముల్. 22

తే. గొంతిదేవికిఁ గోడండ్ర - కును మనములఁ, గరుణ యగ్గల మైయుండు - ధరణినాథ
పౌరులంగును జనపద-ప్రజలయెడను, నాడుదురు మేలు దమ కగ్గ-మైనయపుడు.

తే. వీర లెప్పుడు మము నీవు-గారవించు, టెఱిఁగి మన్నింతు రమలిన-హృదయ కలఁక
దక్కి ధర్మజుపై రాజ్య - తంత్రభార, మిడి మనంబున నూఱడి - యిచ్చ సలుపు. 24

వ. అని చెప్పి ఇట్లవ్విప్రముఖంబునం బౌరులభాషణంబులు విని ధృతరాష్ట్రుండు ప్రీతుం డయి సముచితప్రకారంబుల నజ్జనంబులం గ్రమంబున వీడుకొలిపి కొంతే యాదిబంధువులను మిత్త్రులను నిజనివాసంబులకుం బోవం బనిచి గాంధారీసమేతుం డై యభ్యంతరమందిరంబున కరిగె. . . . ఇట్లు ధృతరాష్ట్రుండు భారతరణంబున మరణంబు నొందినబంధులోకంబునకుం బుణ్యలోక సౌఖ్యాతిశయపదంబులగుపరమ శ్రాద్ధంబులు నిర్వర్తించి కృతకృత్యుం డై సర్వకృత్యంబులుం జలిపి పాడ్యమినాఁడు రేపకడ ఋత్విక్సమేతుం డై యిష్టి నడపి పాండవులను దక్కటిబంధువులను మిత్త్రులను రావించి వనవాసంబునకు సంకల్పంబు సేసి సకలభృత్యజనంబులకు నర్థదానంబు లిచ్చి గాంధారీసమన్వితుం డై వల్కలాజినంబులు ధరియించి యక్షతగంధపుష్పంబుల గృహంబుఁ బూజించి సర్వపదార్థంబులుం బరిత్యజించి యగ్నిదేవియుఁ గదిసి నడవ యాజకు లగ్నులు నుపకరణంబులును ధరియించి ముందటం జేరువ నరుగ నగరువెడలె నట్టియెడ నేతెంచి. 25

క. గొంతి మొద లైనకౌరవ, కాంతాజను లెల్ల నెవ్వ - గలఁ బొగులుచుఁ బ
ర్యాంతంబుల బాష్పసలిల, సంతానము లురులఁ దోన - చను దేరంగన్. 26

వ. అజ్జనపతి యనుచుండె. 27

తే. పాండవాగ్రజుఁ డక్కురు - భర్తవలను, శోకదీనుఁ డైతప్పక - చూచి యేడ్చి
హామహారాజముఖ్య యెం - దరిగెదనుచు, నొడలు కంపింపఁజదికిలఁ - బడియెనధిప.

క. నరుఁ డనునయించె వెస న, న్నరపతి నెత్తుచును దా న - నయము గాఁ జనటం
బురవురఁ బొక్కెం గురుభూ, వర యద్దెసతెఱఁగు రాదు - వాక్రువ్వంగన్. 29

వ. భీమసేననకులసహదేవులును గృపయుయుత్సుసంజయులును ధౌమ్యాదిధరణీసురులును శోకవ్యాకులత్వంబు నొందిరి గొంతి యడలుచు గాంధారికరంబు నిజస్కంధంబున నిడికొని నడవ నయ్యంధనృపతి గాంధారీస్కంధభాగకలిత బాహుం డై పోవు చుండె. అప్పుడు పాంచాలియు సుభద్రయుఁ జిత్రాంగదయు నులూపియు సపుత్ర యగునుత్తరయు మఱియుం గలయట్టిమగువలుం గురరీనిచయనాదంబుల చందంబు దోఁప నాక్రందనంబు సేసిరి. అయ్యవస్థ జూదంబునాఁడు పాండవులు

పురంబు వెలుపడినప్పటిదశం బోలి యుండె. అట్లు ధృతరాష్ట్రు కాననగమనంబు నిశ్చితం బగుటయు నాబాలవృద్ధంబుగాఁ బురజనంబు గనుంగొనం జనుదెంచిన.

ఆ. వచ్చి రెండకన్ను - వానకన్నును నెఱుం, గనిపురంధ్రు లెల్లఁ - గరమువంతఁ
దలరునంతరంగ - ములతోడ నక్కురు, వృద్ధుఁ జూడ నార్తి - వికలగతుల. 31

క. నేలను హర్మ్యంబులపై, నోలి నిలిచి చూచునాన - వోత్కారములతో
కాలాపవిలాపంబులు, నేలకు మింటికిని నడుము - నిండి చెలంగెన్. 32

వ. ధృతరాష్ట్రుండును బురద్వారంబు నిర్గమించు చుండి సకలపౌరజనంబుల నిలువం బనిచె విదురుం డక్కురువృద్ధునితోడ వనంబున కరుగుటకు దృఢనిశ్చయుం డై పలికె సంజయుండు నవ్విధంబువాఁ డయ్యె. కృపాచార్యుండును యుయుత్సుఁడు నత్తెఱంగుమాట లాడిన నాంబికేయుండు వారిని వారించి ధర్మనందనున కప్పగించి నిలిపి కోడండ్రనెల్లను సముచితవచనంబుల మరల నియమించిన వార లావైచిత్ర వీర్యునకు గాంధారికిం బ్రణమిల్లి బాష్పంబులు వదనంబున వెల్లి గొనుచుండ వీడ్కొనియును బాండురాజమహిషిం జూచికొని వెనుకం జను చుండిరి. ఆసమయంబున నజాతశత్రుండు గొంతి కి ట్లనియె. 33

క. మాయయ్య కాననమునకుఁ, బోయెడు నే నితనితోడఁ - బోయెద శుశ్రూ
షాయత్తుఁడ నైయుండెద, నీయువిదలఁ గొనుచు మగిడి - యేఁగుము తల్లీ. 34

చ. అనుటయు గొంతి యక్కురుకు - లాగ్రణి కి ట్లను నీవు దోడఁ గా
ననమున కేఁగుదెంచుట జ - నస్తవనీయచరిత్రుఁ డివ్విభుం
డనుమతి సేయునే యుడుగు - మాపని యియ్యను యత్త నాకు నీ
మనుజవిభుండు మామ గరి - మంబు గ వీరలఁ గొల్చి పోయెదన్. 35

తే. ఇతని కియ్యమకును విను - మేన చువ్వె, వలఁతి శుశ్రూషసేయంగ - వత్సమీర
లాపనికి నేర్తురే వీర - లడవి కరుగ, నింట నుండఁగ నామన - మియ్యకొనునె. 36

వ. అనిన నాధర్మపుత్త్రుండును దమ్ములు నుచితవచనంబుల వేఁడికొనిన నద్దేవి యగ్రతన యుం గనుంగొని. 37

క. వీరలయెడఁ గొడుకా యప, చారంబులు పలుకుదునె వి - చారము విడు మే
నేరూపంబున నిలువన, గారవమున నిది వ్రతంబు - గాఁ గైకొంటిన్. 38

వ. అని పలికి నిజస్కంధంబున నున్న గాంధారికరంబుఁ గరంబు నయంబునం బాపి యతనిదిక్కు మొగం బై. 39

క. నీ వేమియు ననకుము సహ, దేవుని నేమఱక యరయు - దినకరసుతునిన్
భావమునఁ దలఁపు మే నా, దేవసమునిపుట్టు వడఁచి - తిం గపటమునన్. 40

క. అది పాపము దానికి నా, మది నెప్పుడు వగతు విమల - మానస యక్కీ
డు దొలంగునట్లుగా స, త్పదార్థదానములు సేయు - తాత్పర్యమునన్. 41

ఆ. అవ్విధమునఁ గర్ణుఁ - డాఱడిఁ బోయిన, నాదుమానసంబు - వోదు నూఱు
పఱియ లై తలంప - బలుతాతఁ జేసిన, వారు గాఁగ వలయు - వంశవర్య. 42

క. నీవును దమ్ములు భక్తిభ, రావేశముతోడఁ దలఁపుఁ - డమ్మహితాత్మున్
ద్రోవది నెప్పుడు దృఢసం, భావన మన్నింపు మయ్య - పౌరవముఖ్యా. 43

క. భీమార్జుననకులమనఘ, కామంబులు సఫలతాప్ర - కాశంబులు గా
భూమీశ యరసి యొనరుపు, మేమిట నేమఱకు ధర్మ - మిల యరయు నెడన్. 44

వ. అని పలికి నానిశ్చయంబు శిథిలంబు గాదు మీరు మరలుం డని పలికినం బాండవాగ్రజుండు విషాదం బంది యూరకుండె భీమాదులు డెందంబులు గొందలం బంద నస్రు లొలుకం దలలు వాంచిరి. ఇట్లమ్మొత్తంబు గమనంబు గుదివడుచు మందం బై చెల్ల ధృతరాష్ట్రుండు గొండొక యెడగలుగం జనియె నాధర్మతనయుండు దల్లి యాననం బాలోకించి. 45

## ధర్మరాజు కుంతిని వనంబునకుఁ బోవల దని ప్రార్థించుట.

సీ. ఇది యేమి సేయంగ - నెత్తికొం టిమ్మాట, యాడకు మేను ని - న్న డవి కేఁగఁ
బనుతునే మముఁ దొల్లి - పనిచి పనుల్ గొను, భంగిన సామ్రాజ్య - భారనిర్వ
హణము తెఱంగును - నప్పటి కప్పటి, కిట్లని యానతి - యిచ్చి నడపఁ
బంపక యున్న నో - ప్పమి రాదె మాకు ము, న్నీవును గృష్ణుండు - నేవిధమున
నడపితిరి కార్య మెఱుఁగ వే-యడలు వెల్లి, మమ్ముఁ బాంచాలి నిటు ముంచి-యమ్మ యడవి
నెట్టు లుండెద వనఁగ న-య్యింతి బాష్ప, పూర్ణనయన యై యూరక-పోవుచుండె.

ఉ. అయ్యమలాత్మతోడఁ బవ - నాత్మజుఁ డిట్లను ధర్మపుత్త్రు నీ
వెయ్యది యుక్తహేతువు గ - నిమ్మెయిఁ బాపెదు నీదుపన్పునం
గయ్యము సేసి భూపతిని - గాయములం బరిమార్చెఁ దల్లి నీ
కియ్యనలక్ష్మి నూఁది చరి - యింపక యిప్పుడు వాయఁ బాడియే. 47

క. మనమునఁ దోఁచినదానము, లనుదినమును జేయుచును స - మాశ్రితజనులం
బెనుచుచు బంధులఁ బ్రోచుచు, జననుతచరితమునఁ బరఁగు - సౌజన్యనిధీ. 48

క. వనమున మాద్రీపుత్త్రులు, వెనుఁబడుటకుఁ దలరి తట్లు - విక్రమమునకుఁ
గొనకొల్పి తిట్లు వీరల, ననూనదుఃఖముల ముంచి - యరుగం దగునే. 49

వ. అనియె నట్టియెడ. 50

క. ద్రోవదియు సుభద్రయు శో, కావేశం బడర మోము - లశ్రులఁ దోఁగం
గా వెక్కి వెక్కి యేడ్చిరి, భూవర పాండుక్షితీశ - పుత్త్రులు నేడ్వన్. 51

క. పరిజనములు గన్నీళ్లులు, దొరఁగఁగ నడ లొంది వారి - తోడం జని రి
ప్పరుసునఁ దనదుతనూజులు, మరలమికిం బాండురాజ - మహిషి మఱుఁగుచున్.

వ. తెగ నాడ కున్నఁ బోవ రని కన్నీరు దుడిచికొని వారలం గలయం గనుంగొని
వారలు విను చుండం దత్పరిజనంబులతోడ 53

సీ. దుర్ద్యూతమునఁ దారు - దూలపోవుటయును, నాసభ నపకీర్తి - యగుతెఱంగు
వాటిల్లుటయుఁ బెక్కు - భంగుల నడవుల, నిడుమలఁ బడుటయు - నే సహింపఁ
జాలక కార్యంబు - చర్చించి సంధిసై, నొవ్వనివా రెల్ల - నవ్వఁ దలలు
వంచి కౌరవులలో - వర్తింప నే లని, వారితోడ నాడితి - నవ్విధమున
మాననీయు ధర్మ - సూను నాగాయుత, బలుని భీము శత్రు - భంజనైక
శీలుఁ బార్థు శౌర్య - లోలురఁ గవల దై, న్యంబు నొందఁ జూడ - టర్హ మగునె. 54

వ. అని ధర్మతనయువదనంబు వీక్షించి పాంచాలిం జూపి. 55

సీ. గౌరవంబున సుకు - మారత్వమున నొప్పు, నిప్పాల్తిఁ దల పట్టి - యీడ్చి తెచ్చి
సభలోన నట్లు దు - శ్శాసనుం డవమాన, పెట్టంగ నచ్చటి - పెద్ద లెల్లఁ
బలుకక యుండ న - బ్బన్నంబునకు నోర్వ, వలసె మీ కప్పటి - కలఘుతేజ
నీతేజ మట్టులు - నీఱయి పోయినఁ, బాండునికులము సె - ప్పఁగఁ జూప
లేక పోదె యబ్భంగిఁ బ - ల్కితి ముకుందు, తోడ నేను మీరెమ్మెయి-రూఢికెక్కి
వెలుగఁ గోరుటకతమునఁ-దలఁచిదాని, ననిలసుతుఁడెత్తిపెట్టె నే-మనఁగఁగలదు. 56

వ. అనిన విని ధర్మసుతుండును భీముండును సిగ్గువడిరి. ఇట్లు పలికి గొంతి యిమ్మాటకు
భీముచిత్తం బె ట్లగునో యనుతలంపున ధర్మసుతున కతనిం జూపి. 57

ఉ. నామది నొండు లేదు విను - నవ్వితి నీతనితోడ నీదుల
క్ష్మీమహిమన్ మనం బలరఁ - జేసితి నుత్తమదానముల్ జన
స్తోమనుతంబు గా నడపఁ - జూచితి జన్నము గన్నులార నిం
కేమికొఱంత నా కుడుగ - నెట్లును బోదు నరణ్యవృత్తికిన్. 58

తే. రాజ్యఫలము గామింపఁ బ్రతా సమగ్ర, తపమునకు ఫల మైనయు- త్తమగతి ప్ర సిద్ధి గోరుదు నది గల్గఁ - జేత కిట్టి, తోడు మతి నాకుఁ గలుగునే - దురితదూర.

క. కురురాజునకును దేవికిఁ, బరిచర్య లొనర్చుచుం ద - పంబునఁ గృశతం బొరయుతనువుతోఁ గడపెదఁ, గరమునియతి నింకఁ గలుగు - కాలము వత్సా. 60

వ. మీరు మరలుం డనియె. అట్టియెడ నప్పాండురాజమహిషి దమతోడ వనవాసం బున కై వచ్చుటకుం గడంగుటయు దాని నొడంబడక పాండవులు దగుపలుకులం బ్రార్థించుటయు నెఱుంగుం గావున ధృతరాష్ట్రుండు ధర్మతనయుం డెట్లు సెప్పె నట్లు సేయు మని విదురసంజయులచేత నద్దేవికిఁ జెప్పి పుత్తెంచినవార లేతెంచి యబ్భంగి సెప్పినను వదలక వారిపలుకు లాయను వారించి దృఢనిశ్చయంబునఁ గొడుకులఁ గోడండ్రను దక్కటిబంధుజనులను సర్వాభరత భార్యలను బరిజనంబులను గలయం గనుంగొని యిండ్లకు వచ్చెదరు నిలువుండు సుఖుల రై యుండుం డనుటయు. 61

క. హృదయములు దలర నందఱుఁ, బ్రదక్షిణము గాఁగ నేడ్పు - గ్రందు దొలుఁగ నె ల్లదెసలఁ జెలఁగఁ దిరిగి త, త్పదంబులకు నెఱఁగి వంతఁ - దనువులు దూలన్. 62

వ. నిలిచిరి. అందుఁ బాండవు లేవురుం బాండురాజమహిషి ననుపమతియుం జని యాయా మను ధృతరాష్ట్రగాంధారులను గలపి వారల నిరువురనుద్దేశించి మీరు వనంబునకుం బోయి తాను లేకున్న మా కెట్లు కాలంబు గడప వచ్చు ననుతలంపునం దన్ను నెంత ప్రార్థించినను గొంతి నిలుచుట కొడంబడ దయ్యె. ఈసాధ్వికి బుద్ధి సెప్పి కొనుచుం బరిచర్య సేయించుకొం డని యప్పగించి యా రాజునకు నద్దేవికిం గుంతి కిం బ్రదక్షిణంబు సేసి దండప్రణామంబు లాచరించిన దీవించి వా రామంత్రణంబు సేయ నాధర్మపుత్త్రాదు లశ్రుప్లావితంబు లగువదనంబులతోడ మరలి వనితాజనంబులం దోడ్కొని. 63

తే. పొగులుచును నల్లనల్లన - పురికి నరిగి, రదియు నమ్మలికంబు ప్రో - వైనయట్లు నూడఁ గూడక యుండంగఁ-జొచ్చి రాత్మ మందిరము లందఱును బుధ-మాన్యచరిత

* * * * * *

సీ. వనవాస మించుక - యును నాకు దుర్ఖంబు, సేయదు దేహంబుఁ - జిత్తమును ద పగ్గక్రియలకుఁ బను - పడియున్న యవి నన్ను, గాంధారిఁ బుత్త్రశో-కం బొకింత యేనియుఁ బొందంగ - నీఁడు సత్భక్తిక, మైనవృత్తమున ధ - ర్మాత్మజుండు మునివర యితనిపై - ననుజులమీఁద వ, త్సలము నాహృదయ మి - ద్ధరణివిభుఁడు దేవతాత్ముఁ డగుట - దెల్ల మై యునికి మ, ద్వచనవర్తనముల - వలన నితఁడ దొలఁగి యుండు గొంతి-తెఱఁగు శుశ్రూషయు, నద్భుతంబుముదము-నావహించు

వ. నాకుం బరిజ్ఞానంబును మానసనిర్మలత్వంబును భవత్ప్రసాదంబునం గలిగెడుంగాక యనియె నాసమయంబున ద్రౌపదీసుభద్రలును దక్కనుం గల్గునంగనాజనంబులును బారాశర్యసందర్శనప్రవణత్వంబునం జనుదెంచి సభక్తికప్రణామంబు లాచరించి యంతంత నిలిచిరి. అయ్యలఘుజ్ఞానమాననీయుండు ధృతరాష్ట్రుతోడ. 66

ఉ. మీయెడచింత వాయఁగ స - మీహితబుద్ధి యొనర్పఁ గోరి యే
నీయెడ కిప్డు వచ్చితి న - భీష్టము వేడుము శంక దక్కి భూ
నాయక యెల్లభంగిని మ - నఃప్రియముం దగ నిత్తు నన్నఁ గౌం
తేయు లెలర్చి రవ్వసుమ - తీపతి మోదము నొందె నెంతయున్. 67

వ. వ్యాసుండు వెండియు. 68

చ. అనఘ యమానుషం బయిన - యట్టిద దైనను నాతపంబు పెం
పునకు మునీంద్రు లద్భుతము - బొందఁగ మీ కపలీల నిత్తు నే
ననుటయు నాకురుక్షితిపుఁ - డాదటఁ గోరఁగ మీర లింతు వ
చ్చినఁ గరుణామయాదరవి - శేషముకంటెను మేలుఁ గల్గునే 69

క. మానుష మైన నమానుష, మైనను బ్రార్థనకు విషయ - మైనది భవదీ
యానూనకృపకు నెక్కుడు, గా నొక్కఁడుఁ గాన నేను - గారుణ్యనిధీ. 70

ఆ. సంయమీంద్ర నాదు - జన్మంబు సఫలత, బొందె మీరు విమల - బుద్ధి నింత
యాదరించినపుడ - లే దింకఁ బరలోక, భీతి ధన్యతముఁడ - నైతి నేను. 71

వ. అట్లయినను మీ రొక్కటి గోరు మనిన నామనంబున నెప్పుడుం గలయది యెఱిం గింప వలసె విన్నవించెద 72

సీ. దుష్టచిత్తుం డగు - దుర్యోధనుండు ని, ష్పాపస్వభావులఁ - బాండుసుతులఁ
బరిభవించి సమస్త - నరనాథు లను గరి, తురగయుతంబుగాఁ - ద్రుంగఁ జేసి
ధరణిరాజ్యము గోరి - గురుభీష్మకర్ణాది, సత్పురుషుల నెల్లఁ - జంపికొనియె
నన్నిచునకుఁగా మ - హారాజు లాంద్రను, బిడ్డల విడిచి య - భేద్యధైర్య
వృత్తి రణమృతిఁ బొంది ర - వ్విభుల కేది, గతియొ యిమ్మెయి మూఢు లై - కలనఁ బడిన
కురుకుమారకు లెట్లైరొ - పరమబోధ, మహిత యెఱుఁగనివగ పెద్ద - మాన్పు మనియె.

వ. అనుటయు నాప్రేముడిపలుకులు విని గాంధారికిం గుంతికిం బాంచాలికి సుభద్రకు మఱియునుం గలయంగనలకుం జిత్తంబుల నెవ్వగలు గ్రొత్త లయ్యె నప్పుడాసుబలనందన పట్టావృతలోచనత్వంబునన చూచి దయాధామం బై యున్న యామామ నుద్దేశించి మోడ్చినచేతు లద్దెసకు నిగిడ్చి యి ట్లనియె 74

సీ. మునినాథ యీరాజు - తనయు లందఱును గ, య్యంబునఁ దెగినది - యాదిగాఁ బ
దాలుండ్లు పగలపా - లగుచుఁ దత్సన్నిధి, గల్గుట గోరు లో - కంబు లెన్ని
యన్నియుఁ జూపంగ - నైనను జాలుదు, నిర్మలతపమున - పేర్మి నీవు
పుత్రసాన్నిధ్య మీ - భూపతి కొనరించు, టెంతటిపని నీకు - గొంతి ద్రుపద
రాజపుత్రి సుభద్ర కా - రవకుమార, శతముభార్యలు నూర్వురు - సౌమదత్తి
పత్ని యత్తన్వియత్తయ - ప్పడఁతియత్త, గోరుదురు యుద్ధమృతబంధు - కోటిఁజూడ.

వ. అంతయును భవదీయదివ్యబోధంబు గనుచుండు 76

క. పరమమునీంద్ర సమరమృత, కురువీరుల మామనముల - గో డుడుగ భవ
త్కారుణ వెలయ లోకం బ, చ్చెరు వందఁగఁ జూపవే వి - చిత్రపుమహిమన్. 77

* * * * * *

ఆ. * * * * నీవు సుతులఁ - దోడఁబుట్టు
వులను గాంతు నీదు - చెలియలు గొంతియుఁ, గర్ణుఁజూడఁ గాంచు - గణ్యచరిత. 78

ఉ. ద్రౌపదియుం సుభద్రయును - దక్కటికాంతలు భ్రాతృపుత్రపౌ
త్రోపవిలోకనోత్సవము - నొందుదు రిచ్చటి కిప్పు డచ్చు చే
నీపని యాచరించుటకు - నిమ్మనుజేంద్రుఁడు నీవు గొంతి చిం
తాపరితాపశోదనవి - ధంబుగఁ గోరితి రట్లు సేసెదన్. 79

క. నీకొడుకులకు మనుమలకు, శోకింపఁగ వలదు వారు - శూరత వెలయం
జేకొనిరి రణమరణమున, నాకభువనసుఖము పగ్గు - నస్తవనీయా 80

ఆ. భామ విను మవశ్య - భవితవ్య మైనభా, రతరణంబుపొంటె - నతులమహిమ
మాననీయదేవ - యోనులు జననంబు, నొంది రిందు మనుజ - యోనులందు. 81

సీ. ధృతరాష్ట్రుఁ డనఁగ వ - ర్తిల్లెడు మేటిగం, ధర్వుఁ డీధృతరాష్ట్ర - ధరణివిభుఁడు
తన్వి పాండుఁడు మరు - ద్గణమయజని ధర్మ, దేవత సూవె యు - ధిష్ఠిరుండు
పవనుండు భీముఁ డై - ప్రభవించె నరుఁ డను, ముని యర్జునుం డయి - జనన మొందె
నారాయణుఁడుగృష్ణ - నాముఁడై జనియించెఁ, గనుఁగొనుకవలనా - శ్వినులుగాఁగ
ద్వాపరంబుగ నెఱుఁగుగాం - ధారరాజుఁ, గలిసుయోధనుఁడయ్యె రా - క్షసులుపుట్టి
రతనియనుజులై కర్ణుని - నరుణకిరణుఁ, గాఁగ నభిమన్యుఁ జంద్రునిఁ - గాఁగఁ గనుము.

క. అనలుఁడు ధృష్టద్యుమ్నుం, డన ద్రౌపదితోడఁ బుట్టె - ననిలునియంశం
బున జనియించె శిఖండియు, ననిమిషగురుఁ డుద్భవించె - నస్త్రగురుం డై. 83

తే. వినుము వసుశక్తి గాంగేయుఁ - డనఁగ జనన
మొందె రుద్రాంశమున ద్రోణి - యుదయ మయ్యెఁ
దెలియఁ జెప్పితిఁ గొందఱు - గలరు మఱియు
నిర్జరాసురాంశమున జ - న్మించినారు. 84

క. అని పలికి మీమనంబుల, వనట సమస్తంబుఁ బుచ్చి - వైచెద నాతోఁ
జను దెండు మీరు గంగకుఁ, గనియెద రనిఁ దెగినబంధు - గణముల నచటన్. 85

తే. అనుచు నుత్థితుఁ డగుటయు నార్పు లెలుఁగు, లాకసం బంద ధృతరాష్ట్రుఁ-డాదిగాఁగఁ
గలుగునాసర్వజనులు నొ - క్కటఁ గడంగి, యరిగి రమ్మునినాథుతోఁ - గురువరేణ్య.

క. అరుగఁగ మునిజనములు న, చ్చెరు వందుచు నమ్మునీంద్రు - సేవించి మరు
త్సరిదుపకంఠతలమునకు, నరిగిరి కౌతుకము మనము - లందు నెలకొనన్. 87

వ. అట్లు పౌరజానపదసహితు లై సకలజనంబులుం జని సాత్యవతేయుండు వనుప భాగీరథీతీరంబున విడిసి రవ్విచిత్రచరిత్రుండు దనచేయంబూనినపని మఱునాఁడు రేపకడ సేయువాఁడుగాఁ బలికిన నయ్యెందఱు నద్దినశేషంబు నాయామినియును శతసంవత్సరంబులుం బోలె నుండ సూర్యోదయసమయంబగుటయుఁ గాలోచితకృత్యంబు లాచరించి ధృతరాష్ట్రుండు పాండుతనయులుం దపోధనులు నప్పారాశర్యుపాలికి నరిగి యమ్మునివరుం బరివేష్టించిరి. గాంధారీప్రముఖభామినులు నేతెంచి యొక్కయెడలన నతనిం గొలిచి యుండిరి. సర్వజనులు నట్టు లెత్తికొని యంతంత నిలిచిరి తదనంతరంబ. 88

## వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతుల రావించి చూపుట.

సీ. సాత్యవతేయుండు - జాహ్నవీసలిలావ, గాహన మొనరించి - గారవమున
నింపారు నెలుఁగున - నిందు రం డనవుడు, నీ కేమి సెప్పుదు - నీటియందు
రవ మగ్గలముగ రా - రాజుఁ దమ్ములుఁ దత్కు, మారవర్గము నభి - మన్యుఁ డాది
యగుపాండుపౌత్రులుఁ - గర్ణుండును బాహ్లి, కప్రముఖాఖిల - కౌరవులును
ద్రుపదమాత్స్యులు వారిబం - ధులును శకుని
యును దదీయానుజులును నా - తనితనూజ
రాజియును భీష్మగురులఁ బు - రస్కరించి
కొనుచుఁ దమదివ్యదేహముల్ - గొమరు మిగుల. 89

ఆ. దివ్యమాల్యములును - దివ్యాంబరంబులు, దివ్యభూషణములు - దివ్యలేప
నములుఁ జెన్నుఁ జేయఁ - దమమిత్రసుభటసం, దోహములును దారుఁ - దోఁచి రథిప.

వ. అట్టియెడ. 91

క. తగ నాకురువృద్ధునకు నొ, సఁగె నాఁటికి దివ్యదృష్టి - సాత్యవతేయుం
డగణితతపఃప్రభావం, బు గని యధికవిస్మయంబుఁ - బొందఁగ జనముల్. 92

వ. అవ్విశేషంబు విని యద్భుతప్రమదభరిత యై నిజనయనంబుల బంధించిన పట్టం
బపనయించి గాంధారియును గనుంగొనుచుండ. 93

క. అవ్విధమునఁ దోఁచిన మఱి, నవ్వుచుఁ దెగడుచును బెరసి - నరపర పగ లే
కవ్వీరవరులు నెయ్యము, నివ్వటిలఁగ విలసనములు - నెఱయ మెఱయఁగన్. 94

తే. చతురగంధర్వు లప్సరో-జనులు గాన, ములఁ బ్రమోద మొనర్పంగఁ-బొగడ వంది
సమితి నిరహంకృతులు హృద-యములు గౌర, వములు దెల్లంబు సేయంగ-వచ్చిరొప్పి.

వ. ఇట్లు వచ్చి సకలబంధుజనంబులకుం బరమప్రమోదం బానహిల్లం గలసి సముచితా
చారంబులు నడపిరి ఆ రెండుదెఱంగులవారలు నర్హప్రకారంబులం బితామహాచా
ర్యశిష్య మాతృ మాతామహ పితృ పితామహ భ్రాతృజామాతృ పుత్ర పుత్రీ భగినీ
పౌత్ర దౌహిత్ర శ్వశుర శ్వశ్రూ స్నుషా మాతుల స్యాలక ప్రియ ప్రియా
మిత్ర సమాగమసుఖంబు లనుభవించుచు. 96

తే. అనఁగి పెనఁగి నాఁ డెల్ల ని-చ్చానురూప, వృత్తి వర్తిల్లుచుండి ర-వ్విధము సకల
జనుల నద్భుతరసమున-మునుఁగఁ జేసె, నే మనఁగ వచ్చు నాసంయ-మీంద్రుమహిమ.

# సర్వచనోత్తరరామాయణము.

## 40. వేదవతీచరిత్రము.

(ఆ. V)

క. శంభునిచే నివ్విధమున, సంభావితుఁడై తదీయ - శైలము డిగి సం
రంభమున రావణుఁడు దాఁ, గుంభిని నలుగడలఁ గలయఁ - గ్రుమ్మరుచుండెన్. 1

క ఒక్కొకమరి సేనలతో, నొక్కొకమరి వీరపరిజ - నోపేతుండై
యొక్కొకమరి దనయంతన, యెక్కడ నేనియుఁ జరించు - నిచ్ఛాగతులన్ 2

మ. హిమవంతంబున కేగి యొక్కయెడ నం - దేకాంత మొక్కర్తు చీ
రముఁ గృష్ణాజినముం గమండలువు నై - రాగ్యంబు నర్జించి సం
యమముం గైకొని యున్నఁ జేరఁ గని హృ - ద్యాకారమున్ యౌవనో
ద్యమముం గాంతియుఁ జూచి రావణుఁడు గా - మాయత్తుఁడై యిట్లనున్. 3

క. ఎవ్వనితనయవు నీపతి, యెవ్వఁడు పే రేమి నీకు - నీరూపంబున్
జవ్వనముఁ బాయ నీతప, మెవ్విధిఁ బాటిల్లె నకట - యింతయుఁ జెపుమా. 4

క. అనుపలుకులు వినియుం దా, విననియదియపోలె నుచిత - విధి నాతిథ్యం
బొనరించినయక్కన్యక, ననిమిషరిపుఁ డట్ల మఱియు - నడిగిన నదియున్. 5

సీ. అనఘ కుశధ్వజుఁ - డనుమునీశ్వరుఁడు వే, దాభ్యాస మనిశంబు - నాచరించి
యాసుకృతంబునఁ - జేసి నన్ గని వేద, వతి యనుపేరిడి - వంశమహిమ
వెలయంగ నిక్కన్య - విష్ణున కిచ్చెద, నని చాలఁ బ్రీతిసే - యంగ నెల్ల
వారును మాయయ్య - కోరిక యెఱుఁగక, యర్థింప నర్థింప - నతఁడు ద్రోచి
పుచ్చ నసురేంద్రుఁడైనజం - భుండు నడిగి, తనకు నీకున్న నలిగి మా-తండ్రిఁ జంపెఁ
దల్లి సాదఁ జొచ్చె సత్యవ్ర - తంబు నడపు, జనకుపూనికి నేఁ దీర్త-నని తలంచి. 6

క. అది మొదలు గాఁగ విష్ణుని, మది నిల్పి యతండ నాకు - మగఁ డగు నని యి
ట్లు దపంబు సేయుచుండుదు, నిది నా తెఱఁ గనిన దాన - వేశ్వరుఁ డనియెన్. 7

ఉ. కాంతి దొలంగ నే నిటులు - గాఱియఁ బెట్టుచు జవ్వనంబుచె
న్నింతయు రిత్తవో సుఖము - లెల్లను డిగ్గఁగఁ ద్రావి నెమ్మదిం
జింత దళంబుగా నడరఁ - జేడ్పడి యొంటి చరించుచున్ జర
త్కాంతయుఁ బోలె నియ్యెడుమఁ - గైకొనఁ బాడియె చారులోచనా. 8

మ. లలనా విష్ణు డనంగ నెవ్వఁ డతఁ డే - లా శుద్ధవంశంబు ని
ర్మలసంపూర్ణతపోమహత్త్వము పర - ప్రాప్తానుభావంబు దో
ర్బలసంపత్తియు నాకుఁ బోలెఁ ద్రిజగ - త్ప్రఖ్యాతిపాత్రంబులే
కలదే లంక పరాక్రమం బఖిలలో - కశ్లాఘ్యమే వానికిన్. 9

ఆ. అనినఁ జెవులు మూసి - కొని యిట్టులను లోక, వంద్యు వేదవేద్యు - వరదుఁ బరము
ననుపమాను నచలు - నవ్యయు హరిఁ జెడ, నాడఁగూడ దని మృ - గాక్షి మఱియు.

చ. తపముల కెల్లఁ దాన ఫల - దాత కులంబున కాదికర్త యై
యపరిమితప్రభావుఁ డగు - నాచతురాస్యుఁడు నాభిఁ బుట్టె వి
శ్వపతి యహీనబాహుబల - సారసును ర్మధుకైటభాదిదై
త్యపతుల నెల్లఁ ద్రుళ్లడఁచె - నారయ విష్ణుఁ డమాననీయుఁ డే. 11

క. అనిన నసుర యమ్మాటలు, విన నొల్లక కడయ వచ్చి - వెండియు సతి కి
ట్లనియె మరునంపపెల్లునఁ, దనువు నిలువ దింకఁ గోర్కి - దతిమెదుఁ బ్రేర్చెన్. 12

* * * * *

ఆ. అనుచుఁ దగిలి చూచు - నద్దానవేశ్వరు, నలిగి చూచి నిన్ను - నధముఁ డగుట
మును తపఃప్రభావ - మున నెఱింగియుఁ దగ, నాపులస్త్యమనుమఁ - డని తలంచి.

క. అతిథిసపర్యయు సమయో, చిత మగుసంభాషణంబు - సేసితిఁ బోషా
మతిలేదు నీకుఁ జొప్పడు, నతివలలో నన్నుఁ దలఁప - నగునె దురాత్మా. 14

చ. అని కలుషించి వేదవతి - యచ్చటు వాసి చనం దలంచినం
గని దశకంధరుం డడరి - గ్రక్కున వేనలి వట్టికొన్న నం
గన యొకవ్రేల వ్రేయ నది - కత్తివిధంబునఁ దాఁకి కత్తిరిం
చినక్రియఁ ద్రెంచె వెండ్రుకలు - చేతఁ దెమల్చినయంత కివ్వలన్. 15

తే. వెండ్రుకలు చేతపచ్చుడు-వెఱఁగుపడుచుఁ, దపముపేర్మికి నలికి య-ద్దనుజవిభుఁడు
నిలిచె రోషమహానల-జ్వలనమూర్తి, యగుచుఁబిటీఁదికిఁబాసియి-ట్లనియె సతియు. 16

ఉ. బన్నము లిట్లు నీవు వఱు - పం బడి మేను దొఱంగుచుండి యే
నిన్ను శపించినట్లయిన - నిర్మలనిత్యమహాతపఃప్రభా
వోన్నతిచేటు గాదె పున - రుద్భవ మయ్యెద నీకు మృత్యు వై
సన్నుతపుణ్యజాత యనఁ - జాలి యయోనిజమూర్తిఁ దాల్చెదన్. 17

క. ఈపరిభవంబుఁ బడియుం, దీషే ప్రాణంబు లనుచు - దిగ్గన ననలం
బాపాదించి దశానను, నే పడఁగన్ విష్ణు నాత్మ - నిడి సాదఁ జొచ్చెన్. 18

ఆ. కృతయుగమున వేద - వతి యనఁగాఁ జన్న, నాతి త్రేత నిపుడు - సీతయనఁగ
జనకుయజ్ఞవేది - జన్మించి నీసతి, యయ్యె నీవు విష్ణుఁ - డగుటఁజేసి. 19

# 41. చంద్రోదయచంద్రికావర్ణనములు.

(ఆ. VI.)

క. రావణుఁ డమరులమీఁదం, బోవుట విని యతనితోడి - పురుడునకుం బాం
థావలిపై వెస వచ్చెం, గావలయు ననంగ నమృత - కరుఁ డుదయించెన్. 1

సీ. చిత్తజుచిగురులం - జిత్రంబుగా నిడ్డ, లలితతమాలప - ల్లవ మనంగ
రతిపుమాణిక్యద - ర్పణమున నూనిన, కమనీయమృగమద - కణ మనంగ
వెడవిల్తులీలార - విందంబుమీఁ దికిఁ, దివుటమై నెరఁగిన - తేఁటి యనఁగ
వలరాజుసిందూర - తిలకంబుఁగోఁ జెలు, వొందుకాలాగరు - బిందు వనఁగ
నుదయరాగమహిమ - నుజ్జ్వలం బైనబిం, బంబునడుమ లాంఛ - నంబు చెన్నుఁ
జేయుఁ బూర్వశైల - శిఖరదేశంబున, నింగుఁ దొప్పె భువన - మెలమి మిగుల. 2

ఉ. పంబినకెంపుఁ బాసి దివి - బ్రాఁకె దిశల్ వెలిఁగించి చంద్రకాం
తంబుల నీరుసేసి కుము - దంబులఁ బండువుసేయఁ బంచి య
బ్జంబుల నిద్రవుచ్చి మరు - సాయకముల్ గరసానఁ బట్టి కో
కంబుల నేఁచి లోకముపా - గడ్తలు సేకొని చంద్రుఁ డున్నెడన్. 3

క. బడిచేసినచందంబునఁ, గడువేగం బొకటి నొకటిఁ - గదిసి దివిని సం
దడిగా నెంతయు గుంపుగఁ, బడి వెన్నెలకుం జకోర - పంక్తులు గవిసెన్. 4

క. మును మును నెగడెడురశ్ముల, కొన లెల్లం బట్టికొని చ - కోరంబులు ద్రుం
చిన నచటనచటఁ దునిఁగలి, గొని పెరిఁగెడుమాడ్కి దలము-కొని ప్రభ లెసఁగెన్.

తే. తివిచి నవకంబుదీప్తులు-ద్రెంచి యలఁతి, తునియలుగఁ జంచుపుటములఁ-ద్రుంచి తల్లు
లాదరంబున నంది యీ - నజ్జు లెత్తి, ప్రీతిఁ గముచుఁ జకోరంపుఁ - బిల్లగములు. 6

క. చంచులఁ గాంతులు వెన్నెలఁ, జించి యమృత ముట్ట నొసఁగు - చెన్నునకును రా
గించుచుఁ జవిఁ జొక్కుచుఁ గబ, ళించుఁ జకోరికలు సమద - లీలాలస లై. 7

సీ. క్రమ్మి పైఁ దొరఁగెడు - కౌముదితీయంబు, సొంపునఁ దనుపునఁ - జొక్కి చొక్కి
పచరించుచంద్రాత - పంబు కాలువలలో, నడ్డంబుగా నిల్చి - యాఁగి యాఁగి

వెల్లువ పెల్లు నూ - పెడుసాంద్రచంద్రికా, పూరంబు గని మదిఁ - బొంగి పొంగి
మిన్నులతో రాయు - వెన్నెలకరడుల, నెఱకలు సడలించి - యీఁది యీఁది
చెలఁగి చెలఁగి మలఁగి - మలఁగి యల్లల్లన, క్రాలి క్రాలి బిట్టు - తూలి తూలి
సమదవృత్తిఁ గేలి - సలిపెఁ జకోరచ, యంబు సదలు దమము - యంబు గాఁగ. 8

క. తెఱఁబడ నొండొంటికి ము, న్నడఁ గముచుచు నొడిసికొనుచు - నేపునఁ బైపైఁ
బడుచు నవు లవుల నీసునఁ, గడచుచు వెన్నెలఁ జకోర - గణ మానునెడన్. 9

క. తినుగమి నొల్లక యొకయెడఁ, దనయిచ్ఛకు వచ్చునిందు - ధామనికాయం
బున మన్న మెక్కి నిగిడెడి, కొనలు గఱచి మేసె నొకచ - కోరము దివ్యుటన్.

ఉ. సమ్మదవారి గన్గడలఁ - జాలుగ మైగరుపార నింగబిం
బమ్మున దృష్టి నిల్పి పయిఁ - బ్రాఁకుమయూఖముల నూఁగునూఁగులేఁ
గొమ్మలు పట్టి చంచుపుట - కోటిఁ గదల్చి తెమల్చికొంచు సౌ
ఖ్యమ్ము విహంగమమ్మయిన - యాకృతి నొందెఁ జకోర మొక్కెడన్. 11

చ కలయఁగ నూనునట్లుగ జగంబు సమస్తముఁ జాలఁ గ్రాఁగెనో
జలజభవుండు గోరి పెఱ - చాయల నెల్లను మాన్చి యొందునం
దెలుపు ఘటించెనో యమృత - దీధితి వేసెను నిశ్వరూపుఁ డై
నిలిచెనొ నాఁగ నెల్లెడల - నిండఁగ వెన్నెల పర్వె సాంద్ర మై 12

క వెన్నెలపోఁతపనులో యన, వెన్నెలగంభీరువుపనుల - విధమున మీఁదన్
వెన్నెలనీరు నెఱప రనఁ, గన్నుల కిం పొసఁగె నిల స - కిలరూపములున్ 13

చ. అలసత యొప్ప నల్లన ర - తాంతమునం బ్రియునొద్దఁ బాసి నె
చ్చెలికడ కేగుదెంచుసర - సీరుహనేత్రవిలోచనంబులం
దలఁకెడుమందహాసము వి - ధంబున సొంపున మీఱి యున్న చెం
గలువలలోన నింపడరు - కౌముది వేడ్కఁ లొనర్చెఁ జూడ్కికిన్. 14

సీ. భరితసుధారస - పాత్రంబు లనుకుము, దోత్కారంబులు దళు - కొత్త మెఱసి
చంద్రకాంతోపల - జలముల కాలువ, లివి యవి యని యప్పు - డేర్పరించి
దెసలు సూడఁగ గుండె - దిగ్గనుచక్రస, మూహంబునకుఁ దల - మునుక లగుచు
నీఁదుచకోరంబు - లెగుర వ్రేఁగై యీఁడి, గిలఁ బడునట్టుగా - దలముకొనుచు
నంతకంతకుఁ బొంగి మి - న్నందివెల్లి, మిగిలి యెనిమిదిదిక్కుల - మీఁదఁ బొరలి
జనము లానందమునఁ దేల - జగములెల్లఁ, దొట్టి నిండారువెన్నెల - నిట్టవొడిచె.

# III. ఎఱ్ఱాప్రెగడ మహాభారతము.

---

## 42. కృష్ణాగమనము.

(ఆరణ్యపర్వము. ఆ. IV)

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ - బొంపిరివోయి నిరస్తనీరదా
వరణము లై దళత్కమల - వైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమ - ధువ్రతనిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరము - ఖంబులు శారదవేళఁ జూడఁగన్ 1

శా. దానాంభగ్గపటలంబునం బృథుపయో - ధారావలిం దాల్చి గ
ర్జానిర్ఘోషము బృంహితచ్ఛలనఁ బ్ర - చ్ఛాదించి ప్రావృట్పయో
దానీకంబు శరద్భయంబున నిగూ - ఢాకారతఁ డిగ్గ నాఁ
గా నొప్పారె మదోత్కటద్విరదసం - ఘంబుల్ వనాంతంబునన్. 2

క కలనీలకంఠకోలా, హలలీలలు సెందె రాజ - హంసకులములం
దిలకించె సప్తపర్ణా, వలి విగళితకుసుమకుటజ - వాటికలగడన్. 3

మ. అతిగాంభీర్యవిభూతి నేకచులుకా - హంకారనిశ్శేషశో
షితపాథోధిపయస్కుఁ డైనముని దోఁ - చెం బుణ్యతేజోమయా
కృతి నయ్యామ్యదిగంతవీథిఁ బ్రకట - క్రీడాకళాగర్వగ
ర్జితమండూకకళంకితాంబుశుచితా - సిద్ధిప్రదాచార్యుఁ డై 4

తే. విశదశారదాంబుదపరి - వేష్టనమునఁ, బొలుచుగగనంబు ప్రతిబింబ - మో యనంగ
వికచకాశవనీపరి - వేష్టనమున, నతిశయిల్లె నిర్మలకమ - లాకగములు. 5

వ. అట్టిశారదాగమంబున నుత్ఫుల్లకమలకహ్లారకేసరకరాళకలితకల్లోలమాలినియు ననే
కమునిలోకసతతసంసేవ్యమాన విపులపులినోత్సంగయు నిరంతరతీరవానీరవనమండ
లీవిలసితయు నాకాశసంకాశవిశదసలిలయు నైనమహాసరస్వతీనది ననుదిన స్నాన
పానాదివిశేషంబులం బరితోషంబు నొందుచుఁ బాండునందను లమ్మరుభూమిం

గొన్ని దినంబులు వసియించి తదనంతరంబ ధౌమ్యాదిభూసురవరులు నింద్రసేనాది మూలభృత్యులుం దోడ నరుగుదేరఁ గామ్యకవనంబునకువచ్చి యచ్చటిమునులచేత నభినందితు లై యందు సముచితవర్తనంబుల నుండునంత నొక్కనాఁడు. 6

క. వాసవనందనసఖుఁ డగు, భూసురుఁ డొకఁ డరుగుదెంచి - భూవినుతగుణో
ద్భాసితు ధర్మజు విప్రస, భాసీనుం గాంచి యిట్లు - లనియెం బ్రీతిన్. 7

చ. జనవర నీవుఁ దమ్ములును - సమ్మద మొందఁగ నివ్వనంబునం
దునికి ధ్రువంబుగా విని మ - హోజ్జ్వలతేజుఁడు దేవకీసుతుం
డనఘుఁడు మిమ్ముఁ జూచుటకు - నై యిట వచ్చుచు నున్నవాఁడు మీ
కును ననిశంబుఁ దా హితమ - కోరుచు నుండు నతండు నెయ్యుఁ డై. 8

వ. మఱియు ననేకయుగసహస్రజీవియు నప్రమేయతపఃప్రభావభావియు వినుతవిధేయుండు నగుమార్కండేయుండును భవదీయదర్శనార్థం బీక్షణంబ చనుదెంచు నని చెప్పినయనంతరముహూర్తంబున. 9

సీ. శైబ్యసుగ్రీవాది - జవనాశ్వయుక్త మై, యాబద్ధనూత్నర - త్నాంశుపటల
భాసితం బై చారు - పతగపతాకావి, భూషితగగన మై - పొలుపు మీఱు
దివ్యరథంబున - దేవకీసుతుఁడు ప్రి, యంబున సత్యభా - మాన్వితముగఁ
దరళసౌదామనీ - దామసముజ్జ్వల, ధారాధరోత్సంగ - తలమునందు
శచియుఁ దాను వెలుఁగు - శతముఖుండునుబోలె, నరుగుదెంచె ఘనర - థాంగనేమి
విపులఘోషితాండ - వితబర్హిశబ్దశ, బ్దాయమానవనవి - భాగుఁ డగుచు 10

వ. ఇట్లు వచ్చి వాసుదేవుండు రథావతరణంబు నేసి ధర్మనందనున కభివందనం బాచరించి భీమార్జుననకులసహదేవులం గౌఁగిలించుకొని ద్రౌపది గారవించి ధౌమ్యాదిమహీసురుల చేత నభినందితుం డయ్యె. అంతఁ గౌంతేయాగ్రజుండు గదాగ్రజునకు నర్ఘ్యాదిసత్కారంబులు నిర్వర్తించి తమ్ములుం దానును విప్రజనంబులు నతనిం బరివేష్టించి యుండె. అప్పుడు కృష్ణుండు ధనంజయుం దనచేరువ నునిచికొని చిరకాలదర్శనోల్లాసితంబు లైనయాలోకనంబుల నతనియాకారం బత్యాదరంబున నభినందించుచు ధర్మరాజున కి ట్లనియె. 11

సీ. భాగ్యంబు గాదె యీ - పార్థుండు హరుఁ డాది, యైననిర్జరసమూ - హంబువలన
నెలమిఁ గృతాస్త్రుఁడై - యేతెంచు టరయంగ, ధన్యుండ వైతివు - ధర్మతనయ
నీధర్మనిష్ఠయు - నీతపంబును జూవె, యింతకుఁ గారణం - బిద్ధచరిత
రాజ్యంబుకంటెను - రాజేంద్ర ధర్మంబ, యిష్టమై పరఁగు నీ - కెల్లనాఁడు

వేదవేదాంగవిదుఁడవు - వివిధయజ్ఞ, కర్త వైతి ధనుర్వేద - కర్మఠుఁడవు
ధరణి యెల్ల నేలెడిరాజ - ధర్మ మమర, సులభ మయ్యె నీ కిహపర - శోభనములు.

చ. దమమును సత్యయుక్తియును - ధైర్యనిరూఢియు నిత్యతృప్తియున్
శమమును నీకు నైజములు - సన్మతి నర్థవశంబుఁ గామఁలో
భములును బొంద వట్లగుటఁ - బార్థివకుంజర ధర్మరాజనా
మమునఁ ద్రిలోకపూజ్యమహి - మం బొగ డొందెద వివ్విధంబునన్. 13

వ. అని పలికి వెండియు. 14

శా. ద్యూతవ్యాజమునన్ సభాంగణములో - దుర్యోధనుం డట్లు దు
ర్నీతిం గూరి యొనర్చినట్టియఘముల్ - నిష్కంపధైర్యోన్నమ
చ్చేతస్సారుఁడ వైన నీ కొకనికిం - జెల్లెన్ సహింపంగ వి
ఖ్యాతక్షాంతులు లేరె ధార్మికులు ని - క్కం బిట్టిరే యెవ్వరున్ 15

ఉ. ఉల్లము సత్యసంయమము - నూనినవాఁడవు నీవు విక్రమం
బొల్లమిఁ గౌరవాధముల - యుద్ధతి మైమెయిఁ జెల్లెఁ గాక యొం
డెల్లను నేల నీకుమది - నించుక కన్కు జనించినన్ మహీ
వల్లభ యష్ట రూ పఱఁద - వారక వైరికులంబు సర్వమున్ 16

చ. వినుతిభవన్నిదేశ మను - వేల యలంఘ్యము గాన యిమ్మెయిన్
ఘనభుజవీచివిభ్రమవి - కాసముఁ జూపక నిల్చెఁ గాక స
జ్జననుత చూడ నీయనుజ - సాగరముల్ దటితోడ విద్విష
జ్జనలయకారు లై కడఁగి - సర్వజగంబుల నాక్రమింపవే. 17

ఉ. అంధకవృష్ణిభోజకుకు - రాన్వయభూపతు లెల్ల నీదెసన్
బాంధవసౌహృదప్రణయ - భక్తివిశేషము లొప్ప నీమనో
గ్రంథి యడంగఁ జేయ నెస - కంబునఁ బూనినవారు లోభమో
హాంధులు ధార్తరాష్ట్రులు జ - నాధిప మార్కొనువారె వారలన్. 18

క. చతురంభోధిపరీత, క్షితితలసామ్రాజ్యలక్ష్మి - కిం బతివి జగ
న్నుత నీవ నీవు దలఁచిన, నతిదుష్కర మెందు లే ద - నర్గళమహిమన్. 19

వ. అనిన నంతోసిల్లి కుంతీనందనుండు దేవకీనందనుతోడ దేవా యెవ్విధంబున నైన నల్పావశిష్టం బైనయిన్వనవాసంబును నజ్ఞాతవర్తనంబును జల్పి లోకనింద్యంబుగాని విక్రమంబునం బగఱ జయింపఁ గోరెదము. దీని నంతయు నిర్వహించు భారంబు

నీయదియు. నీశరణంబు సొచ్చినమాకుం బరమశోభనంబు లగుట నిశ్చయంబు గాదె యనియె. అప్పుడు కృష్ణుండు నిజసమీపంబున నున్న పాంచాలిం జూచి యి ట్లనియె. 20

సీ. నీపుత్రు లేవురు - నీరజలోచన, యదుకుమారులఁ దారు - ముదముతోడ
ననుపమస్నేహస - మాహృతహృదయు లై, కరిహయారోహణ - చరితఁ దగిలి
యాడుచు వివిధశ - స్త్రాస్త్రవిశేషముల్, గఱచుచు నొం డెల్ల - మఱచి యున్న
వారు ప్రద్యుమ్నుండు - వారికి దివ్యాస్త్ర, జాతంబు లెల్లను - బ్రీతి నొసఁగెఁ
దన్వి యాసుభద్ర - తనపుత్త్రుకంటె నీ, తనయులందుఁ గూర్మి - దనరఁ జేయు
నూఱడిల్లు మింక - నుజ్జ్వలోన్నతులఁ బెం, పారఁ గాల మనతి-దూర మయ్యె.

*

# 43. మార్కండేయుండు పాండవులయొద్దకు వచ్చుట.

(ఆరణ్యపర్వము. ఆ. IV.)

వ. ....................పరమతపోవృద్ధుం డయినమార్కండేయుండు సనుదెంచినం గృష్ణుండును బాండవులు నతని నెదుర్కొని యథోక్తవిధులం బూజించిరి. మునీంద్రుండును వారిని బ్రత్యేకంబ కుశలంబు లడిగె. తదనంతరంబ యందఱు నాసీను లై యున్నయెడఁ బాండవహితార్థి యై వనజోదరుం డమ్ముని వరున కి ట్లనియె. 1

ఉ. ఏనును బాండునందనులు - నిమ్మునిముఖ్యులు నిప్డు లోకస
మ్మానితవాక్య నీ దయిన - మంజులవాగమృతప్రవాహముల్
వీనుల దోయిలించుచును - వేడుకఁ గ్రోలికొనంగ నాత్మలం
బూనెద మస్మదీప్సితము - పూర్ణము సేయఁగ నర్హ మెమ్మెయిన్ 2

వ. కావున. 3

క. దేవనరదేవధరణీ, దేవచరిత్రములు భర్తృ - దేవత లన నా
భూవినుత లయినసతులప్ర, భావము లెఱిఁగింపు మోలిఁ - బ్రస్ఫుటములుగాన్. 4

వ. అని యడుగుచున్నయెడ నారదుం డేగుదెంచిన నందఱు ప్రత్యుద్గతు లయి ప్రణమిల్లి యాతని నుచితపీఠంబున నునిచి యుచితసత్కారంబులం బ్రీతునిం జేసిన నమ్మహాముని మార్కండేయునిం జూచి కృష్ణపాండవప్రియహితార్థంబుగాఁ బరమపుణ్యకథాకథనం బొనరింతువు గాక యని పలికి వారల నామంత్రణంబు సేసి నిజేచ్ఛం జనియె. తదనంతరంబ ధర్మతనయుండు మార్కండేయున కి ట్లనియె. 5

సీ. కడఁగి ధర్మముతోడ - నడచుచు నే మిట్లు, దండిదుఃఖంబుఁ - బొందుటయును
నేపున నెప్పుడు-పాపంబు సేయుచు, ధృతరాష్ట్రజులు సుఖో-న్నతు లగుటయుఁ
గని యవ్విపర్యయ - మునకు నే నూహింతుఁ, బాయక నరుఁ డిప్డు - సేయుకర్మ
మునఫలమిందుఁబొం - దునొపరలోకంబు, నందుఁబొందునొయిందు - నందుఁగనునొ

విశ్వకర్త యైన - యీశ్వరునిన కాని, పురుషుఁ గర్మఫలము - పొరయఁ కున్నె
యొడలితోడఁ గృతము - వెడలిపోవునొ యిది, దెలియవలయు నాకు - నలఘుపుణ్య.

వ. ఇంతయు నెఱింగింప నీవ యర్హుండ వనినఁ బరమజ్ఞాననిధి యైనయత్తపోనిధి యతని
కి ట్లనియె. తొల్లి విధాత ప్రథమకల్పంబున నత్యంతనిర్మలంబులును ధర్మతంత్రంబులు
నైనశరీరంబులు సృజియించె. అట్లు పుట్టింపఁబడినయామనుష్యులు మహాసత్త్వసంప
న్నులు సత్యవాదులు సత్యసంకల్పులు బ్రహ్మభూతాత్ములు స్వచ్ఛందజీవులు నై
దేవయానంబుల విహరించుచు ననాయాసంబున నధికఫలసిద్ధిం బొందుచు సర్వజ్ఞు
లై విగతమత్సరు లై బహుసహస్రసంతాను లై బహుసంవత్సరాయుష్యు లై
వర్తిల్లుచుండిరి. అంతఁ గాలాంతరంబునం గామక్రోధాది గుణంబులు దమ్ముం బొందు
టయు మాయాప్రవర్తను లై దేవతలచేత విడువంబడి యల్పాయువులు నల్పబల
శరీరసత్త్వులును దరిద్రులును నిష్ఫలారంభులును బహురోగపీడితులును నాస్తికు
లును నై యొండొరుల మెచ్చక దురితంబులు సేయుచుఁ దిర్యగ్యోనులం బుట్టుచు
నరకాగ్నులం గ్రాఁచుచు గతాగతభ్రమణంబుల నలయం దొడంగిరి. ఇట్లు దిరుగు
చున్న సంసారచక్రంబునందు. 7

చ మనుజులు పుణ్యపాపములు - మానక యిం దొనరించుచుం దుదిం
దనువు దొఱంగి పోవునెడఁ - దప్పవు నీడయపోలెఁ గర్మముల్
వెనుకన యేగి భూరిసుఖ - విశ్రుతియుం బటుదుఃఖదైన్యముం
దనుకఁగఁ జేయుఁ గ్రమ్మఱఁగఁ - దాన యొనర్చు భవంబు దేహికిన్. 8

క. విను మనుజున కివ్విధమునఁ, దనచేసినసుకృతదుష్కృ - తంబులు నెఱయం
దన కనుభవింపఁ బాలివి, తనువు సెడుం గాని కర్మ - తతి సెడ దనఘా. 9

వ. మఱియు నున్ననిదర్శనంబులు సెప్పెద 10

క. ఈలోకమ యురుఁ గొందఱ, కాలోకము కొందఱకు ని - హంబును బరముల్
మే లగుఁ గొందఱ కధిపా, యేలోకము లేదు వినవె - యిలఁ గొందఱకున్. 11

వ. అది యె ట్లనిన. 12

చ ధనములు సాలఁ గల్గి సత - తంబును నింద్రియవాంఛ సల్పుచున్
మనమున నెన్న దుర్ సుకృత - మార్గముపొంతను బోక లోభమో
హానియతబుద్ధు లై తిరుగు - నట్టిజనుల్ పరలోకసౌఖ్యముల్
గనుటకు నేర రిక్కడి సు - ఖంబులు మే లయి తోఁచు వారికిన్. 13

మ. ఉపవాసవ్రతసంతతాధ్యయనతీ - ర్థోపాసనాదిక్రియై
కపరత్వంబునఁజేసి యైహికము దుర్గ - ఖప్రాయ మై పోవఁగా
విపులానందముఁ బొందఁ గల్గుఁ దుది నా - విర్భూతభోగైక లో
లుపబుద్ధిం జిరపుణ్యశీలురకు నా - లోకంబునన్ భూవరా. 14

ఉ. ధర్మమ పల్కుచుం దగిలి - ధర్మపథంబునఁజేసి యర్థముం
బేర్మియుఁ గాంచి ధర్మవిధిఁ - బెండ్లియు నై ప్రజలన్ సృజించి స
త్కర్మములం బ్రశస్తులు - గాఁ గ్రతువుల్ వొనరించుసజ్జనుల్
ధర్మజ యింపు నంపును ము - దంబునఁ గాంతు రభీష్టసంపదల్ 15

ఆ సత్యమును శమంబు - శౌచంబు లేక నా, స్తిక్యమును నిషిద్ధ - సేవనంబు
గలిగి తిరుగుదుష్ట - కష్టజనశ్రేణి, పొలియు నుభయలోక - ములకుఁ గాక. 16

వ. ఇది మనుష్యులకర్మగతిప్రకారంబు. 17

చ. జననుత మీరు దివ్యులరు - సమ్మతి దేవహితార్థ మిమ్మహిన్
జననము నొందినారరు ప్ర - శస్తపరాక్రమలీలఁ బేర్చి యిం
క నఖిలశత్రునిర్మథన - కర్మ మొనర్చి మహీభరంబు దీ
ర్చి నియతిఁ బెక్కుజన్మములు - సేసి భజింతురు దేవభావముల్. 18

# 44. పతివ్రతాచరిత్రము—ధర్మవ్యాధోపాఖ్యానము.

(ఆరణ్యపర్వము. ఆ. V)

వ. ......బహుభంగుల మార్కండేయుండు వివరింపం బుణ్యకథావిశేషంబులు విని సంతుష్టహృదయుండై కౌంతేయపూర్వజుండు మఱియు నమ్మునీంద్రున కిట్లనియె.

సీ. సమధికదర్పదు - ర్జయములై నిగిడెడు, నింద్రియంబులఁ గుదియించి తెచ్చి
మనసుపొందున నిడి - మన సహంకారంబు, పజ్జకుఁ బాపి స - ద్భక్తియుక్తి
నెరయంగ ననిశంబు - నిజభర్తృశుశ్రూష, యందు సమాహిత - యైనవనిత
యఖిలలోకోత్కృష్ట - యని యెప్డు నూహింతు, నరయఁ బతివ్రత - లైనవారి
చరిత మత్యంతధర్మ సూ - క్ష్మంబుఁ గరము, దుష్కరంబును గాదని - ర్ఘాతదురిత
యట్లు గావున విన వేడ్క - యయ్యెఁ జెప్ప, వలయుఁ బుణ్యసతీప్రభా - వంబు నాకు.

వ. మఱియుఁ దల్లిదండ్రు లిరువురయందును బుత్త్రనిమిత్తంబైనయాయాసం బెవ్వరి కెక్కుడు వారలయెడం బుత్త్రుం డెట్టివాఁడు గావలయు హీనయోనిజాతుం డైన పురుషుం డేమి తెఱంగునడవడిం బరమధార్మికులలోకంబులు వడయు నివియును వివరింప నీవ యర్హుండ వనిన నమ్మహాముని యమ్మహీపతి కిట్లనియె. 3

సీ. జతనంబు మిగుల మా - సములు దొమ్మిది యుద, రంబునం గరముభ - రంబుతోడ
భరియించి పదపడి - ప్రాణసంశయదశ, నొంది పుత్త్రునిఁ గాంచు - నొనరఁ దల్లి
తపములు యజ్ఞముల్ - దానముల్ వ్రతములు, దేవతాసజ్జన - సేవనములుఁ
గావించుఁ బుత్త్రునిఁ - గామించి జనకుఁ, డిట్లిరువురపాటును - సరియె తలఁపఁ
దనయుఁ గని తల్లిదండ్రులు - దమకు నతఁడు, భక్తుఁ డగుటకు ధర్మార్థ - సక్తుఁ డగుట
కాసపడుదురు విను మట్టి యాస సిద్ధిఁ, బొందఁ జేయునతఁడ చువ్వె - నందనుండు. 4

క. జననియు జనకుఁడు నెవ్వని, యనువర్తనమునఁ బ్రియంబు - నందుదు రెదఁ ద
త్తనయుఁడు ధర్మముఁ గీర్తియు, ననూనముగఁ బొందఁబడయు - నక్షయగతులన్. 5

## మార్కండేయుఁడు ధర్మజునకుఁ బతివ్రతామాహాత్మ్యంబు సెప్పుట.

వ. మఱియు నిజభర్తృశుశ్రూషయందు నిత్యాసక్త యయినపతివ్రతకు నఖిలయజ్ఞదానతపఃఫలంబులు సులభంబు లగు నొక్కయితిహాసంబు సెప్పెద. అందు నీ యడిగినయర్థంబు లన్నియుఁ దేటపడు నాకర్ణింపుము కౌశికుం డనుబ్రాహ్మణుండు ధర్మతపశ్శీలుండు సంతతాధ్యయనతత్పరుం డయి యొక్కశిష్టగ్రామంబున నుండు. అతం డొక్కనాఁడు గ్రామసమీపంబునం దొక్కవృక్షమూలంబున నాసీనుం డై వేదంబులు గుణియించుచుండం దదీయశాఖాగతం బైనకొక్కెర యొక్కం డాతనిపై రెట్ట వెట్టిన నమ్మహాద్విజుం డలిగి చూచుటయు నది యప్పుడ నిశ్చేతనం బై నేలం బడినం గనుంగొని యతండు. 6

క. అక్కట నాహృదయము గడు, నక్కటికము లేనిదయ్యె - ననిమిత్తమ యీ
కొక్కెర నిటు సేసితి నా, కెక్కడిశాంతి యని వికల - హృదయుం డగుచున్. 7

వ పెక్కుభంగుల వగచి మాధ్యాహ్నం బగుటయుఁ గృతాహ్నికవిధానుం డై గ్రామంబున కరిగి యందు శుచు లైనవిప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు నం దొక్కపుణ్యగృహంబువాకిట నిలిచి భిక్షాం దేహి యనుటయు నాయింటి యవ్వియు నతిసంభ్రమంబున భిక్ష యిడుటకుం బాత్రశోధనంబు సేయు నెడ. 8

ఉ. ఆయొలనాఁగభర్త గడు - నాఁకటఁ దూలుచు వచ్చె వచ్చినం
దోయజనేత్ర సంభ్రమము - తోఁ దగుపీఠము వెట్టి పాద్యముం
బాయక మజ్జనక్రియయు - భక్తి నొనర్చి ప్రియోక్తు లొప్పఁగా
నాయనఁ బ్రీతుఁ జేసె రుచి - రాన్నరసంబుల నింతి చెచ్చెరన్. 9

చ. కుడిచినపిమ్మటం గుసుమ - కోమల విస్తృతసంస్తరంబుగా
నొడికపుసెజ్జ సేసి ప్రియుఁ - డొయ్యన నందు శయింపఁ దమ్ములం
బిడి చరణంబు లొత్తి మది - రేక్షణ యంతటిలోఁ దలంచె ము
న్నడరఁగ భిక్షకై నిలిచి - నట్టిమహీసురముఖ్యు నాత్మలోన్. 10

వ. ఇట్లు దలంచి భిక్ష గొనుచుం జనుదెంచిన నమ్మగువం జూచి కౌశికుండు రోషరంజితలోచనుం డగుచు ని ట్లనియె. 11

క. అడిగినయప్పుడ చెచ్చెరఁ, గడపినఁ బో నవ్వ యేను - గడుదుర్మతి వై
పడఁతి నను నిలిపి భిక్షం, బిడక కడు నవజ్ఞ సేసి - తేల మదమునన్. 12

చ. అనినఁ బతివ్రతాతిలక - మాతని కిట్లను నయ్య మత్ప్రియుం
డనుపమితక్షుధాచలితుఁ - డై చనుదెంచిన భక్తి నమ్మహా
త్మునకు సపర్య సేయుచు మి - ముఁ మదిలోనఁ దలంపఁ జాలనై
తి నిదియుఁ దప్పుగాఁ గొనక - ధీరత యొప్ప సహింపఁగాఁ దగున్. 13

వ. అనిన నమ్మహీదేవుం డప్పతివ్రత కిట్లనియె. 14

ఉ. నీమగఁ డంతయెక్కుడె మ - నీషులు భూసురు లింతతక్కువే
కోమలి యేల యిట్లు గడుఁ - గ్రొవ్వునఁ గానవు లోకవంద్యులౌ
భూమిసురేంద్రులౌ దివిజ - పుంగవుఁ డాదిగ భక్తిఁ గొల్చు నో
నేమిట నొక్కొ వారు గడు - నెల్లిద మై రిటు నీకు నిచ్చటన్. 15

క. అవమానితులై ధరణీ, దివిజులు క్రోధాగ్నిశిఖల - దీపించి మహో
గ్రవనద్వీపంబులతో, నవని నయినఁ బొడ వడంతు - రప్రతికారుల్ 16

వ. నీ వింత నెఱుంగ నొల్లవైతివి గాకేమి యనిన నయ్యంగన యిట్లనియె 17

సీ. దేవతాసములు భూ - దేవతావరు లయ్య, యేను దన్మాహాత్మ్య - మెఱుఁగనయ్య
యొకవిప్రుఁ డలిగి ప - యోనిధిజలము ల, పేయముల్ గాఁగ శ - పింపఁ డెట్లు
దండకవిషయంబు - దగ్ధంబు సేయండె, యలుకమై నొక్కమ - హాద్విజుండు
వాతాపి యనుదైత్య - వరుమ్రింగి యఱిగించు, కొనఁడె భూదేవుఁడొ - క్కరుఁడు గినిసి
ధరణి మఱియును బెక్కువి - ధంబులందు, బ్రహ్మవిదులైన బ్రాహ్మణ - ప్రభులమహిమ
వినమె యెఱిఁగియెఱింగి స - ద్వినుతచరిత, కొఱవిఁగొని పెట్టినే తల - గోఁకికొనఁగ. 18

వ. నాతెఱంగు సెప్పెద నాకర్ణింపుము. 19

తే. పతియ మాకు నాపాలికిఁ - బరమదైవ, మేను వాఙ్మనఃక్రియలఁ ద - ద్హితము నెపుడుఁ
గోరియొనరింతు దీని మి - క్కులఁగ నొందు, ధర్మువులు గాన నెందును - దలఁచిచూచి.

వ. నీ వతిక్రోధనుండ వగుటయు నెఱుంగుదు. నీకోపంబున నొక్కకొక్కెర నిహతం
బయ్యెం గాదె. ఇది మదీయపాతివ్రత్యమహిమం జేసి కాంచితిం గానఁ గ్రోధంబు
గొనియాడుట లగ్గు గాదని యిట్లనియె. 21

తే. క్రోధమోహనామకులైన - ఘోరశత్రు, లిరువు రెరియించుచుండుదు - రెపుడు నంత
రంగ మయ్యుభయంబు న - డంగ కున్నఁ, గలదె యూరక బ్రాహ్మణ్య - గౌరవంబు.

సీ. ఎవ్వఁడు సత్యంబు - సెప్పుడుఁ బల్కు హిం, సావిదూరుఁడు గురు - జనహితార్థి
యింద్రియంబుల నోర్చి - యెల్లవారలఁ దన, యట్ల కాఁ జూచు ధ - ర్మాభిరతుఁడు

గామంబు దగులండు - కర్మంబు లాఱును, సముచితసంప్రయో - జ్యత నొనర్చు
నట్టిపుణ్యాత్ముని - ననఘు బ్రాహ్మణుఁ డని, యనిశంబుఁ గీర్తింతు - రమరవర్యు
లార్జవంబు శమము - నధ్యయనంబును, బరమధనము సువ్వె - బ్రాహ్మణునకు
ధర్మగతికి నవియ - తగుసాధనంబులు, వేదవిహితముఖ్య - విధులు సెనరె. 23

వ. ధర్మంబు బహుమార్గదృష్టం బయి సూక్ష్మం బయి యుండు నీవు కేవలస్వాధ్యాయపరుండవు గాని ధర్మసూక్ష్మత యెఱుంగవు గావునం దడయక మిథిలానగరంబున కరుగు మందు జితేంద్రియుండును సత్యవాదియు మాతాపితృభక్తుండును నయిన వాఁడు ధర్మవ్యాధుం డనుకిరాతుండు నీకు నఖిలధర్మంబులు సెఱింగించి సంశయచ్ఛేదంబు సేయు నాదెసం బ్రసన్నుండ వగునది వనితలకుం బరిజ్ఞానంబు లేదు గావున నా కెట్టియపరాధంబు సేసినను సహింప వలయుఁ గదా యనినఁ గౌశికుం డి ట్లనియె. 24

క. నను దూఱం దగు నీకత, మున నాచిత్తము ప్రశాంతిఁ - బొరసెఁ బురంధ్రీ
జనవినుత పోయి వచ్చెద, ననుపమశోభనసమృద్ధు - లయ్యెడు నీకున్. 25

## కౌశికుం డనుబ్రాహ్మణుఁడు ధర్మవ్యాధునియొద్దకుఁ బోవుట.

వ. అని యాక్షణంబ యమ్మహాద్విజుండు ధర్మవ్యాధదర్శనలాలసుండై కదలి పతివ్రత యెఱుకకు విస్మయం బందుచుఁ దన్నుం గృతాపరాధునింగాఁ దలంచుచు ననేక నగరగ్రామంబు లతిక్రమించి చని యనుపమానశోభాసనాథం బయినమిథిలానగరంబు సొచ్చి రాజమార్గంబు దఱిసి యచ్చటిజనంబుల ధర్మవ్యాధుం డున్నయెడ నడిగి వా రెఱింగింప నట యేగి ముందట నల్పమృగమాంసఖండంబు లంగడిం బచరించి యమ్ముచున్నవాని ననవరతవిక్రయాగతజనసమావృతు నక్కిరాతుం గని యతిజుగుప్సితం బయినసూనాపణంబు సేర నొల్లక తొలంగి యొక్కయెడ నుండె. అంత. 26

ఆ. వాఁడు నతనిరాక - పోఁడిగ నిజబుద్ధి, సెఱిఁగి యతనియున్న - యెడకు వచ్చి
పరమభక్తి మ్రొక్కి - ధరణీసురేశ్వరుఁ, గుశల మడిగి ప్రియము - గొనలునిగుడ.

ఉ. అనఘునితంబినీతిలక - మైనపతివ్రత నాతెఱంగు సె
ప్పినఁ జనుదెంచి తీవు ననుఁ - బ్రీతిఁ గనుంగొన నీమనోరథం
బును మదిలో నెఱుంగుదుఁ బ్ర - మోదముఁ బొందితి రమ్ము మద్గృహం
బున కని పల్కి తోడుకొని - పోయె నతండు మహీసురోత్తమున్. 28

వ. కౌశికుండును ధర్మవ్యాధుసెఱుక కచ్చెరువంది పతివ్రతయెఱుకయుం దలంచి యిది రెం డవునాశ్చర్యంబు గంటి పొ మ్మని తలంచుచుఁ దదీయభవనంబున కరిగి వాని చేతం బూజితుం డయి యిష్టకథాప్రసంగంబున నుండి యతని కి ట్లనియె. 29

తే. నీవు గడు ధర్మవిదుఁడవు - జీవహింస, జీవనంబుగ నడచుట - శిష్టపథమె యకట యీఘోరకర్మంబు - నకు మదీయ, బుద్ధి దద్దయు దుఃఖంబు - నొందెనిపుడు.

వ. అనుటయు లుబ్ధకుం డి ట్లనియె. బ్రాహ్మణులకుఁ దపస్స్వాధ్యాయసత్యబ్రహ్మచర్యం బులును రాజులకు దండనీతియు వైశ్యులకుఁ గృషిపశుపాలనవాణిజ్యంబులును శూద్రులకు శుశ్రూషయు నెట్లు పరమధర్మం బయి చెల్లు నట్ల మాకును మృగ యోపజీవనంబు పరమధర్మంబు. విశేషించి యిది వంశక్రమాగతం బయిన యాచా రంబు. అదియునుం గాక యీదేశంబునకు రాజైనజనకుండు నిజధర్మతత్పరుం డయి సకలవర్ణరక్షణంబు వడల కుండు నట్లు గాన నాస్తికకర్మంబులు విడుచు వానిం దనపుత్త్రు నైనను దండితుం జేయుఁ గావున నేనును నిజకర్మపరిత్యాగంబు సేయ నోడుదు. ఈదృశప్రవర్తనుండ నయ్యును. 31

తే. జీవహింస యెన్నండును - జేయ ననఘ, యొరులు సంపి తెచ్చినమాంస - మొనరవిలిచి తగినవెల కమ్మి బ్రదుకుదుఁ - దద్ధనమున, నమల మాంసంబు శాంతియ - నాధనంబు

చ. వినయము విస్తరిల్ల గురు - వృద్ధజనాతిథివిప్రదేవతా
ర్చన లొనరింతు సత్యమును - శౌచము నేమఱ నీగి మన్ననం
దనుపుదు భృత్యబంధుతతిఁ - దాల్మి వహింతు ననూయఁ జేయ నెం
దును మదిఁ దృష్ణ సొన్పఁ బర - దోషకథావిముఖుండ నెప్పుడున్. 33

క. సతతోపవాసనియమ, వ్రతములఁ జరియింతు నేక - వనితాప్రియుఁడ
బ్బుతుకాలరతుఁడ నిందా, స్తుతులందు మనంబు నాకుఁ - దుల్యత నుండున్. 34

వ. అ ట్లగుటం జేసి హీనయోనిజుండ నయ్యును నిర్మలుండ నైతి. ప్రసంగవశంబున నింత సెప్ప వలసె. నీవు ధర్మబోధార్థంబు నాయున్నయెడకుం జనుదెంచితి గావున నీకు ధర్మవిశేషంబు లెఱింగించెద. అవధానతత్పరుండ వయి యాకర్ణింపుము. 35

క. తనకులధర్మము విడువక, మనుట పరమధర్మ మండ్రు - మాన్యులు చిత్తం
బునఁ గృప గలుగుట ముఖ్యపుఁ, బని సైరణ వలయు నఖిల - భావములందున్.

ఆ. విడువ వలయు సకల - విషయవాంఛలయందు, విడువుఁ బోలుగుణము - వెదకియెందుఁ
గాన నైరి బుధులు - గలదె పరిత్యాగ, శీలునకు నసాధ్య - సిద్ధి యెందు. 37

సీ. సత్యహితాలాప - చతురత యర్జంబు, సంతతసుజనపూ - జనము వలయు
విను కామసంరంభ - విద్వేషములఁజేసి, మతి గలంగినను ధ - ర్మంబు దప్పఁ
ద్రొక్కక నడచు ట - త్యుత్తమసరణి య, ప్రియములయందును - బ్రియములందు
దైన్యహర్షంబులఁ - దగులక యున్నట్టి, కల్యాణవర్తన - కాంతి లెస్స
యెగ్గు సేసినవారికి - హితము సేఁత, యార్యజనములు గీర్తింతు - రన్యదోష
కారి దనపాపమునఁ దాన - కాలి పోవు, వేఱ వానికిఁ గీడు గా - వింప నేల.

క. ధార్మికులు సలుపునుత్తమ కర్మముఁ జెడ నాడు నాస్తి - కజనము విను మా
దుర్మతులతెఱఁగు గనికొని, ధర్మము నెడఁ బ్రీతి వదలఁ - దగదు బుధునకున్ 39

క. మతిమఱపునఁ బాపము దన, కొదవుటయును బిదప నెఱిఁగి - యొకసగమును నే
నిది సేయ నింక ననియెడు, మదిఁ బెఱసగమైన నరుఁడు - మలుఁగు నఘంబున్. 40

తే. పాపములకెల్ల నెక్కుడు - పాతకములు, సువ్వె క్రోధలోభంబులు - సువ్రతాత్మ
వాని రెంటి జయించిన - వాఁడుగాని, యెందుఁ బరమధార్మికుఁ డని - యెన్నఁబడఁడు.

వ. శిష్టచరితంబులు గానిమార్గంబులు గొన్ని తృణసంవృతంబు లైనకూపంబులుం బోలెఁ గపటధర్మసంవృతంబు లై యుండు వాని దవ్వులన పరిత్యజించి శిష్టాచారంబుల నడ మట ధర్మలక్షణం బనినం గౌశికుండు శిష్టాచారంబు లెయ్యవి యెఱింగింపు మను టయు ధర్మవ్యాధుం డి ట్లనియె 42

సీ. దానంబు సత్యంబుఁ - దపము యజ్ఞము నార్జ, వముఁ గామలోభాది - వర్జనంబు
గురుజనశుశ్రూష - క్రోధరాహిత్యంబు, దమము సంతోష మ - ధ్యయననిరతి
దాంభికత్వము లేమి - దైన్యంబు వొరయమి, యనసూయయనహంక్రి - యాభియుక్తి
దలఁపంగ నాద్యమై - తనరుధర్మము యొప్పుఁ, గొనియాట నాస్తిక - గోష్ఠిఁ జనమి
శీలసంరక్ష తీర్థసం - సేవ శౌచ, మఖిలభూతంబులందు ద - యార్ద్రుఁ డగుట
మితహితోక్తులు సంశ్రిత - మిత్త్రగుప్తి, యిన్నియును శిష్టచరితంబు - లిద్ధచరిత. 43

క. విను శిష్టచరిత లైకొని, యనపాయత నడవ నడవ - నంతఃకరణం
బున దొదలునట్టిసమ్మద, మనఘా దుర్లభము సూవె - యన్యపథములన్. 44

వ. కావున శిష్టాచారనియతిం జేసి గురుశుశ్రూష సలిపి కృతాధ్యయనుండ వై పరమ జ్ఞానపరిపక్వం బైనచిత్తంబుతోడం గామక్రోధమహామకరసంకీర్ణయు విషయజల పరిపూర్ణయు నైనమోహమహానది నస్ఖలితధైర్యం బను తెప్పం జేసి యశ్రమంబున నిస్తరించి కృతార్థుండ వగు మని మఱియు ని ట్లనియె. 45

క. క్రమమున శిష్టాచార, క్రమ మెఱుఁగఁగ ధర్మమునకుఁ - గడు వాటం బై
విమలం బగుఁ జిత్తము స, త్యమును నహింసయును దనకుఁ - దావలములుగాన్ 46

ఆ. విను మహింస ధర్మ - వితతి కెల్లను మేటి, యదియు సత్యయుక్త - మైన వెలయు
ననఘ శిష్టచరిత - లందు సత్యమ కడు నధిక మనిర శ్రుతుల - నరసి బుధులు 47

తే. వేదవిహితంబులును శాస్త్ర - విహితములును, శిష్టచరితంబులును నన( - జెప్పనొప్పి
ధర్మములు మూఁడువిధములఁ - దనరుచుండుఁ, గడఁగియున్నియుసద్గతి - కారణములు

మ. అనయంబున్ శ్రుతిపంక్తిఁ దైవిక తశి - ష్టాచారమార్గంబులం
జనుపుణ్యాత్ముఁడు ధర్మముల్ గడచి ప్ర - జ్ఞాపార్శ్వసంరూఢుఁ డై
కను చుండుం బటుమోహపంక జలమ - గ్నం బైనలోకంబు నీఁ
క నధోభాగమునందు డింగి కడు దుః - ఖం బొందఁగా నవ్వుచున్ 49

ధర్మవ్యాధుఁడు గౌశికున కహింసాస్వరూపంబు సెప్పుట.

వ. అని పలికి ధర్మవ్యాధుండు మఱియు ని ట్లనియె అయ్యా నీవు దొలుత నావర్తనంబు
గనుంగొని యిది హింసాబహుళంబు గాదె యని పలికితివి. దాని కేను దగు తెఱంగు
సెప్పితి. అది య ట్లుండె హింస యిట్టిది యహింస యిట్టి దని విభాగింప నెవ్వరికి
నేరరాదు. 50

క. మును తమ చేసినకర్మం, బునఁ గావె నశించు భూత - ములు సంపెడువాఁ
డు నిమిత్తమాత్ర మింతియె, యని చెప్పఁగ వినమె యంచి - తాచారులచేన్. 51

వ అదియునుం గాక 52

క. ఫలమూలౌషధిశాకం, బులుఁ బశుమృగతతులు భక్ష్య - ములుగా భూతం
బుల కజుఁడు సేసె నని య, స్ఖలితంబుగ మ్రోయు శ్రుతులఁ - గా దన వశమే. 53

సీ. అనఘ యౌశీనరుం డగుశిబి నిజగాత్ర, హింస నింద్రాగ్నుల - కిడఁడె మాంస
మతనిక లే దయ్యె - నయ్య యుత్తమగతి, రంతిదేవుం డను - రాజు తొల్లి
యనుదినంబును గోస - హస్రద్వయంబుఁ దా, వధియింపఁడే వేయి - వత్సరములు
గురుని మ్మహితాత్ముఁ - డొడరఁడే వేదార్థ, నిరతు లై యత్యంత - నియతు లైన
ధారణీసురముఖ్యు ల - ధ్వరము లందుఁ, బశువధింపరే పశువులఁ - బరమపుణ్య
గతులుఁ గనఁగ వె వారికిఁ - గడఁగి యగ్ను, లధికమాంసార్థు లని శ్రుతు - లందువినమె

క పితృదైవతకార్యములం, దతిభక్తిని మాంస మిడుట - యర్హ మనియుఁ ద
త్పితృదైవ శేషములు స, న్మతి భోజ్యము లనియు మునుల - మతములు గావే. 55

మ. హాలికుం డెంతయు నోజదున్ను నెడ సీ - రాగ్రంబునం జోఁకి ప్రా
ణు లనేకంబులు సచ్చు హింస యది యా - నో కాదో వే యేల మ
ర్త్యులు నేలం జరియించుచోఁ బదములం - ద్రొక్కం బడుం బెక్కు జం
తులు హింసావిధి గా దనంగ వశమే - దోషజ్ఞ యూహింపుమా. 56

చ. సలిలము లుర్వి యాకసము - సర్వము జంతుమయంబు గావునం
గలుగు నవశ్యముగా సకల - కర్మములందును హింస హింసకుం
దొలఁగిన దేహయాత్రయును - దుర్ఘట మైనటు లుండు నింతయుం
దలఁపరు హింస సేయ మని - తాగు చరింతురు గొంద ఱిమ్మహిన్. 57

క. పనివడి యహింస వ్రతముగఁ, గొని వనమున నున్న మునుల - కుం దొడరదె హిం
సనము తరుమూలఫలశా, కనిపీడన మదియు హింస - గా దొకొ తలఁపన్ 58

తే. హింస సేయనివాఁడు లేఁ - డిజ్జగమున, నొక్కఁ డైనను దమతమ - యోపినట్లు
హింస తెఱువునకడ గల్గి - యేగవలయు, నదియ చూవె యహింస నా - నతిశయిల్లు.

వ. ధర్మంబు బహుప్రకారం బై యుండుఁ దదీయసూక్ష్మగతి దురవబోధంబు గావున
శ్రుతిప్రమాణంబులవలనను వృద్ధాచారనిదర్శనంబులను నెఱింగికొనునది. 60

ఉ. భూతహితంబుగాఁ బలుకు - బొంకును సత్యఫలంబు నిచ్చుఁ ద
ద్భూతభయాస్పదం బగుప్ర - భూతపుసత్యము బొంకునట్ల ప్రా
ణాతురుఁ డైనచోఁ బరిణ - యంబునయందును బల్కుబొంకు స
త్యాతిశయంబ యండ్రు మహి - తాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్. 61

వ. అని తెలిపి మఱియు నతండు. 62

క. ఒప్పెడునది యైనను గడు, నొప్పనియది యైన నిజకు - లోచితపథముం
దప్పఁ దగ దండ్రు ధార్మికు, లప్పని నిజభాగ్యవిహిత - మని యుండఁ దగున్. 63

క. విను పూర్వకర్మఫలములు, దనకు వశము గాక పొందుఁ - దఱితో వానిం
గనికొన నేరక మూఢుఁడు, దన కాపద యైనచోట - దైవము దూఱున్. 64

తే. కార్యఫలములయెడఁ దాన - కర్త ననుట, కడు నెఱుంగమిఁ జూవె తాఁ - గర్తయేని
దగిలి తన దైనకార్యజా-తంబు నెల్లఁ, జెడక ఫలియించునట్లుగాఁ - జేయ రాదె.

వ. అది యె ట్లంటేని. 66

సీ. నీతిమంతులు ధర్మ - నిరతులు దక్షులు, నగువారు సేయుకా - ర్యములు గొన్ని
సిద్ధిఁ బొందవు దుష్ట - చిత్తులుఁ గ్రూరు లై, చేయఁ గొన్ని విశేష - సిద్ధిఁ బొందు

నూరక యుండంగ - నొందుఁ గొందఱు విపు, లార్థముల్ గొంద ఱా - యాసపడియు
నిష్ఫలారంభు లై - నిలుతురు గొందఱు, పేదవారికిఁ బ్రజ - పెల్లు వొడము
నర్థవంతులు గొందఱ - కర్థి నధిక, దానములు ధర్మములు సువ్ర - తములుఁ జేయఁ
బ్రజలు వుట్టరు విను మట్టి - భంగి సుమ్ము, కర్మఫల మాత్మతంత్రంబు - గాకయుండు.

క. పురుషుఁడు కర్మాధీనత, నరుగక తనవశము యనిన - నాపదలు రుజల్
మరణంబును నివి యేమియుఁ, బొరయక యుండంగ బ్రదుకఁ - బోలదె చెపుమా.

ఆ కర్మవశతఁ జూవె - కలుగు దేహము దేహ, వర్తనంబు కర్మ వశతఁ బుట్టు
దేహపాత మైన - దేహస్థుఁ డగుజీవుఁ, డరుగు గర్మవిహిత - మైనయెడకు. 69

వ. అనినం గౌశికుండు జీవుం డెట్టివాఁ డని యడిగిన లుబ్ధకుం డి ట్లనియె. 70

## ధర్మవ్యాధుఁడు గౌశికునకు జీవలక్షణంబులు సెప్పుట.

క వినుము జీవుండు సనాతనుఁ, డనఘుఁడు నిజకర్మవశత - నధ్రువదేహం
బునఁ బొందు దేహపాతం, బున నెప్పుడుఁ జెడఁ డతండు - భూసురవర్యా. 71

క. ఈయొడలు విడిచి వే ఱొక, కాయముఁ గైకొని శరీరి - గర్మవశగతిం
బోయి సుఖదుఃఖములు గనుఁ, బాయక వెండియును దేహ - బంధముఁ బొందున్.

వ అనిన విని బ్రాహ్మణుండు లుబ్ధకునితోడం బుణ్యపాపానురూపంబు లయినదేహ
బంధంబు లెట్టి వనిన వాఁ డి ట్లనియె 73

చ. స్థిర మగుపుణ్యకర్మమున - దేవభవం బగుఁ బుణ్యపాపసం
కరమున మానుషత్వ మగుఁ - గల్మషముల్ పశుకీటభావముం
బొరయఁగఁ జేయు నిప్పగిదిఁ - బుట్టుచుఁ జచ్చుచు మోహవార్ధిలోఁ
దిరుగుచు నుండుఁ గాని యొక - తీరము సేరఁడు జీవుఁ డెన్నఁడున్. 74

చ. ఇది సకలంబుఁ గాంచి బుధుఁ - డెన్నఁడుఁ బాపముపొంతఁ బోక ని
ర్మదనిరహంక్రియాత్ముఁడును - మత్సరదూరుఁడు నై చరించు బెం
పొదవఁగ ధర్మమార్గమున - నొయ్యన ధర్మముతీ పెటింగి తా
వదలఁడు తత్క్రియావిధము - వారక యెక్కుడొనర్చు ధర్మముల్. 75

చ. చిరముగ ధర్మముల్ నడపఁ - జిత్తము దేలుఁ బ్రసన్నచిత్తుఁ డై
పరువడి నింద్రియార్థముల - భంగులు రిత్తలు గా నెటింగి చె
చ్చెర నవి యంతవట్టు నిర - సించి తపోదమసత్యశీలతం
బరిణతి నొందుఁ బొందుఁ బిద - పం బరమార్థపదప్రభావమున్. 76

వ. అనిన నమ్మహాద్విజుం డమ్మహామతి కి ట్లనియె. 77

ఆ. ఇంద్రియంబు లనఁగ - నెయ్యవి యవి నిగ్ర, హింప కున్నఁ బాప - మేమి దొడరు
వాని నిగ్రహించు - వానికి నగుఫలం, బెట్టి దనిన నాతఁ - డిట్టు లనియె. 78

క. విను విషయజ్ఞానమునకు, ననయంబును మనసు మూల - మది కామక్రో
ధనిరూఢ మగుచుఁ బురుషుని, ననిశము నెలయించు నింద్రి - యార్థంబులకున్.

సీ. ఇంద్రియార్థంబుల - కెలసినపురుషుండు, గాఢరాగంబునఁ - గరఁగు చుండు
రాగంబువలనఁ ది - రం బగు లోభంబు, లోభి యై కరుణకు - లోను గాఁడు
మఱి సముద్ధతప్రవృత్తి - మరగుఁ బాపక్రియఁ, దగువారు సెప్పెడి - తగవు వినఁడు
కుజనులదెసఁ బ్రీతి - గోలుఁ దుల్యంబులు, గా కుండు వాఙ్మనః - కర్మభంగు
లిహమునందుఁ బుణ్య - హీనుఁ డై చెడిపోవుఁ, బరమునందు దుఃఖ - భరము నొందుఁ
గాన నింద్రియార్థ - గతిఁ బోక సాధుసం, సర్గఁ జేసి సుగతిఁ - జనుట యొప్పు. 80

వ. ఇంద్రియంబు లన నెయ్యవి యనియు నింద్రియజయసిద్ధియు నీవు న న్నడిగితివి. తత్ప్రకారంబు బ్రహ్మవిద్యావిషయంబు మాబోఁటివారికి నవాచ్యం బై యుండు. ఐనను నీవు బ్రాహ్మణప్రవరుండవు గావున సద్బ్రాహ్మణప్రియం బవశ్యకర్తవ్యంబు. పరమ బ్రహ్మవిదు లయిన బ్రాహ్మణవరులకు నమస్కరించి బ్రహ్మవిద్యాప్రపంచం బెఱింగించెద. అవధానపరుండ వై యాకర్ణింపుము. 81

తే. అంబరము వాయు వగ్ని దో - యమ్ము ధరణి, భూతపంచక మిదిక్రమం బున మహాత్మ
శబ్దసంస్పర్శరూపర - సములు గంధ, సంయుతంబుగ భూతపం - చకగుణములు. 82

క. ఒనరఁగ నాకస మాదిగ, ననులోమముతోడ నిమ్మ - హాభూతము లే
నునుబుట్టు నొకటి కొక్కటి, యనయముఁ బ్రతిలోమగతిల యంబునఁ బొందున్.

వ. శ్రోత్రంబును ద్వక్కును జక్షువును జిహ్వయు ఘ్రాణంబును ననునియ్యేనగు నింద్రియంబులు శబ్దస్పర్శరూపరసగంధంబు లింద్రియవిషయంబు లయి యుండు. ఇంద్రియపంచకంబునకు షష్ఠంబై మనస్సు ప్రకాశిల్లు. సప్తమాష్టమంబు లై బుద్ధియు నహంకారంబును వర్తిల్లు. సత్త్వంబును రజస్సును దమస్సును గుణంబు లై యుండు. నీచెప్పంబడినమహాభూతప్రముఖప్రపంచం బంతయు నవ్యక్తం బనుతత్త్వంబునం దావిర్భావతిరోభావంబులం బొందు చుండు. 84

క. అవ్యక్తతత్త్వ మరయఁగ, నవ్యక్తం బయ్యు నిట్టి - దై లక్ష్య మగున్
నువ్యక్తేంద్రియభూతా, దివ్యమహార్థలింగ - దృష్టాకృతి యై. 85

వ. అని చెప్పి మఱియు ని ట్లనియె. 86

తే. అనఘ శబ్దాదివిషయంబు - లందుఁ దగిలి
యిచ్చఁ జరియించు నెప్పుడు - నింద్రియములు
బుధుఁడు దత్స్వభావముఁ దన - బుద్ధి నెఱిఁగి
యేమఱక వానిఁ దగఁ గుది - యింప వలయు. 87

ఉ. ధీరుఁడు నిర్జితేంద్రియుఁడు - దెల్లముగాఁ దనుఁ గాంచు భూతవి
స్తారనిరూఢ మైనపర - తత్త్వముగాఁ దవయందు భూతవి
స్తారము నెల్లఁ గాంచు సత - తస్ఫుటదర్శనుఁ డై సమగ్రచి
త్పారముఁ బొంది నిర్మలత - పంబులయందుఁ జలింపఁ డెప్పుడున్. 88

క తప మనఁగ సకలవిషయ, వ్యాపేతి మగునట్టిబుద్ధి - వైభవము సుమీ
తపమున సుస్థిరుఁ డగుయో, గపరునకుం గలవె యొండు - కర్తవ్యంబుల్. 89

క స్వర్గనరకంబు లింద్రియ, వర్గసమాచరణమునన - వచ్చును వినవే
స్వర్గ మగుఁ దన్నివారణ, దుర్గతి యగుఁ దన్నిరోధ - దుర్బలతమెయిన్. 90

చ అరదము దేహ మింద్రియము - లశ్వము లాత్ముఁడు సూతుఁ డమ్మహా
తురగచయంబు ధైర్య మను - తోరపుఁబగ్గములన్ దృఢంబుగా
నురవడిఁ బోక యుంచి వెర - వొప్పఁగఁ బట్టినవాఁడు సేమపుం
దెరువున నేగు నప్పరమ - ధీరుఁడు సువ్వె యుదారుఁ డెయ్యెడన్ 91

తే. ఇంద్రియంబులు దవిచిన - యెడక పాఱు, చుండు మనసెప్పుఁ దద్వేగ-ముడుపకున్న
నెడలి చెడి పోవు బుద్ధి యు - దీర్ణపవన, హతిఁ బయోనిధిలోఁ గల-మవియునట్లు.

క ఏ నింద్రియములు మనసును, బూని తనవశంబ యైనఁ - బురుషుండు సదా
ధ్యానసమాధిసమగ్రుఁడు, వానిం గీర్తింతు రమర - వరులున్ మునులున్ 93

వ. అనిన నవ్విప్రుండు సత్త్వరజస్తమోగుణంబుల తెఱం గెఱింగింపు మనిన నెఱు కి
ట్లనియె. 94

క. అతినిందితము దమోగుణ, మతిమోహమయంబు సత్త్వ - మనయంబుఁ బ్రకా
శత నొప్పు నుభయగుణమి, శ్రితఁ బరఁగు రజోగుణంబు - సన్నుతచరితా. 95

మ. అసుఖాకారత నిద్ర దైన్యము విమో - హం బక్షమత్వంబు దా
మసభావంబులు రాగలోభజడతా - మానంబు లూహింప రా
జసవృత్తంబులు ధైర్యశాంతికరుణా - సంతోషవిద్యాదు లిం
పెసఁగన్ సాత్త్వికచేష్టితంబులు నిజం - బి ట్లాత్మఁ గ న్గొన్నియున్. 96

చ. అనఘుఁడు సాత్త్వికుం డగుమ - హాత్ముఁడు బోధనిరూఢి సర్వముం
గనికొని లోకవృత్తములు - గా వని రోసి సమస్తసంగభం
గనిరతుఁ డై తొలంగు మమ - కారవికార మహంక్రియాచ్యుతిం
బనుపడి సంయమప్రకట - భావన నుత్తమశాంతి నైకొనున్. 97

వ. సత్త్వగుణనిబద్ధుం డగు నేని శూద్రుం డైనను జన్మాంతరంబున వైశ్యత్వంబు నొంది క్రమంబున రాజభూసురభావంబులు భజించి భవవిముక్తుం డగు. అని చెప్పిన నమ్మహీదేవుం డమ్మహానుభావు నభినందించి. 98

తే. దేహమున ధాతుసంశ్రయ - దీప్తుఁ డగుచు, వహ్ని యెట్లుండు శారీర - వాయువులకు
నెలవు లెయ్యవి యెయ్యవి నాకు - నిశ్చయముగఁ, జెప్పు మనుటయు నిట్లని - చెప్పె నతఁడు.

సీ. మూర్ధదేశమునకు - వర్తితం బై పర్వు, నాత్మాగ్ని నాభిద - దాశ్రయంబు
శిరమునఁ బావకాం - తరమునఁ జరియించుఁ, బ్రాణుండు భూతాత్మ - భావుఁ డతఁడు
వరుసఁ బ్రాణాపాను - లిరువురు నయ్యగ్ని, వెలిఁగింతు రనపేత - వృత్తు లగుచు
గుదవస్తితలము లా - స్పదములు గా వహ్ని, పరిగతుం డగుచు న - పానుఁ డుండుఁ
గడఁగి విణ్మూత్రనిర్గమ - కారి యతఁడు, కర్మబలయత్న కారి యై - కంఠతలము
నం దుదానుండు వర్తించు - నఖిలదేహ, సంధులందును వ్యానుండు - సంచరించు 100

క. విను ప్రాణాపానులు న, య్యనలుఁడుఁ బ్రాపుగ సమానుఁ - డున్న రసవిపా
చనుఁ డగుచు నొప్పు దేశం, బున నుండును సకలధాతు - పోషకవృత్తిన్. 101

క. ఇది పరమయోగిదర్శన, విదితం బిప్పాటఁ బవన - విదు లైన మునుల్
వదలక యభ్యాసవిధిన్, ముదమున ధరియింతు రాత్మ - మూర్ధతలమునన్. 102

వ. ప్రాణాపానసమాహితుం డై సకలదేహంబులందును జరియించు చున్న పావకుండు జీవాత్ముండు గా నెఱుంగుము. అతఁడు జలంబుల నున్న కమలపత్త్రంబునుం బోలె దేహంబునం దుండియు నిర్లేపస్వరూపదీపితుం డయి వెలుంగు చుండు. ఇట్టి జీవాత్ముండ కదా పరమాత్ముండు. 103

క. చేతనరహితక్షేత్రముఁ, జేతనముం బొరయఁ జేయు - జీవాత్మదశో
పేతుఁడు పరమాత్ముఁడు వి, ఖ్యాతుఁడు త్రైలోక్యసంప్ర - కల్పనుఁ డనఘా. 104

క. భూతములయందు వెలిఁగెడు, భూతాత్ముని నెఱుఁగుదురు ప్ర - బుద్ధులు నిత్య
జ్యోతిర్మయు నవ్యయు న, ద్వైతం బగుబుద్ధి సూక్ష్మ - ధర్మమువలనన్. 105

వ. అని మఱియుఁ గౌశికునకు ధర్మవ్యాధుండు బ్రహ్మవిద్యాప్రభావంబు తెఱంగు సంప్రయోగరహస్యంబు దెలియ నిట్లనియె. 106

సీ. తెలివి నొందినబుద్ధి - గలమహాత్ముండు శు, భాశుభకర్మము - లందుఁ జొరఁడు
క్రమమున సౌఖ్యదుర్లభ - ఖము లాదిగా నశే, షద్వంద్వములయందు - సమతి నుండు
విను మట్టిపుణ్యున - కొనరింప వలయుకా, ర్యం బెఱింగించెద - ననుదినంబు
నియతాశియును జితేం - ద్రియుఁడు నై పూర్వరా, త్రమ్మున నపరరా-త్రమ్మునందు
యోగధారణనిరతుఁ డై - యుండ వలయు, నపుడు బోధదీపంబున - నాత్మ నాత్మ
యందుఁ గనుచు నివాతదీ - పానుకారి, యై వెలుంగుచు నమృతమ - యత్వమొందు.

క కామంబును గ్రోధంబును, నేమఱక జయింప వలయు - నెల్లవిధముల
ధీమహిత యిదియ సతత, క్షేమంకర మైనపథము గృతిబుద్ధులకున్. 108

క. నిత్యముఁ గర్తియుఁ గర్మఫ, లత్యాగియు నగుట లెస్స - లొల్యవియోగం
బత్యుత్తమయోగము ద, త్ప్రత్యయలక్ష్యుండు సూవె-బ్రాహ్మణుఁడు మహిన్. 109

చ. అరయఁగ జీవితంబు గడు - నధ్రువ మింత యెఱింగి యాత్మ నె
వ్వరిదెసఁ గీడు రోయక ధ్రు - వం బగుమైత్రి భజించి సత్కృపా
నిరతుఁడు నిష్పరిగ్రహు డు - నిత్యతపస్వియు నిత్యతృప్తుఁడుం
బరమశమాస్పదుండు నగు - బ్రాహ్మణుఁ డొందు సనాతనస్థితిన్ 110

వ. నీ వడిగినయఖిలధర్మంబులు సంక్షేపరూపంబున నెఱింగించితి నింక నెయ్యది విన వల తనినం గౌశికుండు మహాత్మా పని వలయు నవి యెల్లను విశదంబుగా వింటిం బ్రబుద్ధుండ నైతి నీవు సర్వజ్ఞుండవు నగుట నెల్లం బయ్యె ననిన ధర్మవ్యాధుం డతని కిట్లనియె 111

క. ఏ నిమ్మెయి నుత్తమవి, జ్ఞానోన్నతి వడయుటకు ని - జం బగుమూలం
బైనది గల దొకధర్మము, భూమతి యది నీకు దృష్ట - ముగ నెఱిఁగింతున్. 112

వ అభ్యంతరగృహంబునకు రమ్మని యతనిం దోడ్కొని చని మనోహరం బై చతుశ్శాలం బై వివిధసౌరభసంవాసితం బైనహర్మ్యంబునందు మహితాసనాసీనులైన వారిం దనజననీజనకుల నభిమతాహారపరితోషితులఁ బరమాంబరాభరణ గంధ మాల్యాలంకృతమూర్తుల నతనికిం జూపి తాను దత్పాదప్రణామంబుసేసి వారలఁ గుశలం బడిగిన నయ్యిరువురుం బుత్త్రున కిట్లనిరి. 113

సీ. అన్న కుమార నీ - యట్టిసత్పుత్త్రుండు, గలుగ మా కేమిటఁ - గడమ సెపుమ
నీచేయుధర్మంబు - నీకుఁ దోడయ్యెడుఁ, బరమాయు వర్ధసం - పదలుఁ గనుము
నీచరిత్రంబున - నిఖిలవంశముఁ బవి, త్రిత మయ్యె మానుష - దేహ మేల
ధరియించితో కాని - తత్త్వమారయఁ బర, దేవత వీవు సం - దియము వలదు

వాఙ్మనఃకర్మములఁ బిత్రు - వత్సలత్వ, మొక్కరూపుగఁ జలుపుచు - నున్నయట్టి
సద్గుణాకరు నిన్నెన్ని జామదగ్న్యు, నొకని నెన్నంగఁ దగుఁగాక-యొరులుఁగలరె.

వ. అని పలికిరి. అప్పుడు ధర్మవ్యాధుండు వారికిం గౌశికుం జూపి యీమహాత్ముండు మనలఁ జూచువేడ్క నిట వచ్చె ననిన నావృద్ధు లతనికి నర్హసత్కారంబులు గావించినం గైకొని యతండు వారలఁ గుశలం బడిగె. అంత న విప్రునకు లుబ్ధకుం డి ట్లనియె. 115

సీ. జననుత వీరు నా - జననియు జనకుండుఁ, జూవె వీరలకు శు - శ్రూష సేసి
యిట్టిపరిజ్ఞాన - మేను బ్రాపించితి, నమరులఁ బూజింతు - రర్థి నెల్ల
వారును నొండుదై - వంబుల నెఱుఁగ నీ, వృద్ధులు నాపాలి - వేల్పు లనఘ
కమనీయఫలపుష్ప - గంధభూషణవస్త్ర ములు మనోహరభక్ష్య - భోజ్యములును
వీరి కెపుడు నివేదింతు - వేడ్కఁ బుత్ర, దారసహితుండ నై నియ - తముగ సేవ
యాచరింతును వేదముల్ - యజ్ఞములు వ్ర, తంబులును వీర నాకను - తలఁపు దృఢము.

తే. జనని జనకుఁడు సద్గురుఁ - డనలుఁ డాత్మఁ, డనఁగ నియ్యేవురును నేగృ - హస్థుచేత
సుగతివాంఛఁ బ్రసాదితు - లగుదు రట్టి, వాఁడ చూవె ధర్మాత్ముండు-వసుధమీఁద.

వ. అని చెప్పి యి ట్లనియె పతివ్రతపనుపునం జేసి నీవు ధర్మజ్ఞానార్థంబు నాయున్న యెడకుం జనుదెంచిన నప్పతివ్రతవలని యనుగ్రహంబున నీకు నెల్లవియు నెఱింగించితిఁ గాని నీదెస నాదుచిత్తంబు ప్రియంపడి యుండదు నీచేసినయకార్యం బొక్కటి గలదు. అది యెయ్యది యనిన 118

ఉ. ఎంతయు వృద్ధు లై తమకు - నీ వొకరుండవ తెప్ప గాఁగ న
త్యంతముదంబునన్ బ్రదుకు - తల్లిని దండ్రిని నుజ్జగించి ని
శ్చింతుఁడ వై సదాధ్యయన - శీలత వారియనుజ్ఞ లేక యే
కాంతమ యిమ్ములన్ వెడలి - తక్కట నీవు గరంబు క్రూరతన్. 119

ఆ. నీకు వగచి వగచి - నిర్భిన్నహృదయు లై, విగతచక్షు లైరి - వినవె వార
లరిగి యింక నైన - నమ్ముదుసళ్లయు, దగ్రశోకవహ్ని - నార్పవయ్య. 120

క. నీయధ్యయనమ్మును సుకృ, తాయాసము నిష్ఫలంబు - లై చను గురుసే
వాయుక్తి లేక తక్కినఁ, జేయుము నాపలుకు మేలు - సేకుఱు నీకున్. 121

వ. అనినఁ గౌశికుం డతని కి ట్లనియె. 122

క. ఇది యట్టిద నీచెప్పిన, సదమలహితవాక్యభంగి సకలము వింటిన్
వదలక యిమ్మెయిఁ జరియిం, చెద గురుజనములకుఁ బ్రీతిఁ - జేసెద ననఘా. 123

క. నా దైనభాగ్యవశమునఁ, గాదే నీతోడిచెలిమి - గలిగెం బరమా
హ్లాదమనస్కుఁడ నైతి శు, భోదయముల కెల్ల నింక - యుక్తుఁడ నైతిన్. 124

క. పాపకృతం బగుదుర్గతి, బ్రాపు గనక యుండ నను బ్ర - బోధాఢ్యకలీ
లాపరిణతుఁ గావించితి, నాపాలిటివేల్పు వీవు - నరనుతచరితా. 125

చ. అనుపమ మెట్టివారలకు - నందదు ధర్మపథంబు ధాత్రిలో
విను పదివేవురం దొకఁడు - విశ్రుతధర్మపరాయణుండు గ
ల్గునొ కలుగండొ సందియము - గోరి సనాతనధర్మ మూఁది యె
వ్వనికిని నీకుఁబోలె బుధ - వత్సల యిట్లు చరింప వచ్చునే. 126

చ. నిను నొకశూద్రుఁగాఁ దలఁప - నేర గుణాకర నీచరిత్రముం
గన మది నద్భుతం బొలసెఁ - గావున నెయ్యది కారణంబుగా
నొనరఁగ నిట్టిజన్మమును - నొందితి చెప్పుము భూతభావివ
ర్తనములయందు నీకు విదితంబులు గానివి గల్గ వెమ్మెయిన్. 127

వ. అనిన నతనికి ధర్మవ్యాధుం డిట్లనియె. 128

## ధర్మవ్యాధుఁడు గౌశికునకుఁ దనపూర్వజన్మ వృత్తాంతంబు సెప్పుట.

క. జననుత నీ వెయ్యది యడి, గినఁ దెలుపుట నా కవశ్య - కృత్యము గాదే
విను చెప్పెదఁ బూర్వభవం, బున నే నొక బ్రాహ్మణుండఁ - బుణ్యాచరితుఁడన్.

వ. వేదవేదాంగపారంగతుండ నై యుండుదు నాకుం బ్రియసఖుం డైనయొక్కరాజ
పుత్త్రుతోడిసంగతిం జేసి ధనుర్వేదంబును నభ్యసించితి నొక్కనాఁ డమ్మహీపతి వేఁట
వోయిన నేనును నతనితోడన చని వనంబునం బెక్కుమృగంబుల నేయుచుండ
నం దొక్కబాణంబు దృణలతాంతరితదేహుం డైనమునివరు నొక్కరుం దాఁకిన
నొండు హా యనుచుం బడియె నంత నేనును. 130

ఆ. డాయ బోయి తీవ్ర - సాయకవిద్ధుఁ డై, పొరలుచున్న విప్ర - వరునిఁ జూచి
తలఁకి యనునయంపుఁ - బలుకులు వలికినఁ, గినిసి యిట్టు లనియె - మునివరుండు.

ఆ. బ్రాహ్మణుండ వయ్యుఁ - బాపప్రవృత్తివై, శూద్రకర్మమునకుఁ - జొచ్చి తీవు
గాన నిక్కువము మృ - గవ్యాధజన్ముండ, వగుము మీఁద ననియె - ననిన నేను.

చ. ఎఱుఁగక తప్పు సేసితి స - హింపఁ గదే కడు దుర్భవంబునం
బఱుపకు మయ్య నావుడుఁ గృ - పన్ మునినాథుఁడు దప్ప దివ్విధం
బెఱుకుకులంబునందు జని - యించియు ధర్మువు లెల్ల నిమ్ముగా
నెఱిఁ గాదు తల్లిదండ్రులకు - నెంతయుభక్తి యొనర్తు ప్రీతితోన్. 133

వ. గురుశుశ్రూషం జేసి నీకుఁ బరమశోభనం బగు జాతిస్మరత్వంబునుం గలుగు నపర
జన్మంబునం బరమబ్రాహ్మణుండ వయ్యెద వని యనుగ్రహించిన నవ్విప్రుని దేహం
బునందు నాటినబాణంబు మెత్తన పెఱికి యతనిం దదీయాశ్రమంబునకుం జేర్చితి.
నాచేసినపుణ్యంబున నమ్మహాత్ముండు నపాయంబు వొందం డయ్యె నాకు నిట్టిజన్మంబు
నొంద వలసె నని చెప్పినం గౌశికుం డిట్లనియె 134

తే జన్మ మిట్టిది చరితంబు - చంద మిట్టి, దెన్నఁడును నిట్టి వొద్య మే - నెందుఁ జూడ
నింక జన్మాంతరముదాఁక - నేల యిపుడ, పుణ్యచరితమై నీవు వి - ప్రుఁడవె కావె.

ఆ. పాపవర్తనుండు - బ్రాహ్మణుం డయ్యును, నిజము శూద్రుకంటె - నీచతముఁడు
సత్యశౌచధర్మ - శాలి శూద్రుం డయ్యు, నతఁడు సద్ద్విజుండ - యనిరి మునులు.

క. అనయంబు నాత్మకర్మం, బున నతినీచ మగుభవముఁ - బొంద వలసెనే
యని నీవు నిరంతరమును, మనమున దుఃఖింప వలదు - మహితచరిత్రా. 137

చ. నిజగుణదోషకర్మముల - నెట్టన మేలును గీడు వచ్చుఁ ద
త్ప్రజనితసౌఖ్యదుఃఖములఁ - బ్రాజ్ఞులు దుల్యమనస్కులై మనో
రుజలును దేహజంబు లగు - రోగములుం హితధర్మకర్మభే
షజములఁ జేసి పాపుదురు - సర్వము సాత్త్వికదృష్టిఁ జూచుచున్ 138

క. ప్రియములు వాయుటయును న, ప్రియములు వెసఁ బొందుటయును - బెల్లుగ నగుఁ ద
త్క్రియలందు మూఢమతికిహృ, దయతాపము వాయ దెపుడుఁ - దరికొనుచుండున్.

తే. ఏగతు మన్న నెవ్వారికి - వగవఁ జనదు, చిత్తమున నేమిటికి సంత - సింపరాదు
కాన గతమునందును ననా - గతమునందు, వగవ రార్యులు సంతోష - వంతు లగుచు.

క. వగవునఁ దేజోహీనుం, డగు నాత్మహితక్రియలకు - నక్షముఁ డగు న
వ్వగపు దొఱఁగి యుద్యోగము, దగఁ జేయఁగఁ గలుగు నంచి - తములగుశుభముల్.

వ. కావున భూతంబులసదసత్ప్రకారంబులు గనికొని ధీరుండ వై యుండు మనిన నా ధర్మవ్యాధుండు మహాత్మా నీ చెప్పినయంతవట్టు నిదర్శనంబులుగాఁ గొని యేను నిర్గఖేదుండనై భవిష్యత్కాలసద్భావంబునందు సమాహితుండ నై యుండువాఁడ ననియె. అంత నాభూదేవుండు. 142

చ. అతులితపుణ్యమూర్తివి కృ - తార్థుఁడ వెందును నీవు ధర్మ మూ
ర్జితముగ నెప్పు డేమఱక - చేయుచు నుండుము నిత్యశోభన
స్థితి వెలుఁ గొందు మేను భవ - దీయసమాగతిఁ జేసి ధర్మసు
స్థిరమతి నైతి న న్ననుమ - తింపు గుణాకర పోయి వచ్చెదన్ 143

వ. అని వానికిం బ్రదక్షిణంబు సేసి వీడ్కొని చని కౌశికుండు నిజజననీజనకుల కతి భక్తి శుశ్రూష సేసి కృతార్థుం డయ్యె. 144

---

# 45. సత్యాద్రౌపదీసంవాదము.

—⟶—

(ఆరణ్యపర్వము. ఆ. V.)

వ. ......పాండవులు సంతుష్టహృదయు లై ......యభీష్టకథాగోష్ఠిం బ్రవర్తిల్లు నెడఁ గృష్ణవల్లభయైన సత్యభామయుఁ బాంచాలియు నేకతంబ యొక్కయెడఁ బ్రియసల్లాపసంసక్త లై యుండిరి. అప్పుడు సత్యభామ ద్రౌపది కి ట్లనియె. 1

సీ. నీప్రియభర్తల - నిర్మలచరితులఁ, బ్రకటతేజుల లోక - పాలనిభుల
బార్థుల నీ వొక - భంగిన వదలక, చెలువ యెబ్భంగి భ - జింతు దగిలి
యొక్కఁ డొక్కనికంటె - నువిద నీ కేవురు, ననురక్తు లగుట య - త్యద్భుతంబు
నగుమొగంబుల కాని - నాతి నీదెస నెప్డుఁ, బతులకుఁ గింకిరి - పాటు లేదు
వ్రతము పెంపొ మంత్రౌషధ - వైభవంబొ, సరసనైపథ్యకర్మకా - శలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయొ - వెలఁది నీవి, శేషసౌభాగ్యహేతువు - సెపుమ నాకు 2

క. ఏనును నీవలన నిజము, గా నిది యంతయును నెఱిఁగి - కమలదళాక్షుం
బూని వశగతునిఁ జేసి య, నూనస్నేహానుభోగ - యుక్తిఁ దలిర్తున్ 3

క. అని యడిగిన మది నించుక, గినుక వొడమ నడఁచుకొనుచుఁ - గృష్ణ మృదులహా
సిని యగుచుఁ గృష్ణభామినిఁ, గనుఁగొని యి ట్లనియె నిర్వి - కారాకృతి యై. 4

క. నను నిట్లు దుష్టవనితా, జనమునటులు గాఁ దలంపఁ - జనునే నీకుఁ
మన సొప్పదు పురుషోత్తము, వనితవు గాఁ దగవు నీవు - వనరుహనయనా. 5

వ. అని మేలంపుఁజందంబున దానివివేకవిహీనత యెఱుకపడ నాడి పాంచాలి మఱియు ని ట్లనియె. 6

చ. అలయక మంత్రతంత్రవివి - ధౌషధభంగులఁ జేసి యెంతయుం
పలతురు నాథు లంట మగు - వా కడు బేలతనంబు దాన ముఁ
గలిగిన ప్రేమయుం బొలియుఁ - గాని యొకండును సిద్ధిఁ బొంద ద
ప్పొలఁతులతోడిమన్కి యహి - పొత్తుగఁ జూచు విభుం డెఱింగినన్. 7

చ. మగువ యొనర్చువశ్యవిధి - మందులు మాయలు నొందుచంద మై
మగనికిఁ దెచ్చు రోగములు - మానక మూకజడాదిభావముల్
మొగి నొనరించు నద్దురిత ముల్ దనచేసినచేఁత లై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్. 8

క. కావునఁ బతులకు నెప్పుడుఁ, గావింపం దగదు కపట - కర్మంబులు ద
ద్భావ మెఱిఁగి యనువర్తిని, యై వనిత చరింప నదియ - యగు నెల్లవియున్. 9

వ. పాండవులయెడ నే నెట్టిదాన నై యిట్టిసౌభాగ్యంబు నందితి నది నీకు నెఱింగించెద నేర్పడ వినుము 10

సీ. పతు లాత్మ నొండొక్క - పడఁతులఁ గలసిన, నలుగ నెయ్యెడల న - హంకరింప
మదముఁ బ్రమాదంబు - మాని వారికిఁ జిత్త, మేకముఖంబుగ - నెల్లప్రొద్దు
భక్తి సేయుదుఁ జూపుఁ-బలుకునుఁ గోర్కియుఁ, జెయ్వును వింతగాఁ-జేయ నెపుడు
నమరగంధర్వయ - క్షాదులం దైనను, బురుషు నన్యునిఁ దృణం - బుగఁ దలంతు
స్నానభోజనశయనాది - సంప్రయోగ, మర్థిఁ బతులకు మున్నెందు - నాచరింపఁ
బతులు వచ్చిన నాసన - పాద్యవిధుల, భక్తితో నేన కావింతుఁ-బనుప నొరుల. 11

చ. తగియెడువేళలందు నియ - తంబుగ మజ్జనభోజనక్రియల్
దగ నొడఁగూర్తు భర్తలకు - ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వ నెప్పుడు గృ - హస్థలభాండవిశోధనంబు లి
మ్ముగ నొకనాఁడు నేమఱఁ బ్ర - మోదము సల్పుదు బంధుకోటికిన్ 12

క. పలుమాఱుం దలవాకిట, మెలఁగుట యసతీజనైక - మిత్త్రత కలహం
బుల కెలయుట నగుపలుకులఁ, బెలుచ నగుట నాకుఁ గాని - పేరివి మగువా. 13

క. పతు లిచ్చమెయిఁ బ్రవాస, స్థితు లైనం బుష్పగంధ - దీప్తాభరణ
ప్రతతి ధరియింపఁ దద్గత, మతి నగుచుఁ దదాగమంబ - మదిఁ గాంక్షింతున్. 14

ఉ. అత్తకు భక్తి గల్గి మది - నాయమ సెప్పినమాడ్కి జీవికా
వృత్తము లావహింతు గురు - విప్రసురాతిథిపూజనంబు ల
త్యుత్తమభక్తి నేన తగ - నోపి యొనర్తుఁ బ్రియంబుఁ దాల్మియుఁ
మెత్తఁదనంబు సంతతము - మేలుగఁ దాల్తు సమస్తభంగులన్. 15

క. కడుమృదువు లనుచుఁ దేఁకువ, సెడి యెపుడుఁ జరింప భరత - సింహులు గోపం
బడరిన నాశీవిషముల, వడువునఁ గ్రూరు లని వెఱపు - వదలక కొల్తున్. 16

సీ. మాయత్తఁ బృథ్వీస - మానఁ బృథాదేవిఁ, గుంతిభోజాత్మజఁ - గోమలాంగి
సతతంబు భోజన - స్నానాదికములయం, దిమ్ముగఁ బరిచర్య - యేన చేసి
సంప్రీతఁ జేయుదు - జనవంద్యుఁ డగుధర్మ, తనయునిబంతి ని - త్యంబుఁ బసిఁడి
పళ్లెరంబులఁ గుడ్చు - బ్రాహ్మణు లతిపుణ్యు, లెనిమిదివేలు స - మిద్ధమతులు
యతులు పః వేలు వారల - కనుదినంబు, నన్నపానంబులందు స - హాయ నగుదు
నొడికముగ నేన కావింతు-నుచితవస్త్ర, భూషణాదులఁ బరితోష-ముగ నొనర్తు 17

వ మఱియు ధ్మరాజు నగరియందుఁ గనకమణిమయభూషణాలంకృతు లయినపరిచారకులు నూఱువేలు రేయును బగలును బాత్రహస్తు లై యభ్యాగతభోజనంబు లొడఁగూర్చు వారు నందఱు కలరు. వీ రెల్ల ని ట్టిట్టి మెలఁకువ మెలంగుదు రని తత్కృతాకృతంబు లేన యెఱుంగుదు. నిరంతరమదధారాతరంగితకపోలంబు లయిన భద్రగజశతసహస్రంబులుఁ బ్రభూతజవసత్త్వసన్నుతంబు లయినయుత్తమాశ్వశతసహస్రంబులుం గలవు. వానికి నన్నింటికి నిత్యోచితంబు లైనఖాద్యంబు లొనరింపను బాలింపను దగినవారి నేన నియమింతు. అఖండభాండాగారపూరితంబు లైన యగణ్యమణికనకాది వస్తువులును బ్రతిదినవిహితంబు లయినయాయవ్యయంబులు నాయెఱుంగనియవియు లేవు గోపాలజనంబులు దుదిగాఁ గలసకలభృత్యజనంబుల జీవితంబుల నరసి యేన నడపుదు. పరమయశోధను లగుపాండునందనులు నిజకుటుంబభారంబు సర్వంబును నాయంద సమర్పించి తారు నిర్భరు లై యిష్టవిహారంబుల నుండుదురు. ఏ నెల్ల వెంటల నప్రమత్తనై వర్తింతు 18

ఆ. వేగ జాము గలుగ - వెడనిద్రఁ బొందుదుఁ, గాని రాజ్యభార - కార్యయుక్తి
నబ్జనయన నాకు - నాహారనిద్రల, కెడయు లేదు సువ్వె - యెల్లప్రొద్దు. 19

ఆ. ఇట్టివర్తనముల - నెపుడుఁ బాండవులకుఁ, దగిలి ప్రియము సేయఁ - దగితిఁ గాని
మగువ నీవు సెప్పు - మందులు మంత్రంబు, లింద్రజాలములును - నే నెఱుంగ. 20

వ. అనిన విని లజ్జాకలితచిత్త యగుచు సత్యభామ పాండవభామిని కి ట్లనియె. 21

క. ఏ నెఱుఁగమి ని ట్లడిగితి, నా నేరమి సైఁప వలయు - నగవుగఁ గొనుమీ
మానిని నాపలుకులు స, న్మానితము భవచ్చరిత్ర - మహిమ ధరిత్రిన్. 22

వ. అనినం బాంచాలి మందస్మితానన యగుచు నది యట్లు కాక యని పలికి మఱియు ని ట్లనియె. 23

## ద్రౌపది సత్యభామకుఁ బతివ్రతాధర్మంబులు సెప్పుట.

క. పతిమనసు నాఁచికొనియెడు, చతురోపాయంబు నీకుఁ - జపలాక్షి సుని
శ్చితమతిఁ జెప్పెద విను మా, ర్జితమును ధర్మాన్వితము సు - శీలంబును గాన్. 24

చ. పతిఁ గడవంగ దైవతము - భామల కెందును లేదు ప్రీతుఁ డై
పతి గరుణించెనేని కల - భాషిణి భాసురభూషణాంబరా
న్వితధనధాన్యగౌరవము - విశ్రుతసంతతియుక్ యశంబు స
ద్గతియును గల్గు నొండు మెయిఁ గల్గునె యిన్ని తెఱంగు లారయన్. 25

ఆ. కరము దుఃఖపడినఁ - గాని యొక్కింతసౌ, ఖ్యంబు ధర్మగతియుఁ గలుగ దెందుఁ
జూడు మబల భర్తృ - శుశ్రూషఫలము సం ఘటితసుఖంబు నంద - గర్హ వౌదవు 26

క. కావున నిత్యము సమ్య, గ్భావము ప్రేమంబు సెరవు - భక్తియుఁ బ్రియముం
గావింపుము నీ ప్రియునెడ, భావ మెఱిఁగి యతఁడు దాన పై పడి మరగున్. 27

మ వనజాక్షుండు గడంగి నీ దగుగృహ - ద్వారంబు సేరంగ వ
చ్చె ననంగా విని లెమ్ము సంభ్రమముతోఁ - జె న్నొంగునభ్యంతరం
బునకుక్ వచ్చిన నాసనాదికరణం - బుల్ దీర్పఁ దత్తజ్జనం
బు నియోగించితి నంచు నుండక ప్రియం - బుల్ సేయు మీవుం దగన్ 28

చ. తివిరి మురారి నీకుఁ గడుఁ - దీపుగఁ జెప్పినపల్కు గల్గినం
గువలయనేత్ర నీమనసు - గూడినవారికి నైన నెప్డుఁ జె
ప్ప వలదు దాన నొండొకనె - పంబు ఘటింతు రెఱింగి రేని నీ
సవతులు కృష్ణుబుద్ధి విర - సం బగు నీదెసఁ దత్ప్రయుక్తిచేన్. 29

చ. పతికి ననుంగు లైనతగు - బంధుల మిత్త్రుల భోజనాదిస
త్కృతముల నాదరించుచు న - కృత్రిమభక్తివిశేషసంతతో
న్నతమతి వై చరింపుము త - దీయహితేతరవృత్తు లైనవా
రతిఁ భవత్సహ్యాజ్జనము - లైనను గైకొన కుండు మేర్పడన్. 30

క. విను ప్రద్యుమ్నాదిభవ, త్తనయుల గెడ నైన నేక - తంబున నేకా
సనమున నుండుట దూష్యం, బని యెఱుఁగుము సతులచరిత - లతిదుష్కరముల్.

క. కులవతులును సతులును ని, ర్మలమతులును నయినయట్టి - మగువలతోడం
జెలిమి యొనరించునది దు, ర్వ్యలసితవనితాభియుక్తి - విడువుము తరుణీ. 32

వ. ఇది నీకుఁ బరమసౌభాగ్యమూలం బయినయుపాయం బనినం బ్రీతచిత్త యై సత్య భామ యి ట్లనియె. 33

సీ. నీవు ధర్మజ్ఞవు - దేవసన్నిభులు నీ, భర్తలు మహనీయ - కీర్తిధనులు
శౌర్యతేజోబల - శౌర్యసంపన్నులు, గావున వీరికి - నేవిధమున
ధారణీరాజ్యంబు - సేరెడుఁ దడయక, మీ కెగ్గు సేసిన - లోకనింద్య
చరితుండు గౌరవ - ధరణీశువనితలు, దిక్కు లే కలమటఁ - బొక్కుచుండఁ
గని ముదంబునఁ బొందెదు - వనిత నీవు, సుతుల నత్యంతనిర్మల - మతుల శౌర్య
యుతులఁ గాంచిన సద్గుణా - న్వితవు వగవు, వలదు చిత్తంబులో నీకు - జలజనయన.

వ. ప్రతివింధ్యాదు లయిననీపుత్త్రు లేవురు నిప్పుడు వచ్చి యదుపురంబున నున్న వారు. వారికి నొక్కటం గొఱంత లేదు. రుక్మిణియు సుభద్రయుఁ దక్కినవారలు న క్కుమారులయెడం దమకొడుకులకంటె గారవంబు సేయుదురు. వారిదెస నిశ్చింత వు గ మ్మనియె 35

# 46. ద్రౌపదీహరణము – సైంధవ భంగము.

(ఆరణ్యపర్వము. ఆ. VI)

మ. వితతానేకమృగాకులంబును సదా - విఖ్యాతనానాతరుం
ప్రతతీపుష్పసుగంధబంధురసుఖా - వాసంబు బ్రహ్మర్షిసం
శ్రితపుణ్యాశ్రమమండలంబు నగుచుం - జెల్వొందునక్కాననో
ద్ధృతపుణ్యుల్ విహరించి రేవురును గుం - తీపుత్త్రు లిచ్ఛాగతిన్. 1

వ. ఒక్కనాఁ డమ్మహారథులు దృణబిందునాశ్రమంబునఁ ధౌమ్యసహితంబుగాఁ బాంచాలి నునిచి యేవురు నొక్కట మృగయార్థంబు నలుదిక్కులకుం జనిన యనంతరంబ. 2

## సైంధవుఁడు ద్రౌపదిం జూచి మోహించుట.

ఉ. వీరుఁడు సైంధవుండు నయ - విశ్రుతశౌర్యుఁడు సాల్వకన్య నిం
పారఁగఁ బెండ్లి యాడుటకు - నై నిజవైభవ ముల్లసిల్ల వి
స్ఫారచతుర్విధోరుబల - సంగతుఁ డై చను చుండి యాశ్రమ
ద్వారమునందుఁ గాంచె ద్రుప - దక్షితిపాలతనూజ నచ్చటన్. 3

ఉ. నీలపయోదమండలము - నిశ్చలలీల వెలుంగఁ జేయుచుం
గ్రాలెడువాలుఁ గ్రొమ్మెఱుఁగు - కైవడిఁ దద్వనభూమి నెంతయుం
లాలితదేహకాంతిపట - లంబునఁ జేసి వెలుంగఁ జేయున
బ్బాల వినీలకుంతలవి - భాసినిఁ జూచి సవిస్మయాత్ముఁ డై. 4

తే. మగువఁ దగిలినచూడ్కుల - మగుడఁ దిగువ, నేర్పు సాలక యపుడు కం - దర్పదర్ప
గోచరాత్ముఁ డైనిజసఖుఁ-గోటికాస్యుఁ, డమ్మృపాత్మజుఁ జూచి యి-ట్లనియెఁ బ్రీతి.

ఉ. ఎన్నలినాక్షి యొవ్వతియొ - యివ్విపినంబున నేకతంబ యి
ట్లున్ననిమిత్త మేమియొ సు - రోత్తమకన్యయొ యక్షకాంతయో
పన్నగభామయో మనుజ - భామిని గామి నిజంబ యిట్టిచె
ల్వన్నదియే మహీతలము - నుగ్మలు లెవ్వరియందు నారయన్. 6

ఉ. లీల యెలర్పఁగా నబల - లేఁజిగురాకునుబోలె నొప్పుకెం
గేలు కదంబశాఖతుదిఁ - గీల్కొనఁ జేసి వసంతవిభ్రమో
న్మీలితబాలవల్లిక్రియ - మే లగుమాడ్కుల కిచ్చి పావక
జ్వాలయపోలెఁ జిత్తము ని - జం బెరియింపఁ దొడంగెఁ జూచితే. 7

ఉ. ఈకమలాస్య నాకు హృద - యేశ్వరి యైనఁ ద్రిలోకరాజ్యముం
జేకుఱ నేలినట్లు విక - సిల్లనె దర్పకవీరు బంటుఁ గాఁ
గైకొన నే వయస్య వెసఁ - గాంత నొడంబడఁ బల్కి దీనికిన్
నాకును బొం దొనర్చి కరు - ణం జరితార్థునిఁ జేయవే ననున్. 8

వ. అని పనిచినం గోటికాస్యుండు గ్రక్కునం బాంచాలిపాలికిం జని ప్రణయసుభ
గంబుగా నమ్మగువ కిట్లనియె 9

సీ. మృగనేత్ర దారుణ - మృగసమాకుల మైన, యివ్వనాంతరమున - నేకతంబ
యిట్లు నీయున్కికి - నెయ్యది మూల మి, వ్వనదేవతవొ సురే - శ్వరునితోడ
నలిగి ధరిత్రికి - నరుగుదెంచినశచీ, దేవివో హరియుర - స్స్థితి దొఱంగి
కేలిఁ గ్రుమ్మఱుపద్మ - గేహవో భవదీయ, జనకత్వమున సము - జ్జ్వలితుఁ డైన
పుణ్యుఁ డేవంశమునవాఁడు - పొలఁతి నీదు, జీవితేశ్వరుఁ డగుసుఖ - జీవితాత్ముఁ
డెవ్వఁ డబల నీనామ మై-యింపు మిగులు, శబ్ద మెయ్యది నాకు ని-జంబు సెపుమ.

క. కరిరాజగమన మా తెఱఁ, గరయఁ దలఁచితేని వినవె - యధికబలుఁ డ నే
సురథుఁ డనురాజపుత్త్రుఁడ, నరమథనుఁడఁ గోటికాస్యుఁ - డనఁ జనువాఁడన్. 11

తే. అల్లకాంచనరథముపై - నమరువాఁడు, ఘనుఁడు క్షేమంకరుండు త్రి - గర్తవిభుఁడు
మఱియునినుఁజూచుచున్నాఁడు-మగువవాఁడె, దీప్తభుజుఁడుగళింగధా-త్రీవరుండు.

తే. ఒనరఁ బద్మాకరముపొంత - నుండి నిన్ను, మెచ్చి కనుఁగొను చున్నయా - న్మీలితాక్షుఁ
డుత్పలాక్షి యిక్ష్వాకువం-శోద్భవుండు, సుబలభూపతిపుత్త్రుండు-సుభగుఁ డతఁడు.

వ. అరుణాశ్వయుక్తంబు లయినరథంబులయందు రత్నమయభూషణు లయి సమిద్ధ
వహ్నులుంబోలె వెలుంగు చున్నయాసౌవీరకుమారులు పన్నిద్దఱుం దన్నుం జేరి
కొలువ ననేకసహస్రకరితురగరథపదాతిపరివృతుం డై మహాగజంబుపై శోభిల్లు
చున్నయవ్వీరుండు సింధుసౌవీరనాథుం డైనజయద్రథుం డమ్మనుజేశ్వరుం డిప్పుడు
నీ తెఱం గెఱుంగఁ దివిరి నన్ను నిట పుత్తెంచె ననినఁ బాండవపత్ని మృదుసంభ్ర
మంబునం గదంబశాఖ విడిచి యుత్తరీయంబు సంగతంబు గావించుకొని కోటికా
స్యున కిట్లనియె. 14

తే. అన్న యిచ్చట నే నొంటి - యున్నదాన నీ విచటి కేగుదెంచుట - నీతి యగునె
సుతవతిని ధర్మవతి నన్ను - నితరకాంతఁ, గాఁ దలంచి పెక్కులు పల్కఁ - గాదు నీకు.

వ. నీవు శిబివంశోద్భవుం డైనసురథుపుత్త్రుండ వగు టే నెఱుంగుదు అస్మత్ప్రకారంబు
చెప్పెద వినుము ఏను పాంచాలపతి యైనద్రుపదుకూఁతుర, కృష్ణ యనుదానను.
పాండునందను లగుయుధిష్ఠిరభీమార్జుననకులసహదేవులకు ధర్మపత్నిని అవ్వీరు లిప్పుడు
నన్ను నివ్వనంబున నునిచి 16

తే ధర్మజుఁడు తూర్పు భీముఁడు - దక్షిణంబు, నర్జునుఁడు పడమర గవ - లర్థి నుత్త
రంబుగా వేఁటవోయిరి - రాజముఖ్యు, లనఘు లింతకు వత్తురు - వినుతబలులు. 17

వ. మీ రమ్మహాత్ములకు మాననీయులరు గావున నార్యజనమిత్త్రు లగునక్కురుకులపవి
త్త్రులు సేయుసత్కారంబులు గైకొని పోవుదురు గాని యొక్కింతతడ వియ్యా
శ్రమసమీపంబున నిలువం డని పలికి యప్లన యవ్వారవర్ణిని భయంబునం బర్ణ
గృహంబు సొచ్చినం గోటికాస్యుండును గ్రమ్మఱి చని జయద్రథునితోడ నబ్భా
మిని పాంచాలకన్యక యనియును బాండవపత్ని యనియునుం జెప్పిన నద్దురా
త్ముండు మదనకంపితహృదయుం డగుచు నమ్మగువ నపహరింపం దివిరి కతిపయజన
సమేతంబుగా నరిగి సింహాగారంబు సొచ్చువృకంబునుంబోలెఁ బాండవనివాసంబు
సొత్తెంచి పాంచాలిం గని దాని కిట్లనియె. 18

క. వామాక్షి నీకుఁ గుశలమె, నీమన సెవ్వారియందు - నిత్యప్రేమం
బై మెఱయు నట్టిసొబగులు, నీమగ లేవురకు నిపుడు - నెమ్మదియె మదిన్. 19

వ అనిన వానికి నమ్మానవతి యి ట్లనియె. 20

చ. స్థిరమతు లైనపార్థులకు - సేమమ నీకు ననామయంబె భూ
వర తిగువింద వైతి కురు - వర్యులయింటికి నట్లు గావునం
బరువడి నాసనక్రియయుఁ - బాద్యముఁ గైకొను మాదరంబుతో
సరసకురంగమాంసములఁ - జల్పుము భోజనకృత్య మిత్తఱిన్. 21

ఆ. వేఁట వోయినారు - విభు లిప్డు వత్తురు, వారు వచ్చి నీకు - వలయునట్టి
ప్రియము లాచరింపఁ - బ్రీతుండ వై మఱి, యిష్టజనులు నీవు - నేగు మనఘ 22

చ. అనవుడు సైంధవుం డనియె - నంబుజలోచన నీవు మాకుఁ జే
యునతిథిపూజ లన్నియును - నొక్కట నైనఁ గొఱంత లేదు వ
చ్చినవియ మన్మథాస్త్రముల - చిక్కునఁ గాఁటియ వొందె డెంద మిం
క ననుఁ గృతార్థుఁ జేయుము ద - గన్ రథ మెక్కుము లెమ్ము నెమ్మితోన్. 23

మ. ధరణీరాజ్యము గోలుపోయి ఘనకాం - తారస్థలీవాసు లై
సరివా రెల్లను నవ్వఁ గుత్సితదశా - సంప్రాప్తిమై నున్న ము
ష్కరులం బార్థులఁ గొల్చినం గలదె సౌ - ఖ్యం బెంతయు■ బేల వై
తరవిందానన శ్రీవిహీనులఁ గరం - బర్థింతురే కామినుల్. 24

ఆ. చిగురుఁబోఁడి నిఖిల - సింధుసౌవీరభూ, వలయరాజ్యగౌర - వంబుతోన
నన్ను నేలికొని మ - నఃప్రియభోగిక, యోగ్య వగుము విడువు - మొండుదలఁపు.

వ. అనినం బాంచాలి ప్రకంపితచిత్త యగుచుఁ గొండొక దొలంగి వానిదెస నవమాన దృష్టిం జూచుచుఁ దనపతులరాకయ కోరుచుం బ్రతివాక్యంబులఁ గొంతకాల క్షేపంబు సేయుటకై వాని కి ట్లనియె. 26

తే. తలఁపఁ బాండవధార్తరా - ష్ట్రులకుఁ జెలియ, లైనయాదుస్సలకుఁ బతి వనఘు నీవు
వాకుఁ దోఁబుట్టువవు గావె - నీకుఁ జను నె, పాడి దప్పినమాటలు - పలుక నిచట.

క. నయమును ధర్మముఁ గలయు, న్వయమున జనియించినాఁడె - వక్కట ధర్మ
క్రియ యెఱుఁగంగా వలదె యు, భయలోకవిరుద్ధ మైన - పథ మేమిటికిన్. 28

వ. అనిన నద్దురాత్ముండు దరస్మితాననుం డగుచు ని ట్లనియె. 29

క. వనజాక్షి రాజధర్మము, వినవే యెన్నఁడును మనుజ - విభులకుఁ బ్రమదా
జనులయెడ వావి వెదకం, జనదు వలసినట్ల వేడ్కఁ - జలుపఁగఁ జెల్లున్ 30

క. విను మడియుఁ గాక జగమున, వనితారత్నంబు లెల్ల - వారికి భోగం
బునయెడ సాధారణము లొ, కనిధన మని గరుసు గలదె - కరినిభగమనా. 31

వ. అనిన నయ్యంగన క్రోధకలుషితాంతరంగ యై యిప్పాపాత్ముండు ప్రియవచనంబులం బోవండు బెట్టిదంబులం గాని చక్కంబడఁ డని తలంచి యి ట్లనియె 32

## ద్రౌపది సైంధవునితో నిష్ఠురోక్తులు వలుకుట.

చ. ప్రకటితశౌర్యసారుల న - భంగపరాక్రమనిర్జితాహిత
ప్రకరులఁ బాండునందనులఁ - బాండుయశస్కుల నాత్మలోఁ దలం
పక నను ధిక్కరించెదు నృ - పాలకులాధమ నీదుగర్వదు
ర్వికసన మింతఁ బోదు తుది - ర్వేఁ గగుఁ దక్కుము దుష్ప్రలాపముల్. 33

మ. హిమవత్పాదవనాంతకేలిరతి నై - సే పారి కోపారుణ
క్రమనేత్రాంచలు మై ప్రభూతమదరే - ఖం బైనగంధద్విపేం
ద్రము డాయం జని సిల్లు నూపుట సుమీ - ధర్మాత్ము నత్యుగ్రవి
క్రముఁ గౌంతేయవరిష్ఠు నీవు దొడరం - గాఁ జూచు టూహింపఁగన్. 34

ఉ. శాతనఖాగ్రఖండితల - సన్మదకుంజరకుంభముక్తము
క్తాతతశైలకందరగు - హాంతరసుప్తమృగేంద్రకేసర
వ్రాతము వేడ్క నూఁచికొన - వారక చేరుట గాదె క్రోధని
ఘ్నాతమహోగ్రు భీముఁ డెన - కం దలపోయుట నీకు నెమ్మెయిన్. 35

మ. చలజిహ్వాగ్రవిలీఢవిస్ఫురితదం - ష్ట్రాభీషణం బైనబె
బ్బులిఁ గోలం గొని వ్రేసి త్రోసి తొలఁగం - బో వచ్చినన్ వచ్చుఁ గా
క లసత్క్రూరశరాగ్నిదుస్సహుని న - గ్గాండీవి నల్గించి యె
వ్వలనన్ మానధనాఢ్యు లై బ్రదికి పో - నన్ వచ్చునే యేరికిన్ 36

ఉ. భోరన విస్ఫులింగములు - వొడ్మఁగ నుగ్రవిషంబు గ్రక్కుచుం
గ్రూరవిచేష్ట నాలుకలు - గ్రోయుచు మహోరగరాజయుగ్మముం
జేరి పదాహతిం గినియఁ - జేయఁ దలంచుట గా నెఱుంగు దు
ర్వారులు మాద్రిపుత్త్రుల క - వజ్ఞ యొనర్పఁ దలంచు టేర్పడన్. 37

ఉ. ఆలములోన వీఁక నమ - రాసురకోటికి నైనదుర్జయుల్
వాలినవీరు లవ్విభులు - వారికి నెగ్గొనరించి పోయి పా
తాళము సొచ్చి డాఁగినను - దప్పదు మృత్యువు నీకు నక్కటా
కాలము నిండె నీవశము - గాదు విధాతృనిచెయ్వి త్రోవఁగాన్ 38

క. తేలును గర్కటయును దెగు, కాలమునకుఁ జూలు దాల్చు - గతిఁ బార్థుల యి
ల్లాల నయిననాదెస దు, శ్శీలుఁడ వై తిది వినాశ - చిహ్నము గాదే. 39

వ. అనిన జయద్రథుండు నవ్వుచు నవ్వెలందికి ట్లనియె 40

ఉ. వారిజనేత్ర పాండుసుత - వర్గము నేఁడుగ మాకు వింతయే
భీరులఁబోలె నేల వెఱ - పించెదు మాటల మమ్ము వింటె సా
వీరకులప్రసూతులము - వీరుల మే మితరక్షితీశసా
ధారణబుద్ధి సేయకు ము - దాత్తచరిత్రుల మైనమాదెసన్. 41

వ. పలుపనిమాటలఁ దేర్చినం దీరదు వేగంబ యల్లకనకరథం బొండె నల్లమహాగజంబు నొండె నెక్కుము బీరంపుమాటలాడక ప్రియవచనంబుల నస్మత్ప్రసాదభాజనంబ వగు మనిన విని యాజ్ఞసేని వాని కి ట్లనియె. 42

ఆ. వీరపత్ని నయ్యు - వీరసహోదరి, నయ్యు నీకుఁ జూడ - ననదవోలె
నున్నదాన నెట్టు - లున్నను నాకు నిన్, దెలుప నేల పలుకు - లియ్య మేల. 43

చ. అతులితవృష్ణికేకయబ - లావళితోఁ బటుశంఖఘోషభీ
షితభువనత్రయుం డగుచు - శీఘ్రతురంగరథాధిరూఢుఁ డై
జితదనుజాన్వయుండు యదు - సింహుఁడు వెన్నడి ముట్టి నిన్ బరి
క్షతబలుఁ జేయ నాకు దెస - గల్గు టెఱింగెదు గాక యత్తటిన్. 44

సీ. గాండీవరేఖ యా - ఖండలుచాపంబు, కరణి గాఁ దద్గుణ - క్వణము ఘోర
గర్జగా నవిరళ - గంభీరవీరర, సాపూర్ణ మై సఁత - తావలిప్త
శత్రుప్రతాపోష్ణ - సమయంబు శమితంబు, గా మిత్త్రబర్హిణకే - కారవంబు
లెసఁగంగఁ దోఁతెంచి - యింద్రనందనమహా, జలధరం బాయత - సాయకోగ్ర
వృష్టి ముంచుటయును - వెగ డొంది చేష్టింప, నలవి గాక నిల్చి - యప్పు డైన
నాత్మకోపవృత్తి - కై మనంబున వగ, చెదవు గాక యిపుడు - సెప్ప నేల 45

ఉ. ఘోరగదావిదారణవి - ఘూర్ణితశాత్రవకుంభికుంభముల్
చీరుచుమౌక్తికప్రతతి - చే రణభూమి నలంకరించు కే
లీరసలోలుఁ డై సమద - లీల బకాంతకుఁ డేగుదేరఁ గ
న్నారఁగఁ జూచి కాక యిటు - లంతకు నీమది త్రుళ్లడంగునే 46

క. ననుఁ బెఱవనితలచందం, బున నవమానింప నీకుఁ - బోలదు మత్పా
వనపాతివ్రత్యమహిమ, ననిశము నేకీడు నెందు - నందదు నన్నున్. 47

వ. అని పలికి ద్రౌపది యద్దురాత్ముండు దన్నుఁ బట్టి సమాకట్టుక న్నెఱింగి తమపురో
హితు ధౌమ్యునిం బేర్కొని యాక్రోశించిన నతం డతిరయంబునఁ జనుదెంచు
నాలోన. 48

## సైంధవుఁడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొని పోవుట.

ఉ. పాపవినిశ్చయుండు సతి - పయ్యెదకొంగు గడంగి పట్టినం
గోపముతో నదల్చికొని - కోమలియున్ వెస వాని వ్రేయుడుం
బ్రోపటి వాఁడు చిత్రముగ - భూమితలంబునఁ ద్రెళ్లె మారుత
క్షేపవిభగ్నమూల మయి - చెచ్చెరఁ ద్రెళ్లుమహీరుహం బనన్. 49

వ. ఇట్లు నేలం బడి తడయక యెగసి జయద్రథుండు మగువం దిగిచి రథంబుపై నిడి
కొని సపరివారుం డయి యరుగం దొడంగె నప్పు డప్పడఁతి పురోహితునకు
మ్రొక్కిన నమ్మహాత్ముండు సైంధవుం బేర్కొని యి ట్లనియె. 50

మ. తగునే రాజకులప్రసూతులకు న - త్యంతంబు నేతాదృశం
బగుదుష్కర్మము నాదుపల్కు విను మీ - యబ్జాక్షి పుణ్యాత్మ యి
మ్మగువన్ వే విడు పాండునందనులు నీ - మానంబుఁ బ్రాణంబు నే
పగిదిం గొందురు గాని పో విడువ రీ - పాపంబు నిం ద్రెక్కఁగన్. 51

వ. అని యాక్రోశించుచు నమ్మహీసురవరుండు వానిపిఱుందన చనియె. ఇట పాండవులు నవ్వనంబున ననేకమృగంబుల వధియించి యందఱు నొక్కయెడం గూడం బడి యాశ్రమాభిముఖు లై వచ్చునెడఁ దమ్ములం జూచి ధర్మజుం డి ట్లనియె. 52

సీ. ఇనుఁ డున్న దెసనుండి - యెలుఁగింపఁ దొడఁగెఁ బ, క్షులు మృగంబులు నతి-ఘోరరుతుల
మగిడెడు నిప్పుడు - మనకు దాపలిదెస, నతిభీషణాకృతి - నఱచె వఱడు
పగఱచే నవమాన - పాటును గయ్యంబుఁ, గలుగు నీశకునప్ర - కార మరయఁ
గడుకొని చెయి వెట్టి - కలఁచిన ట్లయ్యెడుఁ, జిత్తంబు దనువు ని - శ్చేష్ట మయ్యె
నరుగుదెంచు వేగ - యాశ్రమంబునకుఁ గృష్ణ, నునిచి వచ్చినార - మొంటి యకట
తలఁపఁ గ్రూరమతులు - ధార్తరాష్ట్రులు గడు, నెగ్గు సేయఁ జూతు-రడఁగు వేచి 53

ఆ. కమలహీనమైన - కమలాకరముపోలె, రాజహీన మగుపు - రంబుపోలెఁ
జూడఁ గామ్యకంబు - శూన్య మై యున్నట్లు, దోఁచె నేమికీడు-దొడరు నొక్కొ.

వ. అనియె ఇట్లయ్యేవురు నరదంబులు సత్వరంబుగాఁ దోలుకొని యాశ్రమంబునకు వచ్చునెడఁ బాంచాలిపరిచారిక ధాత్రేయిక యనునది యతికరుణంబుగా నేడ్చుచున్నం గని ధర్మతనయుసారథి యైనయింద్రసేనుండు రథంబు డిగ్గ నుఱికి చని యిది యేల నేలం బడి పొరలుచు నేడ్చెదవు నీ కపకారంబు సేసినవా రెవ్వ రనిన నది వానిం జూచి సైంధవుచేతం బాంచాలి చెఱపోయె నని పలుకుచుఁ బె ల్లేడ్చిన నింద్రసేనుం డి ట్లనియె 55

సీ పాండుపుత్త్రులబహిర్గ - ప్రాణంబు నుత్తమ, శీలసమగ్రఁ బాం - చాలతనయఁ
గొనిపోవునంతటి - గుండె గల్గెనె విమో, హీనమానసుఁ డైన - సైంధవునకు
నేగుఁ గా కేమి మ - హీతలగతుఁ డైన, గగనంబునకు వేగ - యొగసి చనినఁ
బో నిచ్చెదరె పొరి - వుత్తురు గాకయు, ధురస్ఫూర్తిఁ బార్థు లా - దురిత చరితు
వీరవరులఘోర - వివిధాస్త్రకౌశలం, బెఱుగఁ డయ్యెఁ గాక - యేమి వాఁడు
వగవ కుండు మబల - వైరి నుగ్రతఁ దున్మి, మగుడఁ దెత్తు రిపుడ - మనుజవిభులు 56

వ. అనిన నయ్యంగన యపాంగతరంగితంబు లగుబాష్పజలంబు లల్లన కరపల్లవప్రమార్జనంబుల నపనయించుచు నతనిం గనుంగొని యి ట్లనియె. 57

ఆ. ఇంద్రకల్పు లైన - యేవురునృపతుల, నాత్మ లోన నుఱక - యంబుజాక్షి
నపహరించినపుడ - యద్దురాత్మునకును, జేటు మూఁడె వేఱ - చెప్పనేల. 58

ఉ. ఇంతకు మున్న వాఁడు సని - యెంగడు దవ్వుగఁ బోవ కుండ న
త్యంతరయంబునం బటుర - థావలి యొప్పఁగ నేగుఁ డుగ్రు లై
సంతనకట్టుఁ డస్త్రములు - శస్త్రములుం దొడుగుండు వర్మముల్
సంతతదివ్యబాణముల - శాత్రవుఁ దున్మఁడు రెండు నెచ్చెలిన్ 59

సీ. భూమిలోఁ దొరఁగిన - పూర్ణాహుతియుఁబోలెఁ, గుక్కతోల్తిత్తిలోఁ - గూరినట్టి
రాజితకపిలగో - రసధారయునుబోలె, మసనంబులోఁ బడ్డ - మహితపుష్ప
మాలికయునుబోలె - మదిరాక్షి దుర్జను, కతమున దూషిత - గాక మున్న
చనరయ్య వేగంబ - చనునె సన్మంత్రవి, శ్రుతపురోడాశంబు - శునకమునకుఁ
జనునె కమలసుగంధికా - సారకేళి, కలుషశవఖాది యైనసృ - గాలమునకుఁ
జనునె తన్వంగి సౌందర్య - చతురభావ, భంగి యాదుష్టచరితుని - పాలు వడఁగ.

## పాండవు లేవురు సైంధవుపై యుద్ధమునకుఁ బోవుట.

వ. అని పలుకుచున్న ధాత్రేయికపలుకులు విని దాని నాశ్వాసించి యక్కురువీరు లేవురు నాక్షణంబ సన్నద్ధు లై క్రోధావేశంబునంజేసి మహోరగంబులుంబోలె రోఁజుచు జయద్రథువెన్నడి దాడి వెట్టి కూడ ముట్టి తత్సైన్యంబుపిఱుంద నాక్రోశవచనవిహ్వలుం డైపోవుచున్న ధౌమ్యుం గని నమస్కరించి మీ రింక విగతఖేదులరై యొయ్యన రం డని యామిషంబునకుం గవియు డేగలుంబోలెం సైంధవసేనపయిం గవిసి సింహనాదంబులు సేసిరి. అప్పుడు పాండుపుత్త్రులరథంబు లడియాలంబులు సూచి సైంధవుండు ద్రౌపది కి ట్లనియె. 61

క. ఈవచ్చురథంబులవా, రేవురు నీమగలె యంబు - జేక్షణ వీరిన్
భావించి యెవ్వఁ డెవ్వం, డేవిధమునవాఁడు సెపుమ - యెఱుఁగఁగ వలయున్.

వ. అనిన నప్పాంచాలి యనాదరక్రోధఘూర్ణిత యగుచు నతని కి ట్లనియె. 63

ఆ. ఇంక వీరి నెఱిఁగి - తేనియు నెఱుఁగక, యుండితేనిఁ జేయు - నొండు గలదె
దుర్మదమునఁ గరము - దుశ్చరిత్రమునకుఁ, జొచ్చి నీకుఁ జేటు - దెచ్చికొంటి. 64

వ. అయినను న న్నడిగితివి గావునం జెప్పెద నింతియకాని నీవలన నాకు భయమించుకంతయుఁ గలుగదు సోదరసహితుం డైనధర్మనందనుం గంటె నింకఁ గుశలంబ యని పలికి యి ట్లనియె. 65

మ. తనువృత్తాంగుఁడు శుద్ధకాంచనసము - ద్యద్వర్ణుఁ డత్యుల్లస
ద్వనజాతాయతచారులోచనుఁడు దీ - వ్యద్భూరితేజోఘనుం
డనఘుం డల్లరథంబుపై వెలుఁగుపు - ణ్యాత్ముండు ధర్మాత్మజుం
డనిరోధప్రతిభాప్రభావనిధి య - త్యాశ్చర్యశౌర్యుం డనిన్. 66

చ. కురుకుల శేఖరుం డతఁడు - ఘోరరణంబుల నెట్టిశత్రులున్
శర ణని వచ్చి రేని విల - సత్కరుణామతిఁ గాచు నీవు చె
చ్చెరఁ జెడి పోక నాపనుపు - సేసి వినీతి యొలర్ప నమ్మహా
పురుషుని నాశ్రయింపుము వి - భుండును నీ దగుతప్పు లోఁగొనున్. 67

చ. ఘనజవసత్త్వచారుతుర - గంబులఁ బూనినయల్లవిస్ఫుర
త్కనకరథంబు పై నుదిత - కాయుఁడు సాలమహీరుహంబుచా
డ్పునఁ దనరారుచున్ వెలయు - భ్రూకుటియున్ దశనోష్ఠపీడనం
బును నయి యున్నవాఁ డనిల - పుత్త్రుడు భీముఁడు భీముఁ డాజులన్. 68

ఉ. ఈతనిపౌరుషం బరయ - నెందు నమానుషకృత్య మప్రతీ
ఘాత మనేక మద్భుతము - గర్వితులౌ ధరణీశ్వరుల్ నిజం
బీతని నాజిలోఁ జెనయ - నెవ్వరు నోడుదు రిమ్మహాభుజుం
డాతతరోషుఁ డైనఁ బ్రళ యానలునట్టిఁడె యాజి డేమిటన్. 69

ఉ. ధర్మజుకూర్మితమ్ముఁడును - దత్ప్రియశిష్యుఁడు నైనవాఁడు స
త్కర్ముఁడు వాఁడె చూడుము ప్ర - గాఢవితీర్ణిజితేంద్రియుండు దు
ష్కర్ములఁ గన్న సైపఁడు ని - కామభయంకరవిక్రమక్రియా
నిర్మథితారి ఫల్గునుఁడు - నిర్మలతేజుఁ డజేయుఁ డేరికిన్. 70

క. అవశగతిఁ గామరోషా, దివికారము లొందినను మ - దిని ధర్మపథ
ప్రవిహారి గానఁ డతఁ డా, దివిజేంద్రతనూజుఁ డద్వి - తీయుఁడు పేర్మిన్. 71

చ. అయనయసంగ్రహుండు విన - యాధ్యవసాయి భయార్తలోకసం
శ్రయుఁడు కృతాస్త్రుఁ డాహవవి - శారదశౌర్యుఁడు శిష్టబాంధవ
ప్రియుఁ డసమానసుందరగ - భీరశుభాకృతి యల్లపుణ్యుఁ డా
రయ నకులుండు పాండుసుత - రత్నము భాసురకీర్తి యిమ్మహిన్. 72

ఉ. వీరుఁడు చిత్రయోధి దృఢ - వేధి కృతాస్త్రుఁడు భూరిబుద్ధివి
స్ఫారుఁడు వాగ్విశారదుఁడు - పార్థులకూరిమితమ్ముఁ డుజ్జ్వలా
కారుఁడు ధర్మనిత్యుఁ డవి - కారుఁడు ప్రౌఢపతంగతేజుఁ డ
ద్ధీరుఁడు పాండవుండు సహ - దేవుఁడు దేవనిభుండు పెంపునన్. 73

తే. కొడుకులం దెల్లఁ గడుఁగూర్చు - గొంతియుతని, కిమ్మహాత్ముఁడుమహిఁ జలి - యించెనేని
యగ్ని చల్లన యయ్యెనే - నాత్మఁ దాను, ధర్మనిష్ఠుఁ డై సత్యంబు - దప్పఁ డెపుడు.

వ. వీ రేపురు నత్యంతదుర్వారులు వీరిబారిం బడిన వారాశినడుమ నుగ్రమకరాహతం బై యవియు పేరోడయుంబోలె నీసైన్యంబు వికలం బగు నీవునుం బ్రాణం బొండె మానం బొండెఁ గోల్పోక మెయిమెయిం బో నేర్చెదవే యనియె నప్పుడు కౌంతేయులు సైంధవసేనం దలపడి దిఙ్ముఖంబుల నెల్లం జీఁకట్లు గవియునట్లుగా బాణపటలంబులు పఱఁగింపం దొడంగిన. 75

క. తొలఁగకుఁడుపొదువు డేయుఁడు, నిలువుఁడువడిఁ బొడువుఁడనుచు-నిజయోధజనం
బులఁ బురికొల్పుచు సైంధవుఁ, డలఘుపరాక్రముఁడు నిలిచె - నాహవభూమిన్

వ. ఇట్లు త్రిగర్తశిబిసింధుసౌవీరసైన్యంబులతో ననేకనరపతిపరివృతుం డై నిలిచిన జయద్రథుం జూచి భీమసేనుండు క్రోధారుణలోచనుం డై రథంబు డిగ్గి హేమబంధబంధురంబును నయోమయంబును నగుగదాదండంబు ద్రిప్పుచు వానిపయిం గవిసిన నడ్డపడి కోటికాస్యుండు నిజసైన్యసంఘంబుతో నమ్మహావీరుం బొదవుటయునతండు.

క మదగజముల రథయోధులఁ, బదాతులను దురగములను - బలువిడిఁ గలయం
జదుపుచు దుర్వారగతిన్, విదితబలుఁడు సునగదాప్ర - వీణత మెఱసెన్ 78

వ ఇట్లు విహరించి యహితసైన్యంబు నిహతం బగుటయుఁ జెలంగి సింహనాదంబు సేసి యతండు సారథిసముపనీతం బైనరథంబు సాదరంబుగా నెక్కి గృహీతశరాసనుం డై విక్రమించె మఱియును 79

క. అలిగి యుధిష్ఠిరుఁడును న, గ్గలికం బ్రతివీరు లడరఁ - గార్ముకవిద్యా
విలసనము మిగుల సౌవీ, రుల నూర్వుర నధికబలుల - రూపడఁగించెన్ 80

క. నకులుఁడు నిశాతసాయక, నికరంబుల సమరధార - ణీతల మెల్లం
బ్రకటపరవీరవరమ, స్తకదంతురముగ నొనర్చె - దారుణభంగిన్ 81

క. నారాచపాతముల దు, ర్వారుఁడు సహదేవుఁ డాహ - వముఖంబున న
శ్వారోహకులం గూల్చుచు, వీరవిహారంబు సలిపె - వేడ్కఁ జెలర్పన్. 82

ఆ. సింధురాజసైన్య - సింధుపూరమునందు, మహితఫల్గునాఖ్య - మంథనగము
దిరిగి కలఁపఁ దొడఁగెఁ - బరనృపాలకమహా, జలచరప్రజంబు - సంచలింప. 83

సీ. వారణకోటి ద - దారోహకులతోన, వివశ మై యొఱలుచు - నవనిఁ ద్రెళ్లె
నూతహయధ్వజ - పాతపూర్వకముగ, రథములు దుమ్ము రయ్యె - రథులతోన
వెస రాహుతులతోన-వస మఱి హయములు, గెడసి యెయ్యెడలను-బుడమిఁ గప్పె
దండడి దెరలుచు - సందడి పెల్లు గాఁ, గాలుబలంబులు - గూలెఁ గలయఁ

దుముల మధిక మయ్యె - సమరతలంబున, ఘోరరుధిరవారి - పూర మెసఁగ
జితవిరోధిబలుఁడు - శతముఖసూనుండు, చాపమై పుణంబు - సూపునపుడు. 84

తే. సవ్యకరమునందును నప - సవ్యకరము, నందుఁ బర్యాయసంగతి - మగుచుఁ జూడఁ
గొలవిద్రిప్పినయొప్పన - మెఱసెఁ బార్థు, గాండివము వాలుఁదూపుల - గనియనంగ.

వ. అట్టియెడం ద్రిగర్తపతి యైనసుధన్వుండు గదాహస్తుం డై రథంబు డిగ్గి చని ధర్మ తనయురథ్యంబులఁ గూల నేసిన నతండు నిశితసాయకంబున వానియురంబు వ్రచ్చి విగతజీవుం గావించి సత్వరంబుగాఁ జని సహదేవునరదం బెక్కె. మఱియును ద్రిగర్తులలోన మహాముఖక్షేమంకరు లనువారు నకులుం బొదివి ఘనశరాసారంబు గురిసి జలధరంబులుంబోలె గర్జిల్లిన నమ్మాద్రీసూనుండు వారి నిద్దఱఁ బెక్కమ్ముల నొప్పించె నంతఁ దదీయాగ్రజుం డగుసురథుండు. 86

చ. కరినికరంబుతోఁ గడఁగి - గర్వితుఁ డై తనవారణేంద్రు న
క్కురుకులవీరుమీఁద వెసఁ - గొల్పినఁ దద్రథఘోటకంబులం
బఁగుపతఁ జంపె నగ్గజము - వాయక వాఁ డసిచర్మహస్తుఁ డై
ధరణికి దాఁటుచో నది మ - దంబున వెంటియుఁ బైఁ గడంగనన్. 87

చ. తొలఁగక యమ్మహాబలుఁడు - దోర్బల మొప్పఁ గృపాణపాతభం
గులఁ గరినాగుకేలు నిరు - గొమ్ములతోఁ బెరసంగఁ ద్రుంప బె
ట్టిలకు విచేష్ట మై నొఱగు - నేనుఁగుపై నతిమాత్ర భీతివి
హ్వలుఁ డగుశత్రు నుద్ధతిఁ గృ - తాంతవిధేయునిఁ జేసె వ్రేల్మిడిన్ 88

క. వైరులు దలఁకఁగ నిమ్మై, దారుణపౌరుషవిశేష - దక్షుం డై య
వ్వీరుఁడు రయమున నరిగి స, మీరతనయునరద మెక్కి - మెఱసెం బోరన్. 89

చ. ఘనుఁడు వృకోదరుండు దనుఁ - గట్టలుకం దలపడ్డఁ గోటికా
స్యునితురగంబులం దునిమి - సూతునికంఠముఁ ద్రుంచి వైచి తీ
వ్రనిశిత మైనప్రాసమున - వానియురంబుఁ బగిల్చి చంపినం
గనుకనిఁ బాఱె భీతి యెసఁ - గంగఁ దదీయచమూసమూహముల్. 90

## అర్జునుఁడు సౌవీరకుమారులం బన్నిద్దఱఁ జంపుట.

వ. అంత నంగారకుండును గుంజరుండును సృంజయుండును సుప్తకుండును శత్రుంజ యుండును సుప్రబుద్ధుండును శుభంకరుండును భ్రమంకరుండును శూరుండును రథియును గుహకుండును బలాఢ్యుండును నను సౌవీరకుమారులు పన్నిరువురు నిష్వా

కుళిబిసైంధవత్రిగర్తసైన్యంబులం గూడి క్రీడి మార్కొని పటుబాణజాలంబులం గప్పిన 91

మ. అతులక్రోధవిఘూర్ణమానహృదయుం - డై చండగాండీవని
ర్గతభల్లౌఘములం దదస్త్రవితతుల్ - ఖండించి సౌవీరసం
తతిఁ బన్నిద్దఱవిండ్లులం దునిమి దో - ర్దర్పంబు మీఱంగ స
న్మితుఁ డై యాతఁడు తచ్ఛిరఃప్రకరవి - చ్ఛేదంబు సేసెన్ వెసన్. 92

క. ఆకులముగ శైబ్యుల ని, క్ష్వాకుల సైంధవులనుం ద్రి - గర్తులనుం బో
నీక పొదివి గయమున న, స్తోకపరాక్రముఁడు దునిమి - తూఁటాడె వడిన్. 93

వ. అప్పుడు రణభూమియంతయు శవమయం బయ్యె అంబరం బంతయుం గబంధమయం బయ్యె. చారుకేయూరవీరాంకవిభూషితంబు లయినబాహుచరణచ్ఛేదంబులును గార్ముకతూణీరకాండఖండంబులునక్షకూబరరథాంగకేతనత్రివేణుకశకలంబులును బుండరీకవ్యజనచామరభంగంబులుం గరవాల పరిఘ శక్తి గదా ముసల పట్టిస ప్రాస లేశంబులు నెక్కడఁ జూచిన రాసు లై యుండె. కీలాలపూరంబును మాంస పంకంబును గేశశైవాలంబును నైనయపూర్వనదీప్రవాహంబునందు బహువిధ క్రవ్యాదగణంబు లవగాహంబు సేయుచుఁ బ్రకటకోలాహలవ్యాకులం బగుచుండె. ఇవ్విధంబున 94

క. గాండివపవనప్రేరిత, చండాంబక ఘోరశిఖల - శతమఖతనయో
ద్దండదహనుఁ డొక మాత్రన, ఖండితసౌవీరసైన్య - కాననమేర్చెన్. 95

వ. అట్టిక్రందున జయద్రథుండు ద్రౌపదిని దిగ విడిచి రథంబు దోలుకొని పఱచె అంత ధర్మజుండు ధౌమ్యసమన్విత యై యున్నపాంచాలిం గని నిజరథంబుపై నిడికొనియె సైంధవుపలాయనం బెఱింగి యర్జునుండు శత్రుసేనాహననసంరంభంబున నున్నభీమసేనున కిట్లనియె. 96

తే. వీతలజ్జుఁ డై పఱచె సౌ - వీరవిభుఁడు, బోనుఁగుప్రజ నేల యాఱడి - దునిమి వైవ
నగ్గురాత్ముని వెనుకొని - యసువు లిపుడు, గొనఁగవలయు లే లెమ్ము స ద్వినుతశౌర్య.

వ. అనిన నతండు గయ్యంబు సాలించి ధర్మతనయుం జూచి. 98

క. జననాథ ద్రుపదసుతఁ దో, డ్కొని ధౌమ్యుఁడు నీవుఁ గవలు-గుఱుకొని మగుడం
జనుఁ డాశ్రమంబునకు నే, మును సైంధవు వెనుకఁ గూడ- ముట్టెదము వెసన్.

క. అతలంబునఁ గ్రుంగిన న, ద్భుతముగ దివమునకు నెగసి - పోయినఁ బగతుం
హతుఁ జేయక మగుడము విని, హతుఁడుగఁ జేయుదుము దివిజు - లక్షం బైనన్.

తే. అనిన ధర్మజుఁ డిట్లను - నద్దురాత్ముఁ, బొలియఁ జేయుట దగదు దు - స్సలఁ దలంచి
వాని నొకతప్పునకు సైఁప వలదె యాంబి, కేయమహిషికి మఱుకువ - సేయఁజనునె.

వ. అనినం బాంచాలి భీమార్జునులతోడ నప్పాపాత్మునిదెసం గృపసేయ వలవ దవశ్యంబును వాని వధియించి నాకుం బ్రియంబు గావించునది యట్టిద్రోహి యెల్లభంగుల వధ్యుం డనియె. తదనంతరంబ ధర్మనందనుండు ధౌమ్యద్రౌపదీనకుల సహదేవసహితుం డై మగిడి యాశ్రమంబునకుం జనియె. ఇట భీమవిజయులు రథంబులు రయంబునం దోలుకొని చని క్రోశమాత్రాంతరంబున సైంధవుం గనిరి. అప్పుడు కిరీటి దూరాపాతవిశిఖంబుల జయద్రథురథ్యంబులం బడ నేసిన. 102

క. తల్లడపడి యరదము డిగి, విల్లును నమ్ములును విడిచి - వెల్ల నగుచు మే
నెల్లఁ జెమర్పఁగ నూర్పులు, పెల్లుగ నమ్మనుజపశువు - పెలుచం బఱచెన్. 103

ఆ. వానిఁ జూచి నగుచు - వార లోరోరి యిం, కెందుఁ బోవ వచ్చుఁ - బంద నిలువు
మిట్టికడిఁది నమ్మి - యే ప్రల్లదంబులు, సేయఁ దొడఁగి తనుచు - డాయుటయును.

వ. మరలి చూచి వాఁ డొక్కగుల్మమధ్యంబుఁ దూఱుటయుఁ గని భీమసేనుండు రోషసందష్టాధరుం డగుచు రథంబు డిగ్గ నుఱికి. 105

క. ఒడిసి తల వట్టి నేలం, బడఁ దిగిచిన వాఁడు పెనఁగఁ - బడుటయుఁ జిక్కన్
మెడఁ ద్రొక్కి గాఢముష్టిం, బొడిచె మొగిం బవియ రక్త - పూరము దొరుఁగన్.

క. ఒడ లెల్లఁ బిండికూడుగఁ, బొడిచి యొగయ నెత్తి త్రిప్పి - భూస్థలి మఱియుం
బడ వైచి యురము మొగమును, నడిచెను వడముడి తలప్ర - హారకుశలుఁ డై. 107

వ. ఇట్లు బెట్టు చఱచిన బగతుండు వివశుం డగుటయుం జూచి యర్జునుం డోహో యింత సాలు నింక నొచ్చినం బ్రాణవిముక్తుం డగుం గావున నజాతశత్రువచనంబులు దలంచి వీనిఁ గరుణింపు మనిన నతండు గవ్వడిదెసఁ గనుంగొని ధర్మనందనుం డెప్పుడుఁ గరుణయ కాని కార్యంబుచేటుపాటు విచారింపఁ జొరండు నీవును నతనిభంగిన బేల వై తిద్దురాత్ము నెట్లు సైఁప వచ్చు నని పలికె ననంతరంబ. 108

## భీముఁడు సైంధవుం బట్టికొని పరిభవించుట.

ఆ. వాఁడి యైనకత్తి - వాతియమ్మునఁ గొని, పగతుశిరము చెక్కి - తెగయ గొఱిగి
నరుల కెల్లఁ జూడ - న వ్వగునట్లుగాఁ, గలయ నైదుగూఁక - టుల నొనర్చె. 109

వ. ఇట్లు రాజవేషంబు వికల్పితంబు సేసి యమ్మహాభుజుండు వాని కి ట్లనుఁ. ఓరీ బ్రదుక వలతేని నేఁడు మొదలుగా నెల్లసభలయందును బాండవదాసుండ నని

పలుకునది యనిన వాఁడును దండాఘాతభయంబున నట్ల చేయుదు ననియె. అంత నయ్యిరువురు నతనిం బెడకేలు గట్టి రథంబుపై నిడికొని నిజాశ్రమంబునకుం జని ధర్మపుత్త్రునకు నివేదించి వీఁడె పాండవదాసుం డనిన నతం డట్లేని వీని విడువుం డనియె. పాంచాలియు జయద్రథుం జూచి నవ్వుచు నిప్పాపాత్ముండు భవదీయ దాసుం డయ్యెం గావున వీనిం బో విడువుం డని విడిపించె. ఆ సైంధవుండును ధర్మజునకుఁ దత్సభాగతు లైనమునులకు మ్రొక్కిన నజాత శత్రుం డి ట్లనియె. 110

ఆ. ఎట్టికష్టుఁ డైన - నిట్టిపాపము సేయ, నెత్తికొనునె ధరణి - నీవు దక్క
నరుగు మింక నేమి-యందుము నిన్ను నిం, ద్రియవిలోలు నల్ప-ధృతివిహీను. 111

వ. ఇంక నైనను నిట్టికొఱగాములుఁ సేయక బుద్ధిమంతుండ వై యుండు మనిన నతండు లజ్జావనతవదనుం డగుచు నచ్చోటు వాసి గంగాద్వారంబున కరిగి యందు.

శా. ఆదిత్యార్చితపాదపద్ము జగదే - కాధీశు నీశాను లో
కాదిం గామవిభేదిఁ బర్వతసుతా - హ్లాదైకసంపాది నిర్గ
ఖేదుం డై శివు నాత్మలో నిలిపి యు - క్షోగ్రవ్రతారూఢతం
బాదాంగుష్ఠమునందు నిల్చి తప మొ - ప్పం జేసె సద్భక్తితోన్ 113

ఉ. వానికి నమ్మహేశ్వరుఁడు - వత్సలుఁ డై పొడసూపి యీప్సితం
బైనది వేఁడు మన్న నతఁ - డానతుఁ డై పరమేశ విక్రమా
హీనులఁ బాండునందనుల - నేవుర సైన్యయుతంబుగా ననిం
బూని జయించునట్టివర - ముం గృప సేయుము నాకు నావుడున్. 114

క. ఇది యొసఁగదు పాండవులం, గదనమున జయింప నలవి - గా దింద్రాది
త్రిదశులకు వినవె యైనను, వదలక నీకోర్కి దీర్ప - వలయున యెట్లున్. 115

చ. విజయుఁ డొకండు దక్క నతి - వీరులఁ బార్థుల నున్న నల్వురన్
నిజ మొకనాఁటికయ్యమున - నీవు జయింపుము ఫల్గునుండు స
ర్వజగదజయ్యవిక్రముఁడు - వాని నెదుర్కొని నాకు నైనఁ గో
ర జితునిఁ జేయు టెంతయు భ - రం బగు నిక్కము పల్కితిం జుమీ. 116

వ. అస్మత్ప్రసాదవిశేషంబునం జేసి వాని కిట్టిప్రభావంబు గలిగె నదియునుం గాక. 117

క. నిఖిలాస్త్రశస్త్రవిద్యా, సఖుఁ డపరాజితయశోవి - శాలుఁడు విష్ణుం
డఖిలేశ్వరుఁ డతనికిఁ బ్రియ, సఖుఁ డటె యవ్వీరు గెల్వ - శక్యమె నీకున్. 118

వ. అని పలికి యీశ్వరుం డంతర్హితుం డయ్యె. సింధుపతియు నిజదేశంబునకుం జనియె.

---

# 47. విప్రరూపంబునఁ గర్ణుకవచకుండలంబులింద్రుఁడు హరించుట.

(ఆరణ్యపర్వము. ఆ. VII.)

సీ. వనమున నప్పాండు - తనయు లుండఁగ నందు, వరుసఁ బండ్రెండగు - వత్సరంబు
కడపట నింద్రుఁడు - గడఁగి పాండవహిత, కారి యై కర్ణుని - కవచకుండ
లములు మాయాప్రయో - గమున హరింపంగఁ, దలఁచిన నాతని - తలఁ పెఱింగి
జలజాప్తుఁ డొకనాఁడు - వెలయ రాధేయున, కది యెల్ల నెఱిఁగింతు - నని తలంచి
లోకనుతుఁడు బ్రాహ్మ - ణాకార మొప్పంగ, నతనియున్న కడకు - నరుగుదెంచి
యేకతంబ యున్న - యాకర్ణుతోడ న, భీష్టభంగి దోఁప - నిట్టు లనియె 1

క. ఓకర్ణ సుజనవినుత గు, ణాకల్ప భవద్ధితార్థ - మై యొకకార్యం
బేకతమ చెప్ప వచ్చితిఁ, బ్రాకటముగ వినుము నాదు - పలుకులు వరుసన్. 2

వ. పాండవపక్షపాతి యై పాకశాసనుండు భవదీయంబు లయినకవచకుండలంబులు హరింపం గోరి నీవు బ్రాహ్మణప్రియుండ వనియును బ్రాహ్మణు లడిగిన నెయ్యది యైనను వంచన సేయ వనియును నెఱుంగుం గావునఁ గపట బ్రాహ్మణుండై వచ్చి యడుగం గలవాఁడు. నీవును గవచకుండలంబు లీ వలవదు రత్నకాంచనవనితా ప్రముఖంబు లయినపదార్థంబులు సూపియుం బ్రార్థించియు నెవ్విధంబున నయినం గడపి పుచ్చ వలయు. అట్లు గాక వీని నతని కిచ్చితేని మృత్యువశంబునం బొందఁ గలవాఁడవు. 3

చ. అమృతమయంబు సువ్వె సుగు - ణాకర యిమ్మహనీయవస్తుయు
గ్మ ఖువియ యుండునేని త్రిజ - గంబులయందు నశేషశత్రులో
కమునకు నీవు వధ్యుఁడవు - గావు నిరంతరసౌఖ్యసంప్రమో
దమున వెలుంగు దీ విది హి - తంబుగఁ జెప్పితి మోసపోకుమీ. 4

క. అనిన విని సూతతనయుఁడు, వినయంబున నిట్టు లనియె - విప్రాకారం
బున వచ్చినవేల్పవు నీ, వనఘా యెవ్వఁడవు నాకు - నానతి యీవే. 5

క. అనిన నతఁ డేను సూర్యుఁడ, మనమున నీయందుఁ గలుగు-మక్కువఁ గర్ణం
బొనరఁగ నుపదేశింపం, జనుదెంచితి ననిన నతఁడు-సంభ్రమ మొప్పన్. 6

వ. అభివాదనంబు సేసి దేవా దేవర నా కత్యంతహితుండ వగుటం జేసి కృతార్థుండ
నైతి నిం కొక్కవిన్నపంబు సేసెద నవధరింపుము. 7

ఉ. భూసురకోటి వేఁడుటయుఁ - బోఁడిగఁ బ్రాణము లైన నీగి నా
బాస దినేశ లోకమునఁ - బ్రస్ఫుట మింతయు నట్లు గావునన్
వాసవుఁ డట్టైన న్నడుగ - వచ్చుఁ బ్రియంబడి నాకు నొక్క బ్రాఁ
తే సురలోకవందిత మ - దంగవచంబును గుండలంబులున్. 8

క. జగములనెల్లను నిండిన, పొగడిత గడువెలితి సేసి - పొల్లయొడలికై
తగవే జన్మవ్రత మిటు దిగవిడువఁగ నేఁడు నాకుఁ - ద్రిభువనదీపా. 9

మ. మతిఁ గుంతీసుతపక్షపాతి యగుచున్ - మాయాస్వరూపంబుతో
జితధైర్యుండు శతక్రతుండు నను భి - క్షింపంగ నేతెంచున
ట్టి తెఱం గైనఁ దదీయకీర్తియ చుమీ - డిందుం ద్రిలోకీసము
న్నతమై యొప్పు మదీయకీర్తి యిది సూ - నాపుణ్య మెబ్భంగులన్. 10

ఆ. కీర్తి వినుమఁ జాలఁ - గీర్తితో మెలఁగంగఁ, జావు వచ్చెనేని - చత్తుఁ గాని
జగములోన నెల్ల - సడికింటెఁ జావు మే, లనఁగఁ బరఁగుమాట - యనఘ వినవె 11

ఉ. కీర్తియ యిచ్చుఁ బుణ్యగతి గీర్తియ తల్లియుఁ బోలెఁ బ్రోచు స
త్కీర్తియ యాయువున్ సిరియుఁ - గీర్తివిహీనుఁడ చూ శవంబు దు
ష్కీర్తికి నెల్లచేటులును - గిట్టి హరించు ననండె తొల్లి భ
క్తార్తిహరుండు నాఁ బరఁగు - నంబుజనూతి జగద్ధితంబుగన్. 12

సీ. విప్రులు గడు నర్థి - వేఁడినఁ గలిమిలోఁ, బొచ్చెంబు సేయక - యిచ్చు టొకటి
బలితంపుఁబగతురఁ-బరిమార్చు టొక్కటి, దండి యై యనిఁ జచ్చు-టొండె నొకటి
శరణాగతుని నెట్టి - శత్రుని నైనను, గరుణఁ గయ్యంబునఁ - గాచు టొకటి
భామినీద్విజవృద్ధ - బాలాతురుల కైన, యాపదఁ జెచ్చెరఁ - బాపు టొకటి
యనఘ యివి వ్రతంబు - లై చెల్లు నాకు నిం, దొకటి దప్పెనేని - వికలకీర్తి
నగుదుఁ గాన యిత్తు - నఖిలభావముల నా, ఖండలునకుఁ గవచ - కుండలములు. 13

వ. అనినఁ గర్ణునకు సూర్యుం డిట్లనియె. 14

క. కడు నెయ్యురు హితముగఁ జె, ప్పెడుపలుకులు వినవు గరము - బేలవు నీ వె
క్కడ బుద్ధితెఱవు లెక్కడ, చెడక వినుము నీకుఁ దెలియఁ - జెప్పెదఁ గర్ణా. 15

క. తనకుఁ దనయులకు సతులకు, జననీజనకులకు బంధు - జనులకుఁ గీర్తిం
దని తెరువునఁ గీర్తిగొనం, జనుఁ గా కందఱును జెడుయ-శం బేమిటికిన్. 16

ఉ. కావున నీవు ప్రాణములు - గావుము కీర్తి యటుండ నిమ్ము నీ
జీవిత మున్నఁ గీర్తి మఱి - చేరదె కీర్తి యొకం డనంగ నే
లా వనితల్ దనూభవులు - లక్ష్ములు బంధులు సార్వభౌమతే
జోవిభవంబు నిమ్మడరఁ - జొప్పడుఁ బ్రాణ మొకండు గల్గినన్ 7

క మృతుఁ డైననరుఁడు వెస భ స్మితుఁ డైచనుఁ గాక కీర్తి - మేలిమి గనునే
మృతదేహంబునకు నలం, కృతిఁ జేసినయట్లు మృతుని - కీర్తియుఁ బిదపన్. 18

వ. నీవు నాకు నత్యంతభక్తుండ వగుటం జేసి భక్తజనరక్షణంబు గర్తవ్యంబు గావున ని
కిట్లన్నియుం జెప్పవలసి మఱియు దేవనిర్మితం బైనరహస్యం బొక్కటి గలదు
దానంజేసి నీయందు నాకు వాత్సల్యంబు మిగిలియుండు నది యిప్పు డేను జెప్పఁ
బిదపఁ డనయంతన యెఱుంగంబడియెడు నీకు నర్జునునకుం దెగనిపగ యై యుం
డు మీకుఁ గయ్యంబు నయ్యెడు నందు నీవు సహజకుండలమండితుండ వగుటం
జేసి యర్జును నకు జయ్యుండ వయ్యెద వట్లుం గాక నీనిం గోలు పోయి తేని యెంత
యు దెప్పరం బగు ననినం గర్ణుం డి ట్లనియె 19

మ కరుణామూర్తివి నీవు సంతతము భ - క్తశ్రీ సమాధానత
త్పరచిత్తుండవు గావునం గడఁగి నా - పై మక్కువం బత్తినీ
వర మేమేలానతి యిచ్చి తింకొకటి దే - వా నిన్నుఁ బ్రార్థించెదం
గరుణన్ నాప్రతికూలదుర్లలితవా - క్యంబుల్ సహింపం దగున్ 20

క. అనృతమున కెంత వెఱతును, విను మంతకునకును నంత - వెఱవ మునునహిం
చినవ్రతము విడిచి గుర్గతిఁ, జనఁ జాలుదునయ్య నన్నుఁ - జనునే మాన్పన్. 21

వ. అర్జునుండు దుర్జయుం డని చూడ వలను నీవును మదీయంబు లగుదివ్యాస్త్రవిశే
షంబు లెఱుంగుదు జామదగ్న్యుండును ద్రోణుండును నాకు నొసంగినదివ్యా
స్త్రంబు లల్పంబులు గావు గావున నవశ్యంబును సమరంబున నమరరాజనందనుం
దెగటార్ప నోపుదు నీ వింక నొండు దలంపక నాకు ననుజ్ఞ యిమ్మనిన నొక్కింత
విచారించి యాదేవుండు రాధేయున కిట్లనియె. 22

## సూర్యుఁడు గర్ణునితో నింద్రుచే శక్తిఁ గైకొను మని చెప్పుట.

తే. ఎల్లభంగుల నిశ్చయం - బిదియ యేని, వత్స విను మింక నొక్కటి - వాసవునకుఁ
గలదు దారుణంబును నమో - ఘంబు నైన, శక్తి యది నీకునడుగుము - సవినయముగ.

క. తొలితొలి బలసూదనుచేఁ, జెలువుగ నాదివ్యశక్తి - సేకుఱఁ గొని కుం
డలములుఁ గవచంబును మఱి, యలఘుమతీ యిమ్ము భద్ర - మగు నట్లయినన్. 24

ఉ. వైరులఁ జంపి చంపి వెస - వచ్చుఁ గరంబున కాజిలోన న
ద్దారుణశక్తి వాసవుఁడు - దానన తొల్లి సహస్రసంఖ్యలం
గ్రూరసురారిసంఘములఁ - గూల్చె మహాభుజ నీకు నెమ్మి నా
ఘోరవుసాధనంబు దొర - కొన్న నవశ్యము గెల్తు పోరులన్. 25

వ. అని చెప్పి కమలహితుం డంతర్హితుం డయ్యె కర్ణుండును వాసవుగాక కెగురు
చూచుచుండె. . . . . అంతపురందరుండొక్క నాఁడు బ్రాహ్మణరూపంబునం జని
మధ్యాహ్నసమయంబునఁ గర్ణుండు సూర్యోపాస్తి సేయు చుండి బ్రాహ్మణులకు
నభీప్సితంబు లిచ్చుతఱిం గని భిక్షాం దేహి యనుటయు గర్ణుం డాతని కిట్లనియె.

చ. అలసవిలాసలాలసర - సాన్వితలైననిలింబినీజనుల్
వలసిన భూరిసస్యపరి - వస్తుసమగ్రము లైనగ్రామముల్
వలసిన నుల్లసన్మణిను - వర్ణవిభూషణగోధనావళుల్
వలసినఁ గోరు మిచ్చెద ధ్రు - వంబుగ నావుడు నాతఁ డిట్లనున్. 27

క. వినుమివి యెయ్యవియును నా, కు నభీష్టము గావు నీదు - కుండలములు స
ద్వినుతకవచంబు నిచ్చినఁ, గొనియెద నీ నోపుదేని - గుణరత్ననిధీ. 28

చ. అనవుడుఁ గర్ణుఁ డిట్లనియె - నక్కట యేను విశిష్టవస్తువుల్
గొనకొని యిత్తు నాఁగ నిటు - గోరెద వీవు దలంప నప్రయో
జన మగువాని భూమిసుర - సత్తమ యెంతయు జేల వైతి ము
న్నెనయఁగ నిట్టు లెవ్వరును - నెయ్యెడ వేఁడిరె యిజ్జగంబులన్ 29

క. కుండలములుఁ గవచము న, ట్టుండఁగ ని మ్మనఘ వేఁడు - మొండుధనంబుల్
నిండింతు నీమనోరథ, మొం డేమియు ననకు మింక - నూర్జితచరితా. 30

వ. అనిన నతం డెవ్విధంబున నొడంబడక కవచకుండలంబులయంద బద్ధాభిలాషుం
డయి పలికినఁ గర్ణుండు వానిం బ్రార్థించియుఁ బూజించియు ననేకమణికనకాది
ద్రవ్యంబులు నివేదించియు నెట్లును నొడంబఱుప నేరక యతని కిట్లనియె. 31

ఆ. సహజములు నాకు నిక్కవ-చంబుఁ గుండ, లములు నివి లేక యున్న నే-సమరభూమిఁ
గడిఁదిశత్రులచేత భం - గంబు పడుదుఁ, గాన యీఁ జాల నయ్యెద - వీని నేను. 32

క. నానాజనపదబహుళము, నానాధనసంయుతంబు - నారాజ్యము స
మ్మానంబున నిచ్చెదఁ గొన, వే ననుఁ గారింప కింక - విప్రవరేణ్యా. 33

వ. అనియును నతనియందు సుముఖత్వంబు గానక కానీనుండు దరహసితాననుం
డగుచుఁ గృతకభూసురు నుపలక్షించి యి ట్లనియె. 34

చ. ఎఱిఁగితి నేను నిన్ను విబు - ధేంద్రుఁడ వీవు జగత్త్రయంబు గ్ర
చ్చుఱ భవదీయరక్షణము - నంద వెలుంగుచు నుండు నిట్టిని
న్నుఱవుగ నేను వేఁడుకొన - యుక్తుఁడఁ గాక మెఱంగి నన్ను న
క్కఱ పడి నీవు వేఁడు టిది - గర్జమె నిర్జితదైత్య చెప్పుమా. 35

తే. అనిననింద్రుఁడిట్లనియెమీ-యయ్యపద్మ, హితుఁడుమున్నింతసెప్పెనీ-కిష్టమెసఁగఁ
గాన యెఱిఁగితి నీ వింకఁ-గడప నేల, యనఘ మాబోఁటులకుఁ బ్రియం-బైనపనికి

వ. అనిన రాధేయుండు దేవా య ట్లయిన నఖిలశత్రుఘాతిని యైననీయమోఘ శక్తి
నాకుం గృప సేసి కవచకుండలంబులు గొను మనినం బాకశాసనుం డి ట్లనియె. 37

ఉ. ఇచ్చెద శక్తి నీకు విను - మేర్పడ నాజి మదీయశత్రులం
గ్రచ్చఱఁ జంపి చంపి యది - గ్రమ్మఱి చేతికి వచ్చు చుండు నీ
మ్చట యట్లు గాదు భువి - నెందును దుర్జయుఁ డైననీరిపుం
జెచ్చెరఁ దున్ము నొక్కరున - చేకుఱ నన్ను భజించుఁ గ్రమ్మఱన్ 38

వ ఇట్టిది సమయంబుగాఁ బరిగ్రహింపు మనినఁ గర్ణుండు నాకుం గలపగతుం డొక్క
రుండ వాని పధియించుటయ మదీయమనోరథం బనుటయుఁ బురందరుండు దర
హాసితవదనుం డై. 39

ఉ. నీయభిలాష మేను మది - నిక్క మెఱుంగుదు నుగ్రశౌర్యుఁ డే
డోయుతుఁ బార్థు నోర్తు నని - చూచెదు నీ కది యేల తీరు రా
ధేయ దయావిధేయుఁడు వి - ధేయజగత్త్రయుఁ డవ్యయుండు నా
రాయణుఁ డమ్మహాత్మునకు - రక్షకుఁ డేరికి వాఁడు సాధ్యుఁడే. 40

వ. అనినం దపననందనుం డది య ట్లుండె నాకు సహజం బైనకవచంబు నొలిచి
యిచ్చిన మదీయదేహంబు గరంబు వికృతం బగు నది యే మని యవధరించితనిన
నింద్రుండు నీశరీరంబు భవజ్జనకుం డైనయరుణకిరణువర్ణం బెట్టి దట్టిదీప్తిం జెలు
వొందు నని పలికి వానికి నమోఘశక్తి యొసంగి దీని నాపత్కాలంబునం దక్కఁ
దక్కినయప్పుడు ప్రయోగించిన నీకు నపాయం బగు నని చెప్పె. తదనంతరంబ
యవ్వీరుండు గవచకుండలంబులం బుచ్చి యతని కిచ్చి. 41

చ. అలఘునిశాతశస్త్రమున - నంగము లన్నియు నిర్వికారుఁ డై
రయిలువఁ దొడంగినట్టియెడ - హా యని కిన్నరయక్షసిద్ధసా
ధ్యులు దివినుండి యార్చుచును - దూర్యరవంబు సెలంగ నద్భుతం
బెలయఁగఁ బుష్పవృష్టిఁ గురి - యించిరి కర్ణునిపైఁ బ్రియంబునన్. 42

వ. ఇట్లు సూతపుత్త్రుని వికృతగాత్రుం జేసి వాసవుండు ప్రమదవికాసభాసితుండగుచు నిజలోకంబున కరిగె. తద్వృత్తాంతం బంతయు విని కౌంతేయు లత్యంత సంతోషంబునం బొదలిరి. గాంధారేయులు దుఃఖవిదారితహృదయు లైరి. 43



# శోధనపత్రము.

| పుట. | పద్యము. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 22 | 60 | ర్గతపట | ర్గతపటు |
| 44 | 9 | కిటవు | కిటఁబు |
| 53 | 18 | బులకాంగి | బులకాంకి |
| 61 | 18 | పత్ర | షత్ర |
| 61 | 20 | పత్ర | షత్ర |
| 65 | 47 | వైర్మువు | వైధర్మువు |
| 79 | 26 | బదిసేసి | బదునేను |
| 84 | 12 | పామజా | సామజా |
| 85 | 20 | నటపూర్వ | నటఁబూర్వ |
| 85 | 20 | ప్రోత్రమ | ప్రోత్తమ |
| *96 | 71 | సుధేష్ణ | సుదేష్ణ |
| 112 | 215 | నిట్టూర్పులో | నిట్టూర్పొకో |
| 112 | 215 | తావిమూతులు | తావి మూతులు |
| 122 | 303 | కెలకులు | కెలఁకులు |
| 125 | 334 | టిట్టు | డిట్టు |
| 127 | 358 | యాభిదాన | యాభిధాన |
| 152 | 72 | వేరిమి | వేరమి |
| 171 | 240 | యుడుపంగ | నుడుపంగ |
| 175 | 271 | బాతినదైన | బాతినసైన |
| 188 | 404 | సిద్ద | సిద్ధ |
| 194 | 456 | సైంధవంబు | సేంధనంబు |
| 200 | 4 | జయ'' తను | జయతి'' యను |
| 218 | 1 | పఱఁగించి | పరఁగించి |
| 221 | 26 | సెయ | సేయ |
| 242 | 70 | గూలఁగ | గూల్పఁగ |
| 243 | 74 | చిచ్చుమిడుత | చిచ్చు మిడుత |
| 244 | 82 | సఱచిన | ఇఱిచిన |
| 251 | 139 | బనిచికాక | బనుచుఁగాక |
| 254 | 165 | డెటవోయెనో | డెటఁ బోయెనో |
| 254 | 166 | యటనూడక | నటఁజూడక |
| 256 | 190 | బిగువారం | బిగువాఱం |
| 259 | 209 | కెటయేని | కెటకేని |
| 260 | 225 | మ్రోసినచంద | మ్రోసినచింద |

* ఈ గుర్తుగల పదములు వచ్చినచోటనెల్ల గుర్తున్నచోటంగల సవరణనే కైకొనవలయును.

| పుట | పద్యము. | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 263 | 242 | యుడలుతనదు | యడలు తనదు |
| 263 | 243 | క్షత్రియ | క్షత్త్రియ |
| 263 | 248 | యవివేక | యవివేకి |
| 267 | 11 | మగనిగీట | మగనిఁగీట |
| 288 | 58 | గీటాడు | గీడాడు |
| 288 | 63 | పదిరిన | పదరిన |
| 293 | 3 | నొత్తపు | న్మొత్తపు |
| 295 | 17 | బెంవోరయె | బెటఁబోరయె |
| 296 | 22 | గుచ్ఛంబులం | గుచ్ఛం బులం |
| 300 | 24 | నొప్పిని | నొచ్చెను |
| 301 | 30 | గాచి | గాంచి |
| 308 | 2 | గత్తళము | కత్తళము |
| 315 | 53 | ప్పనివారు | ప్పనినాగి |
| 319 | 90 | తిలభనదీ | తి భవదీ |
| 323 | 115 | సీవురు | సీవిరు |
| 341 | 9 | కూఁతుండ్రు | కూఁతులు |
| 344 | 15 | నూనదు | పూనదు |
| 348 | 21 | వలసకునికి | వలయకునికి |
| 373 | 3 | ద్యాకా మక్ | ద్యాకారముక్ |
| 380 | 17 | గానయిమ్మెయిక్ | గాననిమ్మెయిక్ |
| 383 | 7 | గ్రాఁచుచు | గ్రాఁగుచు |
| 384 | 18 | దేవభావముల్ | దేనభూయముల్ |
| 388 | 26 | నటయేగి | నటకేఁగి |
| 394 | 80 | సర్గఁజేసి | సర్గమునను |
| 396 | 101 | డగుచునోష్ఠ | డగుచుఁగోష్ఠ |
| 399 | 130 | పారంగతుండ | పారగతుండ |
| 408 | 14 | నిటపుత్తెంచె | నిటఁబుత్తెంచె |
| 413 | 53 | యొలిఁగింప | యొలుఁగింప |
| 415 | 70 | వితీర్ణజితేం | వితీర్ణ జితేం |
| 417 | 87 | వెసఁగొల్పిన | వెసకొల్పిన |
| 422 | 12 | దుష్కీర్తికు | దుష్కీర్తికి |
| 422 | 14 | గానయిత్తు | గాననిత్తు |
| 422 | 15 | లెక్కడచెడక | లెక్కడఁజెడక |
| 424 | 32 | గానయీ | గానవీ |
| 425 | 36 | గానయొతిఁగితి | గాననెతిఁగితి |

PRINTED AT THE S. P. C K PRESS; UNIVERSITY PRINTERS, MADRAS—1917.